వ్యము. ఇందువలననే శాస్త్రమందు విధిమార్గమనియు, రాగమార్గమనియు రెండుమార్గము లుల్లేఖింపఁబడినవి. రాగమార్గము కేవలము స్వతంత్రమైనది. ఈమార్గమునఁ బోవువారికి శాస్త్రసాహాయ్య మవసరమే లేదు. భగవత్కటాక్షము పూర్తిగఁ గలిగియుంటచే నత్యంతము భాగ్యవంతులును, ఉచ్చాధికారులు నగువారలే యీమార్గమునఁ బోవ సమర్థులు. ఈకారణముచే విధిమార్గనిబంధనలే శాస్త్రమునం దుల్లేఖింపఁబడినవి.

పరమేశ్వరునందు విశ్వాసములేని నిర్భాగ్యుల జీవయాత్రా నిర్వాహముకొఱకు కొన్నికొన్ని నిబంధనలు లిపిబద్ధములైనవి. ఆనిబంధనల సముదాయమునకు 'నీతి' యని పేరు. ఏ నీతియందుఁ బరమేశ్వర చింతను సంబంధించిన వ్యవస్థ లేదో ఆనీతి యన్యప్రకారముగ నెంత సౌష్టవముగ నున్నను మానవ జీవనమును సార్థకము సేయుటకెంతమాత్రమును సమర్థముకాదు. ఆనీతి యత్యంతము బహిర్ముఖమగు నీతి. ఈశ్వర విశ్వాసమును, ఈశ్వరారాధనమును గర్తవ్య కర్మలుగ నాదరించెడి నీతినే మానవజీవనవిధిగఁ జెప్పవచ్చును. ముఖ్యమనియు, గౌణమనియు, విధి రెండువిధములు.

జాగతికమగు విధియే నీతి.

ఈశ్వర విశ్వాసమూలకమగు నీతియే యథార్థమగు నీతి.

ఈశ్వర తుష్టిసాధనమే మానవజీవనముయొక్క యేకమాత్ర తాత్పర్యమగుచుండ నేవిధి యాతాత్పర్యమునే యవ్యవహిత రూపమున నిర్దేశించుచున్నదో, దానినే ముఖ్యవిధియందురు. ఏవిధి యా తాత్పర్యమునే కొంచెము వ్యవధానములో నిర్దేశించుచున్నదో దానిని గౌణవిధియందురు. ఈవిషయ మొక యుదాహరణమువలన స్పష్టపడును. ప్రాతః స్నానమనునది యొక విధి. ప్రాతః స్నానముచేసినయెడల శరీరము స్నిగ్ధమును, రోగశూన్యమును అగును. మనస్సు నిశ్చలత్వము నొందును. మనస్సు నిశ్చలమగునెడల నీశ్వరోపాసనము సాగును. ఇచట

గౌణవిధి, ముఖ్య విధియు.

స్నానమునకు వ్యవధాన రాహిత్యమగుఫలము శరీర స్నిగ్ధతయగుటచే మానవ జీవన తాత్పర్యమగు నీశ్వరోపాసనమున కిది వ్యవధాన శూన్యఫలము గాదు. శరీరస్నిగ్ధతాఫలమే స్నానవిధికిఁ జరమఫలముగఁ బరిగణింపఁబడిన యెడల నీశ్వరోపాసనారూపఫలము లభింప నేరదు. ఈశ్వరోపాసనారూప ఫలమునకును, స్నానవిధికిని నడుమ వేలు వేలవాంతరఫలములు గలుగు చుండుటచేఁ దత్ఫలములన్నియు నీశ్వరోపాసనావిషయమున వ్యవధాన స్వరూపములగుచున్నవి. ఏస్థలమందు వ్యవధానము గలుగుచున్నదో, అచ్చటనే వ్యాఘాతములు గూడ సంభవించుచుండును.

భగవదుపాసనమే ముఖ్యవిధికి సాక్షాత్ఫలము. * ఇచట విధికిని, ఉపాసనమును నడుమ నవాంతరములుగ నుండు ఫలములు లేవు. హరినిఁ గీర్తించుట, హరికథలను వినుట ముఖ్యవిధియని చెప్పనగును. ఏమన, నీరెంటికిని సాక్షాత్ఫలము భగవదుపాసనము.

**గౌణ-ముఖ్యవిధుల పరిచయము.**

హరిభక్తియే ముఖ్యవిధియగుటచే సదా హరినామస్మరణమే చేయుచుఁ గూర్చుండినయెడల, ననగా, గౌణవిధి నవలంబింపనియెడల, శరీర యాత్ర సాగ నేరదు. శరీరయాత్రను మనము నిర్వహింపనియెడలఁ బ్రాణము నిలువదు. ప్రాణము నిలువనియెడల హరిభక్తిరూపమగు ముఖ్యవిధి యేవిధముగ నాచరింపఁబడును? గౌణవిధికి సహజలక్షణమేమనిన, నది నరజీవనమున కలంకారస్వరూపములగు శిల్పము, కారుకర్మము మున్నగు సమస్త పార్థివ విద్యలను, అట్లే సభ్యత్వమును, బారిపాట్యమును, సద్వ్యవసాయమును, మఱియు శారీరిక మానసిక సామాజిక నీతిసమూహమును మానవవ్యక్తియం దేకీకృతము సేయుచు నిర్వంచనముగ నరునిచే భగవచ్చరణామృతమును సదా పానము సేయించును. తన కధీశ్వరియగు ముఖ్యవిధికిఁ దాను సదాసహచారిణి

---

* నేహ యత్కర్మ ధర్మాయ న విరాగాయ కల్పతే
న తీర్థపదసేవాయై జీవన్నపి మృతో హి సః.

భా. 3-23-56.

యగుచు నేలికసాని కృపవలనఁ దచ్చరణామృతపానముచే నరజీవనమునకు సాధనకాలమునందును బరమానంద సుఖము గలిగించును.

వన్యజీవనము, సభ్యజీవనము, జడవిజ్ఞానసంపన్నజీవనము, నిరీశ్వర నైతికజీవనము, సేశ్వర నైతికజీవనము, వైధభక్త జీవనము, ప్రేమ భక్తజీవనము — ఇట్లు నానా ప్రకారములగు నరజీవనములు పరిలక్షితములగుచున్నను బ్రకృత నరజీవనావస్థ సేశ్వర నైతిక జీవనమునుండియే స్వీకరింపఁబడుచున్నది. నరజీవనము సేశ్వరము కానియెడలఁ దానెంత సభ్యత్వము నందియున్నను, ఎంతటి జడవిజ్ఞాన సంపత్తు నొందియున్నను, ఎంత నైతికమైనను, బశు జీవనముకంటె నొకప్పుడును శ్రేష్ఠమైనది కాఁజాలదు. సేశ్వర నైతిక జీవనమునకు సంబంధించిన విధినిషేధముల నాధారము చేసికొనియే ప్రకృత నరజీవనము నిర్వహింపఁబడుచున్నది. కనుకనే యీగ్రంథమందు నరజీవన విచారము సేశ్వర నైతికముతోఁ బ్రారంభింపఁబడినది. సభ్యత్వమును, జడవిజ్ఞాన సంపత్తియు, నీతియు, సేశ్వర నైతిక జీవనమునకుఁ బ్రధానాలంకారములుగ మాత్రము పరిగణింపఁబడుచున్నవి. ఇట్టి సమస్తాలంకారములతోఁ గూడుకొన్న సేశ్వర నైతికజీవనము భక్తజీవనముగ నెట్లు పరిణమించి చరితార్థత నొందుచున్నదో ఆవిషయమీగ్రంథమును సమగ్రముగఁ బఠించినఁ దేటఁబడును. జీవుని జీవనమే జైవధర్మము. మానవావస్థయందలి జైవధర్మమునకే మానవధర్మమని పేరు. ఆ ధర్మము గౌణము, ముఖ్యమునియు, సంబంధికము, స్వరూపగతమునియు, రెండు విధములు. గౌణము, లేక, సంబంధికమనునది జడధర్మము. జడగుణములను, జడ సంబంధమును సదా యాశ్రయముగఁ గొని వర్తించుచుండును. ముఖ్యధర్మము, లేక, స్వరూపగతధర్మము శుద్ధజీవుని నాశ్రయముగఁ గొని వర్తించుచుండును. ముఖ్య

నరజీవనము నందలి భిన్నభిన్నావస్థలు.

భక్తిహీనతయే పశుధర్మము.

ముఖ్య ధర్మము, గౌణధర్మమును.

ధర్మమే యథార్థమగు జైవధర్మము. గౌణధర్మము కేవల జడగుణ సంబంధి యగుటచే నది ముఖ్యధర్మముయొక్క గుణీభూతావస్థా విశేషము తప్ప వేఱొండు కాదు. జడగుణములు దూరీభూతములైనచో జైవధర్మము కేవలీభూతమై ముఖ్యధర్మమగుచున్నది. గౌణధర్మమునే సోపాధికధర్మమని చెప్పుదురు. ఉపాధిరహితమైనచో నదియే ముఖ్యధర్మమగుచున్నది. గౌణవిధి నిషేధము, లనఁగా, బుణ్యపాపములు గౌణధర్మాంతర్గతములు. గౌణధర్మము జీవుని నెన్నఁడును విడుచునది కాదు; కేవల గుణముక్తావస్థయందు ముఖ్యధర్మరూపమునఁ బరిణామము నందును. జడబద్ధావస్థయందు ముఖ్యధర్మ మయథాభూత పరిణతినొంది గౌణధర్మమగుచున్నది. మఱల నా గౌణధర్మమే యథాభూత పరిణతిక్రమమున ముఖ్యధర్మమగుచున్నది.

కావున ముందుగ గౌణవిధి నిషేధ విచారపూర్వకముగ ముఖ్య విధి నిషేధములును, వెనుక జైవధర్మమునకు సిద్ధావస్థారూపమగు ప్రేమ భక్తియును, విచారింపఁబడును.

(ఈశ్వరుఁడు,' 'భగవంతుఁడు' 'కృష్ణుఁడు' అనుశబ్దములు (నామములు.)

ఈసృష్టియందు మొదట 'ఈశ్వర' నామమును, వెనుక 'భగవాన్' శబ్దమును, గడపటఁ 'కృష్ణ' నామమును వ్యవహరింపఁబడినవి. ఇట్లని యీశ్వర భగవత్కృష్ణ తత్త్వములు వేఱువేఱు తత్త్వములుగ * జదువరి భావింపరాదు. కృష్ణుఁడే జీవుని శుద్ధోపాసనా విషయమగు కేవల స్వరూపతత్త్వము. కృష్ణుఁడే భగవత్తత్త్వముయొక్క పూర్ణ మాధుర్య ప్రకాశ రూపుఁడు. ఆకృష్ణు డన్యతత్త్వములతోఁగాని, యన్య పదార్థములతోగాని, సంబంధించినవానిగ మన మెపుడు భావింతుమో, అపుడు మనమతనినే యీశ్వరునిగఁ జెప్పుచు, నతనినే యీశ్వరనామముతో వ్యవహరించు

* వదంతితత్తత్త్వవిదస్తత్త్వం యద్జ్ఞానమవ్యయమ్
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే
భా. 1.2.12.

చున్నాము. ఈకారణముచేతనే యీవృష్టి ప్రారంభమునఁ బదార్థత్రయమును వక్కాణించుచు నందుఁ గృష్ణనామమునకు బదులుగ నీశ్వరనామము వ్యవహరింపఁబడినది. ఈశ్వరభావమునఁ గేవల స్వరూపతత్త్వమగు శ్రీకృష్ణునికి సృష్టియందలి సకలపదార్థములపై నేయీశత్వముగలదో దాని పరిచయమాత్రమని తెలియనగును. పదార్థములను బరిగణించుచోట నీశ్వరనామమే సర్వత్ర వ్యవహరింపఁబడినది. చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు, అని పదార్థపరిగణనము.



# ప్రథమవృష్టి—ద్వితీయధార.

## శ్రీ కృష్ణ చైతన్యుని శిక్షా ప్రణాళిక.

శ్లో. మహాప్రభోః కీర్తన నృత్యగీత
వాదిత్ర మాద్యన్ మనసో రసేన
రోమాంచ కంపాశ్రు తరంగ భాజో
వందే గురోశ్శ్రీ చరణారవిందమ్.

శిక్షామృతగ్రంథమున కుపాదానము.

శ్రీమన్మహాప్రభుని శిక్షా విధానమును గూర్చి మనము తెలిసికొనఁ గోరినయెడల శ్రీ చైతన్య చరితామృతమునే మన మవలోకింపవలసి యుండును. ఇందు విషయమై మహాప్రభువు తానెట్టి గ్రంథమును రచించియుండ లేదు. శ్రీ శిక్షాష్టకమని చెప్పఁబడు నెనిమిది శ్లోకములుతప్ప తదితరమేమియు మహాప్రభువు వ్రాయలేదు. "పద్యావళి" యనుగ్రంథమందు మఱికొన్ని శ్లోకములు సంగ్రహింపఁబడియున్న మాట నిజమే కాని యందానుపూర్వికమగు నుపదేశమెద్దియు మనకు లభ్యము కాదు. పైగ్రంథమే కాక మఱికొన్ని క్షుద్రగ్రంథము లొకటి అది ప్రభురచితములని చెప్పుచు నెవరెవరో ప్రకటించిరి. కాని నేనాగ్రంథములను బాగుగ విచారించి యవియన్నియు మహాప్రభుని పేరితో నితరులు వ్రాసినవని నిశ్చయించితిని. మహోదయులగు గోస్వాములు రచించిన సమస్త గ్రంథములయందును శ్రీమన్మహాప్రభుని శిక్షావిధానము మనకు సమగ్రముగ లభ్యమగుచున్నను మహాప్రభుని నిజరచనలని చెప్పుచు నాగ్రంథములయం దెచ్చోటను ఎట్టి విషయమును వ్రాయఁబడలేదు. శ్రీ చైతన్య చరితామృతమే ప్రామాణిక గ్రంథము. అందు ప్రభునిచరిత్రమును, ప్రభుని యుపదేశములును మనసుఁ

బూర్తిగ లభ్యమగుటయేకాక, అందలి యుపదేశములన్నియు నాగ్రంథ మునం గనంబడు గోస్వాముల ప్రమాణ వాక్యములచేత సమగ్రత నొందు చున్నవి. ఈకారణముచేతనే శ్రీ చరితామృతము సర్వత్ర సర్వజనాదరణీయ మగుచున్నది. శ్రీమన్మహాప్రభువు విశ్వరంగమును విడిచిపోయినవెనుక శ్రీ కృష్ణదాస కవిరాజ గోస్వామి యుదితుండై యా గ్రంథమును రచించెను. మహాప్రభుని సాక్షాచ్ఛిష్య బృందమగు శ్రీ రఘునాథదాస గోస్వామి, శ్రీ రూప గోస్వామి మున్నగు ననేకులు శ్రీ చరితామృత రచనయందు కవిరాజ గోస్వామికి సాహాయ్యపడిరి. ఇంతేకాక "శ్రీ చైతన్య చంద్రోదయ" నాటకమును రచించి శ్రీ కవికర్ణపుర మహోదయుండును, "శ్రీ చైతన్య భాగవత" మును రచించి శ్రీ బృందావనదాస థాకురును, శ్రీ చైతన్య చరితామృతమునకు వలయు సామగ్రిని శ్రీ కవిరాజ గోస్వామి కనుగ్రహిం చిరి. కనుక మన మెన్నివిధముల నాలోచించినను జరితామృతమే శ్రీమహా ప్రభుని శిక్షకుం బ్రమాణగ్రంథమగుచున్నది.

వివిధఘటనలు.

శ్రీమన్మహాప్రభు యిరువదినాలుగు సంవత్సరముల వయస్సువఱకే గృహస్థ ధర్మమందుండెను. ఆ కాలమున శ్రీ వాసాంగణమందును, గంగాతీరమందును, వైదిక పాఠశాలలయందును, రాజ మార్గములయందును హరి నామ మాహాత్మ్యమును గూర్చియు, హరి కీర్తనముయొక్క కర్తవ్యతను గూర్చియు, నతండు సకల జీవులకు సవ్యవహితరూపమున బోధించెను. తదుపరి తాను సన్న్యాసాశ్రమము స్వీకరించి శ్రీ పురుషోత్తము (జగన్నాథ) క్షేత్ర మందు శ్రీ సార్వభౌమ భట్టాచార్యులు మున్నగువారికిని, విద్యా నగరమందు శ్రీరాయిరామానందునకును, దక్షిణదేశమందు వేంకట భట్ట ప్రభృతులకును, బ్రయాగయందు శ్రీరూప గోస్వామికిని, అట్లే హాస్యమునకును, నవ్వుటాల కనువలె శ్రీరఘుపతి యుపాధ్యాయులకును, శ్రీ వల్లభ భట్ట మహోదయున కును, శ్రీ కాశియందు శ్రీ సనాతన గోస్వామి, శ్రీ ప్రకాశానంద సన్న్యాసి ప్రభృతులకును, ఏమేమి యుపదేశించెనో, ఆ యుపదేశములందే శ్రీ మహా

ప్రభుని సమస్తశిక్షయు మనకు యథార్థముగ లభింపఁగలదు. అట్టి శిక్షావిధానమును బూర్తిగ విచారించి యా శిక్షాప్రణాళిని నేనీగ్రంథమున సంగ్రహించితిని.

శ్రీ నామ ప్రచారము.

జగత్తునందలి సకలజీవులయెడలను అపారమగు దయను నెఱపుచు శ్రీ మహాప్రభువు విశుద్ధ వైష్ణవ ధర్మము, సనగా, జైవధర్మమును భారతదేశమునందంతటను బ్రచారిత మొనర్చెను. కొన్నిదేశములకుఁ దానే స్వయముగఁ బోయి యద్దానినిఁ బ్రకటించెను. కొన్ని కొన్ని దేశములకుఁ బ్రచారకులనుఁ బంపి ప్రకటింపించెను. ప్రచారకులకు మితిలేనిశక్తి ననుగ్రహించి దేశదేశములకుఁ బంపించెను. మహాప్రభుని ప్రచారకబృందమంతయుఁ బ్రేమబద్ధులై కార్యసాధన మొనర్చిరి కాని నేతనమునుగాని, మెప్పునుగాని వారెన్నఁడును గోరలేదు. విశుద్ధమగు నడవడిక గల ప్రచారకులచేతనే తప్ప నితరులచే విశుద్ధ ధర్మప్రచారము నిర్వహింపఁబడ నేరదు. ఈకారణముచేతనే యితర మతములకు సంబంధించిన కొందఱు, కూలి యిచ్చి చేయించెడి ప్రచారములవల్ల కార్య సాఫల్యము కలుగనేరదు.

శ్రీ చైతన్య చరితామృతమున నాదిలీలయం దష్టమ పరిచ్ఛేదమున నిట్లు వ్రాయఁబడినది:—

“ పంచతత్త్వరూపమున శ్రీమహా ♦ ప్రభువు తా నిఖిలధరణి
మించి కృష్ణనామప్రేమను గా ♦ వించె ధన్య నీ కరణి
మహనీయుల రూప సనాతనులను ♦ మథుర కంప నవ్వారు
బహువిధముల నెఱపిరి నాయకులై ♦ పరబుభక్తి దగు తీరు
నిత్యానందుని గౌడదేశమున ♦ నియమింప శుద్ధభక్తి
నత్యాదరమునఁ గ్రుమ్మరించెనట ♦ నద్భుర మాతని శక్తి
స్వయముగఁ దా దక్షిణదేశమునకుఁ ♦ జనియెఁ బ్రచారముకొఱకు
దయతో నచ్చటఁ గృష్ణనామమును ♦ దానమిడియె నెల్లరకు
నేతువువఱకును గృష్ణప్రేమను ♦ జిలికె జనులఁ గొఱలేక
ప్రీతిగఁ బ్రోచెను భవబంధమ్ముల ♦ ద్రెంచినైచి యలవోక ”

శ్రీ మహాప్రభుని శిక్షామూలమెద్దియనినఁ గృష్ణ ప్రేమమే జీవుని నిత్య ధర్మము. ఈ ధర్మ ధనమునకు నిత్యదూరుఁడై జీవుఁడుండఁజాలఁడు. కృష్ణుని మఱచుటచేఁ గలిగిన మాయామోహమున జీవుని కన్యవిషయానురాగము కలిగి క్రమముగ నా ప్రేమధర్మము గుప్తప్రాయమై జీవాత్మయొక్క యంతఃకోశమున మఱుఁగుపడినది. ఇందువలననే జీవునికి సంసారదుఃఖము గలుగుచున్నది. మఱల సౌభాగ్య ఘటనాక్రమమున "నేను నిత్య కృష్ణ దాసుఁడ" నను విషయము జీవుని కెపుడు స్మరణకు వచ్చునో, అపుడీ ధర్మము పునరుదితమై జీవునికి స్వాస్థ్యప్రాప్తి నొదవించును.

గౌరశిక్షాసారము.

ఈ సత్య విషయమందు విశ్వాసమే జీవుని సకల మంగళములకు మూలము. ఈవిశ్వాసము రెండువిధములుగ జన్మించును. సంసారక్షయోన్ముఖతగల యొకానొక జీవునకు బహు జన్మ సుకృతిఫలముగ స్వభావ సిద్ధ విశ్వాసముదయించును.

సత్య విశ్వాసమే మూలము.

"భాగ్యవశతచే శ్రద్ధోదయమె ♦ వ్వనికిఁ గలుగు నాతండు
యోగ్యుఁడగుచు సాధుసంగలాభము ♦ నొందెడి నల ధన్యుండు".

శ్రద్ధకే మఱియొక పేరు విశ్వాసము. చరితామృతమందు మధ్య లీల 23-వ అధ్యాయమున 9-వ సంఖ్య నిట్లు వ్రాయఁబడినది.

"నిర్వచనము శ్రద్ధకు విశ్వాసము ♦ నిశ్చయాత్మకమగు మతి
సర్వకర్మలొనరించినటులె కృ ♦ ష్ణభక్తి సల్పెడి సుకృతి"

"కృష్ణ భక్తి చేసినయెడల జీవుఁడు సమస్త కర్మలు చేసినవాఁడగుచున్నాఁడు" *అనునట్టి దృఢనిశ్చయమునకే శ్రద్ధయని పేరు.

* యథాతరోర్మూల నిషేచనేన, తృప్యంతి తత్స్కంధభుజోపశాఖాః
ప్రాణోపహారాచ్చ యథేంద్రియాణాం, తథైవసర్వార్హణమచ్యుతేజ్యా
భా. 4.31.14.

సుకృతిఫలముగఁ గలిగిన యాత్మ ప్రసన్నత్వముచే నాత్మయొక్క నిత్యధర్మమునుండియే స్వతస్సిద్ధమగు శ్రద్ధ యుదయించుచున్నది. అట్లుదయించిన* శ్రద్ధ జీవుఁడుపయుక్త సాధు సంగమందు భజన పద్ధతి నవలంబించుటచే సర్వానర్థ నాశనమగుచుండఁ గ్రమముగ నిష్ఠగను, రుచిగను, ఆసక్తిగను బరిణమించి తుదకు భావపర్యంత మున్నతి లాభము నొందుచున్నది.

భజన క్రమము.

స్వతస్సిద్ధమగు శ్రద్ధ ప్రబలరూపమున జన్మించినయెడల జీవునికి రాగమార్గోపలబ్ధి కలుగును†. మఱి యతనికి యుక్తితోఁగాని, విధితోఁగాని పని లేక కృష్ణ రతిరూపమగు భావమార్గమున నతఁడు నిర్భయముగఁ బ్రవర్తింపుచు నాత్మోన్నతి సాధనమందు మిగుల సమర్థుఁడై యుండును. ఒకవేళ శ్రద్ధ ప్రబలరూపముగఁ గాక కోమలముగ నుదయించినయెడలఁ దత్క్షణమే సద్గురు సేవనమొనర్చి వాని యనుగ్రహము నొందఁగలిగినచో నవశ్యముగ నాశ్రద్ధ ప్రబలమగును. శాస్త్రవిశ్వాసమును, గురువాక్య విశ్వాసమును శ్రద్ధాపరిచయ లక్షణములగుచుండ శాస్త్రవిచారమువలన సాధారణముగ నెంతటి ప్రయోజనము గలదో వేఱుగఁ జెప్పవలసిన పనిలేదు.

రాగమార్గవిచారము స్వతంత్రమైనది.

కోమలశ్రద్ధకు శాస్త్ర విచారమావశ్యకము.

---

* యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తుయఃపుమాన్
న నిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోఽస్య సిద్ధిదః
భా. 11.20.8

† తావత్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా
మత్కథాశ్రవణాదౌవా శ్రద్ధాయావ న్నజాయతే
భా. 11.20.9

చరితామృతమునం దాది లీలను సప్తమాధ్యాయమునఁ బ్రభు వాక్య మిట్లున్నది :—

"అనెఁబ్రభువిట్టులు, వీని కారణము ♦ విను సూరిజనాభరణ!
నను మూర్ఖునిగా గురువెఱింగి యా ♦ నతిచ్చె నిట్టులు కరుణ
నీవు మూర్ఖుఁడవు వేదాంతముపై ♦ నీ కధికారము సున్న
కావున నిచ్చలు కృష్ణనామ జప ♦ మీవు సేయుమో యన్న!
కృష్ణమంత్రము జపింపఁ బుట్టు సం ♦ కెలలు త్రెళ్లుఁద్రుటిలోన
గృష్ణనామ గానమున లభ్యమగుఁ ♦ గృష్ణ చరణ మెల్లైన
నామ జపముకంటెను గలికాలము ♦ నకు లేదింకొక్కగతి
నామంబు సర్వమంత్రసారమని ♦ సకల శ్రుతియానను జగతి'
ఇట్టులనుచుఁ దానొకశ్లోకము నా ♦ కిడియె నేర్చి కొమ్మంచుఁ
బట్టుదలగ వల్లింపు దాని తా ♦ త్పర్యంబెలుఁగు మటంచు,
'హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా'
గురువునాజ్ఞ పాలించి నే నిరంతర నామకీర్తనంబు
జరుపఁ గ్రమక్రమముగ మిక్కిలి బే ♦ జారయ్యె నామనంబు
తివ్వఁ బోయెను నాధైర్యము వె ♦ ఱ్ఱివాఁనైతి; బాలుని ఫక్కి-
నవ్వితి నేడ్చితి నర్తించితి గా ♦ నము చేసితిఁ గైపెక్కి
అప్పుడు ధైర్యముఁ గొంతఁ దెచ్చుకొని ♦ యంటిని నాజ్ఞానమ్మఁ
గప్పివైచె నీ కృష్ణనామ జప ♦ కాలాబ్ధవితానమ్ము
మనసు చెడెను బూర్తిగనా; కిపుడు ♦ న్మాద పరవశుఁడనైతి
ననుచు గురువుకడకేఁగి చెప్పుకొం ♦ టిని నిటు వీనునిరీతి—
'ఇచ్చితివయ్యా గొప్పమంత్ర; మది ♦ యేమొ దాని మహిమంబు
పిచ్చివాఁడనైపోతిని దాని జ ♦ పించి నే ననుదినంబు
నను నవ్వించెను; నేడ్పించెను; చే ♦ సెను నన్ను నాట్యమాడ'
ననవిని గురుదేవుఁడు సన్నుఁగొని ♦ యనియె నాదరముతోడఁ

"కృష్ణనామ మను మహామంత్రమున ♦ కిదియె స్వభావము సుమ్ము
కృష్ణనామజపమున భావంబుద ♦ యించు నిశ్చయము సమ్ము
వరకృష్ణప్రేమమె పరమంబగు ♦ పురుషార్థము తానగుటఁ
బురుషార్థ చతుష్టయము తృణముతో ♦ సరిదూఁగు దానియెదుట".

ఈ ప్రభువాక్యమునందు నేను సంగ్రహించిన దొక్క విషయము గలదు. "పట్టుదలగ వల్లింపు దాని తాత్పర్యం బెఱుఁగు" మనునది. దీనినిఁబట్టి మనము శాస్త్ర విచారమే శ్రద్ధాపుష్టికిఁ గారణమనియు, దన్మూలమున శ్రద్ధకుఁగ్రమోన్నతిలాభము గలుగుననియుఁ దెలిసికొనవలసి యున్నది. మహాప్రభుని మతమందు శాస్త్రమనఁగా వేద శాస్త్ర మొక్కటియే ప్రమాణముగాని కేవలతర్కాదిశాస్త్రము లెంతమాత్రమును బ్రమాణములు కావు. సన్యాసి శిక్షయం దాదిస ప్తమమున 132-వ సంఖ్యను, "స్వతః ప్రమాణ వేద ప్రమాణ శిరోమణి" యనియు, మధ్యలీల నిరువదవ యధ్యాయమందు 122-వసంఖ్యను సనాతన గోస్వామిశిక్షయందు

శాస్త్రార్థవిశ్వాసమే శ్రద్ధ.

"జీవులు మాయావశతఁ గృష్ణ వి ♦ స్మృతులైరని కృష్ణుండు
తా విరచించెఁ బురాణములను వే♦దములను స్వయముగ మెండు"

అని చెప్పెను.

కోమలశ్రద్ధయనియు, దృఢశ్రద్ధయనియు శ్రద్ధ రెండువిధములు. దృఢశ్రద్ధవలన నుదయించెడి భక్తి యత్యంత మేదురమై స్వభావసిద్ధముగ భావరూపముననుండును. ఇందువిషయమై శ్రీమన్మహాప్రభుని యుపదేశము శ్రీ శిక్షాష్టకమందు సంపూర్ణరూపమున నున్నది.

కోమలశ్రద్ధయు, దృఢశ్రద్ధయు.

కోమలశ్రద్ధవిషయమై మహాప్రభువు సనాతనున కిట్లు సెలవిచ్చియుండెను.

(చైతన్య చరితామృత మధ్యలీల 23-వ అధ్యాయమున 9-13 శ్లోకములు)

—కోమలశ్రద్ధయొక్క యున్నతిక్రమము.—

"భాగ్యవశతచే శ్రద్ధోదయమై ♦ వ్వనికిఁ గలుగు నాతండు
యోగ్యుఁడగుచు సాధుసంగలాభము ♦ నొందెడి సలధన్యుండు
సాధుసంగమునఁ గలుగు జీవునికి ♦ శ్రవణంబు కీర్తనంబు
సాధనభక్తి ననర్థనివర్తన ♦ జరుగు నిది నిశ్చయంబు
సకలానర్థములడఁగ భక్తిని ♦ ష్ఠయుఁ దానుదయము నొందు
నిఁక నానిష్ఠయె శ్రవణాదుల రుచి ♦ నేర్పడఁజేయుఁగమందు
రుచి యుదయించిన యపుడె పుట్టుఁబో ♦ ప్రచురంబగు నాసక్తి
ప్రచురాసక్తికిఁ బ్రీత్యంకురమే ♦ ఫలమని విజ్ఞులసూక్తి
ప్రీతి గాఢమయ్యేనేని నదియె ధ ♦ రించును ప్రేమాహ్వయము
ఆతత సర్వానంద ధామమున ♦ నా ప్రేమమునకు జయము"

దృఢ శ్రద్ధగలవారికి శాస్త్రవాక్యములతోఁ బ్రయోజనము లేదు. కోమల శ్రద్ధగలవారికి శాస్త్రవాక్యపాలనము, సాధుసంగమము తప్ప వేఱొండు గతిలేదు.

దృఢ శ్రద్ధయే రాగము, కోమల శ్రద్ధయొక్క యాచరణము.

కోమలశ్రద్ధగలవారు దీక్షను స్వీకరింపుటచే నితాంతప్రయోజనము గలదు. సద్గురు సన్నిధానమున శాస్త్ర సిద్ధాంత లాభమును, మంత్ర గ్రహణమును బొంది గురూపదిష్టమార్గమున నర్చనాది సాధనవిధానమును జేయఁగాఁ జేయఁగా వారల శ్రద్ధకుఁ గ్రమోన్నతి కలుగును. ఇట్టి క్రమోన్నతి కలుగుటకు వారలకు దశ మూలశిక్షయే యావశ్యకము:—ప్రమాణమొక్కటియు, ప్రమేయము, లనఁగా, ప్రమాణిత విషయములు తొమ్మిదియు.

దృఢ శ్రద్ధ.

దృఢశ్రద్ధగల భక్తుల హృదయమునందలి స్వతస్సిద్ధవిశ్వాసముచే నే కేవల హరి నామము సాధింపఁబడుచున్నదో, ఆనామానుగ్రహముచేతనే సమస్త ప్రమేయములును, దమంతటఁ దామే సహజముగ సంభావి-

తము లగుచున్నవి. ప్రమాణవిచారము దృఢ శ్రద్ధాళువుల విషయమై యవ సరమే లేదు.

కోమల శ్రద్ధకు వేదాది శాస్త్రము లే మూల ప్రమాణములు.

కోమల శ్రద్ధాళువులకుఁ బ్రమాణావలంబనము లేనియెడల వారలు దుష్ట సంగదోషముచే సత్వరముగ స్థానభ్రష్టులగు దురు. బ్రహ్మవిస్తార స్వరూపమగు వేదమొక్క టియే వారికిఁ బ్రమాణము. వేదము విపులమైనది. అందుఁ గర్మాధికారులఁ గూర్చియు, జ్ఞానాధికారులు మున్నగువారినిగూర్చియు ననేక శాస్త్రీయనియమములు సంగ్రహింపఁబడుటచే శుద్ధభక్తియం దధికారముగలవారిం గూర్చిన యుపదేశములను సులభముగ సంగ్రహించుట కవకాశములేదు. వేదముయొక్క మూలతాత్పర్యము వేదశాస్త్రమునం దాయాస్థలముల నభిధేయరూపమున వర్ణింపఁబడియున్నది. ఆమూలతాత్పర్యమును దేటఁబఱచుటకే సకల సాత్త్వికపురాణములును విరచింపఁబడినవి. ఆ సాత్త్విక పురాణములలో శ్రీమద్భాగవతము సర్వశ్రేష్ఠమై వేద తాత్పర్యమును సాత్త్వికముగ వ్యాఖ్యానించుటయం దద్వితీయమై యున్నది. కావున భాగవత శాస్త్రమును, తదనుగత పాంచరాత్రాది తంత్ర శాస్త్రములును, గూడఁ బ్రమాణములుగనే పరిగణింపఁబడుచున్నవి.

సనాతన శిక్షయందుఁ బ్రభు విట్లు సెలవిచ్చెను:—

(చైతన్య చరితామృత మధ్యలీల 20-124-125).

—వేద ప్రతిపాద్య విషయము.—

"సంబంధము నభిధేయమును బ్రయో ♦ జనమును వేదము చెప్పు
సంబంధంబను నుడి కృష్ణ ప్రా ♦ ప్తిం బచరింపఁగ నొప్పు
పరభక్తి సాధనం బభిధేయా ♦ హ్వాయ యుత యంద్రు జనంబు
పురుషార్థ శిరోమణియగు ప్రేమమె ♦ పరమ ప్రయోజనంబు".

**సంబంధము**—వస్తుత్రయమగు చిత్ (జీవ), అచిత్, ఈశ్వరులకు గల పరస్పర సంబంధమే సంబంధ శబ్దమున నుల్లేఖింపఁబడుచున్నది. వాస్తవముగఁ గృష్ణుఁడే యేకమాత్రవస్తువు. ఆవస్తువునకుఁ జిత్తనియు, నచిత్తనియు రెండుశక్తులు గలవు. అచిచ్ఛక్తి పరిణామముచే నచిజ్జగత్తును, జీవశక్తి పరిణామముచే జీవ జగత్తును సంభవము లగుచున్నవి. సంబంధ విచారముచే జీవునకుఁ గృష్ణదాస్యము మఱలఁ బ్రాప్తించుటే సంబంధ స్థాపనమని తెలియనగును.

(1) కృష్ణుఁడే సంబంధ విషయము.

—సార్వభౌమశిక్షయం దిట్లున్నది.—

"లేమ స్వరూపైశ్వర్యమ్ముల నా ♦ లియు మాయాగంధంబు
వేదములన్నియు భగవంతునికే ♦ పేర్కొనె సంబంధంబు"

మఱలఁ జరితామృత మధ్యలీలను 20-124 సనాతన శిక్షయందు, "సంబంధమనఁ గృష్ణప్రాప్తియనియు, సాధనము భక్తిప్రాప్తి" కనియుఁ జెప్పఁబడినది.

ఈసంబంధ తత్త్వవిచారమం దేడువిషయములు ప్రమేయములుగ నిరూపింపఁబడినవి. అవి యెవ్వియన,—

సప్తప్రమేయములు.

(1) కృష్ణ విచారము.
(2) కృష్ణశక్తి విచారము.
(3) కృష్ణరస తత్త్వవిచారము.
(4) జీవ తత్త్వవిచారము.
(5) జీవుని సంసార విచారము.
(6) జీవుని నిస్తార విచారము.
(7) అచింత్య భేదాభేద విచారము.

అనునవి. ఈ యేడు ప్రమేయములును వేఱువేఱుగ విచారించితిమేని సంబంధజ్ఞానము మనకుఁ బూర్తిగ లభింపఁగలదు.

(2) కృష్ణశక్తి యభిధేయము. అభిధావృత్తి-లక్షణవృత్తి.

**అభిధేయము.**—రచనకు శబ్దవిన్యాసమేకదా కారణము? ఏదేనొక రచనయందుఁ గల శబ్దముల సహజార్థమే శక్తివలన ద్యోతకమగుచున్నదో దానినే శబ్దములయొక్క యభిధాశక్తి యందురు. "దశ గజము" లని చెప్పునపుడు పది సంఖ్యగల యేనుఁగు పిండు మాత్రమే మన కనుభవనీయమగుచున్నది. ఈ సహజార్థమునే మన మభిధేయమందుము. అభిధాశక్తియేకాక లక్షణా నామకశక్తి మఱియొకటి కలదు. "గంగాయాం ఘోషః-(పల్లి)" యనునది దీనికి నిదర్శనము. గంగా జలమందు పల్లి యుండదు గాన శబ్దముల, లక్షణాశక్తి మూలమున గంగాతీరమందలి పల్లి యని మనము గ్రహించుచున్నాము. ఏస్థలమందు లక్షణార్థము ప్రయోజనమో యచట నభిధాశక్తి కార్యకారి కాఁజాలదు. ఏస్థలమందు సహజముగ స్వాభావికార్థము గ్రాహ్యమగుచున్నదో అచట నభిధాశక్తియే కార్యకారియగును.

కృష్ణశక్తియే యేకమాత్రాభిధేయము; ఇది యష్టమప్రమేయము.

అభిధాశక్తిచే వేదశాస్త్రమందేయర్థము లభ్యమగుచున్నదో అదియే మనము గ్రహింపఁదగినది. వేద శాస్త్రమందలి యథార్థమగు నర్థమే వేదశాస్త్రాభిధేయము. ఆ యథార్థమగు నర్థమును దెలిసికొనుటయే మనకుఁ గర్తవ్యము. వేదములనన్నిఁటిని మనము చక్కఁగఁ బరిశీలించినచో భగవచ్ఛక్తియే వేదశాస్త్రాభిధేయమని స్పష్టపడక మానదు. కర్మ, జ్ఞానము, యోగము మున్నగునవి యభిధేయమున కవాంతర సంబంధము కలవిగఁ జెప్పనగునుగాని ముఖ్య సంబంధము వానికెంతమాత్రమును లేదు. కనుక నీశాస్త్రమందుఁ గృష్ణప్రాప్తికి సాధనభక్తియే ముఖ్యోపాయముగఁ జెప్పఁబడుచున్నది. ఇది యొక ప్రమేయము.

ప్రయోజనము—దేని నుద్దేశించి సాధనోపాయ మవలంభింపఁబడుచున్నదో అదియే ప్రయోజనము. జీవునిప్రేమ

(3) కృష్ణప్రేమయే ప్రయోజనము; ఇది నవమ ప్రమేయము.

సిద్ధిరూపమగు నీప్రయోజన మింకొకప్రమేయము. ఈరీతిగఁ దొమ్మిది ప్రమేయములు నిరూపింపఁబడినది. కనుకనే సనాతని శిక్షయందిట్లున్నది—

"ఈ కరణిని సంబంధతత్త్వమభి ♦ హితమయ్యెను నీకనఘ!
ఏకమాత్ర కృష్ణప్రాప్తియె వే ♦ దైకోపదేశమనఁగ
విను చెప్పెద నభిధేయలక్షణము; ♦ వినుటకు ఫలముగ దొరకు
మన కల కృష్ణుఁడు కృష్ణప్రేమం ♦ బను నమూల్యమగు సరకు"

ఈప్రణాళి ననుసరించి శ్రీమన్మహాప్రభువు జైవధర్మశిక్షను లోకమున కనుగ్రహించెను.



## ప్రథమవృష్టి—తృతీయధార.

### కృష్ణుఁడు, కృష్ణశక్తియు, రసమును.

శ్లో. శ్రీ విగ్రహారాధన నిత్యనానా
శృంగార తన్మందిర మార్జనాదౌ
యుక్తస్య భక్తాంశ్చ నియుంజతోఽపి
వందే గురోః శ్రీ చరణారవిందమ్.

కృష్ణుఁడే పర తత్త్వము.

సచ్చిదానంద విగ్రహస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడే పరముఁడును, బరమేశ్వరుఁడును, అనాదియు, సర్వమునకాదియు, సకల కారణకారణుఁడును. కృష్ణునకు శాస్త్రము లందు గోవిందుఁడను నామాంతరము గలదు. సనాతన శిక్షయం దిట్లున్నది:—

"విను శ్రీకృష్ణస్వరూప విచారము ♦ సనాతనా! ఆతండు
అనయమద్వయ జ్ఞానతత్త్వఃము వ్ర ♦ జాధీశుని తనయుండు
సర్వాదియు సర్వాంశియుఁ దా శా ♦ శ్వత కిశోర శేఖరుఁడు
సర్వాశ్రయుఁడు చిదానందమూర్తి ♦ సర్వుఁడు సర్వేశ్వరుఁడు
భగవానుఁడు స్వయముగఁ గృష్ణుఁడు శా ♦ శ్వత గోలోకనివాసి *
తగ సర్వైశ్వర్యమయుఁడు గోవిం ♦ దాపరనామోద్భాసి

చై. చ. మధ్య 20-152-155.

---

* గోలోకనామ్ని నిజధామ్ని తలేచతస్య
దేవీ మహేశ హరిధామ సుతేషు తేషు
తేతే ప్రభావ నిచయా విహితాశ్చయేన
గోవింద మాది పురుషం తమహం భజామి

బ్రహ్మసంహిత 5-43.

ఈశ్వర స్వరూపానుభవము జైవ జగత్తునందే మనకు సదా లభ్య మగుచున్నది. పరమేశ్వరుఁడు మానవునకే యనుభవశక్తి ననుగ్రహించెనో, గానివలననే యచ్చాధికారము గల జీవులందఱును ఈశ్వర స్వరూపాను భవమును బొందుచున్నారు. మానవుని యనుభవ వృత్తి మూఁడువిధములు.

స్థూల దేహము, సూక్ష్మదేహము, లేక, మనము ఆత్మగతాను భూతియు.

(1) స్థూలదేహగతమగు జ్ఞానేంద్రియవృత్తి.
(2) సూక్ష్మదేహ (మనో) గతమగు బోధశక్తి.
(3) జీవాత్మయొక్క స్వరూపగత చిద్దర్శనవృత్తి.

చక్షువు, కర్ణము, నాసిక, జిహ్వా, త్వక్కు అను నైదును జ్ఞానేంద్రియములు. ఈ యింద్రియముల మూలమున మనకుఁ గలుగు బాహ్యజ్ఞానము కేవల జడజ్ఞాన మాత్రమే. మనోగతములును, జడజ్ఞాన ప్రతిఫలన రూపములును అగు చింతా, స్మరణ, ధ్యాన, ధారణాదులచే జడ జ్ఞానమును, కేవల చిదాభాస ధర్మమును, మాత్రము ప్రాప్తించును. కావున నీరెండువిధములగు జ్ఞానవృత్తులును ప్రకృతి సంబంధములైనవే. ఈ రెండు వృత్తులమూలమున నీశ్వరస్వరూపముగాని, చిదానంద తత్త్వానుభవముగాని మనకెంతమాత్రమును గలుగ నేరదు. కనుక మనమాత్మవృత్తి * నవలంబింప వలెను; లేనిచో మఱియెన్నఁటికిని ఈశ్వర స్వరూప దర్శనలాభము మనకు సంభవింపదు.

జడములగు జ్ఞానేంద్రియముల నాశ్రయించి యీశ్వర స్వరూప దర్శ నముకొఱకుఁ బ్రయత్నించుమానవులానసప్రాణా యామ ధ్యాన ధారణాది యోగాంగములఁ జేకొని, సృష్టిజగత్తున కీశ్వరుఁడాత్మభూతుఁడను వ్యతిరేక చింత నవలంబించి పరమాత్మదర్శన

పరమాత్మ దర్శనము, బ్రహ్మదర్శనము.

*యథాయథాత్మా పరిమృజ్యతేఽసౌ, మత్పుణ్యగాథా శ్రవణాభిధానైః
తథాతథాపశ్యతి వస్తుసూక్ష్మం, చక్షుర్యథైవాంజనసంప్రయుక్తమ్.
భా. 11.14.26.

రూపమగు నొకసమాధిని గల్పింతురు. ఇట్లు చేయుటచే వారలకప్రాకృత దృష్టి సంపూర్ణముగఁ బ్రాప్తింపదు; కేవల ప్రాకృత జ్ఞాన నిషేధపూర్వక మగు నొకవిధమగు ఖండజ్ఞానము మాత్రమే లభించును. ఏ మానవులు దీని కంటె నధికతరమగు వ్యతిరేకచింత నవలంబించి సమస్త ప్రాకృత రూపములను ధిక్కరింపుచు నిరాకారమును నిర్వికారమును నగు నొక పరమేశ్వర స్వరూపమును గల్పింతురో, అట్టి వారు బ్రహ్మ దర్శనము మాత్రమభిలషించినవా రగుచున్నారు. బ్రహ్మదర్శనము యథార్థముగ భానమాత్రమే. *కనుకనే సనాతనునను మహాప్రభువిట్లు సెలవిచ్చెను.

"జ్ఞాన యోగ భక్తులనెడి మూఁడగు ♦ సాధనములఁ గ్రమముగను
మానుగ బ్రహ్మయుఁ బరమాత్మయు భగ ♦ వానుఁడు సేవితుఁడగును.

చై. చ. మధ్య 20.157.

మఱల నిట్లు సెలవిచ్చెను.

"వావిరి నాగౌణముఖ్యవృత్తుల ♦ వ్యతిరేకాన్వయములను
ఆవేదమె చెప్పెను కేవలునిగ ♦ నా కృష్ణునె యిమ్మలను"

చై. చ. మధ్య.

త్రివిధ దర్శనము.

ఫలితార్థమేమన, జీవుఁడు ద్రష్టస్వరూపుఁడగుచు దన దృష్టి కనురూపమగు నీశ్వరస్వరూపము దర్శింప నిచ్ఛగించు నపుడు తన యధికారస్థానము ననుసరించి తత్స్థానోచిత ద్రష్టవ్య స్వరూపమునే చూడఁగలు

---

* వాచంయచ్ఛ మనోయచ్ఛ ప్రాణాన్యచ్ఛేంద్రియాణిచ,
ఆత్మానమాత్మనా యచ్ఛ నభూయః కల్పసేఽధ్వనే.
యోవై వాఙ్మనసీ సమ్యగసం యచ్ఛన్ ధియాయతిః
తస్యవ్రతం తపోదానం స్రవత్యామ ఘటాంబువత్.
తస్మాద్వచోమనః ప్రాణాన్నియచ్ఛేన్మత్పరాయణః
మద్భక్తియుక్తయా బుద్ధ్యా, తతఃపరి సమాప్యతే

భా. 11.16.43 to 45.

గాను. కర్మయోగముచేఁ బరమాత్మయు, జ్ఞానయోగముచే బ్రహ్మయు, భక్తియోగముచే భగవంతుఁడును మనను సంబంధులుగ లక్షింపఁబడుచున్నారు. తత్త్వవేత్తలగు పండితుల ద్వయజ్ఞానతత్త్వమునే తత్త్వమని పిలుతురు. * ఆయద్వయ చిద్విగ్రహమునే యా యా యధికారులు తమ తమ యధికారానురూపమగు నేర్పుతో వేఱు వేఱు విధములుగ సాక్షాత్కరింపఁజేసికొనుచున్నారు. బ్రహ్మయు, బరమాత్మయు, భగవానుఁడును వాస్తవముగ నొక్కటే తత్త్వము. ఆ తత్త్వము నెవఁడే దృష్టితో నెంతఁదనుకఁ జూడఁగలుగునో, అతఁడంతపర్యంతమే తత్తత్త్వ గ్రహణంబు సేసి తాను గ్రహించిన మేరకే సర్వోత్తమత్వము స్థిరపఱచుకొనుచుండును.

కృష్ణుఁడే భగవంతుఁడు.

ఆ భగవానుఁడే కృష్ణుఁడు. కృష్ణుని సామాన్య నరస్వరూపునిగను, సామాన్య నర విలాసము గలవానిగను భావించి వానిం దృణీకరించువారల తత్త్వజ్ఞానము మిగుల క్షుద్రమైనదిగఁ జెప్పనగును. కృష్ణుఁడే స్వయం భగవానుఁడను విషయముద్ఘాటించు సందర్భమున శ్రీభాగవతాది గ్రంథములయందలి మర్మములను † శ్రీమన్మహా ప్రభువు సనాతనున కీవిధమున ననుగ్రహించెను.

"భక్తియనఁగ భగవత్పూర్ణానుభ • వ స్వరూపమై పొల్చు
శక్తివంతుఁడేకమూర్తియయ్యు న • సంఖ్యరూపముల దాల్చు
అరయస్వయంరూపావేశ తదే • కాత్మరూపములు మూఁడు
ధరియించియు భగవంతుఁడుండు నీ • త్రయమగు స్థితినే నాఁడు.

---

* వదంతితత్ తత్త్వవిదస్తత్త్వం యద్ జ్ఞానమద్వయమ్
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితిశబ్ద్యతే
భా. 1.2.11.

† ఏతేచాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్
ఇంద్రాది వ్యాకులం లోకం మృడయంతి యుగేయుగే
భా. 1.3.28.

అగును స్వయంరూపుఁడు కృష్ణుడే; ద్విత ♦ యంబు ప్రకాశస్వమూర్తి
భగవంతుఁడు స్వస్వరూపకృష్ణుఁడే ♦ వ్రజమందు గోపమూర్తి
ఆకర్ణింపు సనాతన! యింక స్వ ♦ యంప్రకాశ పరిచయము
ప్రాకటముగఁ బ్రాభవమున మఱినై ♦ భవమన నొప్పు ద్వితయము
చై. చ. మధ్య. 20.164 to 167.

విందు మవతరించు నంచుఁదగ నా ♦ ర్విధముల శ్రీకృష్ణుండు
అందొక్కటి పురుషావతారము గు ♦ ణావతారమింకొండు
మఱియొక్కటి లీలావతారమగు ♦ మన్వంతర గతమొకటి
మఱి శక్త్యావేశావతారమును ♦ మఱియు యుగ గతంబొకటి
చై. చ. మధ్య. 20.245 & 246.

భగవదాజ్ఞ నడిపెదు బ్రహ్మశివుల్ ♦ భక్తావతారములగు
జగములఁ బ్రోచెడి విష్ణువు కృష్ణ ♦ స్వరూపాకృతిం జెఁగు *
చై. చ. మధ్య. 20.317.

సమగ్రైశ్వర్యము, సమగ్రవీర్యము, సమగ్రయశము, సమగ్రశ్రీయు, సమగ్రజ్ఞానము, సమగ్రవైరాగ్యము నను నీ యాఱింటిని "భగ" యని వ్యవహరింతురు. ఏపురుషుఁ డీ యాఱును గలిగియుండునో అతఁడే భగవంతుఁడు. ఈ సమస్తమునకును కృష్ణుఁడే యవధియగుటచేఁ గృష్ణునియం దివి పూర్ణముగఁ బ్రకాశించుచుండునుగాన, కృష్ణుఁడే స్వయం భగవంతుఁడు. కృష్ణునికంటె నధికుఁడుకాని, కృష్ణునితో సమానుఁడుకాని మఱి యొకఁడు లేఁడు. కృష్ణుడు స్వయంరూపుఁడై గోలోకమందు సదా నివసించుచుండును. తదేకాత్మరూప పురుషగణము కృష్ణేచ్ఛ ననుసరించి తమ తమ కార్యములను జేయుచుందురు. మహావిష్ణువే కృష్ణుని ప్రథమ పురుషావతారము. అతఁడు

కృష్ణుని యొక్కయు, దత్ప్రకాశము యొక్కయుఁ బరిచయము.

* సృజామి తన్నియుక్తోఽహం, హరో హరతి తద్వశః
విశ్వం పురుష రూపేణ పరిపాతి త్రిశక్తిధృక్
భా. 2.6.31.

కారణసముద్రమున శయనించియుండును. గర్భోదకశాయి, క్షీరోదకశాయి యను పురుషులిరువురు నతని యంశములు. రామ నృసింహాద్యవతారములు తత్పురుషుని యంశ కలామాత్రులు. పురుషావతారమునకు మూలమగు కృష్ణుఁడు స్వయంభగవానుఁడు. కృష్ణుఁడు తన యచింత్య శక్తిచే సర్వోపరి స్థితుఁడైయున్నను యుగ పద్ధర్మమున వ్రజేంద్ర నందనుఁడై యవతరించు చున్నాఁడు. ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడిన బ్రహ్మ కృష్ణుని శరీరకాంతి యే. * వేదమందును, యోగ శాస్త్రమందును వివరింపఁబడిన పరమాత్మ కృష్ణుని దగు నొక యంశమాత్రము. † ఈరెండువిషయములకు శాస్త్రప్రమాణము లనేకములు గలవు గాని తర్కాది శాస్త్రాదుల యందలి యుక్తులం సహజముగ నిట్టివి తెలిసికొనఁజాలవు. మనకిపుడు దృగ్గోచరమగుచున్న సౌర జగత్తు సూర్య స్వరూపమునుండి వెలువడి సర్వత్ర యెట్లు వ్యాపించెనో, అట్లే చిదానంద స్వరూపుఁడును, అప్రాకృతుఁడును, సర్వ విక్రమ యుక్తుఁడును నగు శ్రీ కృష్ణ నభస్వంతునినుండి యసంఖ్యములగు కిరణములు వెలువడి సర్వగములై సర్వత్ర వ్యాపించి వ్యతిరేక చింతాశీలురగు జ్ఞానుల చిత్తములందు, బ్రహ్మస్వరూపమున నిరాకారాది వ్యతిరేక ధర్మములతోఁ బ్రతిఫలించియుండును. జడజగత్తును సృజియించి దానియందుఁ బ్రవేశించిన కృష్ణాంశమునకే యోగి గణము పరమాత్మ యను నామమిడి దాని ననుసం

---

* యస్య ప్రభా ప్రభవతో జగదండకోటీ,
కోటీష్వశేష వసుధాది విభూతిభిన్నమ్
తద్బ్రహ్మనిష్కలమనంత మశేషభూతం,
గోవిందమాది పురుషం తమహంభజామి

బ్రహ్మసంహిత 5-40.

† కృష్ణమేన మవేహిత్వ మాత్మాన మఖిలాత్మనాం
జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా

భా. 10-14-55.

ధింతురు. ప్రాకృత సత్త్వగుణ వికార రూపములగు నిరాకార నిర్వికార ధర్మములు ఖండజ్ఞానముగల పండితుల కుపాసనావిషయములయ్యెను. భగవత్పూజనమన్న నరపూజగను, గుణపూజగను బరిణమించునను భయముతో ఖండ విత్పండితాభిమానులగు పురుషగణము నిరాకార నిర్వికార ధర్మముల నాశ్రయించి తుదకుఁ బ్రేమ భండారమునకుఁ గడుంగడు దూరమగుచున్నారు.

కృష్ణ దర్శనమందలి యోగ్యత.

పవిత్రమగు జైవ ధర్మమున కిట్టి విప్లవము చెడు సంస్కార దోషము వలన సంభవించుచున్నది. శ్రీకృష్ణునిమహత్త్వము, శ్రీకృష్ణుని సౌందర్యము నెవరి హృదయములందు స్థిరీభూతములగుచున్నవో అట్టివారు నిరాకారాది వ్యతిరేకబుద్ధినుండి యుద్ధరింపఁబడి యప్రాకృత రాజ్యదర్శన లాభము నొందుదురు. ఇట్టి యనంత సుఖలాభ ప్రాప్తి జీవుని భాగ్యఫలము వలననే కలుగును. మానవుని దుర్భాగ్యఫలముగ సామాన్య ప్రాకృతవిజ్ఞానముచే వంచితమగు బుద్ధి యప్రాకృతరాజ్యముపైఁ బ్రసరింపఁ జాలదయ్యెను. కృష్ణుఁడాద్యంతములు లేని యప్రాకృతకాలమందు సర్వోచ్చ స్థితిగల గోలోకమునకు నాయకుఁడయ్యును దన యవిచింత్యశక్తి క్రమమున స్వచ్ఛందవృత్తితో గోలోకమందలి వ్రజముతోఁ గూడ భూమండలమునకు దనంతటఁ దానే యవతరించి శుద్ధసవిశేషధర్మమున సదా సంచరించును. ఈ సమస్త కృష్ణలీలలు నాత్మగత విశుద్ధ సమాధి మూలముననే జీవుని కవగతములగుచుండును * గాని చర్మచక్షువుచే నిట్టివి యనుభవనీయములు కావు. స్వశక్తిమూలమున శ్రీకృష్ణుడెప్పుడైనను మాంసనేత్రములకు సాక్షా

---

* అథో మహాభాగ భవానమోఘదృక్
శుచిశ్రవాః సత్యరతో ధృతవ్రతః
ఉరుక్రమస్యాఖిల బంధముక్తయే
సమాధి నానుస్మర యద్విచేష్టితమ్.

భా. 1.5.13.

త్కరించినచో, అట్టి సాక్షాత్కారమువలని లాభము మాత్రము చేకూఱుట సున్న. ఏమనఁ, గృష్ణలీల నిత్యమును, ప్రకృతిమయములగు దేశకాలములచే ననవచ్ఛేదకమును అగుచున్నది. విశుద్ధమును, ఆత్మగతమును నగు కేవలభక్తి చక్షువుచేతనే యది చూడనగును; కేవల భక్తిపూరిత హృదయమునందే దానిని ధ్యానింపనగును. * కాని ప్రకృతిమయములగు జ్ఞాన విజ్ఞానములతోడను, అహంకారముతోడను, గూడుకొన్న చిత్త మెప్పుడైన నా శ్రేష్ఠతత్త్వము వంకఁ బరువిడినచో నాతత్త్వము సహజముగ దాని నతిక్రమించి చనుచు దానికి దవ్వులనే యుండును. గడ్డిపోఁచకంటె నెక్కువ యడఁకువ గలిగి, తత్తఱపాటు నొందుచున్న చిత్తముతో నెవరు కృష్ణునికై యాక్రోశింతురో, అట్టి ధన్యాత్ములు కృష్ణలీలా సందర్శనము సేయఁగలిగి యపారమగు నానందమును భోగింతురు. భాగ్యవశమున నట్టివానికి శ్రద్ధోదయమయ్యె. నేని పలుల వారు ప్రాకృతాహంకార బాధితులై నామాపరాధులగుట సంభవింప నేరదు. కృష్ణాను శీలనమునకు జాతి, వర్ణము, ప్రాకృతవిద్య, రూపము, బలము, ప్రాకృత విజ్ఞానాది బలము, ఉచ్చపదము, ధనము, రాజ్యము మున్నగునవి కొంచమైనను సాహాయ్య పడవు. ఈ కారణము చేతనే వర్ణాభిమానులు మున్నగు వారికిఁ గృష్ణతత్త్వము స్వభావసిద్ధముగ దూరమందుండును. పైనిఁజెప్పిన సమస్త హేతువాదములను మనము సమ

---

* భక్తియోగేన మనసి సమ్యక్ప్రణిహితేఽమలే
అపశ్యత్పురుషం పూర్వం మాయాం చ తదుపాశ్రయామ్.
యయా సమ్మోహితో జీవ ఆత్మానం త్రిగుణాత్మకమ్
పరోఽపి మనుతేఽనర్థం తత్కృతం చాభిపద్యతే.
అనర్థోపశమం సాక్షాద్భక్తియోగ మధోక్షజే
లోకస్యాజానతో విద్వాంశ్చక్రే సాత్వత సంహితామ్.
యస్యాంవై శ్రూయమాణాయాం కృష్ణే పరమపూరుషే
భక్తిరుత్పద్యతే పుంస శ్శోక మోహ భయాపహా.

భా. 1.7.4 to 7.

క్రమముగ విచారించినచోఁ బ్రస్తుతకాలమునఁ గృష్ణతత్త్వమునను గల యవజ్ఞకుఁ గారణము సహజముగఁ దేటఁబడును.*

అప్రాకృత నిర్ధారము.

ప్రకృతిమయ విజ్ఞానముయొక్క దుర్దశ యెట్టిదనిన, నది తన యధికారమున కతీతములగు సమస్త విషయములను దెలిసికొనుటయందు మిక్కిలి యభిరుచి గలిగి యుండును. అప్రాకృత తత్త్వవిషయమై దాని కెట్టి యధికారమును లేదు. అయినను నిర్లజ్జాభావమున దాని వెంటఁ బరువెత్తి సహజముగ దానిం బొందలేక వ్యతిరేకబుద్ధితో మఱలివచ్చి దానివిషయమై యకించిత్కరమగు నొక సిద్ధాంతమును స్థాపించి కొని దానిం బొందు ప్రయత్నము మఱి సేయదు. సత్సంగముచే జీవునికిఁ గలుగు దైన్యమువలన వానిపైఁ గృష్ణకృప కలుగును. అప్పు డా జీవున కప్రాకృత తత్త్వానుభవము విషయమై యధికారము గలుగును. కేవల జడ జ్ఞాన విచారముచే నప్రాకృత జ్ఞానలాభము కలుగుట సున్న. †

కృష్ణశక్తి—కృష్ణశక్తియనంతమైనది. అనంతమగు సృష్టజగత్తునం దేయేస్థానముల నేయే శక్తులు ప్రకాశితములగుచున్నవో తద్విషయము మన క్షుద్ర జైవజ్ఞానముచేతఁ దెలిసికొనఁజాలము. చిజ్జగత్తునం, దనఁగా, విరజానది కవ్వలియొడ్డున వైకుంఠమును, దాని కుపరిభాగమున గోలోక వ్రజమును

---

* శ్రియా విభూత్యాభిజనేన విద్యయా,
త్యాగేన రూపేణ బలేన కర్మణా
జాతస్మయేనాంధధియ స్సహేశ్వరాన్,
సతోఽవమన్యంతి హరి ప్రియాన్ ఖలాః

భా, 11-15-9.

† అథాపి తేదేవ పదాంబుజ ద్వయప్రసాదలేశాను గృహీత ఏవహి
జానాతితత్త్వం భగవన్మహిమ్నో, నచాన్యఏకోఽపి చిరం విచిన్వన్.
భా. 10-14-29.

ప్రకాశించుచున్నవి. వైకుంఠమందు చతుర్భుజ నారాయణరూపమున సమగ్రైశ్వర్యమును ప్రకాశితమగుచున్నది. గోలోకమందు మాధుర్య ప్రకాశమే ప్రధానమగుటచే ఐశ్వర్య ప్రకాశము సకలము నచట పిహితమైనది. *

మాయాశక్తి.

కృష్ణుడు స్వయం శక్తిమంతుడు. నిజ స్వరూప సంబంధమగు నొక యవిచింత్య మహాశక్తి యతనికి గలదు. శాస్త్రములలో ననేకస్థలములందా శక్తినే "మాయ" యను పేరితో వ్యవహరించిరి. "మీయతే అనయా ఇతి మాయా" (దేనిచే బరతత్త్వము కొలత చేయబడుచున్నదో అది మాయ) అను నర్థమందు గృష్ణుని బాహ్యపరిచయము మాయచేతనే చెప్పబడుచున్నది. మాయచే దప్ప నేఱు విధముగ గృష్ణ పరిచయము లభింపనేరదు. తత్త్వవేత్తలు మాయయను గృష్ణస్వరూప శక్తియని చెప్పి దానినే "పరా" యనియు, "అపరా" యనియు రెండుగ విభజించి మొదటిదానిని జిచ్ఛక్తి యనియు, రెండవదానిని మాయాశక్తి యనియు భిన్న భిన్న నామము లిడిరి. వాస్తవముగ బరాశక్తి యొక్కటియే కృష్ణుని యవిచింత్య శక్తి. దాని ఛాయనే యపరాశక్తి యందురు. ఈ ఛాయారూపయగు మాయాశక్తియే † సమస్త జడ బ్రహ్మాండములకు నధికర్త్రి. చిత్ప్రసంగమున నేమాయాశక్తిని దూషితగా మనము భావించి నిందింతుమో, అది ఛాయారూపయగు మాయాశక్తి కాని స్వరూప శక్తిరూపయగు మాయాశక్తి కాదు. కనుకనే శ్రీమన్మహాప్రభువు సనాతనున కిట్లు సెలవిచ్చెను.

---

* కో వేత్తి భూమన్ భగవన్ పరాత్మన్,
యోగేశ్వరోతీర్భవత స్త్రిలోక్యాం
క్వ వా కథం వా కతి వా కదేతి,
విస్తారయన్ క్రీడసి యోగమాయామ్.

భా. 10.14.21.

† ఋతేऽర్థం యత్ప్రతీయేత, న ప్రతీయేత చాత్మని
తద్విద్యా దాత్మనో మాయాం, యథాభాసో యథాతమః.

భా. 2.9.33.

"కెరలుచు మూఁడై పరిణమించె శ్రీ ♦ కృష్ణ స్వరూపశక్తి
వరచిచ్ఛక్తి యొకటి రెండగు జీ ♦ వశక్తి మాయాశక్తి"
చై. చ. మధ్య. 20-111.

మఱల నిట్లు సెలవిచ్చెను.

"శ్రీకృష్ణుని శక్తులలోశ ♦ త్రితయంబు ప్రధానంబు
వాకొన నగు జ్ఞానేచ్ఛాక్రియలని ♦ వాని దగు లక్షణంబు"
చై. చ. మధ్య. 20-252.

సార్వభౌమునకుఁ బ్రభువిట్లనుగ్రహించెను.

"ఎసఁగు సచ్చిదానంద మయమగుచు ♦ నీశ్వర స్వరూపంబు
భాసఁగును జిచ్ఛక్తియు నంశత్రయ ♦ మున నొంది త్రిరూపంబు
ఆనందాంశము హ్లాదిని; సంధిని ♦ యయ్యెఁదా సదంశమున
మానుగ సంవిత్తయ్యెను గృష్ణ ♦ జ్ఞానమనఁ జిదంశమున
అంతరంగమగుఁ జిచ్ఛక్తి; తట ♦ స్థాహ్వాయము జీవశక్తి;
ఎంతయు బహిరంగము మాయాహ్వా ♦ యువి నేయుఁ బ్రేమభక్తి"
చై. చ. మధ్య. 6-158 to 160.

ఫలితార్థమేమియనఁ, గృష్ణుని యాత్మ శక్తియన్నను, స్వరూపశక్తియన్నను, బరా శక్తియన్నను ఒక్కటియే. ఆ పరాశక్తికి మూఁడు విధములగు విభావములును, మూఁడు విధములగు ప్రభావములును, మూఁడు విధములగు ననుభావములును గృష్ణేచ్ఛచేఁ గలుగుచున్నవి. *

(1) చిచ్ఛక్తి - జీవశక్తి - మాయాశక్తి యను నీ మూఁడును విభావములు.

(2) ఇచ్ఛాశక్తి - క్రియాశక్తి - జ్ఞానశక్తి యను నీమూఁడును ప్రభావములు.

---

* యస్మిన్ విరుద్ధగతయోహ్యనిశంపతంతి, విద్యాదయో వివిధశక్తయ ఆనుపూర్వ్యాత్ తద్బ్రహ్మ విశ్వభవమేక మనంత మాద్య మానంద మాత్ర మవికార మహం ప్రపద్యే. భా. 4-9-16.

(౨) సంధిని - హ్లాదిని - సంవిత్తు అను నీమూఁడు ననుభావములు.

భిన్న భిన్నము లగు శక్తి పరిణామములు.

ఇచ్ఛాశక్తి రూప ప్రభావమువలనఁ జిచ్ఛక్తినుండి గోలోకము, వైకుంఠము మున్నగు లీలాపీఠములును, కృష్ణుఁడు, గోవిందుఁడు మున్నగు నామములును, ద్విభుజ చతుర్భుజ షడ్భుజ ప్రభృతి విగ్రహరూపములును, గోలోక బృందావన వైకుంఠ ప్రభృతి నిత్యానుగ సంస్థానములును, లీలా దయా దాక్షిణ్యాత్మకమేత్యాది గుణములును, ప్రకాశితము లగుచున్నవి.

జ్ఞానశక్తి రూప ప్రభావమువలనఁ జిచ్ఛక్తి కారణముగ వైకుంఠగతమగు నైశ్వర్యము, మాధుర్యము, సౌందర్యము మున్నగునవి సంగతము లగుచున్నవి. ఇచ్ఛాశక్తి కృష్ణునియందుఁ దప్ప మఱి దేనియందును లేదు. జ్ఞానశక్త్యధిష్ఠాత కృష్ణప్రకాశ స్వరూపుఁడగు వాసుదేవుఁడు. క్రియాశక్త్యధిష్ఠాత బలదేవ సంకర్షణాది ప్రకాశము. జీవశక్తి రూపమగు తటస్థశక్తినుండి యిచ్ఛాజ్ఞాన క్రియా ప్రభావములచే దివ్యపారిషదులును, సృష్టిలయేత్యాద్యధికారములు వహించిన దేవతావర్గమును, నర దైత్య రాక్షసాదులును ప్రభవించిరి.

క్రియాశక్తి రూప ప్రభావముచేఁ గృష్ణ లీలాదికమగు క్రియానుభావ సముదాయమంతయుఁ బ్రకాశితమగుచున్నది. సంవిత్సంధినీ హ్లాదినుల విచిత్రత (variegatedness) చిచ్ఛక్తియందే యుపలక్షితమగుచున్నది. ఇవి యన్నియుఁ గలసినచోఁ బరమ ప్రయోజన రూపమగు ప్రేమ లీలయొక్క యన్వయ వ్యతిరేక భావసిద్ధి ఘటించుచున్నది. కృష్ణుని శక్తి యసీమయు, అనంతమును, అపారమును. చిచ్ఛక్తియొక్క క్రియాసముదాయమునకే నిత్యత్వము గలదు. సనాతన శిక్షయం దిట్లున్నది.

"నిత్యమందు చిచ్ఛక్తి లీలనై ♦ నిర్మించిన సర్వమ్ము
సత్యత్వంబది సంకర్షణు ని ♦ చ్ఛవలన నొందును సుమ్మా"

ఛాయాశక్తికి నామాంతరము జడ ప్రకృతి. దానింగూర్చి యిట్లు చెప్పఁబడినది.

జడ ప్రకృతి.

"సృజియించు నతఁడు (సంకర్షణుఁడు) మాయా
సాధన చే బ్రహ్మాండగణమ్ము
నిజముగఁ గాదు జడీయప్రకృతి వా ని సృష్టికిఁ గారణమ్ము
జడమునుండి యెటు వెలువడు నీశ్వర శక్తివినా సర్గంబు?
ఇదు సంకర్షణుఁడేఁడు స్వశక్తిని నిదె సృష్టికి మార్గంబు
ఈశ్వరశక్తి గరించి ప్రకృతి సృజి యించును జరాచరంబు
నశ్వరలోహమదెట్లుదహించు న నల సంగతి నితరంబు"

చై. చ. మధ్య. 6.259 to 261.

కృష్ణుని క్రియాశక్తినే సంకర్షణశక్తియందురు. మాయాశక్తియొక్క నశ్వరపరిణామమే జడజగతు. చతుర్థధారయందు జీవతత్త్వవిచారమున జీవ (తటస్థ) శక్తినిగూర్చి కొంత విచారము సేయఁబడును.

రసతత్త్వము.

కృష్ణరసము—శ్రీకృష్ణుఁడే స్వయం రసతత్త్వము. ఈ విషయము వేదమే చెప్పెను. సప్తమవృష్టి ప్రథమధారయందు రసతత్త్వ విచారము సేయఁబడుచోట రసమన నేమియో పూర్తిగ వివరింపఁబడును. వాక్యములు ప్రకృతి సంబంధములు కావున నవి దేనిని వచింపఁబూనునో అది ప్రయత్నపూర్వకముగ నెట్టి సుందరపదముతోఁ జెప్పినను ప్రాకృతమే యగును; అథవా ప్రాకృతమువలెనైనఁ దోఁచును. ప్రకృత ప్రస్తావమందుఁ బాఠకునకు శ్రద్ధయున్నచో వాని శుద్ధచిత్తమం దప్రాకృత రస ముద్భవించియేతీరును. సత్సంగమును, సుకృతియు, నిట్టి ఫలమునకుఁ గారణములు. తక్కపేషణమెంతఁజేసినను అప్రాకృత రస ముదయింపనేరదు. దుష్టసంగమువలన నుదయించు ప్రాకృతరసము జిజ్ఞాసువును సహజీయ (Psilanthropist) స్థితికిఁ దెచ్చి యథాపతితునిగ నొనర్చును. మానవుఁడు సర్వవిధముల జాగరూకుఁడగునేని రస తత్త్వమాతని కనుభవమునకు రాఁగలదు. శ్రీ

కృష్ణుడు చతుఃషష్ట్య ప్రాకృత గుణమయుఁడును, స్వయ మఖండరసమయుఁడును. ఆ యఱువదినాలుగు గుణములలో నేఁబది గుణము లణురూపమున జీవులయందు ద్యోతితము లగుచున్నవి. ఆ యేఁబది గుణములు నధిక పరిమాణముగ గోచరించుచు మఱి యైదధికగుణములు గూడ శివ, బ్రహ్మ, గణేశ, సూర్యాది దేవతలయందు లక్షితము లగుచున్నవి. అందువలన నా దేవతలు వాస్తవముగ విభిన్నాంశులగు జీవమాత్రులేయైనను ఈశ్వరనామములో వ్యవహరింపఁబడుచున్నారు. ఆ యేఁబదియైదు గుణములును బూర్ణరూపమున ప్రకాశించుచుండ మఱి యైదుగుణములు కూడ నారాయణునందును, విష్ణువునందును, దదవతారగణమగు రామ నృసింహాదులయందును ప్రకాశితములగుచున్నవి. ఈరీతిగ విష్ణుతత్త్వమునందు గోచరించు నఱువదిగుణములే కాక మఱి నాలుగు పరమాప్రాకృత పరమాసాధారణ గుణములు శ్రీకృష్ణుని యందు విరాజమానములగుచున్నవి. ఈకారణముచేతఁ గృష్ణుఁడు మాత్రమే సర్వేశ్వరుఁడును, సర్వ శక్తిమంతుఁడును, సర్వ రసమయ తత్త్వమును, నగుచున్నాఁడు. కృష్ణ స్వరూప శక్తియందే విచిత్రతగలదో, అదియంతయు మూర్తీభవించి శ్రీకృష్ణుని శాంత దాస్య సఖ్య వాత్సల్య మధుర రస సేవనములందుపకరణరూపమగుచున్నది. హ్లాదినీ (మధుర రస) సారరూపయగు శ్రీ రాధిక సర్వప్రధాన. ఈరసము గోలోకవ్రజమందు నిత్య నివాసము గలదయ్యును గృష్ణుని కోర్కెననుసరించి యోగమాయ యగు చిచ్ఛక్తి భూలోకవ్రజమందు దానినే యఖండరూపమునఁ బ్రకాశింపఁజేయుచున్నది. ఎవరి బుద్ధికిఁ బ్రకృతిగుణముల నతిక్రమింపఁగల శక్తిలేదో, అట్టివారలీరసము ననుభవించుటకుఁగాని, తదకీరస విమర్శచేయుటకైనఁగాని యెంతమాత్రము నర్హులు కారు. కావున వారు ప్రాకృతజ్ఞానవశులై వ్రజరసము నవహేళనము సేయుదురు. ఇందువలననే యెవరు శ్రద్ధాన్వితులై వ్రజరసమును వర్ణింతురో లేక, తద్వర్ణన మాకర్ణింతురో, అట్టివార చిరకాలమునఁ బరాశక్తిరూప

మగు ప్రేమ లాభమును బొంది జడోదితహృద్రోగమునుండి విముక్తు* లగుదురని శ్రీమద్భాగవతమునందుఁ జెప్పఁబడెను. ఇదే శ్రీమన్మహాప్రభుని చరమ శిక్ష.

---

* విక్రీడితం వ్రజవధూభి రిదంచ విష్ణో
శ్శ్రద్ధాన్వితోను శృణుయాదథ వర్ణయేద్యః
భక్తింపరాం భగవతి ప్రతిలభ్యకామం
హృద్రోగ మాశ్వపహినోత్య చిరేణ ధీరః
భా. 10-33-40.



# ప్రథమ వృష్టి—చతుర్థ ధార.

## జీవుఁడు; బద్ధ జీవుఁడు; ముక్త జీవుఁడు.

శ్లో. చతుర్విధః శ్రీ భగవత్ప్రసాదః
స్వాద్వన్న తృప్తాన్ హరిభక్త సంగాన్
కృత్వైవ తృప్తిం భజత స్సదైవ
వందే గురోః శ్రీ చరణారవిందమ్.

మహాప్రభుని శ్రీముఖమునుండి మానవానుగ్రహముకొఱకు వెలు స్వాంశయు, విభి నడిన మఱియొక విషయము గలదు. అది సనాతన న్నాంశయు. శిక్షయందిట్లున్నది.

“స్వయముగ భగవంతుండు సద్వయ ♦ జ్ఞానమైన కృష్ణుండు
స్వయముగ నొందు నవస్థానమ్ముల ♦ స్వరూప శక్తిని మెండు
తానే స్వాంశవిభిన్నాంశల వి ♦ స్తారుఁడగుచు విహరించు
ఆనందముతో వైకుంఠ బ్ర ♦ హ్మాండములం; బ్రేమ నించు
పాలుచు స్వాంశచే నాతండె చతు ♦ ర్వ్యూహావతారుఁడగుచు
చెలువొందు విభిన్నాంశచే నతఁడె ♦ జీవతత్త్వ గతుఁడగుచు.

జీవులు రెండు విధములు.

—నిత్యబద్ధులును, నిత్యముక్తులును.—

సత్యముగన్ ద్వివిధమ్ము విభిన్నాం ♦ శజీవ సముదాయమ్ము
నిత్యముక్త లోక తెగ వేఱొక తెగ ♦ నిత్యబద్ధనిచయమ్ము
కృష్ణపదోన్ముఖులు నిత్యముక్తులు ♦ కృష్ణవ్రతులగు వీరు
కృష్ణపారిషదనామాన్వితులై ♦ కీర్తిగడించిన వారు
నిత్యబద్ధులన: గృష్ణుని మఱచిన ♦ నిత్యబహిర్ముఖ సమితి

—నిత్యబద్ధుల దశ.—

నిత్య సంసృతిస్థులు స్వర్గంబో ♦ నిరయంబో వారి గతి
వారిని సంసృతియందు మిగుల మా ♦ యారాక్షసి దండించు
వారక తాపత్రయ దావాగ్నిని ♦ వారినెపుడుం గ్రాఁగించు
దాసుఁడగుచుఁ గామక్రోధంబుల ♦ తాడనములు తీరలేక
నేసటి తుదకొక సాధువును సమీ ♦ పింప నాతఁడలవోకఁ
గృష్ణమంత్ర మిడ మాయారాక్షసి ♦ యెట కేని దౌడుదీయుఁ
గృష్ణభక్తి లభియించు నప్పుడల ♦ కృష్ణునె భక్తుఁడు డాయు

చై. చ. మధ్య. 22-7-15.

సనాతన శిక్షయందు మఱియొక స్థలమున నిట్లు చెప్పఁబడినది.

—జీవుని స్వరూపము.—

"పావకుఁడర్చుల భానుఁడు గోవుల ♦ పరియించు నేవిధముగ
జీవునిఁ గృష్ణుఁడు స్వదాస్యమునకుం ♦ దావరించు సహజముగ
అల శ్రీకృష్ణ తటస్థశక్తియే ♦ యగు జీవుఁ; డిరువురకుఁ
గల భేదాభేదతత్త్వ మద్భుత ♦ గతి నిందు మనకు దోఁచు

చై. చ. మధ్య. 20-108-109.

మఱల రూపశిక్షయం దిట్లున్నది.

"వినుమీ గతి బ్రహ్మాండమెల్ల వ్యా ♦ పించిన జీవ నిచయము
ఎనుబది నాలుగు లక్షల యోనులు ♦ గనుచుండును నిశ్చయము
శతభాగము కేశాగ్రమునఁ బున ♦ శ్శతఖండములై యందు
అతి సూక్ష్మజీవుఁ డొక్కదానితో ♦ సతి సాదృశ్యము నొందు.

చై. చ. మధ్య. 19-138, 139.

సార్వభౌమ శిక్షయందుఁ బ్రభు విట్లు చెప్పెను.—

—ఈశ్వరుఁడును, జీవుఁడును.—

"మాయాధీశుం డీశుఁడు జీవుఁడు ♦ మాయావశుఁడ సనొప్పు
నాయీశునితోఁ జెప్పుటభేదం ♦ బాజీవునికిది తప్పు

జీవుం డీశ్వరశక్తియంచు గీ • తావాక్యము వచియించు
నీవందువు భాగలకున్నా సుం తే • నియు భేదము లేదంచు.

చై. చ. మధ్య. 6-162, 163.

ఈ మహావాక్యముల నిష్కర్షార్థమిట్లు చెప్పఁబడుచున్నది. అవిచింత్యశక్తి యుక్తుఁడును, నిచ్ఛామయుఁడును, స్వాంశతత్త్వము. నను శ్రీకృష్ణ చంద్రుఁడు తన చిచ్ఛక్తి మూలమున స్వాంశవిభిన్నాంశభేదములతో రెండు విధములగు విలాసములను ప్రకటించుచున్నాఁడు. స్వాంశమూలమున నతఁడు చతుర్వ్యూహమును, అసంఖ్యాకములగు నవతారగణములను విస్తరింపఁజేయుచున్నాఁడు. విభిన్నాంశ మూలమున జీవసమష్టిని విస్తరింపఁజేయుచున్నాఁడు. * స్వాంశ విస్తారము తనదగు బ్రహ్మచిచ్ఛక్తి కార్యము. ఆ విస్తృతియంతయు విష్ణుతత్త్వమయమై సర్వశక్తిసంపన్నమై యుండును. పూర్ణతత్త్వమునుండి వెలువడిన సమస్తాంశములును బ్రహ్మశక్తినె కలిగియుండును. ఎట్లొక పెద్దదీపమునుండి లెక్కలేనిదీపములు నిర్మింపఁబడియు, నా పెద్దదీపమున కొక్కింతయు క్షయములేక ప్రత్యేకదీపములు కూడ మొదటి మహాదీపముతో సమానములుగ నుండునో, అట్లే శ్రీకృష్ణుని స్వాంశ విస్తారగణములు ప్రకాశించుచుండునని యెఱుంగనగును. స్వాంశచేఁ బ్రకాశితులగు పురుషులందఱును మహేశ్వరులే. వారికిఁ గర్మఫలభోగములేదు. కృష్ణేచ్ఛతో సమానమగు నిచ్ఛగలిగినవారయ్యును గృష్ణేచ్ఛకు మాత్రము వారలధీనులు.

---

* క్షీరం యథాదధి వికారవిశేషయోగాత్
సంజాయతే నహితతః పృథగస్తి హేతోః
యశ్శంభుతామపి తథా సముపైతి కార్యా
ద్గోవింద మాదిపురుషం తమహం భజామి.

బ్రహ్మసంహిత. 5-45.

విభిన్నాంశ జీవతత్త్వము.

చిచ్ఛక్తియొక్క యతిసూక్ష్మ ఖండాంశములు విభిన్నాంశరూపమున జీవతత్త్వమయ్యెను. * దీనినే తటస్థశక్తి యందురు. చిచ్ఛక్తికిని, మాయాశక్తికిని, నడుమనుండు తత్త్వమునకే తటస్థశక్తియని పేరు. ఈ తటస్థశక్తియందు మాయాశక్తియొక్క సత్త్వమేమియు గోచరింపదు. కాని క్షుద్రతా వశతచే తటస్థశక్తి మాయాధీనత నొందుటకు యోగ్యయగుచుండును. కృష్ణుని యచింత్యశక్తినుండియే యేతద్రూపకమగు శక్తి యొకటి యిట్లుదయించెను. ఇందులకుఁ గారణము కృష్ణుని నిరంకుశేచ్ఛయే. విభిన్నాంశులగు జీవులు స్వకర్మ ఫలభోగయోగ్యులు. † ఎప్పుడు తమ స్వతంత్రేచ్ఛచే వారు కృష్ణసేవ నభిలషింతురో, అనాఁటనుండియు వారు మాయకుఁగాని, కర్మకుఁగాని మఱియధీనులుకారు. కాని యేనాఁడు తమ స్వతంత్రేచ్ఛ యపమార్గవర్తిని యగుటచే వారు భోగాసక్తులై కృష్ణసేవాధర్మమును మఱతురో, ఆనాఁడే వారు మాయామోహితులై కర్మపరతంత్రులగుదురు. కృష్ణసేవాధర్మమే తమ స్వధర్మమనుమాట వారల మనస్సునకు దృఢపడినప్పుడే ముక్తి వారికడ కరుదెంచి కర్మబంధనమునుండియు, మాయా

---

* వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్యచ
భాగజీవః సవిజ్ఞేయ స్తదనంతాయ కల్ప్యతే.
శ్వేతాశ్వతరోపనిషత్.

సూక్ష్మాణా మప్యహం జీవో దుర్జయానా మహంమనః.
భా. 11.16.11.

† ఆత్మానమన్యంచ సవేద విద్వా
నపిప్పలాదో నతు పిప్పలాదః
యోఽవిద్యయాయుక్స్తు నిత్యబద్ధో,
విద్యామయో యస్తు నిత్యముక్తః.
భా. 11-11.7.

పీడనుండియు, వారి నుద్ధరించును.* జడజగత్తునను రాకపూర్వమే జీవుఁకుఁ గర్మబంధనము సంప్రాప్తించియుండుటచే వారలబంధనమున కనాదిత్వము చెప్పఁబడెను. వీరినే నిత్యబద్ధులని పిలుతురు. ఎవరికిఁ గర్మబంధములేదో వారు నిత్యముక్తులు. కర్మబంధము గలవారు నిత్యబద్ధులు.

**కృష్ణుఁడును, జీవుఁడును.**

ఈకారణములచేత జీవేశ్వర స్వరూపములయందు విశేషభేదము కనఁబడుచున్నది. ఈశ్వరుఁడు మాయాధీశుఁడు† జీవుఁడు మాయావశుఁడు కావున మాయాబద్ధుఁడు. కృష్ణరూపముగు విభుచిత్స్వరూపము యొక్క యంశమాత్రుఁడగుటచేఁ దత్త్వవిచారమున జీవునిఁ జిత్కణమనియు, కృష్ణునికంటె భిన్నమగు తత్త్వమనియుఁ జెప్పనగునుగాని జీవుఁడు కృష్ణశక్తియగుటచేఁ గృష్ణునితో నభిన్నత్వముగూడ విచారితమగుచున్నది. కావుననే శ్రీమన్మహాప్రభువు జీవునికి భేదాభేద ప్రకాశత్వముచెప్పి యచింత్య భేదాభేద తత్త్వశిక్ష మన కనుగ్రహించెను. సూర్యుని కిరణకణములు, అగ్నిమిణుగురులు, అను నీరెండు నుదాహరణములుగఁ జెప్పి కృష్ణవిభిన్నాంశుఁడగు జీవునికి నిత్యభిన్నత్వము స్థిరపఱిచెను. "అహం బ్రహ్మాస్మి" మున్నగు ప్రాదేశిక వేదవాక్యములచే జీవునికిఁ

---

* భయం ద్వితీయాభినివేశతస్స్యా
దీశాదపేతస్య విపర్యయోఽస్మృతిః
తన్మాయయాఽతో బుధ ఆభజేత్తం,
భక్త్యైకయేశం గురుదేవతాత్మా.

భా. 11-2-37.

† త్వం నిత్యముక్తపరిశుద్ధ విబుద్ధ ఆత్మా
కూటస్థ ఆదిపురుషో భగవాంస్త్ర్యధీశః
యద్బుద్ధ్యవస్థితి మఖండిత యాస్వదృష్ట్యా
ద్రష్టాస్థితావధి మఖో వ్యతిరిక్త ఆస్సే.

భా. 4-9-15.

బరబ్రహ్మత్వ మేనాఁటికిని సిద్ధింపదు. కృష్ణ (విష్ణు) తత్త్వమొక్కటే పరంబ్రహ్మ. జీవుఁడు చిత్తత్త్వవిశేషమని చెప్పుటకొఱకుఁ దదవస్థయందు వస్తుతః బ్రహ్మమని చెప్పఁబడుచున్నాఁడు. పరబ్రహ్మస్వరూపుఁడగు శ్రీకృష్ణునియొక్క స్వరూపకాంతిరూపము బ్రహ్మతత్త్వము. శ్రీకృష్ణుఁడు జగన్మధ్యమునఁ దనయందొక యంశమును బరమాత్మరూపమున విస్తరింపఁ జేసెను. జగత్తునకు వెలుపల వ్యతిరేకావస్థయందు నిర్విశేషజనకరూపమగు నచింత్యాదృశ్యాప్రాప్య బ్రహ్మరూపమున నిజదేహకాంతిని వెలువరించెను. కృష్ణునియొక్క యచింత్య విభిన్నాంశమే దేవనర యక్ష రాక్షస పశు పక్షి కీటపతంగ భూత ప్రేతేత్యాది వివిధ రూపముల విస్తృతమయ్యెను. సమస్త జీవకోటియందును మానవుఁడే శ్రేష్ఠుఁడు; ఏమనఁ, గృష్ణభక్తి సలుపుట కతనికే యోగ్యత గలదు. మానవుఁడైనను జీవుఁడు కర్మదోషముచేత స్వర్గ నరకాదిభోగముల ననుభవింపుచుండును. మాయాధీనుఁడగు జీవుఁడు కృష్ణుని మఱచి యైహికములగు వివిధ వాంఛాఫల సిద్ధులను సదా గోరుచుండును.

జీవ స్వరూపము.

అణు చైతన్యుఁడగు జీవుఁడు పూర్ణచైతన్యరూపుఁడగు కృష్ణునికి సహజముగ దాసుఁడు. కృష్ణదాస్యమే జీవ స్వరూపము. జీవుఁడు తన నిత్యస్వరూపమును మఱచి బద్ధభావమును బొందుచున్నాఁడు. నిజ నిత్యస్వరూపము మఱల నెప్పుడైన నతని స్మృతికి వచ్చినయెడల నప్పుడే యతనికి ముక్తభావము ప్రాప్తించును. చైతన్యవస్తువున కేది స్వాభావికమగు శక్తి ధర్మమో యయ్యది తదను చైతన్యజీవునియం దణుప్రమాణమున నుండియే తీఱును. అణుప్రమాణస్థితిచే జీవుఁడు స్వాభావికముగ నిశ్శక్తుఁడయ్యును ముక్తావస్థయందుఁ గృష్ణశక్తి తనకుఁ బ్రాప్తించుటచేఁ దాను దదనురూపముగ శక్తిమంతుఁడగును. "నేను చైతన్య వస్తువును" అని యెంత కాల మధ్యాసము సల్పినను జీవునకు శక్తిలాభము కలుగదు. మఱియు నట్టి యధ్యాసముచేఁ గలుగు ముక్తి నిర్వాణ రూపముక్తియే యగును. "నేను

కృష్ణదాసుడను" అను నధ్యాసమువలనఁ జీవునకుఁ గృష్ణశక్తి గలిగి నిత్యానందానుభవలాభము సంప్రాప్తించును. మాయాధ్యాసరూపభయము దూరీభూతమగును.

బద్ధజీవుల వివిధావస్థ.

బద్ధజీవులు నానాప్రకారములగు నాకారములతో నొప్పుచుందురు. కేవల నిజకర్మ ఫలరూపములుగ నాయాయాకారములు గలుగుచున్నవి. * మాయాసంబంధమగు గుణములచేఁగాని కర్మలచేగాని జీవత్వము నిర్మింపఁబడలేదు. అటులే జీవత్వము నిర్మింపఁబడెనని చెప్పినచో మాయావాదము సంఘటనమగును. జీవుఁడు సహజముగ శుద్ధచిద్వస్తువై చిద్ధర్మముచే నొప్పుచుండును. తటస్థశక్తిచే నతఁడు మాయాధర్మబంధనములచేఁ గట్టఁబడుటకు యోగ్యుఁడగుచున్నాఁడు. అట్లు కట్టఁబడుటకుఁ గారణము కృష్ణదాస్యరూపమగు స్వధర్మమును దాను మఱచుటయే. శుద్ధజీవుని సత్తయు, నాకారము, వికారము మున్నగునవన్నియుఁ జిన్మయములు. జీవుఁ డణు చైతన్యుఁడగుటచే నీసత్త్వాదులన్నియు నణురూపములుగనే యుండును. జీవుఁడు మాయాబద్ధుఁడగునపు డతని శుద్ధాకారమునకు మనోమయమగు లింగదేహము ప్రథమమున నేర్పడును. తదుపరి యతఁడు కర్మభూమికేతేఱ స్థూలదేహమొకటి యతని లింగదేహమునకావరణముగ నేర్పడి యతనినిఁ గర్మప్రవృత్తునిగ † నొనరించును. ఈ రెండు శరీరములును శుద్ధస్వరూపముయొక్క మాయిక వికారములగుటచే నవి యొకదానినొకటి పోలియేయుండును. భూమి, జలము, అనలము, వాయువు,

---

* మనః కర్మమయం నృణా మిన్ద్రియైః పంచభి ర్యుతమ్
లోకాల్లోకం ప్రయాత్యన్య ఆత్మా తదనువర్తతే
భా. 11-22-36,

† మల్లక్షణ మిమం కాయం లబ్ధ్వా మద్ధర్మ ఆస్థితః
ఆనందం పరమాత్మాన మాత్మస్థం సముపైతిమాం.
భా. 11-26-1.

ఆకాశము నను మాయిక స్థూలభూతములైదును గలసి బద్ధజీవుని స్థూలదేహ నిర్మాణమునకుఁ గారణమగుచున్నవి. మనస్సు, బుద్ధి, అహంకారము అను నీమూఁడు లింగతత్త్వములును లింగదేహ నిర్మాణ మొనరించుచున్నవి * ఈ రెండావరణలును దొలఁగినపుడు జీవునకు జీవుని స్వరూపసిద్ధి. మాయవలని మోక్షము కలుగుచున్నది. అప్పుడే యతని యాత్మమయచిచ్ఛరీరము ప్రకాశితమగుచున్నది. ఆ చిచ్ఛరీరమునందలి యింద్రియాదులతోడనే ముక్తపురుషుఁడు సకలకార్యములు నిర్వహించును. స్థూలజగత్తునఁ గననగు నాహార స్వీకారము, విహారము, స్త్రీసంగము, మలమూత్రవిసర్జనము, శరీరాఘాతము, పీడ, (గురుదేవ విషయమున) దూరతా నిర్బంధన క్లేశము మున్నగునవి చిచ్ఛరీరమున కెన్నఁడును లేవు. అయినను జీవుని దేహాత్మాభిమాన రూపమగు వివర్తధర్మముచే స్థూలశరీరముచేఁ జేయఁబడు నాయాకార్యములు జీవుఁడు భ్రాంతివశతను దానే యొనరించినట్లుగ భావించి సుఖదుఃఖములను భోగించుచుండును. †

---

* భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.
అపరేఽయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్.

గీ. 7-4, 5.

† ప్రకృతేరేవ మాత్మాన మవివిచ్యా బుధఃపుమాన్
తత్త్వేన స్పర్శసంమూఢ స్సంసారం ప్రతిపద్యతే.
సత్త్వసంగాదృషీన్ దేవాన్ రజసా సురమానుషాన్
తమసా భూత తిర్యక్త్వం భ్రామితో యాతికర్మభిః.
నృత్యతో గాయతఃపశ్యన్ యథైవాను కరోతితాన్
ఏవంబుద్ధి గుణాన్ పశ్య న్ననీహోఽప్యను కార్యతే.
యథాంభసా ప్రచలతా తరవోఽపి చలా ఇవ

ముక్తపురుష సంబంధమగు రహస్యవిషయ మొకటి గలదు. తాను ముక్తుఁడయ్యును జడజ్ఞానాభిమానముగాని, జడ వ్యతిరేకమగు నిర్వాణబుద్ధిగాని యతని కెప్పుడైనఁ గలిగినేని భక్తి కుపకరించు భాగవతీ తనులాభ

భాగవతీ తనువు.

మతని కెన్నఁటికిని గలుగనేరదు. *భక్త సంగ ఫలముగను, సాధు సంగఫల ముగను, గలుగు నవాంతర ముక్తిచేతనే భాగవతీ శుద్ధతనూదయము కలుగు చున్నది. † జ్ఞానుల సాంగత్యముచేఁ గలుగు ముక్తి 'నాకును ముక్తి వచ్చె' నని తనలోఁ దాను సంతసింపుటకుమాత్ర మనుకూలించునదియే. ఇట్టిముక్తిచే జీవునికి దుర్దశయే ప్రాప్తించును. ‡

---

చక్షుషా భ్రామ్యమాణేన దృశ్యతే భ్రమతీవ భూః.
యథా మనోరథ ధియో విషయానుభవో మృషా
స్వప్న దృష్టాశ్చ దాశార్హ తథా సంసార ఆత్మనః.
అర్థేహ్య విద్యమానేఽపి సంసృతి ర్న నివర్తతే
ధ్యాయతో విషయా నస్య స్వప్నేఽనర్థాగమో యథా.

భా. 11-22-50 to 55.

* హంతాస్మి న్జన్మని భవా న్మామాం ద్రష్టు మిహార్హతి
అవిపక్వ కషాయాణాం దుర్దర్శోఽహం కుయోగినామ్.

భా. 1-6-22.

† ఏవం కృష్ణమతేర్బ్రహ్మ న్న సక్తస్యామలాత్మనః
కాలః ప్రాదురభూత్కాలే తటిత్సౌదా మనీయథా.
ప్రయుజ్యమానే మయితాం శుద్ధాం భాగవతీం తనుమ్
ఆరబ్ధ కర్మ నిర్వాణో న్యపత త్పాంచ భౌతికః

భా. 1-6-28, 29.

‡ యేఽన్యేఽరవిందాక్ష! విముక్తమానిన
స్త్వయ్యస్తభావా దవిశుద్ధ బుద్ధయః

జీవుని శుద్ధస్వరూపమును, బద్ధస్వరూపమును, ముక్తస్వరూపమును, సంక్షేపముగ నిచట విచారింపఁబడినవి. జీవునికర్తవ్యాకర్తవ్యములు వేఱొకస్థలమున విచారింపఁబడును.

---

ఆరుహ్యకృచ్ఛ్రేణ పరంపదం తతః
పతంత్యధోఽనాదృత యుష్మదంఘ్రయః

భా. 10.2.32.



## ప్రథమవృష్టి—పంచమధార.

---

## అచింత్యభేదాభేదతత్త్వము.

---

శ్లో. శ్రీరాధికామాధవ యోరపార
మాధుర్య లీలాగుణ రూప నామ్నాం
ప్రతిక్షణా స్వాదన లోలుపస్య
వందే గురోశ్శ్రీ చరణారవిందమ్.

కృష్ణుఁడు, కృష్ణశక్తి, కృష్ణరసము, జీవస్వరూపము, బద్ధజీవుఁడు, ముక్తజీవుఁడు నను నీ యాఱు ప్రమేయములు నింతను ముం దాయాధారల యందు విచారింపఁబడినవి. ఈధారయందచింత్య భేదాభేదసంబంధతత్త్వము సంక్షేపముగ విచారింపఁబడును. ఈ సందర్భమున శ్రీమన్మహాప్రభుని యుపదేశవాక్యములు ముందుగఁ బ్రస్తావింపఁబడును. సన్యాసి శిక్షయందుఁ బ్రభు విట్లు సెలవిచ్చెను.

—శక్తి పరిణామవాదము.—

"వ్యాసుఁడు పరిణామవాద * మెంచెక్కడె ♦ వ్రాసెందనసూత్రముల
వ్యాసుఁడు పొరఁబడెనంచు శంకరుఁడు ♦ చేసెం బలువాదముల
పరిణామవాదమున వికారిత ♦ ప్పక యగునని యీశ్వరుఁడు
సరియగు వాదము వివర్తమే యని ♦ స్థాపించెను శంకరుఁడు
పరిణామవాదము తనకుఁ దానే ♦ ప్రమాణ మిది నిశ్చయము
శరీరమందాత్మబుద్ధి సేయుటె ♦ సరిగ వివర్తాలయము

---

* యథోల్ముకా ద్విస్ఫులింగా ద్ధూమాద్వాపి స్వసంభవాత్
అప్యాత్మత్వే నాభిమతా ద్యథాగ్నిః పృథగుచ్యతే.

భా. 3.28.40.

అవిచింత్యశక్తి సముపేతుండగు ♦ నలభగవానునిదైన
యవిచింత్యేచ్ఛయె పరిణమించు బ్ర♦హ్మాండము * లట్లు బిరాన
అందువలన నవిచింత్య శక్తిపై ♦ నతనికె యధికారంబు
ఇందుల కల ప్రాకృత చింతామణి ♦ యే యగు దృష్టాంతంబు
చింతామణి వేవేల్ రత్నములను ♦ సృష్టించియు నలవోక
సుంతయైన మాఱక తొల్లింటివలె ♦ శోభిల్లును గొఱలేక
లేదు స్వరూపైశ్వర్యమ్ముల నా ♦ లియు మాయాగంధంబు
వేదములన్నియు భగవంతునికే ♦ పేర్కొనె సంబంధంబు
పరశక్తి వినా భగవంతుండె కే ♦ వలము నిర్విశేషుండు
అఱరూపము లేదన్నఁ బూర్ణత ♦ హాని యెట్లు రాకుండు?”

మఱల సార్వభౌముని శిక్షయందుఁ బ్రభు విట్లు వచియించెను. –

“ఏముఖ్యార్థ ముపనిషద్వాక్య కభి ♦ హితమయ్యెను లోకమున
ఆముఖ్యార్థమె వ్యాససూత్రములు ♦ వ్యాఖ్యానించెఁ గ్రమమున
అవలఁద్రోఁచి ముఖ్యార్థము నల గౌ ♦ ణార్థ కల్పనమదేల?
అవలఁద్రోఁచి యభిధేయము లక్షణ ♦ నవలంబించుటదేల?”

సన్యాసి శిక్షయందు మఱల నిట్లు సెలవిచ్చెను.

“ప్రణవమును మహావాక్యము వేద ♦ మ్మునకు పరనిధానంబు
ప్రణవ మీశ్వరస్వరూపమును స ♦ ర్వ విశ్వసంస్థానంబు
సర్వాశ్రయుండగు నీశ్వరుండె వా ♦ స్తవ ప్రణవోద్దేశంబు
సర్వగతులఁ దత్త్వమసి యేక దే ♦ శమగు వేదవాక్యంబు

---

* కాలాద్గుణ వ్యతికరః పరిణామ స్స్వభావతః
కర్మణో జన్మ మహతః పురుషాధిష్ఠితా దభూత్.
మహతస్తు వికుర్వాణా ద్రజస్సత్త్వోపబృంహితాత్
తమః ప్రధాన స్త్వభవ ద్ద్రవ్యజ్ఞాన క్రియాత్మకః.
భా. 2-5-22, 23.

కల్పితి ప్రణవ మహావాక్యము నే ♦ కదేశములచే నీవు *
చెప్పితివి మహావాక్యమె తత్త్వమ ♦ సి యని స్థిరముగా నీవు
వ్యాస సూత్రములు ప్రభువు చెప్పె నీ ♦ శ్వర వచనములేయంచు
వ్యాసరూపమున నారాయణుఁడే ♦ వాని వచించెనటంచు
భ్రమయు విప్రలిప్సయు నాకరణా ♦ పాటవము ప్రమాదంబు
కమిచికొనవు సుంతయు నీశ్వర వా ♦ క్యముల నివి యేదినంబు
ఏ యర్థముపనిషత్తులు సూత్రము ♦ లేక కంఠమునఁ జెప్పు
ఆ యర్థము ముఖ్యవృత్తిఁ బరమ మ ♦ హత్త్వము గలదై యొప్పు
పూని గౌణవృత్తినె యేభాష్య ♦ మ్మును లిఖించె నాతండు
దాని విన్నచో సర్వనాశన ♦ త్వంబెటు కలుగక యుండు?
ఇదియుఁ గూడ నాతని దోషము కా ♦ దీశ్వరాజ్ఞ వహియించి
వదలివైచి ముఖ్యవృత్తి గౌణముఁ ♦ బట్టికొనియెఁ దామించి
భగవంతుఁడె యగు సుమ్ము బ్రహ్మశ ♦ బ్దమునను ముఖ్యార్థంబు
తగు నాతనికి సమూర్ధ్వసమాస ♦ త్వము పూర్ణైశ్వర్యంబు
అతని విభూతియు నతని దేహము చి ♦ దాకారంబైయుండు
అతని చిద్విభూతి నవలఁ ద్రోచి ని ♦ రాకారుఁడనె నతండు
తాను జిదానందుఁడు చిన్మయుమా ♦ తని స్థానము పరిజనము
వానినిఁ బ్రాకృతుఁడనెడి శంకరుని ♦ నాదే మనవలె మనము?
శంకరు దోషము కాదలందు తన ♦ శాస్త్రముఁ దాసుఁడెసుమ్ము
శంకయేల? ఆతని వింటిమె అగు ♦ సర్వ కార్యములు వమ్ము"

ప్రణవమే మహావాక్యము.

భగవంతుఁడగు శ్రీ కృష్ణచైతన్య దేవుని వగు నీ మహావాక్యములకు ఫలితార్థమేమనఁ బ్రణవ (ఓంకార) మనునది శ్రీ కృష్ణుని గూఢనామము; అది వేదమునకాది బీజము, మఱియు సర్వవేదమయమగు శబ్దబ్రహ్మము "ప్ర + ను (స్తుతికరా) + అణ్"—ఈ

---

* ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ. స్త్రివిధ స్స్మృతః.
గీ. 17-23.

ప్రకారము ప్రణవశబ్దము సాధింపఁబడుచున్నది. స్తవనీయుఁడగు పరబ్రహ్మ యొక్క శాబ్దికావతారమే ఓంకారము. ఓంకారమునుండియే సమస్త వేదములు సద్భవించినవి. వాస్తవముగఁ బ్రణవమే వేదబీజమును మహావాక్యము. వేదములయొక్క యితరాంశములు సమస్తమును ప్రాదేశిక వాక్య విశేషములే. మాయావాదరచయితయగు శ్రీ శంకరాచార్యస్వామి ప్రణవ మహావాక్యము నొప్పుకొనక

(1) అహం బ్రహ్మాస్మి (నేనే బ్రహ్మను.)
(2) ప్రజ్ఞానం బ్రహ్మ (ప్రజ్ఞానమే బ్రహ్మ.)
(3) తత్త్వమసి (నీవే అతఁడు.)
(4) ఏకమే వాద్వితీయమ్ (ఒకటిగాక రెండు లేవు.)

అను నాలుగు ప్రాదేశిక వేదవాక్యములే మహావాక్యములని చెప్పి సిద్ధాంతీకరించెను. వేదబీజమగు ప్రణవము శుద్ధభక్తినే ప్రచురించునుగావున, వామతమును నప్పిపుచ్చుటయే యతని ప్రయోజనమైయుండుట, నన్యములగు నేవేవో వాక్యములను మహావాక్యములనిచెప్పి కేవలాద్వైతమును ప్రచురించెను. మాయాబద్ధుఁడగు జీవుని సత్యత్వము మాయానిర్మితమనియు, బ్రహ్మమునకు నీశ్వరత్వము మాయోపాధిచేఁ గలుగునదే యనియు, బ్రహ్మనిర్వాణ మనఁగా, మాయావిచ్ఛేదమే జీవన్ముక్తియనియుఁ జెప్పుచు నిట్టి విషయములనే యతఁడు సంగ్రహించెను. ఈకారణముచేత నతని సిద్ధాంతమందు జీవునకుఁ బర బ్రహ్మలోఁగల శుద్ధసంబంధము ప్రకటితమగుటకేమియు నవకాశములేకుండెను. కావున వేదముయొక్క సర్వాంగవిచార మాతని మతమందుఁ గానరాదు. ఇందువలననే శ్రీమధ్వాచార్యస్వామి యేవేవో

నిర్విశేష, సవిశేష వాదములు.

వేదవాక్యములఁ గొన్నిఁటి నాధారముచేసికొని ద్వైతవాద స్థాపనమొనర్చెను. దానియందుఁ గూడ వేదముయొక్క సర్వాంగ విచారములేనందున సంబంధ తత్త్వము ప్రస్ఫుటితము కాలేదు. శ్రీమద్రామానుజాచార్యులు స్థాపించిన విశిష్టాద్వైతవాదమందు సంబంధజ్ఞాన

సమగ్రతను గనుపఱచలేదు. ద్వైతాద్వైతవాదియగు శ్రీనింబార్కస్వామియు నదేవిధమున నొకమాదిరి యసంపూర్ణ సిద్ధాంతమునే ప్రకటించెను. శ్రీవిష్ణుస్వామిగూడఁ దానుస్థాపించిన శుద్ధాద్వైత మతమందు సంబంధతత్త్వ విషయమై యేదోకొంత యస్పష్టతనే నిరూపించెను. శ్రీ మన్మహాప్రభువు మాత్రము ప్రేమధర్మముయొక్క నిత్యత్వమును స్థాపించు నుద్దేశముతో భేదాభేద వాదమూలమున సంబంధజ్ఞానముయొక్క సంపూర్ణశుద్ధతను జక్కగ బోధించి వితర్కరూపమగు నంధకారమునుండి జగత్తు నుద్ధరించెను. మహాప్రభుని సిద్ధాంతము ప్రకారము ప్రణవముయొక్కటే మహావాక్యము. ప్రణవార్థ ముపనిషత్తులయందుఁ బ్రకాశితమగుచున్నది. ఉపనిషత్తు లుపదేశించిన విషయమును వ్యాససూత్రములు పూర్తిగ ననుమోదించుచున్నవి. వ్యాససూత్రములభాష్యమే శ్రీమద్భాగవతము. వ్యాససూత్రములందలి " జన్మాద్యస్యయతః " అనునట్టి ప్రథమసూత్రమునందుఁ బరిణామవాదముయొక్క సత్యత్వము చెప్పునట్టి యుపదేశమే కానఁబడుచున్నది. " యతోవా ఇమాని భూతానిజాయంతే " అను వేదమంత్రమందుఁ గూడ నీ యుపదేశమే కానవగును. భాగవతమందును నీ యర్థమే స్వీకరింపఁబడుచున్నది.

**అచింత్య భేదాభేద వాద, మనఁగా, శక్తి పరిణామవాదమే బ్రహ్మ సూత్ర మతము.**

పరిణామవాదమును స్వీకరించినయెడల వస్తువునకు వికారాదులు సంభవించునను సందేహముతో శ్రీశంకరాచార్యస్వామి వివర్తవాదస్థాపన మొనర్చెను. వాస్తవముగ బ్రహ్మవివర్తమే సకల దోషములకును మూలము. పరిణామవాదమే సర్వశాస్త్రసమ్మతమగు విశుద్ధ సత్య తత్త్వము. పరమేశ్వరుని శక్తికి నిత్యత్వములేదని భావించినచోఁ బరమేశ్వరునకు వివర్తవికారాది మహాదోషములు కలుగును. కాని పరబ్రహ్మముయొక్క నిత్యస్వభావరూపయగు పరాశక్తిని మనమంగీకరించిన యెడల నట్టి దోషాదులెప్పుడును సంభవింపవు. ఆశక్తియందుఁ గల విచిత్ర వికారమునుండియే విశ్వము సంభవించినది. ఆ విచిత్రవికారమునకు సత్యత్వముగలదు. బ్రహ్మ

గొన్నఁడును వికారికాఁడు. ఈజడజగత్తును, జైవజగత్తును బ్రహ్మయొక్క శక్తివికారఫలములే. మణినుండి స్వర్ణప్రసరమగుచున్నను దన్మణి వికృతి నొందక యథాస్థితి నుండునని మహాప్రభువిచ్చిన యుదాహరణమునకు స్పష్టమగు నన్వయము, ,, కృష్ణశక్తియే సమస్తసృష్టినిఁ గలిగించెను. అందు వలనఁ గృష్ణుఁడు వికారికాఁ '' డను సందర్భమునఁ జెప్పబడినది. సమస్త మును శక్తిపరిణామమే. చిచ్ఛక్తియొక్క పూర్ణపరిణామముచే వైకుంఠాది ధామ నామ రూపగుణ లీలా ప్రభృతులును, అణుపరిణామముచేఁ జిత్కణ రూప జీవసమూహమును సృష్టింపఁబడినవి. మాయాశక్తియొక్క పరిణా మముచే సమస్త జడజగత్తును, మఱియు జీవుని స్థూలసూక్ష్మశరీరములును, సృష్టింపఁబడినవి. జడజగత్తనఁగాఁ బదునాల్గు భువనములని యర్థము. వేదాంత సూత్రములందును, ఉపనిషత్తులయందును ఈపరిణామవాదమే సర్వత్ర కనఁబడును. మహత్తత్త్వాహంకారాకాశ తేజోవాయుస్సలిల పృథ్వీ తత్త్వముల క్రమపరిణామ వికాసమే పరిణామవాదము. కేవలా ద్వైతవాదమును బట్టి యెంతఁ బొలార్చినను దుదకు వచ్చునదేమియులేదు. అవిద్యాకల్పితములగు జీవజగత్తుల భానము మాత్రమే సిద్ధాంతీకరింపఁబ డును. * శుద్ధపరిణామ వాదమందుఁ గృష్ణేచ్ఛచే జైవజగత్తునకును, జడ జగత్తునకును సత్యత్వము సిద్ధించుచున్నది. సృష్టి కల్పితమును, భ్రాంతిమయ మును గాదు. మఱలఁ గృష్ణేచ్ఛచే నాసృష్టి లయించుచున్నదని చెప్పుటచే జగత్తుయొక్క నశ్వర స్వభావముమాత్రమే చెప్పఁబడుచున్నది. చిన్మయ స్వరూపుఁడగు పరమేశ్వరుఁడు జగత్తును సృష్టించి తానందంతర్యామి రూపమునను౦డియును స్వయం పూర్ణశక్తి పరిసేవితుఁడును, స్వేచ్ఛామయుఁ

---

* శ్రేయ స్సృతిం భక్తి ముదస్య తే విభో
క్లిశ్యంతి యే కేవలబోధ లబ్ధయే
తేషామసౌ క్లేశల ఏవ శిష్యతే
నాన్యద్యథా స్థూల తుషావ ఘాతినామ్.

భా. 10-14-4.

డును నగు శ్రీకృష్ణ స్వరూపముతో నిత్యపృథక్ స్థితియందతఁడు విరాజిల్లు చుండును. * ఈయపూర్వ తత్త్వము దెలిసికొనఁజాలిన వారలే కృష్ణుని యనంతైశ్వర్యమును, మాధుర్యమును, జవి చూడఁగల సమర్థులు. ఇదే కృష్ణునకును, జీవునకును గల సహజసంబంధము. నశ్వరజగత్తుతో జీవున కనిత్య పాంథసంబంధము మాత్రమే కలదు. యుక్త వైరాగ్యముచేతనే జీవుఁడు తనకు జగత్తుతోఁగల సంబంధము దెలిసికొని తదనుగుణముగ వ్యవహరింపవలసియుండును. ఇట్టి సంబంధబుద్ధి జీవున కెంతవఱకుఁ గలుగునో అంతవఱకు బద్ధజీవునకుఁ గర్తవ్య కార్యస్ఫురణము గలుగదు.

అచింత్యభావము తర్కాతీతము.

ఈసిద్ధాంతము ప్రకారము కృష్ణునితో, జీవునకుఁగల భేదాభేదములును, నట్లే కృష్ణునితో జగత్తునకుఁ గల భేదాభేదములును, యుగపత్సత్యత్వము గలవని స్థిరపడుచున్నది. ఈ సత్యత్వముయొక్క సమంజసత ససీమయగు నరయుక్తిచే సాధింప వలనుపడదు. కనుకనే యీనిత్య భేదాభేదతత్త్వము „ అచింత్య ” మని చెప్పుటకుఁ గారణమైనది. అచింత్యవిషయమైనను దీనిచే యుక్తిగాని, తర్కముగాని యసంతుష్టి నొందఁజాలవు. అచింత్యశక్తి యుక్తుఁడగు భగవంతుని పక్షమున నిది సమంజసముగుట నిజమే. కాని యాశక్తిచే నేదేది సిద్ధాంతీకరింపఁబడుచున్నదో అది భగవత్కృపాలబ్ధతత్త్వము. † అచింత్యభావములను

---

* యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను
ప్రవిష్టాన్య ప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్.

భా. 2-9-34.

† అచింత్యాః ఖలు యేభావా న తాం స్తర్కేణ యోజయేత్.
ప్రకృతిభ్యః పరం యచ్చ తద చింత్యస్య లక్షణం.
„ నైషా తర్కేణ మతి రాపనేయా ”

ఇత్యాది వేదవాక్యాని.

దర్కమూలమునఁ దెలిసికొనఁ బ్రయత్నింపకుమని ప్రాచీన పండితగణము మనకుపదేశించియే యున్నారు. ఇట్లు చెప్పుటకుఁ గారణమేమనఁ దర్కము విచింత్య విషయము నొకప్పుడును బ్రమాణరూపమున నిరూపింపఁజాలకుండుటయే.* ఈ విషయమెవ్వనికి జ్ఞప్తియందుండదో వానిదురవస్థను మేర యెక్కడిది?

---

* యావానహం యథాభావో యద్రూపగుణకర్మకః
తథైవ తత్త్వవిజ్ఞానమస్తు తే మదనుగ్రహాత్.
భా. 2-9-32.



# ప్రథమవృష్టి—షష్ఠధార.

## సాధననిర్ణయము.

శ్లో. నికుంజయూనో రతికేళి సిద్ధ్యై
యా యాలిభి ర్యుక్తి రపేక్షణీయా
తత్రాతిదాక్ష్యా దతివల్లభస్య
వందే గురో శ్శ్రీచరణారవిందమ్.

వివర్తవాదము.

ప్రమేయము లేడింటిని విచారించుటచే సంబంధతత్త్వనిర్ణయమేర్పడినది. సంబంధతత్త్వజ్ఞానముచే నింతవఱకు మనము తెలిసికొనఁగలిగిన దేదియన, జీవుఁడు తనకుఁ గృష్ణునితోఁ గల నిత్యసంబంధము మఱచి తాపత్రయ జ్వలితమగు సంసారసాగరమునఁబడి యనేక కష్టముల ననుభవించుచున్నాఁడని. ఈకష్టము లెట్లు నివారణయగునను విషయము విచారించిన మూలమున మనకుఁ దెలియఁబడిన దేమనఁ బూర్వోక్త సంబంధము మఱల స్థాపింపఁబడునేని జీవునకు సకలదుఃఖములును దూరీభూతములై పరమానంద లాభ ప్రాప్తి కలుగునని. జీవుఁడు నిత్యసిద్ధమగు చిద్వస్తువు. జీవునకు నిజముగ బంధనముకాని, క్లేశములుకాని లేవు. దేహమే నేనను నభిమాన రూపమగు వివర్తభ్రమచే జీవుని కిట్టికష్టములు సంభవించినవి. రజ్జువునందలి సర్పజ్ఞానము, శుక్తియందలి రజతజ్ఞానము నను నీరెండును వివర్తవిషయమున వైదికోదాహరణములు. మాయావాది యీరెండుదాహరణములను సరిగా నర్థముచేసికొనఁజాలక బ్రహ్మవివర్తమే జీవుని సత్త్వమును భ్రాంతినొందుచుండును. సద్గురుకటాక్షముచే నెపుడతనికి

సరియగు నర్థము తెలియుచున్నదో, అపు డీ రెండుదాహరణములును జీవుని సత్తకు సంబంధించినవి కావనియు, దన స్థూలసూక్ష్మ దేహములయందు జీవునకుంగల యాత్మబుద్ధికి మాత్రమే సంబంధించి చెప్పంబడినవనియు, నతండు తెలిసికొనును. ఇవ్విధముగ నతని కప్పుడు సుపథము గోచరించును. పరిణామమునకును, వివర్తమునకును గల భేద మిదియే. వస్తువెపు డన్య విధమగు నాకృతినొందునో అపుడు దానిని వికార* మనియు, బరిణామ మనియుం జెప్పుదురు. ఆమ్ల సంబంధము గలుగునేని బాలు పెరుంగుగ మాఱుచున్నది. ఇది పరిణామము. వస్తువులేకున్నను అస్థలమున నన్యవస్తువు నందన్యథాబుద్ధి యెపుడు కలుగుచున్నదో అపుడు దానిని వివర్తమందురు. ఎట్లన, సర్పరూపమగు వస్తువులేకున్నను రజ్జువునందు మిథ్యా సర్పభ్రాంతి కలుగుటయు, వెండి యెచటలేదో అచట ముత్తెపుం జిప్పయందు వెండి యను భ్రాంతి నొందుటయును. ఈ రెండు స్థలములయందును „ అతత్త్వతో అన్యథాబుద్ధిరూప ” మగు వివర్తభ్రమము గలుగుచున్నది. జీవుండు కేవల శుద్ధచిద్వస్తువు. వాస్తవముగ నతనికి మాయాబంధములేదు. కాని వివర్త బుద్ధికలుగునపు డతండు స్వదేహముతో నైక్యానుసంధానమునొంది తన్మూలమున వివర్తభ్రాంతి నొందును.† బద్ధజీవుని కీదుర్దశ సంభవించినపుడే వివర్తము లక్షితమగుచున్నది. కాని యీవివర్తబుద్ధి దూరమగు టెప్పుడు? సద్గురు సన్నిధిని జీవుండు సదుపదేశ లాభము నొందుటచే, „నేను గృష్ణ

---

* అతత్త్వతోఽన్యథా బుద్ధి ర్వివర్త ఇత్యుదాహృతః
సతత్త్వతోఽన్యథా బుద్ధి ర్వికార ఇతి శబ్ద్యతే.
కశ్చిన్మాయావాదాచార్యః.

† స ఏష యర్హి ప్రకృతే ర్గుణే ష్వభి విషజ్జతే
అహంక్రియా విమూఢాత్మా కర్తాస్మీ త్యభిమన్యతే
తేన సంసార పదవీ మవశోఽభ్యేత్య నిర్వృతః
ప్రాసంగికైః కర్మదోషై స్సదసన్మిశ్రయోనిషు.
భా. 3.27-2, 3.

దాసుఁడ" నను నభిమానమెపుఁడు దృఢపడుచున్నదో, అపుడు జీవునకు మఱల నీవివర్తబుద్ధి కలుగదు. * ముఖ్యముగ మోక్షకాంక్షవిడిచి కృష్ణ భక్తి సేసెనేని వివర్తబుద్ధి యనాయాసముగ దూరమగుచున్నది. మోక్షాభి సంధి స్వధర్మమునకు సాధనమెన్నఁడునుగాదు; అందువలనఁ గేవల వ్యతి రేకానుశీలనమే సంభవించును. † కావున భక్తియే అభిధేయము. భక్తియే స్వధర్మసాధనము. అర్వాచీన గణము భక్తిని దూరముగ నునిచి, కర్మమునో, జ్ఞానమునో ధర్మసాధనములుగఁ జెప్పి వానిని స్థాపింపఁ బూనుదురు. ‡ జ్ఞాన కర్మము లొకప్పుడు గౌణసాధనములైనఁ గావచ్చునుగాని యవి యెన్నఁడును ముఖ్యసాధనములు మాత్రము కావు. § సనాతన శిక్షయందుఁ బ్రభు విట్లు సెలవిచ్చెను.

---

* ఏవం గురూపాసన యైక భక్త్యా, విద్యాకుఠారేణ శితేన ధీరః
వివృశ్చ్య జీవాశయ మప్రమత్తస్సంపద్య చాత్మానమథత్యజాస్త్రమ్.
భా. 11.12.24.

† యస్త ఆశిష ఆశాస్తే న స భృత్యస్సవై వణిక్.
భా. 7.10.4.

‡ నాలం ద్విజత్వం దేవత్వ మృషిత్వం చాసురాత్మజాః
ప్రీణనాయ ముకుందస్య నవృత్తం నబహుజ్ఞతా.
నదానం నతపో నేజ్యా నశౌచం నవ్రతానిచ
ప్రీయతేఽమలయా భక్త్యా హరి రన్య ద్విడంబనమ్.
భా. 7.7.51, 52.

§ దానవ్రత తపోహోమ జపస్వాధ్యాయ సంయమైః
శ్రేయోభిర్వివిధైశ్చాన్యైః కృష్ణే భక్తిర్హి సాధ్యతే.
భా. 10.47.24.

"జ్ఞాను ; కృష్ణభక్తియె యభిధేయ ప్ర♦ధానంబై తాఁ దెలఁగు
జ్ఞానయోగ కర్మలు భక్తిదేవి ♦ కన్ను సన్నలనె మెలఁగు
ఆ మూఁడిఁటిచే వచ్చుఫలంబ ♦ త్యంతము తుచ్ఛఫలంబు
ఆమూఁటికి భక్తివినా ఫలమిడ ♦ ననలే లేదు బలంబు
భక్తివినా జ్ఞానము కేవలముగ ♦ ముక్తినిడ సమర్థాఁబు
ముక్తి నిచ్చుఁబో కేవల కృష్ణ ♦ స్మృతి, వినాజ్ఞానఁబు
జీవుఁడు కృష్ణుని నిత్యదాస్యమును ♦ దా విస్మరించునెపుడు
తీవతిఁచి వానిగళము మాయా ♦ దేవి నులుము నుట్టిపను
నేయు నెవఁడు కృష్ణభజనంబు గురు ♦ సేవన మెవఁ డొనరించు
మాయతొలఁగి శ్రీకృష్ణుని పదప ♦ ద్మం బాతనికి లభించు
చాతుర్వర్ణ్యాశ్రమితతి కృష్ణ భ ♦ జనముతి కర్మరుచై నఁ
బాతమంది రౌరవ నరకంబున ♦ ధ్వంసమగుదురు బిరాన
జీవన్ముక్తావస్థ తనను వ ♦ చ్చెనని తలఁచుఁ జో జ్ఞాని
కేవల శుద్ధము కాదతని బుద్ధి ♦ కృష్ణభక్తిచేఁగాని"*

శ్రీమన్మహాప్రభువు చెప్పనదేమనఁగా, గర్మయు, నష్టాంగయోగమును, జ్ఞానమును, సాధనములుగఁ గొన్ని కొన్ని శాస్త్రములందు నిర్దేశింపఁబడెను. కాని ఖండ బుద్ధిగల పండిత గణ మాయాశాస్త్రముల తాత్పర్యమును జక్కగను, సమగ్రముగను దెలిసికొనఁ జాలక వానినే ముఖ్యాభిధేయములుగ సిద్ధాంతీకరించిరి.

భక్తి వ్యతీతములగు కర్మ, యోగ, జ్ఞానములు నిష్ఫలములు.

---

* ముఖబాహూరుపాదేభ్యః పురుషస్యాశ్రమైస్సహ
చత్వారో జజ్ఞిరేవర్ణా గుణై ర్విప్రాదయః పృథక్.
య ఏషాం పురుషం సాక్షా దాత్మప్రభవ మీశ్వరం
నభజంత్యవజానంతి స్థానాద్భ్రష్టాః పతంత్యధః.

భా, 11-5-2,3.

అధికారిభేదముచే మనుష్యగణము బహువిధము లగుచున్నది. మఱియుఁ బ్రవృత్తి నివృత్తి భేదములచే ద్వివిధమగుచున్నది. ఒక యధికారస్థానమం దున్న మనుష్యుఁడు దానిపై స్థానమును బొందుటకై యేసాధనము నవలంబించునో ఆసాధనములు సాధనమాత్రములే యగునుగాని ముఖ్యసాధనములుగాని, అభిధేయములుకాని, కావు. ఈ సాధనములచే వచ్చు ఫలము తానున్న సోపానమునుండి పై సోపానమునకుఁ బోవుట మాత్రమేకాని బృహత్తత్త్వవిషయమై యయ్యది యవాంతర ఫలమై తుచ్ఛమగుచున్నది. ధర్మసాధన ప్రవర్తకములగు కర్మ, యోగ, జ్ఞాన ప్రభృత్యవాంతర ప్రకారసమూహమునకు భక్త్యుద్దేశముమాత్రము లేనియెడల నయ్యవి సత్ఫలదాయకము లెన్నఁడును గాఁజాలవు.* కృష్ణభక్తియే వాని చరమోద్దేశమైనయెడల నయ్యవి గౌణ ఫలప్రదాయకములైనఁ గావచ్చును. కేవల జ్ఞానముచే ముక్తి సంభవింపదు. సంబంధజ్ఞానము భక్త్యుద్దేశము కలిగియున్నచో దాని ప్రథమ ఫలమే ముక్తి యగుచున్నది. భక్తికి ఫలమగు ముక్తి తానాయాసముగ నీఁగలుగు నవాంతర క్షుద్రఫలముమాత్రమే యగుచున్నది. ఇఁకఁ గర్మవిషయము. నాలుగువర్ణములకును, నాలుగాశ్రమములకును, ఏదేశకాల కర్మనిర్దేశము గలదో దానినే ధర్మమందురు. దీనినే త్రైవర్గిక ధర్మమని కూడఁ జెప్పుదురు. ఈగ్రంథమున ద్వితీయవృష్టియందీ త్రైవర్గిక ధర్మవివరణము గనఁబడును. దానివిషయమై ప్రభూవదేశమేమన, దేహయాత్ర, సంసారయాత్ర మున్నగునవి స్వచ్ఛందముగ నిర్వహింపుటచేఁ బ్రవృత్తియందున్న పురుషులకు ముఖ్య వైధ సాధనయందు బలప్రాప్తి కలుగును. కనుకనే ప్రవృత్తియందున్న బహిర్ముఖ పురుషగణము కృష్ణభక్తి కుపకరించు విధమున వర్ణాశ్రమ ధర్మ ప్రతిపాలనమొనర్చుటయం దధికారులగుచున్నారు. కాని భక్త్య

---

* షడ్వర్గ సంయమైకాంతా స్సర్వా నియమ చోదనాః
తదంతా యది నోయోగా నావహేయు శ్శ్రమావహాః.

భా. 7-15-28.

ద్దేశము లేక వర్ణాశ్రమ ధర్మాచరణ మొనర్చువారు మాత్రము స్వధర్మసాధన మొనర్చువారయ్యును నరికగాములే యగుచున్నారు.

ఈగ్రంథమున: దృతీయవృష్టియందు సాధనభక్తి వివరింపఁబడినది. వైధసాధనభక్తి శుద్ధభక్తి యగునేని ప్రేమ సాధనమునకు యోగ్యమై యుండును.

జీవుని కీశ్వరునియెడల నే ప్రేమగలదో, అదియే జీవుని స్వాభావికమగు నిత్యధర్మము. ఆ ప్రేమయే వాస్తవముగ ప్రేమ నిత్యసిద్ధము. సాధ్యవస్తువు. కాని యీసందర్భమున నొకవిషయమాలోచింపఁదగినది. సాధ్యవస్తువు నిత్యసిద్ధము కదా? సిద్ధవస్తువు సాధ్యమెట్లగును? ఇందు విషయమై శ్రీమన్మహాప్రభు వీక్రింది విధముగ సెలవిచ్చెను.

"సాధనభక్తి విధము వివరింతును ♦ సనాతనా! ఇంక వినుము
సాధింపనగును దీనినుండి కృ ♦ ష్ణప్రేమ మహాధనము
దీని [స్వ] రూపలక్షణమగు శ్రవణా ♦ దిక క్రియాసమ్మతము
దానఁ బ్రేమ ధనముద్భవించుం బో ♦ తటస్థ లక్షణయుతము
సిద్ధవస్తువగు కృష్ణప్రేమము ♦ చిక్కఁడు సాధనవలన
శుద్ధచిత్తమునఁ దప్పక యుదయిం ♦ చును శ్రవణాదులవలన"

ప్రభు వాక్యములకుఁ దాత్పర్యమేమనినఁ, బ్రేమమే సిద్ధవస్తువు. మాయామోహిత దశయందున్న జీవునియందది కృష్ణప్రేమము స్వ తటస్థలక్షణము నొందియుండునుగాని స్వరూప ప్రకాశమైనది. లక్షణముతో నుదయింపదు. కృష్ణ నామము, గుణము, రూపము, లీలాకథనము, శ్రవణము, కీర్తనము, స్మరణము మున్నగు కార్యములు సాధన భక్తియొక్క స్వరూప లక్షణములు. * ఆసాధనభక్తి సేయఁగాఁ జేయఁగా గర్భీకృతమగు నగ్నివలెఁ

* శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్.

ప్రేమ మొదటఁ దటస్థరూపమున నుదయించును. తదుపరి లింగశరీరము భంగమగుచుండ, ననఁగా, వస్తుసిద్ధిసమయమున నది స్వరూపలక్షణముతోఁ బ్రకాశించును. కృష్ణప్రేమము సిద్ధవస్తువు కావున నది సాధనమూలమున నుదయించునది కాదు. కేవలము శ్రవణాదులచే శుద్ధచిత్తమున నది యుదయించును. ఈవిధముగ శ్రవణాది సాధనావశ్యకత స్పష్టమగుచున్నది.

ఈసాధన భక్తి (1) వైధీ సాధనభక్తియనియు, (2) రాగానుగ సాధనభక్తియనియు, రెండువిధములు. దీనింగూర్చి శ్రీమన్మహాప్రభుని వాక్యమిట్లున్నది.

"సాధన భక్తియు రెండువిధములని ♦ శాస్త్రములు చెప్పుచుండు
వైధీభక్తి యొకటి రాగానుగ ♦ భక్తి యనఁగ నింకొండు"
ఏనరుఁడొందఁడొ రాగ మతఁడు శా ♦ స్త్రానుమతిం భజియించు
దాని నె వైధీభక్తియంచు శా ♦ స్త్రములెల్లను గీర్తించు"

వైధీభక్తి.

కృష్ణేతర విషయములందు బద్ధజీవుఁడెపుడు విశేషానురాగము గలిగియుండునో, అపుడతనికిఁ గృష్ణునియెడలఁ బ్రేమ మించు మించుగ లేనటులే కనఁబడుచుండును. అప్పుడు శుభాకాంక్షియగు జీవుఁడు కేవల శాస్త్ర విధినిఁ బాలింపుచుఁ గృష్ణ భజన మొనర్చును. ఈభజనమే వైధీభజన మనఁబడును. శాస్త్రమునందలి శాసనవాక్యములను శిరసావహించి యందు నిరూపింపఁబడిన సకల విధి నిషేధములయందును దృష్టినిలిపి సర్వకార్యములును నిర్వహించుచుండును. ఇదియే యతని జీవనమునకుఁ బ్రాథమిక శుభోదయము. శాస్త్రవాక్యములయందలి శ్రద్ధయే యతఁడిట్లు కృష్ణ భజనమందుఁ బ్రవర్తించుటకుఁ గారణము. ఆశ్రద్ధ మొదటఁ గోమలముగ నుండి,

---

ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా,
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీత ముత్తమమ్.

భా. 7-5-23, 24.

తదుపరి మధ్యమముగను, దుదకు త్తమరూపముగను బరిణమించి ఫలసిద్ధి నొసంగుచున్నది. ఉత్తమ రూపము నొందిన యీ శ్రద్ధ సాధు సంగమునఁ గృష్ణభజనము సల్పుటచే నిష్ఠ, రుచి, ఆసక్తి, మఱియు భావ పర్యంత మవస్థాంతరముల నొందినపుడీ విధి యొక చమత్కారరూపము వహించును. అపుడు సాధకుఁడు తెలిసికొనునదేమనఁ, గృష్ణుఁ డొక్కఁడే సర్వదా స్మరింపదగినవాఁడు. ఒకప్పుడైన నతనిని స్మరింపకుండు టుచితముగాదు. సకల విధి నిషేధములు నీరెండు మూల విధి నిషేధములకుఁ గింకరప్రాయము" * లని. ఈ యవస్థయందున్న సాధునికి విధి నిషేధములయందలి నియమాగ్రహము క్షీణించిపోవుచుండుటచే నతనిభక్తి సాధనమందలి యధికారానుసారము కొన్ని కొన్ని విధులను బరిత్యజింపుటయు, గొన్ని కొన్ని నిషేధములను స్వీకరింపుటయు, గాన నగును. †

సాధనభక్తి వివర మీక్రింది ప్రభువాక్యములచే గ్రహింపవచ్చును.

—చౌషష్ఠి సాధన భక్త్యంగములు.—

"సాధన భక్త్యంగములనెల్ల వి ♦ స్తరింపఁబనిలే దనుచు
సాధనాంగములఁ గొన్ని ప్రభువు వి ♦ స్తరించె నిటు వినుమనుచు:-
గురు పదాశ్రయము, ధర్మశిక్ష, అడు ♦ గుటయు దాని తత్త్వంబు

---

* స్మర్తవ్య స్సతతం విష్ణు
ర్విస్మర్తవ్యో న జాతు చిత్
సర్వే విధి నిషేధాస్స్యు
రేతయో రేవ కింకరాః.

† స్వేస్వేఽధికారే యానిష్ఠా సగుణః పరికీర్తితః
విపర్యయస్తు దోషస్స్యా దుభయో రేష నిర్ణయః.
కర్మణాం జాత్యశుద్ధానా మనేన నియమఃకృతః
గుణదోష విధానేన సంగానాం త్యాజనేచ్ఛయా.

భా. 11-20-26, 27.

గురుసేవయు, సాధుమార్గ గమనము ♦ వరదీక్షాగ్రహణంబు
ఘన కృష్ణప్రీతిని భోగత్యా ♦ గము తీర్థావాసంబు
తనువుండుటకై మెసవుట, ఏకా ♦ దశియం దుపవాసంబు
గోవిప్రాశ్వత్థ వృక్ష వైష్ణవ ♦ కుల ధాత్రీ పూజనము
సేవసమును మఱి నామాపరాధ ♦ కేవల పరివర్జనము
బహు శిష్యగ్రహణంబు నవైష్ణవ ♦ పరిజన నిరాసనంబు
బహుగ్రంథ కళాభ్యాస వర్జనము ♦ వ్యాఖ్యానవర్జనంబు
హాని లాభముల సమదృష్టియు శో ♦ కాదులకు లొంగ కునికి
ఏనాఁ డన్యాలిబునుల శాస్త్రములఁ ♦ దానిందింపక మనికి
వినకుండుట గ్రామ్యవార్త ♦ వైష్ణవ విష్ణునింద నేదినము
మనసమున వాక్కున హింసింపమి యణు ♦ మాత్రముఁ బ్రాణులమనము
పరిచర్యయు దాస్యమును సఖ్యమును ♦ వందనము పూజనంబు
స్మరణము శ్రవణము కీర్తనంబు నా ♦ త్మనివేదన కార్యంబు
ఎదుట నృత్యగీతములు, విన్నపము, ♦ లెంతయు సాఁగిలి వినతి
ఎదురేఁగుట, వెన్నాడుటయు, తీర్థ ♦ గృహదర్శన ప్రీతి గతి
పరిక్రమము స్తవమును బాఠమును జ ♦ పంబును సంకీర్తనము
మఱిధూపము గంధము మాల్యంబును ♦ మహాప్రసాదాశనము
ఆరతి మహోత్సవ శ్రీమూర్తి స ♦ దాలోకన భాగ్యంబు
కోరికొలుచు, టిష్టవస్తునిడుట, అ ♦ సంతితమగు ధ్యానంబు
తపేయతులసీ మధురాభాగవ ♦ తవైష్ణవ సేవనంబు
సదాచరణ యోగ్యములని శ్రీకృ ♦ ష్ణ ప్రధానాభిమతంబు
కృష్ణునికొఱకై యఖిలచేష్టలును ♦ కృష్ణ కృపాలోకనము
కృష్ణభక్త సహితముగ జేయుటయుఁ ♦ కృష్ణోత్సవ దర్శనము
శరణాపత్తియుఁ గార్తికాదులగు * ♦ సద్వ్రత నిర్వహణంబు

* (1) కార్తికము (2) మాఘస్నానము (3) వైశాఖకృత్యము.

అఱువది నాల్గంగము; లొండెదు ని ♦ య్యవి పరమ మహత్త్వంబు
నామకీర్తనము భాగవత శ్రవ ♦ ణమును సాధుసంగంబు
శ్రీమూర్తిని శ్రద్ధమెయిఁ గొల్చుటయు, ♦ నా మధురావాసంబు
పంచాంగము లివి శ్రేష్ఠంబులు స ♦ ర్వ సాధనాంగములందు
ఇంచుక సల్పినఁ గృష్ణప్రేమ జ ♦ నించి తీఱు నిఁక నెందు."

**శ్రేణీ విభాగము.**

ఈ యఱువదినాలు గంగములయందును శ్రవణాదులగుఁ దొమ్మిదియుఁ బ్రధానాంగములు; తక్కిన వన్నియు ననుషంగములు. ప్రారంభమున వివరించిన పదియంగములును భక్తిభవనమునకుఁ బ్రవేశ ద్వారములవంటివి; తఱువాతి పదియంగములును భక్తిప్రతికూల విషయములను నిషేధించునవియును, భక్త్యనుకూల విషయగ్రాహకములునని చెప్పవచ్చును. వీనిలో ధాత్రి, అశ్వత్థము, గోవు, విప్రుఁడు మున్నగువాని పూజనాదులు సమాజ నిష్ఠాకర్తవ్య విశేషములు. ఇవియే ప్రారంభమందు భక్తి కనుకూలించు విషయములు. సాధనభక్తి పరిపక్వస్థితికి వచ్చినప్పుడీ యఱువదినాల్గంగములయందును దుదను వివరించిన యైదంగములు మాత్రమే విశేష పాలనీయము లగుచున్నవి.

**సాధన రహస్యము.**

సాధన పర్వమందొక రహస్యము గలదు. క్రమపద్ధతిని సాధనము సాగుచుండినపుడప్రాకృతజ్ఞానమును, భక్తియు, ఇతర (కృష్ణేతరవస్తు) వైరాగ్యమును నీమూఁడును యుగపద్ధర్మమున సమభాగములుగ వృద్ధిఁ బొందుచుండును. కాని యెచట వీనియందు వ్యతిక్రమము కనఁబడునో, అచ్చట సాధనమూలమున నేదియో దోషము గలదని తెలిసికొనవలసి యుండును. * సకలవిధములచేతను సాధుసంగము, శ్రీగురుకటాక్షము తప్ప,

---

* భక్తిః పరేశానుభవో విరక్తి, రన్యత్ర చైషత్రిక ఏకకాలః
ప్రపద్యమానస్య యథాశ్నతస్స్యుస్తుష్టిః పుష్టిః క్షుదపాయోఽనుఘాసం.

భా. 11-2-42.

సాధకుని గుమార్గపతనమునుండి రక్షింపఁగలుగునవి వేఱొండు లేవు. శ్రీ మన్మహాప్రభువిట్లు సెలవిచ్చిరి.

"ఏకాంగము సాధింపుము; కొలువు మ ♦ నేకాంగముల సతమ్ము
నీకుఁ బ్రేమ జన్మించుటనఁగ ద ♦ న్నిష్ఠచేతనే సమ్మ"

ఏకాంగసాధకులు, బహ్వంగసాధకులు.

ఏకాంగసాధకులలోఁ బరీక్షిత్ప్రభువు (శ్రవణము), శుకుఁడు (కీర్తనము), ప్రహ్లాదుఁడు (స్మరణము), లక్ష్మి (పాదసేవనము), పృథువు (అర్చనము), అక్రూరుఁడు (వందనము), హనుమంతుఁడు (దాస్యము), అర్జునుఁడు (సఖ్యము), బలిచక్రవర్తి (ఆత్మనివేదనము), మున్నగువారల నుదాహరణములుగఁ జెప్పిరి. బహ్వంగసాధకులలో నంబరీషు నుదాహరించిరి.

పారమహంస్యము వైధము కాదు.

సాధనకాలమున సాధకుని హృదయ మెంతవఱకుఁ గామగ్రస్తమై యుండునో అంతవఱ కతనికి వర్ణాశ్రమాది ధర్మములయం దపేక్షయుండును. కామమును విడిచి శాస్త్రవిధి ననుసరించి సాధనభక్తి సలుపువారు ఋణత్రయమునుండి విముక్తులగు చున్నారు.*

"కామమేది శాస్త్రవిధిఁ గృష్ణు ను ♦ త్కంఠమై గొల్చువాఁడు
ఏమియు ఋణపడఁడా దేవర్షి పి ♦ తృ దేవతలకేనాఁడు."

సాధనభక్తి నిష్కామమయ్యేనేని విధిధర్మముతో సాధకునికిఁబని లేదు. అట్లని నిషిద్ధాచారమువంక నతని కెన్నఁడును బుద్ధిపోదు. శుద్ధ సాధనభక్తియందుఁ బాపాచరణ మసంభవము. ఒకవేళఁ దనకుఁ దెలియక నే

* దేవర్షి భూతాప్తనృణాం, పితౄణాం
నకింకరో నాయమృణీచ రాజన్
సర్వాత్మనా యశ్శరణం శరణ్యం
గతో ముకుందం పరిహృత్యకర్తమ్.

తనచే నకస్మాత్తుగ నేదేని నొక పాపకార్య మొనర్పఁబడినను దానికిఁ ప్రాయశ్చిత్తము చేయవలసిన యావశ్యకతయు లేదు. *

మున్ముందుగ జ్ఞానవైరాగ్యములను సంపాదించి తదుపరి భక్తిని
సంపాదించుటయే యుచితక్రమమని కొందఱి
జ్ఞానవైరాగ్యములు మతము. కాని యిదిపిచ్చిభ్రమ. ఇందువిషయమై
భక్తికి సోపానములు మహాప్రభువు " జ్ఞానవైరాగ్యాదు లెన్నఁడును
కావు. భక్త్యంగములు కా"వని సెలవిచ్చియేయున్నారు.

భక్తి స్వతంత్ర వృత్తిగలది. జ్ఞానవైరాగ్యములు భక్తిదేవి కించుమించుగ దాసరూపములగుచు దవ్వులనుండియే యామెను గొలుచుచుండును.† అహింస, యమము, నియమము, మున్నగుధర్మములు భక్తితోపాటు స్వాభావికముగ గలుగునవియే. వీనింగూర్చి వేఱే ప్రయాసపడవలసిన యగత్యములేదు. తదుపరి ప్రభువిట్లు సెలవిచ్చిరి.—

—రాగానుగ భక్తి.—

" మునువైధీభక్తి సాధనంబును ♦ వినిపించితిఁ బూర్తిగను
వినురాగానుగ భక్తిలక్షణం ♦ బును సనాతనా ! ఇఁకను
రాగాత్మిక భక్తియనఁ గేవలము ♦ వ్రజవాసులదే సొమ్ము
రాగానుగ మగుఁ దదనుగమన సాం ♦ ద్రభక్తియోగము నమ్ము
" ఇష్ట " మందు గాఢతృష్ణ కలుగుట ♦ యేస్వరూపలక్షణము
" ఇష్ట " మునందావిష్టత యనునది ♦ యే తటస్థ లక్షణము

---

* స్వపాదమూలం భజతః ప్రియస్య త్యక్తాన్యభావస్య హరిః పరేశః
వికర్మ యచ్చోత్పతితం కథంచి ద్ధునోతి సర్వం హృది సన్నివిష్టః.
భా. 11-5-41, 42.

† తస్మాన్మద్భక్తియుక్తస్య యోగినో వై మదాత్మనః
నజ్ఞానం నచవైరాగ్యం ప్రాయశ్శ్రేయో భవేదిహ.
భా. 11-20-31.

రాగమయంబగు భక్తికి చెల్లను ♦ రాగాత్మిక నామంబు
వేగిరపడు నేధన్యుఁడో దానిని ♦ విని సలుప నజస్రంబు
అనుగమనము వ్రజవాసులభావను ♦ నతిలోభమునతో సతము
అనుమోదింపమి శాస్త్రయుక్తి రా ♦ గానుగ ప్రభృతుల మతము
బాహ్యమొండు సాధనము దీనిక ♦ భ్యంతర మొకసాధనము
బాహ్యమునుసాధక దేహముతోడ శ్ర ♦ వణమును సంకీర్తనము
మననమునఁజేయుట స్వసిద్ధదేహ ♦ స్మరణంబును భావనము
దినము రేయి వ్రజమం దొనరించుట ♦ తివిటి కృష్ణసేవనము
తనగురువగు కృష్ణప్రేష్ఠుని యూ ♦ థమునఁ దాఁ జేకొంట
అనవరతముఁ గృష్ణసేవ యంత ♦ ర్మనమునఁ జేయుచునుంట
దాససఖ్య పిత్రాది ప్రేయసీ ♦ తర తను సంగ్రహణంబు
వాసిగ రాగసరణి నిజనిజ భా ♦ వంబుల పరిగణనంబు
ఈరాగానుగభక్తి నిరంతర ♦ మెవరుసేతు రీ రీతి
వారికిఁ గృష్ణపదసేవయందు ♦ ద్భవించు నెంతయుఁ బ్రీతి
భావంబని రతియని తాఁ బిలువం ♦ బడు నీప్రీత్యంకురము
తావకుఁడగుఁ గృష్ణుఁడు వీరికిఁ బర ♦ తంత్రుని రీతిగఁగర్మము.

ఇదియే రాగానుగసాధనభక్తి వివరము. ఈవిధముగ వైధీసాధనభక్తికిని, రాగానుగ సాధనభక్తికిని గల భేదము నిరూపించి శ్రీమన్మహాప్రభు వభిధేయసాధన తత్త్వ వివరణము ముగించెను. చతుర్థవృష్టియందు రాగానుగ తత్త్వ విచారము స్పష్టీకరింపఁ బడుచున్నది.

క్రమపథమే మంగళప్రదము.

అపక్వ సిద్ధాంత సంతుష్టులగు కొందఱి యభిప్రాయానుసారము భక్తి ప్రాప్తికి సాధనావశ్యకతతోఁ బనిలేదు. వారలు వర్ణాశ్రమధర్మ జీవనముగాని, లేదా యొక్కమాఱుగాఁ గృత్రిమలక్షణయుక్తమగు ప్రేమభక్తితోఁ బ్రారంభించు కృతక జీవనము

గాని ముఖ్యముగ నభిలషింతురు. కాని భక్త్యుపదేశమును మనము పూర్తిగ గమనించితిమేని క్రమోన్నతియే మంచిదనియు, నర్థజనకమనియు, స్పష్టపడ గలదు. మొట్టమొదట వర్ణాశ్రమనిష్ఠతోఁ గూడుకొన్న ధర్మజీవనము నిర్వ హింపఁ బడునేనిఁ దదుపరి యున్నతిక్రమమున వైధభక్తి జీవన మవశ్యము లభించును. తుదకుఁ గ్రమపరిణతిచేఁ బ్రేమభక్తి లాభము గలిగి జీవితము సంపూర్ణత్వము నొందును.* అధికారోన్నతి ననుసరించి యాసాధనప్రణాళి యందు మార్పు లాయాజీవనముల కనురూపములగుచు నవశ్యముగ నుండియే తీఱును.

కాని యిట్టి క్రమావలంబనముచే మనుష్య జీవనమున కవనతియే సంభవించునని మఱికొందఱి యభిప్రాయము.

కర్మ ఆత్మధర్మము కాదు.

మొదట వ్యవసాయదారుఁడు గను, వెనుకవ్యాపారస్థుఁడుగను, దదుపరి రాజకీయోద్యోగిగను, దుదకు ధర్మవ్యవసాయి యగు బ్రాహ్మణుఁడు గనుఁ బురుషుఁడు క్రమోన్నతి లాభము నొందునేని బ్రాహ్మణత్వమే కాక చివరకు సన్న్యాస సహితమగు బ్రహ్మత్వము గూడ సిద్ధించునని వారను కొందురు. కాని యిదికేవల మాత్మవంచనము మాత్రమే.† ఈధర్మజీవనము లన్నియుఁ గేవల పార్థివోన్నతినిఁ గల్పించుననేకాని తామెంతటి ప్రయ

---

* సతాం ప్రసంగాన్మమ వీర్యసంవిదో
భవంతి హృత్కర్ణ రసాయనాః కథాః,
తజ్జోషణాదాశ్వపవర్గ వర్త్మని
శ్రద్ధారతిర్భక్తి రనుక్రమిష్యతి.

భా. 3.25-25.

† మతిర్నకృష్ణే పరతస్స్వతో వా, మిథోఽభిపద్యేత గృహవ్రతానామ్,
అదాంతగోభిర్విశతాంతమిస్రం, పునఃపునశ్చర్విత చర్వణానామ్.

భా. 7-5.30.

త్నము సలిపినను అవి యాత్మోన్నతికిఁ సాధనములు కాఁజాలవు. ఈపార్థివ జీవనముల నన్నిఁటి నతిక్రమించి మానవుఁడు పారమార్థిక జీవనమును సహజముగ నొందుట కనుకూలించు వ్యవస్థయే శ్రీమన్మహాప్రభు వుపదేశించెను.

**సాధన భక్తిమూలమున నాత్మోన్నతి క్రమము.**

వర్ణాశ్రమ ధర్మమును బాలించుటచే దేహయాత్ర నిర్వహింపఁ బడుచున్నది. యోగాదులచే మన ఉన్నతి సాధింపఁ బడుచున్నది. కాని సాధనభక్తిచేతనే యాత్మోన్నతి లభించుచున్నది. భక్తిసాధనసకు వ్యవసాయమందు నేర్పుఁ దనముకాని వ్యాపారమునందు దక్షత్వముకాని, యుద్ధకర్మమందుఁ జాతుర్యము కాని, అంతగా లేకున్నను దనయధికార క్రమమున నతఁ డత్యుచ్ఛ మానవ జీవననిర్వాహకమందుఁ బరిపాకము నొందినవాఁడే యగుచున్నాఁడు. ఒకానొక చతురుఁడగు రాజమంత్రికిఁ దుపాకిఁ బేల్చుటయం దతిసామర్థ్యము లేక పోయినను అతఁడే సకలయోధ గణములకు నుత్తమాంగమువలెనుండి నాయకపదవి నలంకరించును. ఈరీతిగ సాధకభక్తునియొక్క సర్వోచ్ఛస్థితి నెవఁడు తెలిసికొనునో, అతఁడే నిజముగ బుద్ధిమంతుఁడు, అతఁడే యవశ్యముగ భగవత్కృపాలాభము నొందువాఁడు. *

---

* యదాయస్యాను గృహ్ణాతి భగవానాత్మభావితః
సజహాతి మతింలోకే వేదేచ పరినిష్ఠితామ్.

భా. 4-29-46.

యేవా మయీశే కృతసౌహృదార్థా, జనేషుదేహం భరవార్తికేషు
గృహేషు జాయాత్మజరాతి మత్సు, నప్రీతియుక్తా యావదర్థాశ్చలోకే.

భా. 5-5-3.



## ప్రథమవృష్టి—సప్తమధార.

## ప్రయోజనతత్త్వము.

శ్లో. సాక్షాద్ధరిత్వేన సమస్త శాస్త్రై
రుక్తస్తథా భావ్యత ఏవ సద్భిః
కింతు ప్రభోర్యః ప్రియ యేవ తస్య
వందే గురోశ్శ్రీ చరణారవిందమ్.

భగవంతుఁడగు శ్రీ కృష్ణ చైతన్య చంద్రుఁడు సనాతనున కిట్లు సెలవిచ్చెను.

"విను సనాతనా.! భక్తిఫలంబగు ♦ ప్రేమ ప్రయోజనంబు
పనివడి దీనిని వినిసఁ బుట్టుఁబో ♦ భక్తి రస జ్ఞానంబు
కృష్ణునియందలి రతి గాఢమయ్యె ♦ నే నదియే ప్రేమంబు
కృష్ణ భక్తిరసమున కయ్యెడు నది ♦ యే స్థాయీ భావంబు"

సాధనభక్తి విధము.

ప్రభుని వాక్యములకుఁ దాత్పర్యమేమనిన, ప్రథమమున సాధనావస్థ యందు భక్తికి 'భక్తి' నామమే యనువర్తించును. తదుపరి సాధన ఫలోదయకాలమున నా భక్తికే 'భావా' వస్థ ప్రాప్తించును. తరువాత నాభక్తియే ప్రేమరూపము వహించును. సాధనభక్తియొక్క యవధికే భావ మనియు, రతియనియుఁ, బ్రీత్యంకురమనియుఁ జెప్పు. * వైధీ సాధనభక్తికిని, రాగానుగ సాధనభక్తికినిఁ గల ధర్మభేదమేమనిన, వైధీ భక్తికిఁ గొంచె

---

* పరస్పరానుకథనం పావనం భగవద్యశః,
మిథోరతి ర్మిథస్తుష్టి ర్ని ర్వృతిర్మిథ ఆత్మనః.

మాలస్యముగ భావావస్థ కలుగును. రాగానుగ భక్తికది మిగుల స్వల్ప కాలములోనే ప్రాప్తించును.* రాగానుగ భక్తుల హృదయములందు శ్రద్ధ 'నిష్ఠ'ను గ్రోడీభూత మొనర్చుకొని 'రుచి' రూపమున జన్మించును. కనుకనే యది 'భావ' రూపముగ మాఱుట కెంతో కాలము పట్టదు. †

భావ లక్షణము.

సాధకుని హృదయమందెపుడు భావోదయమగుచున్నదో అపుడీక్రింద వివరించిన లక్షణము లతనియందుఁ గానఁబడును. మహాప్రభువు వాని నిట్లు చెప్పుచున్నారు.

"మొలఁచు నెవని చిత్తంబున నూతన ♦ ముగ నీ ప్రీత్యంకురము ‡
కలఁగఁడతఁడు ప్రాకృతమగు క్షోభము ♦ వలన; నిది శుభంకరము.

---

స్మరంతః స్మారయంతశ్చ మిథోఽఘౌఘహరం హరిమ్
భక్త్యాసంజాతయా భక్త్యా బిభ్రత్యుత్పులకాంతనుమ్.
భా. 11-3-30, 31.

* శృణ్వతాం గృణతాం వీర్యాణ్యుద్దామాని హరేర్ముహుః
యథా సుజాతయాభక్త్యా శుద్ధ్యేన్నాత్మా వ్రతాదిభిః.
భా. 6-3-32.

† కేవలేన హి భావేన గోప్యో గావో నగా మృగాః
యేఽన్యే మూఢధియో నాగా సిద్ధా మామీయు రంజసా.
యం న యోగేన సాంఖ్యేన దానవ్రత తపోఽధ్వరైః
వ్యాఖ్యాస్వాధ్యాయ సన్న్యాసైః ప్రాప్నుయా ద్యత్నవానపి.
భా. 11-12-8, 9.

‡ క్వచిద్రుదంత్యచ్యుతచింతయా క్వచి,
ద్ధసంతి నందంతి వదంత్యలౌకికాః
నృత్యంతి గాయంత్యనుశీలయంత్యజం,
భవంతి తూష్ణీం పరమేత్య నిర్వృతాః
భా. 11-3-32.

కృష్ణభక్తియందుఁ దప్ప వృథగ నొ ♦ కింతయుఁ గాలము పోదు
తృష్ణా భక్తులు సిద్ధులు నింద్రియ ♦ తృప్తులఁ గోరిక లేదు
తానుత్తములం దుత్తముఁడయ్యును ♦ హీనునివలెఁ జనుచుండు
మానక కృష్ణుఁడు బ్రోచునంచు నెం ♦ తే నమ్మికతో నుండు
కృష్ణదర్శనము నాకెపు డగునని ♦ యెదురు చూచుచునె యుండు
కృష్ణ నామ గానమున సర్వదా ♦ యీతని కభిరుచి మెండు
కృష్ణుని గుణములు వర్ణించుటయం ♦ దితనికిఁ బరమాసక్తి
కృష్ణుని వసతి గృహావాసమునం ♦ దితనికిఁ గడు ననురక్తి"

పంచమ వృష్టియందు శ్రీమన్మహాప్రభుని వగు నీ సమస్తోపదేశములకు విపుల వ్యాఖ్యానము గనఁ నగును. ప్రేమ లక్షణ

ప్రేమ లక్షణము.

మత్యంత దురూహము. కనుక నే దానివిషయమై మహాప్రభుని వాక్యము లిట్లున్నవి.

"కృష్ణరతికె లక్షణము వింటి విఁక ♦ నేల దాని వివరణము?
కృష్ణప్రేమను లక్షణమెద్దియొ ♦ యిపుడు సనాతన! వినుము
కలుగును గృష్ణప్రేమము పూర్ణము ♦ గా నెవ్వరి చిత్తములఁ
దెలియం డెంతటి విజ్ఞుఁడయ్యు వా ♦ రల వాక్క్రియాంకముల"

ప్రేమము శాంత దాస్య సఖ్య వాత్సల్య మధుర భేదములచే నైదువిధములు. వీనియందు మధుర ప్రేమ, మనఁగా,

ప్రేమయొక్క విష యాశ్రయ గుణ వర్ణనము.

మధుర రస మన్నిఁటికంటె శ్రేష్ఠమైనది. మధుర రసమునందుఁ గృష్ణ మాధుర్య సమగ్రానుభవము మనకు లభించుచున్నది. * మధుర రస స్థితుఁడగు భక్తునికిఁ బ్రేమయొక్క యత్యుచ్చ స్థితి కూడ

---

* నృణాంహి శ్రేయసార్థాయ వ్యక్తిర్భగవతో నృప!
అవ్యయస్యా ప్రమేయస్య నిర్గుణస్య గుణాత్మనః

సంప్రాప్తించిరియే తీఱును. * వ్రజ మధుర రసముసందే కృష్ణుని యఱువది నాలుగు గుణములును సంపూర్ణముగఁ బ్రకటితములగుచున్నవి. తద్రూపమగు ననంతమాధుర్యము వ్రజభక్తియందు మాత్రమే కలుగుట కవకాశముగలదు. భక్తగణ చూడామణియగు శ్రీమతి రాధికను గూర్చి మహాప్రభు విట్లు సెలవిచ్చెను.

" అనంతగుణ [శ్రీ] రాధికయం దిఱువది♦యైదె వరగుణములుండు
ఱనివడి యాగుణములకే పూర్తిగ ♦ వశుఁడగు శ్రీకృష్ణుండు."

మహా భాగ్యవశతచే మధురరసమం దధికారులగువారు మాత్రమే తద్రసాస్వాదనముచేయఁ గలుగుదురు.† ఈరస మిట్టిదని యెవరికిని మాటలతో బోధపఱచుట కవకాశమే లేదు. కావుననే ప్రభు విట్లు వచించిరి.

—మధురరస మాస్వాద్యమే కాని విచార్యము గాదు.—

„ కృష్ణభక్తిలేనివారి కెచ్చటి ♦ దేతద్రసనేవనము?
„కృష్ణభక్తులే చేయుదురీ యు ♦ త్కృష్ట రసాస్వాదనము"

ఈసమస్తమును శ్రీమన్మహా ప్రభువు సనాతనునకు ముందుగ నుపదేశించి ప్రేమభక్తికిఁ బ్రతికూలమగు శుష్కవైరాగ్యము నెట్లు విడువవలెనో,

---

కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవవా
నిత్యంహరౌ విదధతో యాంతి తన్మయతాంహి తే.
భా. 10.29.14, 15.

* మయి నిర్బద్ధహృదయాః సాధవః సమదర్శనాః,
వశీకుర్వంతి మాం భక్త్యా, సత్స్త్రియస్సత్పతిం యథా.
భా. 9.4.66.

† స వై ప్రియతమశ్చాత్మా యతో నభయ మణ్వపి,
ఇతి వేద స వై విద్వాన్ యో విద్వాన్ స గురుర్హరిః.
భా. 4.29.51.

తత్ప్రాప్తి కనుకూలమగు యుక్తవైరాగ్యము నెట్లు సంపాదింపవలెనో, తద్విషయమగు శిక్షకూడ తదుపరి యనుగ్రహించెను.

,, మహాప్రభువు సర్వంబు ◆ యుక్తవైరాగ్య తత్త్వమా
చెప్పె శుష్కవైరాగ్య జ్ఞాన వి ◆ శేషప్రతి షేధంబు. ''

యుక్తిలక్షణమును, యుక్తి కనుకూలమగు వేదవాక్య లక్షణావృత్తిని అనుసరించి కొందఱు మానవులు మహానిశ్చయము

ఫల్గువైరాగ్యము.

మెట్లుండుననిన, ,, నేను బ్రహ్మ ననుమాటలో సందేహములేదు కాని ప్రపంచమను జాడ్యము నన్నావరించుటచే బ్రహ్మానుభవమునకు దూరుఁడ నైతిని. ఈ ప్రపంచము నుండి విముక్తుఁడ నగుటకు నాకెద్ది యుపాయము? మానవదేహము ప్రపంచమేకదా? అట్లే గృహము ప్రపంచము; స్త్రీ పుత్త్రులు ప్రపంచము; ఆహారాదులు ప్రపంచము; వేయేల? సకలమును బ్రపంచమే. కావున నీ ప్రాపంచికోత్పాతమునుండి విముక్తి నొందు జేయుటకు నే నేమిచేయవలసి యుండును? ''

అనుచు వ్యస్తమతులై తమ శరీరములయందు విభూతి మున్నగునవి పూసి కౌపీనాదులు ధరింతురు. శుష్కద్రవ్యములు మాత్రమే భుజింతురు. ఆలు బిడ్డలను బరిత్యజింతురు. తాము ముముక్షువులని సలుగుఱు సనుకొనుటకు గాను గృహవిసర్జనము చేసి యడవులందైనఁ ద్రిమ్మరుదురు. లేదా మఠములందైన వసింతురు.

ఇట్లు చేయుటవలన వారల కేమిలాభముగలిగెను? వైరాగ్యము నవలంబించు విధమెఱుఁగక, హరి సంబంధముచేత నే యయ్యది ప్రపంచోద్ధారక మగునను విషయము నుపేక్షించి వారలు శుష్కజ్ఞానమును మాత్రమే సదా భావించుచుందురు. ,, నేను బాపమునువిడిచితిని; పుణ్యమును విడిచితిని; సమస్తమును సన్యసించితిని '' అని చెప్పుదురు. సత్యమే. కాని దీని వలని లాభమేమిరో వారలకుఁ దెలియదు. మరణానంతరము వఱకును

వేదాంతసూత్రములను, అందలి యధికరణములను బట్టి పలార్చుచుఁ గాల క్షేపము సేయుచుందురు. మరణము రాఁగానే వారిబుద్ధివంటి బుద్ధిగలవారలే యెవరో నలుగు రైదుగురుచేరి వారల నెత్తిపైఁ డెంకాయలు కొట్టి వారిని భూమిలోఁ బాతిపెట్టుదురు. ఇట్టి జన్మము జీవయాత్రపూర్తియగుటయే కాని భగవంతునిలో వార లైక్యమగుటయే లేదు. వారలు బ్రహ్మానుగు చింత వలుకే. వీరివలెఁగాక యెవరు దేహగేహములయందును, భోజన శయనము లందును, దిక్కాలములయందును, హరి సంబంధమే స్థాపించికొని, తదను శీలన మొనరించుచుఁ గ్రమముగ భక్తి నభివృద్ధిపఱచు కొందురో, వార లాభక్తికిఁ జరమఫల మగు ప్రేమము నవశ్యముగఁ బొందుదురు.*

పైనిఁ జెప్పిన వైరాగ్యమునకే ఫల్గువైరాగ్యమని పేరు. దీనిని నిషేధించి శ్రీమహాప్రభువు యుక్తవైరాగ్యమును సనాతనున కుపదేశించెను. అదియే దాసగోస్వామికి నీవిధముగ నుపదేశించెను.

"స్థిరమతివై పొమ్మింటికి; నిటు పి ♦ చ్చివాఁడ వగుటనుచితము
దొరకుఁ గ్రమక్రమముగ నాభవసిం ♦ ధుకూలము; మిది సమ్మతము
ప్రజల మెప్పుకై పూనవలదు మ ♦ ర్కటవైరాగ్యము నీవు
భుజియింపు యథాయోగ్యముగ విషయ ♦ ముల నిస్పృహతో నీవు

* జాతశ్రద్ధో మత్కథాసు నిర్విణ్ణః సర్వకర్మసు
వేదదుఃఖాత్మకాన్ కామాన్ పరిత్యాగేఽప్యనీశ్వరః॥
తతో భజేత మాం ప్రీతః శ్రద్ధాలుర్దృఢ నిశ్చయః
జుషమాణశ్చ తాన్ కామాన్ దుఃఖోదర్కాంశ్చ గర్హయన్॥
ప్రోక్తేన భక్తియోగేన భజతో మాఽసకృన్మునేః
కామాహృదయ్యా నశ్యంతి సర్వే మయి హృదిస్థితే॥
భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి మయిదృష్టేఽఖిలాత్మని॥
భా. 11.20.27 to 30.

అంతర్నిష్ఠను గొని సేయుము బా ♦ హ్యాజగద్వ్యవహారంబు
ఎంతయుఁ ద్వరలో నుద్ధరించు నినుఁ ♦ గృష్ణుం డిది సత్యంబు."
చై. చ. మధ్య. 15-237 to 239.

స్వచ్ఛంద జీవనము సేయుఁ దలఁపుగలిగి, స్వగృహత్యాగము సేయక, భార్యా పుత్త్రులతోఁ గలసియుండి, సర్వవిషయ యుక్తవైరాగ్యము. ముల ననాసక్తభావముతో ననుభవించుచు, నంతరనిష్ఠను గలిగి భక్తిసేయఁ గలిగెనేని నట్టి మనుజునిఁ గ్రమముగఁ బ్రపంచము విడిచివేయును. భక్తిబలముచేఁ బాటవము నొందిన యతని యాత్మ భగవత్సంబంధలబ్ధిచే స్థిరత్వముపహించును.* అట్లుగాక మోక్షార్థియై యిట్టి క్రమోన్నతి యత్నమును బరిత్యజించెనేనిఁ దుదకు మర్కట వైరాగ్యముకుదిటి జీవితము దోషదూషితముగును. "యథాయోగ్యముగ విషయముల ననుభవింపు" మనుటచేఁ గేవలమింద్రియ ప్రీతి కొఱకు విషయములను భోగింపు టుచితముగాదనియు, దనయాత్మకుఁ గృష్ణునితోఁగల సంబంధమును స్థాపించుటకొఱ కెంతవట్టు విషయగ్రహణ మవసరమో అంతవఱకే గ్రహింపుమనియు, నర్థము. ఇట్టి విషయానుభవముచే నాత్మయెంతయుఁ బ్రసన్నమగుచుఁ బ్రపంచాతీతత్వమొందుచుండ, నట్టి యాత్మ నపుడా విషయములు విడిచిపోవును. దేహమును, గేహమును, గృష్ణ పూజనమునకు వలయు సమస్తోపకరణములును, సమాజమును, నపుడు యుక్తవైరాగ్యమున కుపకరణములగుచున్నవి. సాధకుఁడు కేవల మంతర నిష్ఠగల వాఁడైనచో నంతయు మేలేయగును. బాహ్యనిష్ఠ కేవలము లోక

---

* ధర్మస్య హ్యాపవర్గ్యస్య నార్థోఽర్థాయోపకల్పతే
నార్థస్య ధర్మైకాంతస్య కామోలాభాయ హిస్మృతః॥
కామస్య నేంద్రియ ప్రీతిర్లాభో జీవేత యావతా
జీవస్య తత్త్వజిజ్ఞాసా నార్థో యశ్చేహకర్మభిః॥
భా. 1.2-9, 10.

వ్యవహారమునకే పనికి వచ్చును. కపటరహితమగు నంతర నిష్ఠ కుదిరెనేని భవబంధమును, ప్రపంచసంబంధమును, సత్వరముగఁ దిరోహితములగును. భక్తి శుద్ధమగుచున్న కొలఁది శుద్ధ జ్ఞానమును, శుద్ధ వైరాగ్యమును దదను రూపముగనే వృద్ధినొందుచుండును.

సరళ (అకపట) భక్త జీవనమునందుఁ గేవల కృష్ణ నామాశ్రయమే సర్వోత్తమమగు సాధనము. * శ్రీమన్మహాప్రభువు సనాతనున కిట్లు సెల విచ్చెను.

“నవవిధ భక్తులు శ్రేష్ఠమగును భజ ♦ న ప్రణాళియందుఁ గడు
ఇవి తగునెంతయుఁ గృష్ణప్రేమను ♦ గృష్ణుని మనకిడ నెపుడు
నామ భజన మా తొమ్మిదింటిలో ♦ నది సర్వశ్రేష్ఠంబు
ప్రేమ వొడము నిరపరాధముగఁ గీ ♦ ర్తించినఁ దన్నామంబు.”

చై. చ. అంత్య. 4.70, 71.

మఱియు నిట్లు సెలవిచ్చిరి.

“నలుపు మీవు దుర్బుద్ధివిడిచి త ♦ చ్ఛ్రవణంబుకీర్తనమ్ము
కలుగు నీకుఁ గృష్ణప్రేమ ధనం ♦ బలఁతి కాలమున నమ్ము
కృష్ణునిఁ గొలుచుటను నీచజాతుల ♦ కెటు లేకుండును సత్త? †
కృష్ణసేవకుల సత్కులవిపుల ♦ కేవిధి నేర్పడు గుత్త?
కృష్ణునిఁ గొలువని వాఁడె తుచ్ఛుఁడతి ♦ హీనుండు నభక్తుండు
కృష్ణుఁ గొల్చుటను జాతికులాది ని ♦ కృష్ట చర్చ లేకుండు

* ఏతన్నిర్విద్య మానానా మిచ్ఛతా మకుతోభయమ్
యోగినాం నృపనిర్ణీతం హరేర్నామానుకీర్తనం.

భా. 2.1.11.

† ధిగ్జన్మ నస్త్రివృద్యత్త ధిగ్వ్రతం ధిగ్బహుజ్ఞతామ్
ధిక్కులం ధిక్క్రియాదాక్ష్యం విముఖా యే త్వధోక్షజే.

భా. 10.23.40.

వన నిధి తుల్యము దీనులయెడ భగవంతుని దయ యని సమ్మ్ర
ధని పండితుఁడు కులీనుఁడు వహియించును గడు నభిమానమ్ము."

మహాప్రభుని యీ వాక్యరత్నములను సరళార్థ మీ క్రింద వివరించిన రీతిని గ్రహింప నగును. "భగవద్విషయమందు నీకు శ్రద్ధ యొదవె నేని సత్వరముగ సాధు సాంగత్యము నొంది వారలచే హరి నామము గ్రహింపుము. జ్ఞానకర్మముల గొడవ బెట్టుకొని చిత్తక్షోభము నొందకుము. సంఖ్యా విధిక్రమమున "హరే కృష్ణే"త్యాది పదునాఱు నామములును నిరంతరము గీర్తించు ప్రయత్నము చేయుచుండుము. దేహమును, గేహమును, మఱియు సమాజమును నామానుశీలనమున కనుకూలించువానిగఁ జేసి, వాని రక్షణమున కెంతటి ప్రయాస మావశ్యకమో దానినిఁ గృష్ణార్పణము చేసి నియోగింపుము. మఱి యేవిషయములకొఱకుఁ బ్రయాసపడకుము. పైనిఁ జెప్పినవిషయముల కొఱకైనను అతి ప్రయాసపడుట మానివేయుము. ఇంద్రియములకుఁ బ్రియమగు వస్తువుల నాహరింపకుము. అన్యవిషయములను వ్యవహరింపకుము. జీవుని శుద్ధజ్ఞానమును, అనుకూల రాగాదులును, ఇంద్రియములును, మనఃప్రభృతు లగు నంతరింద్రియములును, వినాశముగాని, వికారముగాని, యొందకుండుట కెంత యాహారమవసరమో, అంతమాత్రమే ప్రాణవృత్తిరూపమును, బరిమితమును నగు సాత్త్వికాహారమును భుజించి దేహమును రక్షించుకొనుము. * అధిక

వర్ణాశ్రమము ననుసరించి హరిభజన ప్రణాళి.

---

* ప్రాణవృత్త్యైవ సంతుష్యేన్మునిర్నైవేంద్రియప్రియైః
జ్ఞానం యథా న నశ్యేత నావకీర్యేత వాఙ్మనః.
భా. 11-7-39.

పథ్యం పూతమనాయస్త మాహార్యం సాత్త్వికం స్మృతం
రాజసం చేంద్రియప్రేష్ఠం తామసం చార్తిదాశుచిః.
భా. 11-25-23.

ప్రయాసమును, అధిక కష్టమును, లేకుండ నిర్మింపనగునే నట్టి నిర్జనావాసము నొకదానిని స్వీకరింపుము. కృష్ణభక్తికిఁ బ్రతికూలింపనిచో నీవొక భక్తసమాజమునందుండి దాని నున్నతపదవికిఁ దెచ్చుటకుయత్నింపుము. ఇవియన్నియుఁ జేయవలయు ననుట కర్థమేమనిన, నిర్జన స్థానమున నిశ్చింతమై ప్రబల ప్రయత్న సహితముగ నామ భజనము సాగవలయుననియే. * స్త్రీలంపటత్వమును, స్త్రీలంపటుల లంపటత్వమును, ఒకేమాఱుగఁ బరిత్యజింపుము. భక్తిలేనివారల సాంగత్యము చేయకుండుటయందు మిగుల జాగరూకుఁడవు కమ్ము. † అన్యులఁ గూర్చియుఁ, నస్య విషయములఁ గూర్చియు, ననవసరపుఁ జర్చ లెన్నఁడును సేయునము. నిష్కపటవృత్తి నవలంబించి నిన్నుఁ గూర్చి నీవు మిక్కిలి దీనునిగ నెఱుంగుము. అత్యంత సహనబుద్ధితో సమస్తకార్యములను సాధింపుచు యథార్థమగు లోకోపకారము సేయుము. నీకులమును, ధనమును, బరిజనమును, రూపమును,

---

వనంతు సాత్వికోవాసో గ్రామోరాజస ఉచ్యతే
తామసం ద్యూతసదనం మన్నికేతంతు నిర్గుణమ్.

భా. 11.25.25.

* నయత్రవైకుంఠకథా సుధాపగా
ననాధవో భాగవతాస్తదాశ్రయాః.
నయత్రయజ్ఞేశ మఖామహోత్సవా
స్సురేశ లోకోఽపి నవైస సేవ్యతాం.

భా. 5.19.24.

† సహ్యన్యో జాపతోజోస్యాఽ బుద్ధిభ్రంశోరజోగుణః
శ్రీమదాదాభిజాత్యాది ర్యత్రస్త్రీ ద్యూతమాసవః.
హాస్యంతే పశవోయత్ర నిర్దయై రజితాత్మభిః
మన్యమానై రిమందేహ మజరా మృత్యునశ్వరమ్.

భా. 10.10.8 & 9.

బలమును, పాండిత్యమును, బదవినిఁ దలఁచుకొని యెన్నఁడును గర్వింపకుము. సర్వమానవకోటిని యథాయోగ్యముగ గౌరవింపుము.* జీవితము నిట్లు సంస్కరించుకొని నిరంతరభావ పూర్ణుఁడవై హరినామము సేయుము. ఇట్లొనర్చితివేనిఁ గృష్ణానుగ్రహముచే విశుద్ధ ప్రేమలాభము నొందుదువు. ధర్మము, అర్థము, కామము, మోక్షమను నీనాల్గును బానిసలవలె నిన్ను సదా కొలుచుచుండును. † కామలేశమేదైన నీహృదయమున డాఁగియున్నచో దానింగూర్చి యతిశీసవృత్తి నవలంబించి గర్హాణపూర్వకముగ దానిని స్వీకరించియే నిష్కపట హరిభజనము సేయుచుండుము. కొలఁది దినములకే భగవంతుఁడు నీహృదయమునఁ బ్రవేశించి దానినిఁ గామరహిత మొనర్చుచు నీప్రేమము ననుగ్రహపూర్వకముగ స్వీకరించును. ‡ శ్రీమన్మహాప్రభుని యుపదేశములందు, ,, నామరుచి—జీవదయ ,, యను నీరెండును ఎవనియం దెంతవట్టుద్యోతిత మగుచుండునో,

---

* తృణాదపి సునీచేన తరోరపి సహిష్ణునా
అమానినా మానదేన కీర్తనీయస్సదా హరిః.

శ్రీశిక్షాష్టకమ్.

† భక్తిస్త్వయిస్థిరతరా భగవన్ యదిస్యా
ద్దైవేన నః ఫలిత దివ్యకిశోరవేషే
ముక్తిస్స్వయం ముకుళితాంజలి సేవతేఽస్మాన్
ధర్మార్థ కామగతయస్సమయ ప్రతీక్షాః.

శ్రీకృష్ణకర్ణామృతమ్.

‡ శ్రుణ్వతాం స్వకథాఃకృష్ణః పుణ్యశ్రవణ కీర్తనః
హృద్యంత స్థోహ్యభద్రాణి విధునోతి సుహృత్సతాం.

భా. 1.2.18.

అతఁడంతవట్టు వైష్ణవుఁడు.* ఇతరసద్గుణ సంపాదనముకొఱకుఁ బాటుపడ నవసరమేలేదు. భక్తజనములందు సకల సద్గుణములును దమంతటఁదామే యుద్భవమొందును.† భక్తగణము స్వభావసిద్ధముగ శ్రేయోఽఽచరణమునందే సదా ఆనందలాభము నొందుచుండుదురు.‡ కృష్ణదాసుఁడయ్యే నేని నేఁడెవుఁడును మఱల దుఃఖములనుగాని, క్లేశములనుగాని, యనుభవింపఁడు.§ గురువును, ఆత్మవర్గమును ఏ యేసమయములందు సంగయోగ్యులో తద్విషయమందు భక్తుఁ డతి జాగరూకుఁడై యుండు టావశ్యకము.¶ భావుక భక్తుని

* సోఽభివ్రజేఽచలాం భక్తిం, తస్మిన్నేవాఖిలాత్మని
తద్భక్తేషు చసౌహార్దం, భూతేషుచ దయాంపరాం.

భా. 10.41.51.

† యస్యాస్తిభక్తి ర్భగవత్యకించనా, సర్వైర్గుణైస్తత్ర సమాసతే సురాః
హరావభక్తస్య కుతో మహద్గుణా మనోరథేనాసతిధావతోబహిః.

భా. 5.18.12.

‡ ఏతావజ్జన్మ సాఫల్యం, దేహినామిహదేహిషు
ప్రాణైరర్థైర్ధియావాచా, శ్రేయ ఆచరణం సదా.

భా. 10.22.40.

§ తావద్రాగాదయః స్తేనాస్తావత్కారాగృహం గృహం
తావన్మోహోఽంఘ్రినిగళో, యావత్కృష్ణ నతేజనాః.

భా. 10.14.36.

¶ గురుర్నసస్యాత్స్వజనోనసస్యాత్పితా నసస్యాజ్జననీనసాస్యాత్
దైవంనతత్స్యాన్నపతిశ్చ నస్యాన్నమోచయేద్యస్సముపేతమృత్యుమ్.

భా. 5.5.18.

శారీరా మానసా దివ్యా వైయాసే యేచ మానుషాః
భౌతికాశ్చ కథంక్లేశా బాధేరన్ హరి సంశ్రయాన్.

భా. 3.22.37.

జీవన మత్యంత పవిత్రమైనది. వాని 'రుచి' సర్వదా విశుద్ధముగనే యుండును.*

—సాధ్యసాధన తత్త్వములు.—

ఈ సమస్తోపదేశ సారమును శ్రీమన్మహాప్రభువు శ్రీరఘునాథదాస గోస్వామికి సంక్షేపముగ నిట్లు సెలవిచ్చిరి.—

" నగుచు శ్రీమహాప్రభువనియెను రఘు ♦ నాథునితో నీరీతి
ఇఁగ నీకుపదేష్టగ స్వరూపునే ♦ నిచ్చుచుంటి నిదె ప్రీతి
వానివద్ద నేర్వుము సాధనత ♦ త్త్వంబు సాధ్య తత్త్వంబు
నే నెఱుంగనివి గలవెన్నియు మఱి ♦ తా నెఱుంగు సర్వంబు
ఐన నీకు శ్రద్ధగలదేని నా ♦ యాజ్ఞావచనములందు
ఈ నా వాక్యములఁ భావించుట ♦ యే నీ కగును బసందు:—
వినకుండుట గ్రామ్యకథల గ్రామ్య వ ♦ చనములు పలుకకయుంట
తినకుంట సుఖాద్యముల సువస్త్రము ♦ లను దా ధరించకుంట
మానదుఁడగుచు నమానియగుచు నా ♦ మమెపుడు సేయుచునుంట
మానసమున వ్రజయోగ్య 'యుగళ' సే ♦ వానిరతుండగుచుంట
ఇవి చెప్పితి సంక్షేపముగా మఱి ♦ యిదియే యుపదేశముగ
వివరించు స్వరూపుఁడు నీకన్నియు ♦ వినుమట సవిశేషముగ.

ఈవిధముగ శ్రీమన్మహాప్రభువు దాసగోస్వామికి నష్టకాలభజన ప్రణాళికూడ రహస్యముగ నుపదేశించెను. శ్రీస్వరూపునివలన మనకు సంప్రాప్తించిన యీసమగ్రోపదేశ మీగ్రంథమున వేఱొకచోట వివరింపఁ

---

* అర్థేంద్రియారామ సగోష్ఠ్య తృష్ణయా,
తత్సమ్మతానామ పరిగ్రహేణచ,
వివిక్తరుచ్యా పరితోష ఆత్మ ని
వినాహరేర్గుణ పియూష పానాత్.

భా. 4.22.23.—

బడినది. దానిం గ్రహింపుట కధికారము సంపాదించుటకు భక్తగణము ప్రయత్నింతురుగాక.

నిర్బంధినీమతి.

భావభక్త్యుదయము నుద్దేశించి యేబుద్ధిచే నుత్తమమును, ఏకాంతమును, నగు వైధభక్త్యనుశీలనము సేయఁబడుచున్నదో, అట్లే ప్రేమ భక్త్యుదయము నుద్దేశించి యేబుద్ధిచే భావభక్తి నిర్బంధితాను శీలనము సేయఁబడుచున్నదో, ఆబుద్ధినే నిర్బంధినీమతి యని చెప్పుదురు. ఇట్టి నిర్బంధినీమతి కలిగనేని భక్తి యతి శీఘ్రముగ సిద్ధించును. దీనికే యుపయుక్త యత్నాగ్రహమని మఱియొక పేరు గలదు. సాధకగణము మున్ముందుగ నీ నిర్బంధినీమతినే యాశ్రయింపవలెను. యత్నాగ్రహమును విడనాడి యీ విషయమం దుపేక్ష వహించుట యుక్తముకాదు.



# గౌణవిధివిచారము.

## ద్వితీయ వృష్టి—ప్రథమ ధార.

### గౌణవిధివిభాగము.

శ్లో. వాచా నిర్మలయా సుధా
మధుర యాయాంనాథ! శిక్షామదా
స్తాం స్వప్నేఽపి న సంస్మరా
మ్యహామహం భావావృతో నిస్త్రపః
ఇత్యాగశ్శత శాలినం
పునరపి స్వీయేషుమాం బిభ్రత
స్త్వత్తో నాస్తి దయానిధి
ర్యదుపతే మత్తో న మత్తోఽపరః.

భక్తియే ముఖ్యాభిధేయము, కర్మజ్ఞానములు గౌణాభిధేయములు.

ఏభక్తిజీవుని కుపేయ రూపమగు ప్రేమను సంఘటించుట కేకమాత్ర శాస్త్ర నిర్దిష్టోపాయముగుచు శాస్త్రాభిధేయ మనం బడుచున్నదో, అయ్యది ప్రథమవృష్టియందే నిరూపింపఁబడినది. కర్మగాని, జ్ఞానముకాని ముఖ్యా (సాక్షాద) భిధేయములు కావను విషయముగూడ విచారింపఁబడినది. కాని కర్మజ్ఞానములచేఁ గొంత ప్రయోజనము లేకపోలేదు. ఏమన, నివి రెండును గౌణోపాయములుగను, శ్రవణాది ముఖ్య విధులు ముఖ్యోపాయములుగను

జెప్పఁబడుచున్నవి. గౌణములైనను జడబద్ధుఁడగు జీవుని విషయమున జ్ఞాన, కర్మలభిధేయములుగనే పేర్కొనఁబడినవి. *

జ్ఞానకర్మలు గౌణాభిధేయములు; భక్తి ముఖ్యాభిధేయము. జ్ఞానకర్మలు భక్తిసాధనమున కుపాయములు; భక్తి ప్రేమ సాధనమున కుపాయము. ఈవిషయమంతయుఁ గ్రమ క్రమముగ విచారింపఁబడును. శరీరమును, మానసమును, సమాజమును, భక్తికనుకూలించురీతిని వ్యవస్థాపరిణతి నొందుటకు జ్ఞానకర్మలు తోడ్పడునేని నపుడా జ్ఞానకర్మల కభిధేయత్వము సిద్ధించుచున్నది. అట్లు కానిచో వీనికి బహిర్ముఖతాదోషము సంభవించును. అందువలననే యీరెంటిని గూర్చిన విశేష నింద శాస్త్రములందు మనము వినుచున్నారము.

గౌణవిధిని మొదట నేను బూర్తిగ విస్తరించి తదుపరిమూల సిద్ధాంతమగు ముఖ్యవిధిని వివరింతును.

జన నిష్ఠా విధి, సమాజ నిష్ఠా విధి, పరలోక నిష్ఠా విధి యని గౌణ విధి మూఁడు విధములు. వీనిలో జన నిష్ఠావిధి

శరీర నిష్ఠా విధి.

(1) శరీర నిష్ఠా విధి, (2) మనోనిష్ఠా విధి యని మఱల రెండువిధములు. మానవ శరీరము బలిష్ఠమైనచో సుఖజీవనము సేయవచ్చునను నభిప్రాయముతో నే యే వ్యవస్థలు కల్పింపఁబడినవో తద్వ్యవస్థా సముదాయమునకుఁ బేరు శరీర నిష్ఠా విధి. † మిత పానము, మిత భోజనము, మిత నిద్ర, వ్యాయామము మున్నగు నే సే

---

* యోగాస్త్రయోమయాప్రోక్తా, నృణాం శ్రేయోవిధిత్సయా
జ్ఞానం కర్మచ భక్తిశ్చ నోపాయోఽన్యోఽస్తి కుత్రచిత్.
భా. 11-20-6.

† నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంతమనశ్నతః
నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున!
యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగోభవతిదుఃఖహా

విధులు కలవో యవియును, అటులే శరీరము రోగగ్రస్తమైనచోఁ దన్నివారణార్థ మాయుర్వేదశాస్త్రమున నే చికిత్సా ప్రకరణములు గలవో యవియును, జేటి శరీర నిష్ఠావిధిగఁ జెప్పఁబడుచున్నవి. శరీర నిష్ఠావిధిని జక్కఁగఁ బరిపాలింపనిచో మానవకోటి జీవ యాత్ర సుఖముగ నిర్వహింప నేరదు. మనోనిష్ఠా విధిని జక్కఁగఁ బరిపాలింపనిచో మనస్సునకుఁ గల యుపలబ్ధిశక్తి (Perception), ధారణాశక్తి (Retention), కల్పనాశక్తి (Conception). విభావనాశక్తి (Imagination), విచారశక్తి (Power of Judgement) మున్నగునవి చక్కఁగఁ బెంపొంది తమ తమ కార్యములను లెస్సగ నిర్వహింపుటయందు సమర్థములై యుండవు. విజ్ఞానము, శిల్పము మున్నగునవి యభివృద్ధి నొందఁజాలవు. మనస్సునం దావరించియున్న కుసంస్కార రూపమగు తమము విగళితము కాదు. విషయ సంబంధమగు శుద్ధ జ్ఞానమెంతమాత్రమును లభింపదు. బుద్ధిని లౌకికచింతనుండి తొలఁగించి పరమేశ్వర చింతనమందుఁ బ్రవేశపెట్టుట కవకాశ ముండదు. చివరకుఁ బాపచింతనములును, నిరీశ్వర భావమును సర్వదా మనస్సు నావరించి మానవునిఁ బశుప్రాయునిగ నొనర్చును. కావున జన నిష్ఠా విధి మానవజీవితమును ఫలవంతముగ నొనర్చుటయందు మిగులఁ బ్రయోజనీయమగుచున్నది.

మనోనిష్ఠ.

మానవగణము సమాజబద్ధముగ నివసించు స్వభావము గలది. కావున సమాజము నున్నతస్థితికిఁ దెచ్చుటకును, బాప శూన్యముగ నొనర్చుటకును, సమాజ నిష్ఠావిధులు కల్పింపఁబడినవి. సమాజ నిష్ఠా విధులన్నిటిలో

సమాజ నిష్ఠా విధి.

---

యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే
నిస్స్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా
సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః
గీ. 6-16 to 18 & 29.

వివాహమనునది యుత్కృష్టవిధి. మానవసమాజమందు వివాహవిధియే లేకుండినచో సమాజము తగినంత యున్నతస్థితికి రాజాలదు. * కొన్ని కొన్ని దేశములయందు మొదట వివాహవిధి లేకుండుటచే నచ్చటి మానవగణము స్వేచ్ఛావిహార మొనర్చుచుఁ బశువులమాదిరి వర్తించుచుండిరి. కాని కొంతకాలమున కాదేశములయం దనేక సామాజికోత్పాతములు సంభవించుట వలన వివాహవిధి వారలచే నవలంబింపఁబడినది. యథేచ్ఛావర్తనము విడిచి యొక్కొక్కపురుషుఁ డొక్కొక్కస్త్రీనిఁ బరమేశ్వర సాక్షిగను, సర్వ జన సమ్మతముగను, వరించుటచే సంసారయాత్రకుఁ బునాది యేర్పడుచున్నది. ఈవరణమునకే వివాహమని పేరు. సంతానము గలిగినచో వారలను జక్కఁగఁ బరిపాలించియును, విద్యాదికము వారల కొసంగియును, సుఖ జీవనోపాయము వారలకుఁ దల్లిదండ్రులు కల్పించుచున్నారు. సంసారమందుఁ బ్రవర్తించుచున్న మానవులందఱు నన్నదమ్ములవలెఁ గలసిమెలసియుండుటచేతను, బరుల కష్టములకుఁ దోడ్పడుచుండుటచేతను, న్యాయమార్గమున నర్థసంపాద మొనర్చుచు జీవనము గడపుచుండుటచేతను, సర్వదా సత్యపాలనము, నసత్య గర్హణము నొనర్చుచుండుటచేతను, సంసారోన్నతిని విధిబద్ధ మొనర్చుచున్నారు. సమాజనిష్ఠయందుఁ బ్రవర్తించుట మానవజాతియొక్క ప్రధాన ధర్మము. ఈ ధర్మము సర్వదేశములయందును, సర్వకాలములయందును, ద్యోతకమగుచు నేయున్నది. ఏదేశపు మానవగణమందు సామాజికోన్నతియు, సభ్యత్వమును, సమృద్ధముగఁ గనఁబడుచున్నదో, ఆదేశమునందలి సమాజ నిష్ఠావిధి యత్యంత పరిపక్వముగను, బద్ధమూలముగను, ఉన్నదని తెలియ నగును. జాతులన్నిఁటిలో నార్యజాతియొక్క సామాజికోన్నతియు, సభ్యత్వమును సర్వోత్తమములనుట సర్వవాదిసమ్మతము. ఈ యార్యజాతియందుఁ గల శాఖోపశాఖలలో భారతీయులనఁబడు నార్యశాఖయందు విద్యయు,

---

* నగృహం గృహమిత్యాహు ర్గృహిణీ గృహముచ్యతే
తయాహిసహితః సర్వాన్ పురుషార్థాన్ సమశ్నుతే.
ఇతిస్మృతిః.

బుద్ధియు, సమాజమును, అధికతరోన్నతి వహించియున్నవి. ఇది యందఱు నంగీకరించిన విషయమేకదా? కాని యీ యార్యశాఖ నేఁటికి వృద్ధావస్థ నొంది బలహీనమయ్యెను. అయినను, ఇంతమాత్రమున దాని సామాజిక గౌరవమునకు నంతయుఁ గొఱఁతగలుగుటలేదు. అర్వాచీనులలోఁ గొందఱు భారతీయుల యనౌన్నత్యముఁ గూర్చియు, సభ్యత్వము గూర్చియుఁ, ఘృణీకార భావముతోఁ బ్రశంసించినను, భారతీయులకు వాస్తవముగ నెట్టిన్యూనతయు నందువలనఁ గలుగ నేరదు. భారతీ యార్యశాఖయందు సమాజ నిష్ఠా విధి కెంతటి యుచ్చావస్థ ప్రాప్తించెనో తద్విషయము వైదిక ధర్మశాస్త్రములు చదివినవారికి మాత్రమే తెలియఁగలదు. వాస్తవముగ మన ఋషుల నాఁటనే సమాజ నిష్ఠా విధి భారతీ యార్య శాఖయందుఁ బరాకాష్ఠ నొందినది. ఈ విషయము సమస్త సహృదయులకును, వైజ్ఞానికులకును, గూడ సంగీకారవిషయమే. వారును సమాజ నిష్ఠావిధిని వైజ్ఞానిక విచార క్రమమున రెండుభాగములుగ విభజించి వానికి 'వర్ణ విధి', 'ఆశ్రమ విధి', యని పేరిడిరి. * సమాజ నిష్ఠగల మానవుల యవస్థ స్వభావ మనియు, నవస్థానమనియు రెండువిధములు. జన నిష్ఠాధర్మమునుండి స్వభావమును, సమాజ నిష్ఠాధర్మమునుండి యవస్థానమును, ఏర్పడు చున్నవి. సమాజ బద్ధుఁడగుటచే మానవుని జన నిష్ఠాధర్మమునకు లోపము గలుగదు. సరేకదా నమాజసంబంధ క్రమమున నయ్యది పుష్టిఁ జెందును. మానవుని స్వభావక్రమమున వర్ణవిధియు, నవస్థానక్రమమున నాశ్రమవిధియు వ్యవస్థాపితము లయ్యెను. మానవుని శారీరికములును, మానసికములును నగు వృత్తులన్నియు ననుశీలనక్రమమునఁ బెంపొందుటచేఁ గ్రమముగ నొక్కస్థాయీ అవస్థ ప్రాప్తించును. అట్టి యవస్థయందే ప్రవృత్తి

* యస్త్వయాభిహితః పూర్వం ధర్మ స్త్వద్భక్తిలక్షణః
వర్ణాశ్రమాచారవతాం సర్వేషాం ద్విపదామపి.

భా. 11.17.1.

వర్ణవిధియు, నాశ్రమ విధియు.

యితరములగు నన్నిప్రవృత్తులపైఁ బ్రభుతవహిం చునో, ఆప్రవృత్తియే యామానవుని స్వభావమని చెప్పఁబడును. ఆస్వభావము బ్రహ్మస్వభావ మనియు, క్షత్రియస్వభావమనియు, వైశ్యస్వభావ మనియు, శూద్ర స్వభావమనియు, నాలుగువిధములు. మానవుని యుత్కృష్ట ప్రవృత్తిక్రమమునఁ బైఁజెప్పిన నాలుగువిధములగు స్వభావములును గలుగు చున్నవి. నికృష్టప్రవృత్తిక్రమమున నంత్యజస్వభా వము కలుగుచున్నది. అంత్యజ స్వభావమునకు స్వభావ త్యాగముమించి వేఱొండు విధిలేదు. *

స్వభావము నాలుగు విధములు.

జన్మమెత్తినది మొదలు ప్రబలప్రవృత్తి యుద యించు నంతవఱకు మానవునికి సంసర్గమూలకముగను, అనుశీలన మూలకము గను, దత్ప్రవృత్తి మొదట బీజముగనుండి, వెనుక సంకురముగను, అవల వృక్షముగను, బరిణమించి క్రమ క్రమముగ నభివృద్ధినొందును. స్వభావో త్పత్తి పూర్వకర్మానుసారముగ నగుచుండునని శాస్త్రకారులుగూడ లిఖించి యున్నారు. ఏవంశమున నెవరుజన్మింతురో ఆవంశస్వభావమే శైశవకా లమునుండియు వారికి సంసర్గజగుణస్వభావమై యొప్పుచుండును. తదుపరి విద్యావిశేషముచేతను, అనుశీలనానుసారముగను, అపర సంసర్గక్రమమునను, దత్స్వభావము కొంతయున్నతిఁ జెందుటయో, లేక, యవనతినందుటయో సంభవించును. ఇది స్వభావసిద్ధవిషయము. శూద్ర స్వభావముగల నరునకు శూద్రస్వభావ సంతానమును, బ్రహ్మస్వభావముగల మానవునకు బ్రహ్మ స్వభావసంతానమును నవశ్యముగ నుత్పన్నమగును. కాని యీవిధియే సర్వత్ర చెల్లుననుట సమంజసముకాదు. ఇందువలననే శాస్త్రకారులు

---

* అశౌచమనృతం స్తేయం నాస్తిక్యం శుష్కవిగ్రహః
కామః క్రోధశ్చ తర్షశ్చ స్వభావోఽన్త్యవసాయినాం.
భా. 11-17-20.

స్వభావ నిరూపణపూర్వకముగు వర్ణనిర్ణయ మనుసరించు నభిప్రాయముతో సంస్కారవిధిని స్థాపించియుండిరి. కాని యాసంస్కారవిధి కాలక్రమమునఁ దాఱుమాఱయ్యెను. వర్ణనిర్ణాయకమగు నాసంస్కారవిధి రానురానుత్సన్నమగుటచే దేశమున కవనతి సంభవించెను.* వర్ణవిధియే వాస్తవమగు సామాజిక ధర్మమనుటలో నెట్టి సందేహమునులేదు.

వైజ్ఞానికపద్ధతిచే నవస్థానములు (1) బ్రహ్మచర్యము (2) గార్హస్త్యము (3) వానప్రస్థము (4) సన్న్యాసము నని నాలుగవస్థానములు. నాలుగు విధములు.

వివాహమునకుఁ బూర్వమెవఁడు విద్యోపార్జనమును, దేశభ్రమణమును సేయుచుండునో, అతఁడు బ్రహ్మచారి.

ఎవఁడు వివాహమాడి సంసారమునందుఁ బ్రవర్తింపుచుండునో, అతఁడు గృహస్థుఁడు.

వయస్సు ముదురుటచే నెవఁడు లౌకికవిషయములనుండి విరమించి నిర్జనస్థలమున నివాసమొనర్చునో, అతఁడు వానప్రస్థుఁడు.

ఎవఁడు సంసారమునందలి సమస్తబంధములను ద్రెంచివైచి స్వేచ్ఛావిహార మొనరించుచుండునో, అతఁడు సన్న్యాసి.

సకలవర్ణములకును, సకలాశ్రమములకును గల సంబంధమువిచారించుటచే నేధర్మము స్థాపింపఁబడుచున్నదో, ఆధర్మమునకు వర్ణాశ్రమ ధర్మమని పేరు. ఈవర్ణాశ్రమధర్మమే భారతీయార్యశాఖయొక్క సామాజికవిధి. ఇట్టివిధి యేదేశమందులేదో, ఆదేశము నున్నతదేశమని చెప్పుటకువలను పడదు. ఈవిషయమిచ్చట సంక్షేపముగ మాత్రము విచారింపఁబడినది. తృతీయధారయం దిదివిపులముగ విచారింపఁబడును.

---

* యస్యయల్లక్షణం ప్రోక్తం పుంసోవర్ణాభివ్యంజకం
యదన్యత్రాపి దృశ్యేత తత్తేనైవ వినిర్దిశేత్.

భా. 7-11-35.

## ద్వితీయవృష్టి—ద్వితీయధార.

---

## పు ణ్య క ర్మ ము.

---

శ్లో. గోపాలాజిర కర్దమే విహ
రసే విప్రాధ్వరే లజ్జసే
బ్రూషేగోకులహుంకృతై
స్తుతిశతైర్మౌనం విధత్సేవిదాం
దాస్యం గోకులపుంశ్చలీషు
కురుషే స్వామ్యం న దాంతాత్మసు
జ్ఞాతం కృష్ణ! తవాంఘ్రి పల్లవ
యుగం ప్రేమ్ణాచలం మంజులమ్.

పారలౌకిక నిష్ఠావిధిక్రమమును మానవుని కర్మననుసరించి పరలోక సంబంధమగు ఫలవిచారము చేయఁబడుచున్నది.

**పాపపుణ్యములు.** సమాజావస్థితుఁడగుచు సత్కర్మాచరణ మొనరించుచుండు నతఁడు మరణానంతరము స్వర్గమునకుఁ బోవును. అసత్కర్మ నొనర్చునతఁడు నరక మనుభవించును. సత్కర్మకుఁ బుణ్యకర్మమనియు, నసత్కర్మకుఁ బాపకర్మమనియు, నామాంతరములు. పుణ్యము నార్జించుటకగు విధులన్నియును, పాపనివారణమునకగు నియమములన్నియు నేకీకృతమైనచో నద్దానినిఁ బరలోక నిష్ఠావిధియని చెప్పుచున్నారు. సత్కర్మలనియు, వర్ణాశ్రమ గతధర్మములనియు వక్కాణింపఁబడునవి తదనుష్ఠాతల యధికారభేదమునుబట్టి తామసరాజస సాత్త్విక శ్రద్ధాభేదములతో నొప్పుచుండును. ఆశ్రద్ధప్రవృత్తిపరమనియు, నివృత్తిపర

**అధికార భేదమును బట్టి కర్మవిధి.**

మనియు, రెండువిధములు. ప్రవృత్తిపరమగు శ్రద్ధను గనిష్ఠాధికారు లవలంబింతురు. మధ్యమాధికారులు ప్రవృత్తినివృత్త్యా (ఉభయా) త్మక మగు శ్రద్ధ నవలంబింతురు. ఉత్తమాధికారులు కేవల నివృత్తిపరమగు శ్రద్ధ నవలంబింతురు.* బహుదేవతా పూజావిధి ప్రవర్తింపుచున్నచోటఁ దద్విధికి సంబంధించిన సమస్తకర్మములతోఁ గేవల భగవత్పూజనము సల్పుట సాత్త్వికజనులకు విధియైయున్నది. ఇంద్రియ తృప్తిరూపమగు భోగము భగవద్భక్తులకొఱ కుద్దేశింపఁబడినది కాదు. ఏకర్మముల నాచరింపుటచే వారల కప్రాకృతలాభము కల్గునో తత్కర్మాచరణమందే వారు ప్రవర్తింపవలయును.† కర్మకే జీవనయాత్రయని మఱియొక పేరు. తత్త్వజ్ఞానులొనర్పవలసిన కర్మలవిషయము నిర్ధారణసేయుచు భక్తికనుకూలమగు కర్మలుమాత్రమే కర్తవ్యములనియు, భక్తికిఁ బ్రతికూలించు కర్మ

---

* త్రివిధాభవతి శ్రద్ధాదేహినాం సాస్వభావజా
సాత్త్వికీ రాజసీచైవ తామసీచేతి తాం శ్రుణు.
యజంతే సాత్త్వికాదేవాన్ యక్షరక్షాంసిరాజసాః
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసాజనాః.
గీ. 17-2, 4.

అస్మింల్లోకే వర్తమానః స్వధర్మస్థోఽనఘః శుచిః
జ్ఞానం విశుద్ధ మాప్నోతి మద్భక్తింవా యదృచ్ఛయా.
భా. 11.20.11.

† నజాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషాకృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే.
భా. 9-19-14.

కుర్యాత్సర్వాణి కర్మాణి మదర్థం శనకైః స్మరన్
మయ్యర్పిత మనశ్చిత్తో మద్ధర్మాత్మ మనోరతిః.
భా. 11-29-9.

అత్యంత త్యాజ్యములనియు, భగవానుఁడగు శ్రీకృష్ణుఁడు శ్రీ భగవద్గీతయందు స్థిరపరచెను. *

**స్వరూపగత, స్వభావగత పుణ్యములు.**

నేను యథాగతములగు పుణ్యపాపములను సంక్షేపముగ వివరించి విచారింపుదును. వానిని వైజ్ఞానిక రూపమున విభజింపుట చాల కష్టము. ఒకానొక ఋషి పుణ్యపాపములను శారీరికములు, మానసికములు, సామాజికములు, ఆధ్యాత్మికములనుచు నాలుగు విధములుగ విభజించెను. మఱియొకఁడు వానినే కాయికములు, వాచికములు, మానసికములనుచుఁ ద్రివిధముగ విభజించెను. ఇంకొకఁడు వానినే కాయికములు, ఐంద్రియికములు, ఆంతఃకరణికములనుచు మూఁడు విధములుగఁ జెప్పెను. కాని మనమీవిషయ మాలోచించినపుడు పైనిఁజెప్పిన విభాగము లెవ్వియును సర్వాంగసుందరములు కావని మనకుఁ దేటఁబడగలదు. నేను పుణ్యకర్మలను స్వరూపగతములు, సంబంధగతములనుచు రెండుగ విభజించుచున్నాను. న్యాయ్యము, దయ, సత్యము, పవిత్రత, మైత్రి, ఆర్జవము, ప్రీతి మున్నగునవి స్వరూపగత పుణ్యకర్మములు. ఈ పుణ్యకర్మములన్నియు జీవస్వరూపము నాశ్రయించి సర్వకాలములయందును దత్స్వరూపాలంకారములుగ నుండుటచే వీనిని స్వరూపగత పుణ్య

---

* నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః
గీ. 3.5.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః.
గీ. 4.17.

కర్మణ్యకర్మయః పశ్యేదకర్మణిచ కర్మయః
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్.
గీ. 4.18.

కర్మములుగఁ జెప్పుచున్నారు. బద్ధావస్థయం దీకర్మ లొకింత పుష్టములై "పుణ్య" ములని వ్యవహరింపఁబడుచున్నవి. ఇవి కాక తక్కిన సమస్త కర్మములును జీవుని జడసంబంధవశతచే నుత్పన్నములగుటను వానిని సంబంధగత పుణ్యములని చెప్పుచున్నారు. సిద్ధావస్థయందు వీని ప్రయోజనములేదు. పాపమెన్నఁడును జీవునికి స్వరూపగత తత్త్వముకాదు. బద్ధావస్థయం దది జీవుని నాశ్రయించును. స్వరూపగతపుణ్యములకు విరోధములగు నే పాపములు గలవో వానిని స్వరూప గత విరోధి పాపములని చెప్పనగును. ద్వేషము, అన్యాయము, అసత్యము, చిత్తభ్రమ, నిష్ఠురత, క్రూరత, లాంపట్యమనునవి కొన్ని స్వరూప విరోధి పాపములు. ఇతరములగు సమస్తపాపములును, జీవసంబంధిక పుణ్యవిరోధములే. మిగుల సంక్షేపముగ నేను పాప పుణ్యవిచారము సేయుదునని చెప్పుటచే నా యా కర్మల స్వరూప సంబంధ విభాగము నిరూపింపలేదు. దానిని దిగ్దర్శనముగ మాత్రము చూపించి వాని గుణించి యొకించుకయే లిఖించితిని. నా సూచించిన దానిఁ బట్టి పాఠక మహాశయుఁడు కొంచెము పరిశ్రమ మొనరించినచోఁ దద్విభాగమనాయాసముగఁ జేయఁగలిగి యుండును.

మిక్కిలి ప్రధానములగు పుణ్యకర్మములు పది విధములు:—

పుణ్య శ్రేణీ విభాగము.

(1) పరోపకారము (2) గురుజన సేవనము (3) దానము (4) ఆతిథ్యము (5) పావిత్ర్యము (6) మహోత్సవము (7) వ్రతము (8) పశుపాలనము (9) జగద్వృద్ధి (10) న్యాయాచరణము.

I. వీనిలోఁ బరోపకారము (i) పరకష్టనివారణము (ii) పరోన్నతి సాధనము ననిరెండువిధములు.

ద్వివిధ పరోపకారము.

వీఁడు నావాఁడనియు, వీఁడు పైవాఁడనియు వివేచనము సేయకుండ సర్వజనులకును యథా సాధ్యముగ నుపకారమొనర్చుటయందు మానవుఁడు ప్రవర్తింపవలెను. లోకమునందలి సకల విధములగు కష్టములు తనకుఁ బ్రాప్తించినపుడెట్లుండునో, అట్లే యిత

రులకుఁగూడ నుండునని తెలిసికొనవలెను. తనకేదైన కష్టము సంభవించి నపుడు తన్నివారణార్థ మితరు లెవరైనఁ దనకొఱకుఁ బాటుపడవలెనని తాను స్వాభావికముగఁ గోరుచుండును. అట్లే తనకువలెనే పరులకుఁ గూడఁ గష్టములు కలిగినపుడుండునని తెలిసి తాను వారలకొఱకుఁబాటువడి వారల కష్టములను నివారింపు టుచితము. స్వార్థపరత్వ మీకార్యమునకు వ్యాఘాతము గలిగించునని తెలిసికొని దానిని సాధ్యమగునంతవఱకుఁ బాఱఁదోలి పట్టుదలగఁ బరకష్టనివారణమునకై ప్రయత్నింపుటావశ్యకము. శారీరకములు, మానసికములు, సామాజికములు, ఆధ్యాత్మికములు నగు సమస్తకష్టములును బరులకుఁ గలిగినపుఁడు వానిని నివారించియే తీఱవలెను.

(i) పీడ, క్షుత్తు మున్నగునవి శారీరిక కష్టములు.

(ii) దుశ్చింత, హింస, శోకము, భయము మున్నగునవి మానసిక కష్టములు.

(iii) సంసారము చేయుటకు సమర్థత లేకుండుటయు, గలిగిన సంతానమునకు విద్యాభ్యాసమును, వివాహమును నిర్వహింపఁజాలమియు, మృతవ్యక్తులను సంస్కరింపుటకు వలయు ద్రవ్యముగాని, వాహనములుగాని లేకుండుటయు, మున్నగునవి సామాజిక కష్టములు.

(iv) సంశయము, నాస్తికత, పాపస్పృహ మున్నగునవాధ్యాత్మిక కష్టములు.

పరుల కష్టముల నివారించు టెంత యుచితమో, పరుల యున్నతికిఁ బాటువడు టంతయావశ్యకము. అర్థమొసఁగికాని, శరీరకష్టము చేసికాని, యుపదేశ మూలకముగఁగాని, తన యాత్మీయులచే సాయము చేయించి కాని, యితరులకు శారీరిక మానసిక సామాజికాధ్యాత్మికోన్నతి సమకూర్చుట ప్రతిమానవునికిని గర్తవ్యము.

II. గురుజన సేవనము మూఁడు విధములు.

—త్రివిధ గురుజన సేవనము.—

(1) మాతాపితలను బాలింపుటయు, సేవింపుటయు,
(2) ఉపదేశకులను బాలింపుటయు, సేవింపుటయు,
(3) గురుజనులనందఱను సన్మానింపుటయు, సేవింపుటయును.

తల్లిదండ్రులయాజ్ఞలను బరిపాలింపుటయును, వారలను యథాసాధ్యముగ సేవింపుటయు, నతఁడఱకుఁ బ్రధాన కర్తవ్యములు. శైశవకాలమునఁ మనము నిరాశ్రితులము, నసమర్థులమైయుండ మనల నెవ్వరు తమ ప్రాణభంగమునైన జూడకుండ రక్షించి పరిపాలించిరో, అట్టి తలిదండ్రులను దాను సమర్థుఁడై యుండుకాలమునం దన్నివిధములచేతను సేవింపు టుచితము. ఇందు విషయమై విశేషముగఁ జెప్ప టనావశ్యకము. బాల్యమునుండియు నెవరు మనకు విద్యయు, సదుపదేశమును, ననుగ్రహించిరో, అట్టివారిని బాలింపుటయు, సేవింపుటయు నుచితము.

పరమార్థమంత్రోపదేశమును, బరమార్థజ్ఞానోపదేశమును, మనకెవఁ డనుగ్రహించెనో, అట్టి యుపదేష్ట యందఱికంటె నధిక వరణీయుఁడును సేవ్యుఁడును. *

---

* అసంకల్పాజ్జయేత్కామం క్రోధం కామ వివర్జనాత్
అర్థానర్థేక్షయా లోభం భయంతత్త్వా వమర్శనాత్,
అన్వీక్షిక్యా శోకమోహౌ దంభం మహదుపాశ్రయాత్
యోగాంతరాయాన్మౌనేన హింసాంకామా ద్యనీహయా
కృపయా భూతజం దుఃఖం దైవంజహ్యాత్సమాధినా
ఆత్మజం యోగవీర్యేణ నిద్రాంసత్త్వ నిషేవయా
రజస్తమశ్చసత్త్వేన సత్త్వంచోపశమేనచ
ఏతత్సర్వం గురౌభక్త్యా పురుషోహ్యాంజసాజయేత్
యస్యసాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదేగురౌ

సంపర్కముచేత నెవరు మనకుఁ బెద్దలో, వయస్సుచేతను, జ్ఞానము చేతను ఎవరు శ్రేష్ఠులో, అట్టివారలు గురుజనులు. వారిని సన్మానించుటయు, నవసరమును బట్టి వారు గోరెడి పరిచర్య సేయుటయును, యుక్తము. గురుజను లేదే నొకయన్యాయకార్యముసేయ నాజ్ఞాపించిన నదిజేసి తీఱవలెననుట కాదుకాని వారలట్లాజ్ఞాపించి నందులకుఁ బరుషములును, నవమానసూచకములునగు వాక్యములచేతను, వర్తనముచేతను వారల యెడల మనము దురాగ్రహము చూపరాదు. తీయని మాటలచేతను, సద్భావముచేతను, సమయమెఱిఁగి వారలతో వినయపూర్వకముగఁ దద్విషయ విచారము సలుపుటచేతను, వారిని సంతోషపఱచి యన్యాయాచరణమునకై మున్నిడిన యాజ్ఞను వా రుపసంహరించుకొను నట్లొనర్పవలెను.

III. అర్థముగాని, ద్రవ్యముగాని యోగ్యపాత్రమున కిడుటయే దాన మనఁబడును. అపాత్రునకు దాన మిడునతఁడు నిరర్థకముగ నపవ్యయ మొనర్చిన వాఁడుగఁ బరిగణింపఁ బడుచున్నాఁడు. అట్టి దానము పాప కార్యమనియే తెలియవలెను.

దానము* పండ్రెండు విధములు—

—దానశ్రేణీ విభాగము.—

(1) బావులు, చెఱువులు త్రవ్వించిన మూలమున జలదానము.

(2) ఉభయపక్షస్థానములయందుఁ జెట్లను నాఁటుట, పెంచుట మూలమున ఛాయాదానమును, వాయుదానమును.

---

మర్త్యాన్నస్థిరశ్రుతం తస్య సర్వం కుంజరశౌచవత్
యథావార్తాదయోహ్యర్థా యోగస్యార్థంనబిభ్రతి
అనర్థాయ భవేయుశ్చ పూర్తమిష్టం తథాసతః.
భా. 7-15-22 to 26 & 29.

* దానం స్వధర్మో నియమోయమశ్చ శ్రుతంచ కర్మాణిచ సద్వ్రతాని
సర్వే మనోనిగ్రహలక్షణాంతాః పరోహియోగో మనసస్సమాధిః.
భా. 11-23-46.

(3) ఉపయుక్తస్థలములందు దీపదానము.
(4) ఔషధదానము.
(5) విద్యాదానము.
(6) అన్నదానము.
(7) పంథాదానము.
(8) ఘట్టదానము.
(9) గృహదానము.
(10) ద్రవ్యదానము.
(11) సుఖాద్యములందలి యగ్రభాగదానము.
(12) కన్యాదానము.

ద్వాదశవిధ దానములు.

దప్పిఁగొనిన వానికి జలదాన మొసంగుటుచితము. దప్పిఁగొనిన మనుజుఁడు గృహాగతుఁ డయ్యెనేని సుశీతలములగు జలములను వానికిఁ ద్రాఁగనీయవలెను. అందఱకును జలపాన మొసఁగుటకు గాను బావులు, చెఱువులు, కొలఁకులు మున్నగునవి త్రవ్వించుట పుణ్యకార్యము. పనికివచ్చు చోటులనరసి యందిష్టాపూర్తములను నిర్మింపవలెను.* ఎచ్చట జల మత్యంతావశ్యకమో, అచ్చట బావులు మున్నగునవి త్రవ్వఁబనగును. తీర్థములు మున్నగుస్థలములయం దనేకజనులకు జలము కావలసియుండును. అచ్చట నలుగురికి నుపయోగించు సమలు మొదలగునవి లేనిచోఁ గూపాదుల నవశ్యకముగఁ ద్రవ్వింపవలయును.

నదీతీరములందును, విశ్రామస్థలములందును, మార్గమున కిరువంకలను రావి మున్నగు పెద్ద పెద్దచెట్లను నాఁటి వానినిఁ బెంచవలయును. తన యింటియందును, నితర పవిత్రస్థానములందును, దులసిచెట్లు మున్నగునవి

* ఇష్టాపూర్తేన మామేవ యో యజేత సమాహితః।
లభతే మయి సద్భక్తిం మత్స్మృతి స్సాధుసేవయా.
భా. 11.11.46

వేయవలెను. వానిచే శారీరకమును, ఆధ్యాత్మికమును నగు మేలు మనకు లభింపఁగలదు.

ఘట్టములయందును, బాటలయందును, సంకట స్థలములయందును, బాటసారుల కుపయోగించుకొఱకు దీపదానము సేయవలెను. గాలి కొట్టి నపు డారిపోకుండు నట్లద్దములతో నావరణమేర్పఱచి పైఁ జెప్పిన చోటుల యందు దీపములుంచఁబడెనేని విశేషోపయోగము గ నుండును. చంద్రుఁడు లేని సమయములందును, మేఘము లావరించియున్న సమయములందును రాత్రి వేళ వెలుతురు కావలసియుండును. ఎవఁడెంతవట్టు దీపదానము సేయఁ గలిగియుండునో అతఁడంతవట్టు పుణ్యము నార్జించినట్లేయని తెలియవలెను. ఆకాశదీపములు కేవల కార్తికమాసమందే పెట్టవలెననుట సరికాదు. కార్తికమాసమునుండి పెట్టవలయునని యభిప్రాయము. ఆకాశదీపములు మిగుల నెత్తుగఁ బెట్టినచో నవి శోభ కొఱకే యగునుగాని యెవ్వరికి నుపకరింపవు.

ఔషధదానము రెండువిధములు. రోగుల యిండ్లకుఁబోయి మందు లిడుట మొదటిది. తనయింటికి రోగులువచ్చినపుడు మందులిడుట రెండవది. ఇంతేకాక యేదేనొక ప్రత్యేకౌషధాలయము కట్టించుటకూడ నౌషధదాన మనిపించుకొనును. ఇందువిషయమై యెవరికెంతవఱకు సాధ్యపడునో, వారలంతవఱకు శక్తివంచన లేకుండ దానము సేయుటయే యుక్తము.

తనద్రవ్యమును వెచ్చించి విద్యార్థులను దనయింటఁబెట్టుకొని విద్యాదాన మొసంగుటయు, వారలను విద్యాలయములకుఁ బంపి యచ్చటవారిని దనద్రవ్య సాహాయ్యముచేఁ జదివించుటయు, విద్యాదాన మనఁబడును. బాలసులకును, బాలికలకును విద్యాదానముసేయుట ప్రధాన కర్తవ్యము.

అన్నదానము రెండువిధములు. తనయింటికి వచ్చినవారి కన్నమిడుట మొదటిది. సత్రమునందందఱకు నన్నమిడుట రెండవది.

దుర్గమ స్థలములందును, గష్టగమ్య స్థలములందును, బాటల నేర్పఱచుట పంథాదాన మనఁబడును. చిరకాలముపయోగించునట్లు రాలతోఁగాని, ఇటుకలతోఁగాని పంథానిర్మాణమొనర్చు టధికపుణ్యప్రదము.

నదులచెంతఁగాని, తటాకములచెంతఁగాని యందఱుపకరించురీతిని ఘట్ట నిర్మాణమొనర్చుట ఘట్టదానమనఁబడును. ఘట్టమున కుపరిభాగమున విశ్రామస్థానము, ఉద్యానము, ఆచ్ఛాదనము, దేవాలయము మున్నగునవి యేర్పఱచుటవలన నధికపుణ్యము లభించును.

డబ్బులేకుండుటచే గృహము నిర్మించుకొనఁ జాలనివారికి గృహదాన మొసంగుట పుణ్యజనక కార్యము. అవసరమెఱిఁగి యేదేని ద్రవ్యమునుగాని, అర్థమునుగాని యోగ్యపాత్రముల కిడుట ద్రవ్యదాన మనఁబడును.

శ్రేష్ఠములగు తినుబడివస్తువులయం దగ్రభాగ మితరులకిచ్చి మిగిలినది తాను భుజించుట యుక్తము.

సవర్ణుఁడును, యోగ్యుఁడు నగువానికి సాలంకృత కన్యాదానము సేయుట కన్యాదానమనఁబడును.

IV. జనప్రత్యాతిథ్యము, సమాజప్రత్యాతిథ్యము నని యాతిథ్యము రెండు విధములు.

అతిథి తనయింటికి వచ్చినపుడు గృహస్థుఁడు వానిని యథాయోగ్యముగ సేవింపవలెనుగాని యుపేక్ష సేయరాదు.

ద్వివిధమగు నాతిథ్యము.

శాస్త్రములందుఁ జెప్పిన రీతిని గృహస్థుఁడు తనయింట నన్నాదికము సంసిద్ధమయ్యెనేని నింటి వెలుపలకుఁబోయి సింహద్వారమునొద్ద నిలువఁబడి భోజనము సేయని యతిథి తనకు లభించుటకుఁగాను వానికొఱకు ముమ్మాఱు పిలువవలెను. ఎవ్వఁడైన లభించినచో వానికి ముందుగ భోజన మిడి వెనుకఁ దానును దన పరివారమును భుజింపవలెను. మధ్యాహ్నము సుమా రొకటిన్నర గంటలకు నతిథిని బిలువవలెనను విధికలదు. కాని ప్రస్తుతకాలమం దంతవఱకు భోజనము సేయకుండుట కష్టము గనుక తాను భుజించుట కుద్యుక్తుఁడగుచుండు సమయమునకుఁ గొంచెము ముందుగ నభుక్తుఁడగు నతిథికొఱకుఁ బిలుచుట కర్తవ్యము. అభుక్తుఁడగు నతిథి యనినఁ దిరిపెమెత్తుటే వృత్తిచేసికొనియున్న భిక్షుకులని యర్థముకాదు.

సమాజక్రియా యోగమునందు సామాజికాతిథ్యము కర్తవ్యము.

V. పావిత్ర్యము

చతుర్విధ పావిత్ర్యము.

(1) శౌచమనియు,
(2) పంథాఘట్ట గో గృహావిజణి స్వగృహ దేవ మందిరాది మార్జనమనియు,
(3) వసపరిష్కారమనియు,
(4) తీర్థయాత్రయనియు, నాలుగు విధములు.

వీనిలో శౌచము, అంతశ్శౌచమనియు, బహిశ్శౌచమనియు, రెండు విధములు.

చిత్తశుద్ధి కంత శ్శౌచమని పేరు. పాపరహితములగు క్రియలచేతను, బుణ్యకర్మలచేతను, జిత్తశుద్ధికలుగును. పాపరహితమైనవియు, సులభములగు జీర్ణమగునవియు, బరిమితములగునవియు నగు నాహారమును, బానీయమును, జిత్తశుద్ధికి సహకారులు. నిషాచేయువాఁడును, ఇతర పాపకృత్యము లొనర్చువాఁడును, దాఁకిన ద్రవ్యములు భుజించుటచేతను, ద్రాఁగుటచేతను జిత్తమున కపరిశుద్ధత యేర్పడును. చిత్తశుద్ధికొఱకుఁ జెప్పఁబడిన యుపాయములందు విష్ణుస్మరణము ప్రధానోపాయము. పాపచిత్తమును శోధించుటకే ప్రాయశ్చిత్తమేర్పడినది. చాంద్రాయణాదికమగు కర్మప్రాయశ్చిత్తమూలమునఁ బాపకర్మ తొలఁగిపోవునుగాని తత్కార్మమూలమగు పాపవాసన తొలఁగిపోదు. అనుతాపరూపమగు జ్ఞానప్రాయశ్చిత్తముచేతఁ బాపవాసన దూరీకృతమగుచున్నది. కాని యీశ్వర వైముఖ్యమను పాపబీజము కేవల హరిస్మరణముచేతనే దూరీభూతమగుచున్నది.* ప్రాయశ్చిత్త తత్త్వవిచా

---

* గురూణాంచ లఘూనాంచ గురూణిచ లఘూనిచ
ప్రాయశ్చిత్తాని పాపానాం జ్ఞాత్వోక్తాని మనీషిభిః.
తైస్తాన్యఘాని పూయంతే తపోదాన వ్రతాదిభిః
నాధర్మబీజం తద్ధృదయం తదపీశాంఘ్రిసేవయా.
భా. 6.2.16 & 17.

రము బహుళమైనది; దానిని గ్రంథాంతరములందుఁ జూడనగును. తీర్థ జలములందు స్నానముచేయుట, గంగాస్నానాది పుణ్యస్నానములు, దేవతా దర్శనము మొదలగువానిచేఁ జిత్తశుద్ధి కలుగుచున్నది.

తన శరీరము, వస్త్రములు, గృహము మున్నగువానిని శుభ్రపఱచుటయు, మలరహితముగ నొనర్చుటయు, బహిశ్శౌచమనఁబడును. స్వచ్ఛము లగు జలములందు స్నానముసేయుటయు, శుభ్రవస్త్రములను ధరింపుటయు, సాత్త్వికద్రవ్యములను భుజింపుటయు, త్రాఁగుటయు శౌచలక్షణములు. మలమూత్రములును, అపవిత్ర ద్రవ్యములును శరీరమున కంటినయెడల జల ప్రక్షాళనముచేఁ దదంగమును శుభ్రపఱచు టుచితము.

బాటలను, ఘట్టములను, గోశాలలను, అంగళులను, స్వగృహమును, దేవతా మందిరములను, జక్కఁగ నూడ్చుటచేఁ బవిత్రత ఘటించుచున్నది. తమయిండ్లను, ఘట్టములను, నడదారులను, గోమందిరములను, ప్రాంగణము లను ఎల్లపుడు శుభ్రముగనుంచుట సర్వ మానవ కర్తవ్యమైయున్నది. ఇవియే కాక యితర రాజమార్గములును, ఘట్టములును, బజారులును, దేవమందిరము మున్నగునవియును గ్రామ మధ్యమందున్నచో వానినిఁ గూడ శుభ్రపఱచుట యందఱికి విధియై యున్నది. గ్రామము పెద్దదైనచో గ్రామస్థులందఱును జేరి తమలోఁ దాముగాని, దొరతనమువారి సాయముచేఁగాని యర్థసంగ్రహమొనర్చి యీ సమస్తకార్యములును సాధించిరేని గ్రామస్థు లొక మహా పుణ్యకర్మ మాచరించిన వారగుచున్నారు.

తమతమ యిండ్లయందుఁ గల తోఁటలును, ఉద్యానములును, దాము స్వయముగ శుభ్రస్థితిలో నుంచుట కర్తవ్యము. ఇతరస్థలములయందున్న వస ములను పైనిఁజెప్పిన విధముగ నాచరించి శుభ్రపఱచు టుచితము.

తీర్థయాత్ర లొనర్చుటచే మానవగణ మనేకవిధములుగఁ బవిత్రమగు చున్నది. సాధు సంగలాభమే తీర్థయాత్రలకుఁ జరమోద్దేశమైనను తీర్థము లకుఁ బోవువారందఱును దాము పవిత్రులమైతిమని తమ చిత్తములలోఁ

దలంచుచుండుటచేఁ దన్మూలముసఁ బూర్వపాపవృత్తులనేకములు నశించి
పోవును.

VI. మహోత్సవములు మూఁడువిధములు.

—త్రివిధ మహోత్సవములు.—

(1) దేవతాపూజలకొఱకగు నుత్సవములు.

(2) సాంసారికములై బృహద్ఘటనము లనఁదగు యజ్ఞాదులు.

(3) సాధారణములై యానందవర్ధనముకొఱకగు నుత్సవములు.

దేవతాపూజలకొఱకగు సమస్తోత్సవములును సదా మనమెఱిఁగియు
న్నవే. అవి యన్నియుఁ బుణ్యాజనకములని చెప్పుటలో సందేహమేమున్నది?
అనేక జనులొకచోటఁ గూడుట, ఆహారాదు లారగించుట, గీతవాద్యముల
చర్చయు, జిత్రపుత్తళికాదుల యున్నతస్థితియు, బీదల కన్నదానమును, బండి
తుల కర్థదానమును, ఇవియన్నియు సమాజము నుజ్జీవింపఁజేయు జగన్మంగళ
సాధక పుణ్యకర్మలని చెప్పుట కేమియును సందేహములేదు. ఈ మహోత్స
వములన్నియుఁ జేయుటను సమర్థత కలిగియుండియును ఎవరు వీనినిఁ జేయ
కుందురో, వారలు తమ కర్తవ్యకర్మలయం దశ్రద్ధానులగుచు నపరాధు
లగుచున్నారు. విశేషమేమనిన, నీ సమస్త మహోత్సవములయందు నెప్పు
డీశ్వరభావము సమ్మిళితమయ్యెనో, అపుడీ యుత్సవము లేవిధముచేతను
గూడఁ బరిత్యాజ్యములు కావు.

సంసారమునకు సంబంధించిన నానావిధ ఘటనలు గలవు. పుత్త్రి
పుత్త్రికల జన్మము, అన్నప్రాశనము, ఉపనయనము, వివాహము, తల్లి
దండ్రులకుఁ జేయు శ్రాద్ధము, మున్నగు నానావిధ సాంసారిక యజ్ఞములు
మహోత్సవములే యగుచున్నవి. యథాసాధ్యముగ నాయాకార్యము లాచ
రింపుటయే యందఱికిఁ గర్తవ్యము. గ్రామస్థులందఱు నొకచోటఁ జేరి
సలుపు బహిరంగపూజనములును, దేవతోత్సవములును సాధారణము లగు
నానంద వర్ధక కర్మలుగ నెఱుంగవలెను. ఇట్టి యుత్సవములన్నిఁటికిని జను

లందఱు కొంచెము కొంచెము సాయము చేసిరేని క్రమక్రమముగఁ బెద్ద పెద్ద కార్యములకుఁ గూడ సాయము సేయుటకు వార లలవాటు పడుదురు.

జామాత్రార్చనోత్సవము. అరంధనోత్సవము, భగినీ కర్తృక భ్రాతృ పూజనము, నవాన్నోత్సవము, పిష్టకోత్సవము, శీతలోత్సవము మున్నగు సామాజికోత్సవము లనేకములు గలవు.

VII. (1) శారీరక వ్రతములనియు, (2) సామాజికవ్రతములనియు, (3) పారమార్థిక వ్రతములనియు, వ్రతములు మూఁడువిధములు.

ప్రాతఃస్నానము, పరిశ్రమము, సాష్టాంగ దండప్రణామము మున్నగు పని వ్యాయామసంబంధములగు శారీరకవ్రతములు.

త్రివిధ వ్రతములు. ఒకానొక ధాతువు ప్రకోపించినపుడు శరీరమున కస్వస్థత గలుగును. తన్నివారణార్థ మమావాస్యా వ్రతము, పూర్ణిమావ్రతము, సోమవాసరవ్రతము మున్నగు ప్రత్యేక వ్యవస్థలు గలవు. ఆయా నిర్దిష్టదినములం దాహార వ్యవహార పరివర్తనములును, ఉప వాసములును, ఇంద్రియ సంయమ పూర్వకమగు నీశ్వర చింతనమును సలుపుట శ్రేయోదాయకము. ఆవశ్యక స్థలములం దాయా వ్యవస్థల నవలంబించుట పుణ్యకార్యమగును.

ఉపనయనము, చౌలము, వివాహము మొదలగు వ్రత సమూహమును, సామాజిక విచారమును బట్టి యధికార క్రమమున నొకానొక వర్ణమున కొకానొక వ్రతవ్యవస్థయు, సాధారణ జనులకొఱ కేవేవియో వ్రత వ్యవస్థలును, నియమింపఁబడినవి. వివాహము, సర్వవర్ణ సామాన్యమగు నొక వ్యవస్థ. ఒక పురుషుఁడు తనకు సవర్ణయగు నొక స్త్రీని వివాహమాడును. ఏకపత్నీవ్రతమే పురుషునికిఁ గర్తవ్యము. ఒక భార్య యుండఁగా నేఱొక స్త్రీని వివాహమాడుట కేవల కామసంతర్పణము కొఱకే. అట్టి పునర్వివాహము నీచప్రకృతిగల వ్యక్తి కుచితమగు కార్యము. సంతానములేనప్పుడొక భార్య యుండఁగా నేఱొకస్త్రీని వివాహమాడు వ్యవస్థ యెచ్చటెచ్చటనో కలదు.

మహాభారతమునం దుల్లేఖింపఁబడిన మాస వ్రతములును, మఱియు, దదనురూపములగు పరమార్థసాధకవ్రతము లేవేవి కలవో అవియును, జేఱి పారమార్థిక వ్రతము లనఁబడుచున్నవి. ఇరువదినాలు గేకాదసులును, జన్మాష్టమీ ప్రభృతులగు నాలు జయంతులును, మాసవ్రతములు. కేవల పరమార్థ సాధనమే యీవ్రతములన్నిఁటియొక్క మూలోద్దేశము. భక్తి విచారస్థలమున నివియన్నియు విచారింపఁబడును. "శ్రీహరి భక్తి విలాసము"నం దీ వ్రతములన్నియును వివరింపఁబడినవి.

VIII. పశుపాలన మొక గొప్ప పుణ్యకార్యము.

(1) పశూన్నతి సాధనమనియు,

(2) పశుపోషణము రక్షణమనియు, నయ్యది రెండువిధములు.

ద్వివిధ పశుపాలనము.

మనక నేకవిధముల నుపచరించెడు పశువుల యున్నతి సాధనమునకై ప్రయత్నించుట మనకందఱకుఁ గర్తవ్యము. పశువులసాయము మనకు లేనియెడల సంసారకార్యము లుత్తమ రూపమునఁ గొనసాగ నేరవు. కావునఁ బశువుల యాకారమును, బలమును, ప్రకృతియు, నున్నతస్థితికిఁ దెచ్చుటకై ప్రయత్నముసేయు టుచితము. వానికేదే నొక విశేషావస్థ గల్పించుటయు, వానిలో నుపయుక్తములగు స్త్రీపురుష జాతులకు సంయోగ మేర్పడుటయు, పశూన్నతికిఁ గారణము లగుచున్నవి. పశువులన్నిఁటిలో గోవుల కున్నతి సాధనము గల్పించుట నితాంత కర్తవ్యము. వానిసాయముచేతనే కృషికార్యములును, సామానుల యెగుమతి దిగుమతులును, జక్కగ సాగుచున్నవి. బలిష్ఠములును, సుందరాకృతులును, నగు వృషభములచే గోవులయందు సంతానోత్పత్తి కల్పించు టుచితము. ఈ యభిప్రాయము గలిగియే శ్రాద్ధకాలములయందు బాలవృషభముల కచ్చువేసి స్వేచ్ఛావర్తనమునకై వదలుచున్నారు. అట్లు విడువఁబడిన యెద్దులు యథేచ్ఛగా విహరింపుటచే వానియొడల్లు పెఱిగి బలిష్ఠములై బలముగల

గోజాతి సంతానమును గనుటకు మిక్కిలి సమర్థములగుచున్నవి. పశువులు సంసారమున కుపకారకములగుచున్న విధము నాలోచించి వాని కాహార మిడి, శాలా నిర్మాణమొనర్చి వానినిఁ బోషించుటయు, రక్షింపుటయు మన కుచితము. గో పోషణము, గో రక్షణము నను కార్యము భారతవర్షమున నొక విశేష పుణ్య జనక కార్యముగఁ బరిగణింపఁబడుచున్నది.

IX. జగద్వృద్ధికార్య మీక్రింద వివరించినరీతిగ నాలుగువిధములు.

—చతుర్విధ జగద్వృద్ధి కార్యములు.—

(1) విధ్యుక్తముగఁ బెండ్లాడి సంతానము గనుట

(2) కలిగిన సంతానము నుచితరీతిని బాలించుట, రక్షించుటయు,

(3) సంతానమునకు సంసార నిర్వహణయోగ్యతను గల్పించుట,

(4) సంతానమునకుఁ బరమార్థ శిక్షాదాన మొనర్చుట.

ఉచితవయస్సున నుపయుక్తయగు స్త్రీనిఁ బెండ్లాడి శరీరస్వాస్థ్యము గాని, చిత్తస్వాస్థ్యముగాని, చెడకుండునటులు విధ్యుక్తముగను, బరస్పర* సౌభాగ్యదాయకముగను, సంసారమును నిర్వహించుట మానవునికి విధియై యున్నది. అట్లొనర్చినపు డీశ్వరేచ్ఛయున్నచో సంతానోత్పత్తికలుగవచ్చును. కలిగిన సంతానమునుఁ బ్రయత్నపూర్వకముగఁ బాలించుటయు, రక్షింపుటయు వానికి విధాయకమైయున్నది. క్రమముగ వారలకు విద్యగఱపి కార్యదక్షులుగఁ జేయవలసియుండును, యుక్తవయస్సు వచ్చెనేని వివాహము చేసి వారలను గృహస్థులుగఁ జేయుటకుఁ బ్రయత్నింపవలయును. వారల కాయావయస్సులయందు లౌకిక విధులను, ధర్మమును, నీతియు, బర

* గృహార్థీ సదృశీం భార్యా ముద్వహే దజుగుప్సితాం
యవీయసీం తు వయసా సమవర్ణా మనుక్రమాత్.

భా. 11.17.38.

మార్గతత్త్వమును, బోధింపనగును. ఇట్టికార్యము లొనరించుచునే తాను వైరాగ్యము నలవర్చుకొనవలెను.*

X. న్యాయాచరణము బహువిధములు గలది. అందుఁ గొన్నిఁటిని మాత్రమే క్రిందఁ బొందుపఱచుచున్నాను.

—న్యాయశ్రేణీ విభాగము.—

| | |
|---|---|
| (1) క్షమ | (8) వైరాగ్యము. |
| (2) కృతజ్ఞత | (9) సచ్ఛాస్త్ర సమ్మానము. |
| (3) సత్యకథనము. | (10) తీర్థ భ్రమణము. |
| (4) ఆర్జవము. | (11) సద్విచారము. |
| (5) ఆస్తేయము. | (12) శిష్టాచారము. |
| (6) అపరిగ్రహము. | (13) ఇజ్య. |
| (7) దయ. | (14) అధికారనిష్ఠ. |

(1) నేరముచేసిన వానిని దండించి తీఱవలయునని వాసనను విడుచుటయే క్షమ యనఁబడును. అపరాధిని దండించుటలో నెట్టి యన్యాయమును లేదు కాని యట్టివానిని క్షమించుట యంతకంటె గొప్ప

క్షమ.

* యదృచ్ఛయోపపన్నేన శుక్లేనోపార్జితేనవా
ధనేనాపీడయన్ భృత్యాన్న్యాయేనైవాహరేత్క్రతూన్
కుటుంబేషు నసజ్జేత న ప్రమాద్యే త్కుటుంబ్యపి
విపశ్చిన్నశ్వరం పశ్యేదదృష్టమపి దృష్టవత్
పుత్రదారాప్తబంధూనాం సంగమః పాంథ సంగమః
సగృహైరనుబధ్యేత నిర్మమో నిరహం కృతిః
కర్మభిర్గృహమేధీయై రిష్ట్వామామేవ భక్తిమాన్
తిష్ఠేద్వనంవా ప్రవిశేత్ప్రజావాన్వాపరివ్రజేత్.

భా. 11.17.50 to 54.

న్యాయము. ప్రహ్లాదుఁడు, హరిదాసఠాకురు మున్నగువారు తమ శత్రువులను దాము క్షమించి జగత్తున కాదర్శరూపులైరి.

(2) ఎవరైనను మన కుపకారముచేసినేని దానిని స్వీకరించుటయు, స్మరించుటయుఁ గృతజ్ఞత యనఁబడును. ఆర్య సంతతివారి కృతజ్ఞతాగుణము తమ తల్లిదండ్రులను సేవింపుటయందు ద్యోతితమగుచున్నది. జననీ

కృతజ్ఞత.

జనకులు జీవించి యున్నంతవఱకుఁ దమశక్తివంచనములేక వారిని సేవించుటయే కాక, వారుచనిపోయినప్పు డశౌచగ్రహణ రూపమగు కష్ట స్వీకారమును, శయనభోజనము లందలి సుఖత్యాగమును, గావింపుచు దానభోజనాదులతో వారలకు శ్రాద్ధకార్యములు నిర్వహింపుచుందురు. మఱల నేఁటేటను, ఆయానియమిత సమయములందును, వారలకు శ్రాద్ధతర్పణములు సలిపి తమకృతజ్ఞతను వెల్లడింతురు. అందఱియెడలను గృతజ్ఞతఁ జూపుట పుణ్యకర్మయగుచున్నది.

(3) సత్యమువచింపుటచే నెల్లరకు విశ్వాసపాత్రుఁడగువాని ప్రవృత్తి బలమునకు సత్యకథనమని పేరు. సత్యవ్రతము గల పురుషులు పుణ్యవంతులును, జగత్తునకంతయుఁ బూజనీయులు నగుచున్నారు.

సత్యకథనము.

—ఆర్జవము.—

(4) సరళభావమునకే యార్జవమనిపేరు. మానవజీవనము సరళమగుచున్నకొలంది బుణ్యవంత మగుచుండును.

(5) ఇతరులద్రవ్యము నన్యాయముగ గ్రహింపకుండుటే యస్తేయము. పరిశ్రమము వలనఁగాని, న్యాయ్యానుసారముగాఁగాని, దానరూపకముగఁగాని ద్రవ్యార్జనము సేయఁబడని యెడల నాద్రవ్యమందుఁ

అస్తేయము.

బరిగృహీత కెట్టియధికారమునులేదు. గ్రుడ్డి, కుంటిమున్నగు నసమర్థులే భిక్షాగ్రహణమునకుఁ దగినవారు.

అపరిగ్రహము.

(6) పరిశ్రమము సేయుటకు సమర్థత గలిగియుండినపుడు తన్మూలమున ద్రవ్యసంపాదనము సేయుటయే యుక్తము. అట్టిసమర్థతగలవారు బిచ్చమెత్తినచో నద్దానినిఁ బరిగ్రహమందురు. అట్లుసేయకుండిన నదియే యపరిగ్రహము.

దయ.

(7) సర్వజీవులయందును దయగలిగియుంటు టుచితము. యుక్తమను నభిప్రాయముతోఁ జూపుదయకు వైధదయ యని పేరు. రాగతత్త్వమందుఁ జేసిన దయావృత్తి వేఱొకచోట విచారింపఁబడును. కేవలము మానవజాతి యెడలనే దయకలిగియుండి పశుజాతియెడల దయారహితముగ వ్యవహరింపవచ్చునను సిద్ధాంతము న్యాయ్యమైనది కాదు. ఎవరికైనను గష్టమువాటిల్లినపు డదియెట్లు నివారణకాఁగలదో, ఆవిధముగఁ బ్రవర్తించుట మానవుని కుచితము.

వైరాగ్య శమదమోపరతులు.

(8) శమము, దమము, తితిక్ష, ఉపరతి యలవడుటచే విషయరాగము దూరమగుటకుఁ బేరు వైరాగ్యము. అంతరింద్రియ నిగ్రహము శమము. బహిరింద్రియ నిగ్రహము దమము. దుష్టవాసనలను, గష్టములను సహింపుట కభ్యాసపడుటయే తితిక్ష. సామాన్యవిషయములయెడల నాలంబనత్యాగమే యుపరతి. వైరాగ్యము పుణ్యకార్యములలో నొకటిగఁ బరిగణింపఁ బడుచున్నది. వైరాగ్యము వాస్తవముగఁ గుదిరినవానికిఁ బాపచింతయుండదు. విధ్యుక్తముగ వైరాగ్యధర్మ క్రమాభ్యాసము సేయనగును. రాగమార్గమున వైరాగ్య మప్రయత్నముగను, సహజసిద్ధముగను, గలుగును. ఈవిషయము వేఱొకచోట వివరింపఁబడును. వైరాగ్యము నభ్యసింపుట పుణ్యకర్మము. చాతుర్మాస్యము, దర్శ, పౌర్ణమాసి మున్నగు శారీరిక వ్రతములను జేయఁగా జేయఁగా వైరాగ్య మలవడఁగలదు. మొదట శయన భోజనాదులకు సంబంధించిన సుఖాభిలాష

క్రమముగ విడిచి, తదుపరి సర్వవిషయములందలి సుఖాభిలాషను విడిచి, కేవల జీవధారణమునకు మాత్ర మెంతవఱకు విషయగ్రహణ మవసరమో, అంతవఱకుమాత్రమే వానిని గ్రహించు నభ్యాసము మనుజుని నెపుడు సమగ్రముగ బలపడునో, అప్పుడతనికి వైరాగ్యావస్థ వచ్చెనని చెప్పవలెను. వైరాగ్యాభ్యాసమెపుడు పూర్ణమగు నపుడు సన్న్యాసరూపమగు చతుర్థాశ్రమమునకు మానవుని కధికారము గలుగుచున్నది.

**సచ్ఛాస్త్ర సన్మానము.**

(9) సచ్ఛాస్త్రములను సన్మానించుట సర్వజనులకును కర్తవ్యము. సాధ్వసాధు విచారము లిపిబద్ధమైనచో దానినే శాస్త్రమందురు. సుయోగ్యతా ప్రసిద్ధి గలిగి శాస్త్రప్రణయన మొనరించిన మహనీయులే సత్ శాస్త్రకర్తలు. సుయోగ్యతా ప్రసిద్ధి లేక విధి నిషేధ వ్యవస్థానిర్ణయమును, బరమార్థవిచారమును జేయుటయందుఁ బ్రవృత్తులగుచు శాస్త్రకల్పనము సేయువార లసద్విచారరతులగుటచే నసచ్ఛాస్త్రకర్తలగుచున్నారు. ఏశాస్త్రమయుక్తమును, నాస్తికమును నగు మతము నంగీకరించునో, అది యసత్తర్కజనితశాస్త్రమని చెప్పనొప్పును. అట్టి శాస్త్రమును సన్మానించు టెవ్వరికి నుచితము కాదు. ఒకగ్రుడ్డివాఁడు వేఱొక గ్రుడ్డివానికి దారిజూపినపు డిరువురునుబోయి యొకబావిలోఁ గూలినట్టు లా యసచ్ఛాస్త్ర ప్రణేతలును, దచ్ఛాస్త్రానుగాములగు సజ్ఞాంధ జనులును, గుమార్గగతులగుచు శోచనీయులగుచున్నారు. సచ్ఛాస్త్రములన వేదమును, వేదానుగతములగు శాస్త్రములు నవియే తెలియనగును. అట్టి శాస్త్రములను స్వయం విచారము సేయుటయు, నితరులకు వానిని బోధించుటయును, బుణ్యకర్మములు.

**తీర్థభ్రమణము.**

(10) తీర్థాటనము సలిపినవారి కనేకవిషయములు తెలియుటయును, అనేక కుసంస్కారములు దూరమగుటయును, సంభవించుచున్నది.

సద్విచారము.

(11) సద్విచార, మనఁగా, వివేకమనునది సర్వమానవులును సర్వదా కలిగియుండవలసిన సర్వోత్తమగుణము. "లోక మనఁనేమి? నేనెవరు? ఎవరీలోకమును సృజించిరి? నాకర్తవ్యమేమి? నాకర్తవ్యమును నేనాచరించిన యెడల నాకేమిలభించును?'' అను నిట్టిపరిశీలనబుద్ధి లేనివారలను పశులలోఁ బరిగణింపరాదు. పశువునకును, మనుజునకును భేదమేమియనినఁ బశువు సద్విచార శూన్యమైనది. మానవుఁ డావిచారము సేయఁగల సమర్థుఁడు. ఆత్మబోధయే సద్విచారమునకు ఫలము.

శిష్టాచారము.

(12) శిష్టాచారము పుణ్యజనకము. పూర్వపుసాధువు లేయే యాచారములను బాలించిరో, ఎట్టివి పాలింపుమని యితరుల కుపదేశించిరో, అవియన్నియుఁ గలసి శిష్టాచార మనఁబడును.* కాలక్రమమున శిష్టాచారము పరివర్తన మొందుచున్నది. ఎట్లనిన, సత్య త్రేతా ద్వాపర యుగముల యందు గోవధము మున్నగు కార్యములు శిష్టులొనరించెడి యజ్ఞాదుల యందుఁ బ్రవర్తితములయ్యెను. ఆ యాచార మీకలికాలమున నుత్సన్నమైనది. పూర్వకృతములగు సకలవిధులును సద్విచారముచేఁ బరీక్షింపఁబడి శిష్టాచారరూపమున సంగ్రహింపఁబడుట కర్తవ్యము.

పాత్రభేదమును బట్టి మర్యాద.

పాత్రవిచారక్రమమున జనులను సన్మానించుట ప్రథమశిష్టాచారము. దీని నే మర్యాదయందురు. మర్యాదాభంగముచే మహాదతిక్రమ దోషముకలుగును. మర్యాదాక్రమ మీక్రిందవ్రాసిన విధమునఁ దెలియవలెను. ఎట్లనిన, సాధారణ నరులకందఱకును సామాన్య

---

* తానాతిష్ఠతి యస్సమ్యగుపాయాన్పూర్వదర్శితాన్
అవరశ్శ్రద్ధయోపేత ఉపేయాన్విందతేఽంజసా
తాననాదృత్యయోఽవిద్వా నర్థానారభతేస్వయం
తస్య వ్యభిచరంత్యర్థాః ప్రారబ్ధాశ్చ పునః పునః.

భా. 4.18.4 & 5.

మర్యాదయే సేయవలెను. ఏదేనొక పదవినలంకరించిన నరులకంతకంటె నధికమర్యాద సేయవలెను. ఈవరుసను మర్యాదను వృద్ధిసేయుచు భక్తజనులయెడల నందఱికంటె నధికమర్యాద చూపవలెను. బ్రాహ్మణ మర్యాదయు, వైష్ణవ మర్యాదయు నీక్రింది విధిక్రమమున సర్వత్ర లక్షింపఁబడుచున్నవి.

(i) సాధారణజన మర్యాద.
(ii) సభ్యజన మర్యాద (దీని కంతర్గతమగు రాజ మర్యాద).
(iii) పద మర్యాద.
(iv) విద్యా మర్యాద.
(v) సద్గుణ మర్యాద (దీనికంతర్గతమగు బ్రాహ్మణ మర్యాద, మఱల దీని కంతర్గతమగు సన్యాసి మర్యాదయు, రెండియు దీని కంతర్భూతమగు వైష్ణవ మర్యాదయును).
(vi) వర్ణమర్యాద.
(vii) ఆశ్రమ మర్యాద.
(viii) భక్తి మర్యాద.

పదమర్యాద యనుటవలన రాజసన్మానమును, విద్యామర్యాదయనుటవలనఁ బండిత సన్మానమును, వర్ణమర్యాదయనుటవలన బ్రాహ్మణ సన్మానమును, ఆశ్రమ మర్యాద యనుటవలన సన్యాసి సన్మానమును, ఇట్లే భక్తిమర్యాద యనుటవలన యథార్థ భక్తజన సన్మానము నని తెలియనగును.

ఇజ్య.

(13) ఈశ్వరపూజనమునకే ఇజ్యయని పేరు. ఇది సకలజనులకును బుణ్యాజనకమగు కర్మము. సమస్త విధులయందును నిజ్యయే ప్రధాన విధియని యెఱుంగనగును.

అధికారనిష, కర్మ-అకర్మ-వికర్మ.

(14) అధికార భేదమును బట్టి యిజ్యావిధానమందు భేదములు కలుగుచున్నవి. సత్కర్మము పుణ్యాజనకము. అసత్కర్మము పాపజనకము. కర్మము, అకర్మము, వికర్మమునను త్రివిధకర్మభేదము శాస్త్రములందుల్లేఖింపఁబడినది. పుణ్యకర్మమునకే కర్మయని

పేరు. ఏకర్మ చేయకపోవుటచే దోషము కలుగుచున్నదో, అది సేయకుండు టయే అకర్మ. పాపకర్మమునకే వికర్మ యని పేరు.

నిత్యము, నైమిత్తికము, కామ్యము నని కర్మములు మూఁడువిధములు. కామ్యకర్మ మన్నివిధములచేతను విడువఁదగినది. నిత్య నైమిత్తిక కర్మలు గ్రాహ్యములును, పాలనీయములును. ఈశ్వరోపాసనము నిత్యకర్మము. పితృతర్పణాదులు నైమిత్తికములు. *

---

* ఇష్టం దత్తం హుతం జప్తం మదర్థం యద్వ్రతం తపః.

భా. 11.19.23.



## ద్వితీయవృష్టి—తృతీయధార.

### క ర్మా ధి కా ర ము, వ ర్ణ వి చా ర ము.

శ్లో. నయస్య జన్మ కర్మాభ్యామ్
న వర్ణాశ్రమ జాతిభిః
సజ్జతే స్మిన్న హంభావో
దేహీవైస హరేః ప్రియః.

అధికారవిచారము, అనఁగా, యోగ్యతావిచారము.

అధికారనిర్ణయ మొకప్రధాన న్యాయ్యాచరణకార్యము. యోగ్యతకే అధికారమని పేరు. యోగ్యత రెండు విధములు. ఏకర్మకెవరు యోగ్యులగుదురనునది మొదటిది. ఒక కర్మచేయుటయం దెంతవఱకుఁ దనకు యోగ్యత గల దనునది రెండవది. సకలజనులును సకలకర్మము లొనర్చుటకు యోగ్యులై యుండరు. ఒకానొకఁ డొక పుణ్యకర్మసేయ సమర్థుఁడై యుండిన నుండవచ్చును గాని యది సమగ్రముగ నెఱవేర్చుటకు యోగ్యత యతనికి లేకపోవచ్చును. కావుననే యోగ్యతావిషయము గమనింపకుండ నెవఁడైనఁగర్మచేసినచో నాకర్మ ఫలవంతమయ్యెననిగాని, కాలేదనిగాని చెప్పుటకు వలనుపడదు. అందువలన మున్ముందుగ నధికార నిర్ణయము సేయుట మిగులఁ గర్తవ్యము. కర్మసేయువాఁడు తనకందులకుఁ గల యోగ్యతను నిర్ణయింపఁజాలఁడు. కనుక సమర్థుఁడగు నొకగురువు చెంతకుఁ బోయి తన యధికారవిషయము ముందుగ వానివలనఁ దెలిసికొనవలెను. ఉపదిష్టమగు కర్మ మొనర్చుటకు వలయు సమయప్రక్రియా నిర్ణయము సేయుపని పురోహితునిదై యున్నది. కావుననే జనులం గురువునుగాని, పురోహితునిగాని సహజముగ వరింతురు. నేటికాలపుఁ

గురువులును, నేఁటికాలపుఁ బురోహితులును శాస్త్రకారుల యభిప్రాయమునను సరియైనవారు కారు. నామమాత్ర గురువులను, నామమాత్ర పురోహితులను వరించుట పుత్తళికావరణమువలె నిరర్థకమగును. గ్రామమందు విశేష యోగ్యతగలవానినే వరించు టుచితము. తనగ్రామమం దట్టివాఁడు చిక్కఁడేని నితరగ్రామములం దట్టివానికొఱ కన్వేషించుట కర్తవ్యము.

కర్మాచరణమునకు వలయు యోగ్యత విషయమై యేదే నొక యుదాహరణమిడుట కర్తవ్యము. లేనియెడల నది సత్వరముగ బోధపడునది కాదు. చెఱువు త్రవ్వించు టొకానొక పుణ్యకర్మము. ఆ పని తాను స్వయముగఁ జేయఁదలఁచినచో దానికి వలయు బలము, సాధనములు, భూమి, సాహాయ్యము లభించినపుడా కర్మ సేయుటకు యోగ్యత కలుగుచున్నది. ధనము వెచ్చించి యాపని సేయఁదలఁచినచో, వలయు ధనము కలిగియుండవలెను. తన కెంతవఱకు బలము, సాధనములు, భూమి, సాహాయ్యము, ధనమును గలవో, అంతవఱకే యతని కాకార్యనిర్వహణమం దధికారము కలిగియుండును. అనధికారి కెట్టి ఫలప్రాప్తియుఁ గలుగదు. అట్టివాఁ డేదైనఁ గర్మ చేయఁ బూనినచోఁ దప్పక ప్రత్యవాయము గలుగును. వివాహకార్యము సేయఁ బూనినపుడు శరీర యోగ్యతయు, సంసారము చేయుటకొఱకు వలయు సామర్థ్యమును, దాంపత్య వ్యవహారమున కుపయుక్తమగు మానస సంస్కారము మున్నగు యోగ్యతల నరయు టావశ్యకము. ఈవిధముగఁ దానేకార్యము సేయ సంకల్పించినను దానిం జేయుటకుఁ దనకధికారమున్నదా లేదా యను విషయము మున్ముందుగ నిర్ణయింపఁబడు టుచితము.

అధికారము— స్వభావగతమును, అవస్థాగతమును.

స్వభావగతాధికారమనియు, నవస్థాగతాధికారమనియు, నధికారము రెండువిధములు. మానవ జీవితమును గూడ శిక్షాకాలము, కార్యకాలము, విశ్రామకాలము నని మూఁడువిధములుగ విభజింపనగును. మానవగణ మెంతకాలము విద్యోపార్జనము సేయుచుండునో, అంతవఱకు శిక్షాకాలమనఁబడును. ఈ

కాలమున గ్రంథావలోకనము, సత్సంగము, పరకృత కర్మాది దర్శనము, ఉపదేశగ్రహణము మున్నగునవి సేయుటచే నేప్రవృత్తి యపుడు ప్రబలమగు చున్నదో అదియే ఆమానవుని స్వభావముగాఁ జెప్పఁబడుచున్నది. ఏవంశ మందుజన్మించినవాని కావంశానుగతమగు నాలోచనము, ఉపదేశము, సంగము ఘటించుటచే వంశీయస్వభావోపదేశ సంగమములు భిన్నప్రకారము లుగ వానియందుఁ బ్రకాశితము లగుచుండును. ఒకప్పుడు తద్వ్యతిరేకమగు స్వభావముగూడ నాయాస్థలములయందు లక్షితమగుచున్నది. ఫలితార్థమేమ నిన, శిక్షాకాలము సమాప్తమై కార్యకాలము ప్రారంభము కాక పూర్వము ఏవ్యక్తియందేస్వభావము గనఁబడుచున్నదో, అదియే యతని స్వభావము. వైజ్ఞానిక మతమున విషయవిభాగము సేయఁగల పురుషగణము స్వభావ మును, (1) బ్రహ్మస్వభావము (2) క్షత్రస్వభావము (3) వైశ్యస్వభావము (4) శూద్ర * స్వభావము నని నాలుగువిధముల విభజించిరి.

స్వభావనిర్ణయము.

---

* శమోదమ స్తపశ్శౌచం సంతోషః క్షాంతిరార్జవం
మద్భక్తిశ్చ దయాసత్యం బ్రహ్మప్రకృతయ స్త్విమాః
తేజోబలం ధృతిశ్శౌర్యం తితిక్షౌదార్యముద్యమః
స్థైర్యం బ్రహ్మణ్యమైశ్వర్యం క్షత్ర ప్రకృతయ స్త్విమాః
ఆస్తిక్యం దాననిష్ఠాచ హ్యదంభో బ్రహ్మసేవనమ్
అతుష్టిరర్థోప చయైర్వైశ్య ప్రకృతయ స్త్విమాః
శుశ్రూషణం ద్విజగవాం దేవానాం చాప్యమాయయా
తత్రలబ్ధేన సంతోష శ్శూద్ర ప్రకృతయ స్త్విమాః
అహింసాసత్యమస్తేయ మకామక్రోధలోభతా
భూతప్రియహితేహాచ ధర్మోఽయం సార్వవర్ణికః.

భా. 11.17.15 to 20.

బ్రహ్మస్వభావము.

ఏ స్వభావమువలన నంతరింద్రియనిగ్రహము, బహిరింద్రియనిగ్రహము, సహిష్ణుతాగుణము, శుద్ధాచారము, సరళతయు, జ్ఞానవిచారము, ఈశ్వరారాధనము మున్నగు విషయములందు నరునకుఁ బ్రవృత్తి కలుగుచున్నదో, అదియే బ్రహ్మస్వభావము.

క్షత్రస్వభావము.

ఏ స్వభావమువలన వీరత్వము, తేజస్సు, ధారణాశక్తి, దక్షత, యుద్ధమందు నిర్భయత్వము, దానము, జగద్రక్షణము, జగచ్ఛాసనము, ఈశ్వరపూజనము మున్నగు సకలగుణములును వెలువడినవో, ఆ స్వభావమును క్షత్రస్వభావమని చెప్పనగును.

వైశ్య స్వభావము.

ఏ స్వభావమువలనఁ గృషికార్యము, పశుపాలనము, వాణిజ్యము చేయుటయందుఁ బ్రవృత్తి గలుగుచున్నదో, అది వైశ్యస్వభావము.

శూద్ర స్వభావము.

ఏ స్వభావమువలనఁ గేవల పరసేవనముచే జీవింపవలయునను ప్రవృత్తి కలుగుచున్నదో అది శూద్రస్వభావముగఁ జెప్పుదురు.

అంత్యజ స్వభావము.

కర్తవ్యాకర్తవ్య జ్ఞానము లేకుండుట, న్యాయ్యాచరణశూన్యత, నిరంతర కలహప్రియత్వము, నితాంత స్వార్థపరత్వము, ఉదర సర్వస్వము, విధ్యుక్త వివాహ నిరసనము మున్నగునవి యంత్యజ స్వభావలక్షణములు. ఇట్టి స్వభావము నరుని నాశ్రయించి యున్నంతకాల మతఁడు నరులలోఁ బరిగణింపఁబడుటకెట్టి యవకాశమును లేదు. కావున నరస్వభావము నాలుగువిధములని మాత్రమే చెప్పఁబడినది.

స్వభావానుసారముగు వర్ణనిర్ణయమే

స్వభావానుసారముగఁ బ్రవృత్తియు, గుణములును, దదనుగతమగు కర్మయును సంభవించుట సహజము. స్వభావవిరుద్ధమగు కర్మ చేయఁబడినచో నది సమగ్రము, ఫలవంతమును, గానేరదు. స్వభావాంశ

విజ్ఞాన సమ్మతమును, ఆర్యర్షి సమ్మతమును.

మనకే యింగ్లీషులో జీనియస్ (Genius) అందురు. ఎంతకాలమునుండియో పాతుకొనియున్న నర స్వభావమును మార్పఁదలఁచుట సులభము కాదు. కావున స్వభావానుగతమగు కర్మలు చేయుచునే జీవయాత్ర గడపుటయు, బరమార్థచింతనము సేయుటయు, గర్తవ్యములు. ఈ భారతదేశమందలి మానవులయందుఁ బైనిఁ జెప్పిన నాలుగువిధములగు స్వభావములను బట్టి నాలుగువర్ణము లేర్పడెను. వర్ణవిభాగముచేతనే సమాజమునకు స్థాయి యేర్పడుటయు, సామాజిక కృత్యములన్నియు సహజముగ ఫలవంతములగుటయు, సంభవించుచున్నది. ఇందువలన జగత్తునకుఁ గూడ సర్వమంగళ మొనఁగూడుచున్నది. ఏ సమాజము వర్ణవిభాగము నంగీకరించెనో, దాని పునాది విజ్ఞాననిర్మితమనియు, నా సమాజము సర్వ మానవజాతికినిఁ బూజనీయమైనదనియు, నెఱుంగనగును. కొందఱి కీవిషయమై కలుగువింత సందేహములను గ్రింద వ్రాయుచున్నాను. "యూరపుఖండమునం దిట్టి వర్ణవిభాగ వ్యవస్థ లేకున్నను, అచ్చటి జనులు మహత్తరములగు కార్యములొనర్చుటయందుఁ గుశలులగుటయు, నితర ఖండవాసులకు మాననీయులగుటయు సంభవించినపుడు వర్ణవిభాగము స్వీకరింపుటవలన నేమి ప్రయోజనము గలదు?" కాని యిట్టిసందేహము నిరర్థకము. యూరపునందలి జాతులన్నియును మిగుల నవీనములును, ఆధునికములును. నవీనజాతులయందలి సకల మానవులును మిక్కిలి బలవంతులును, సాహసికులునైయుందురు. తమ బలసాహసముల కారణముచేఁ బూర్వజాతులవలనఁ దాము సంగ్రహించిన విద్యను, విజ్ఞానమును, కౌశలమును బట్టి జగత్తునందు వారట్టి మహాత్కార్యముల నొనర్పఁ గలుగుచున్నారు. జాతి క్రమముగఁ బ్రవీణమయ్యును నందు వర్ణ విధాన స్వభావముగల వ్యవస్థలేనిచో నతిశీఘ్రముగఁ బతనమొందును. భారతీయార్యజాతియం దిట్టి వర్ణవిధానముండుటచేతనే యిప్పటి వృద్ధావస్థయందుఁ గూడ జాతిలక్షణములు దానియందుఁ బ్రకాశించుచున్నవి. రోము, గ్రీసు జాతు లొకానొక కాలమందు యూరపుజాతులన్నిటికంటె బలవంత

ములుగను, వీర్యవంతములుగను, ఉండెను. కాని యాజాతుల ప్రస్తుతావస్థ యెట్లున్నది? తమయందు జాతిలక్షణములు లేకుండుటచే నితరములగు సాధు నికజాతుల ధర్మములను, లక్షణములను, అవలంబించి భిన్నరూపమునఁ బరి ణామము నొందెను. ఇక్లేల సయ్యెనన, వారలకు స్వదేశ వీర పురుషాభిమా నము కొంచెమైనను లేదు. మనదేశమందలి యార్యజాతి రోము, గ్రీసు జాతులకంటెఁ గూడఁ బ్రాచీనమయ్యును దానికి భారతీయ పూర్వ వీరపురు షాభిమానము గలదు. దీనికేమి కారణము? వర్ణాశ్రమవిధాన మద్దానియందు సంపూర్ణముగఁ బ్రకాశించుచుండుటచే, దానియందుఁ గల జాతిలక్షణము లేవియుఁ బోలేదు. మ్లేచ్ఛహతుఁడగు రాజపుత్రుఁ డిప్పటికిని శ్రీరామచం ద్రుని వంశమువాఁడ నగు వీరుఁడననియే చెప్పుకొనుచుండును. జాతియొక్క వృద్ధావస్థను బట్టి భారతవాసు లెంతటి పతితులైనను దమయందు వర్ణవిధాన మెంతవఱకుఁ బ్రవర్తింపుచుండునో అంతవఱకు వారలార్యులనియే పిలువఁ బడుదురుగాని యనార్య శబ్దము వారలయెడల నెన్నఁటికిని వర్తింపదు. యూరపునందలి రోము ప్రభృతులగు నార్యవంశజాతులు హూణ (Hun), వ్యాండల్ (Vandal) ప్రభృతులగు నంత్యజ జాతులలోఁ గలసిపోయిరి. యూరపు జాతుల వర్తమాన పరిస్థితుల నాలోచించిన పు దభ్యుదయ చిహ్నము లేసమాజమునందుఁ దోఁచుచున్నవో, ఆ సమాజము స్వభావ జనితమగు వర్ణ ధర్మము నవలంబించినదనియే చెప్పనలెను. యూరపు నందు వైశ్యస్వభావము గలిగియుండు మనుజుఁడు వాణిజ్యముచేసి యందు మూలమునఁ దనయున్నతి సాధన మొనర్చును. క్షత్రస్వభావముగలిగి యుండు మనుజుఁడు సైనికకర్మ మొనర్చును. శూద్రస్వభావము గలిగియుండువారు సాధారణముగ సేవాకార్యమునం దనురక్తులగుదురు. వాస్తవముగఁ గొంత వఱకైనను వర్ణధర్మము సమాజమునఁ బాలింపఁబడనియెడల నయ్యది చిర స్థాయి కానేరదు. వివాహాది ప్రక్రియలచేతను వర్ణసమ్మతములగు నుచ్చనీచా వస్థలచేతను జాతిస్వభావము రక్షింపఁబడుచున్నది. కొంతవఱకైనను వర్ణ విధాన మవలంబించియే యూరపు జాతులయందు సమాజసంస్థాపనము సేయఁ

బడినను ఆవర్ణధర్మము వైజ్ఞానికవిధమున నాజాతులయందు సంపూర్ణపరిణతి నొందలేదు. యూరపునందు సభ్యత్వమును, జ్ఞానమును, ఉన్నతస్థితికి వచ్చుచున్నకొలఁది వర్ణధర్మముకూడ దానిననుసరించియే సమగ్రత నొందుచుండును.

వైజ్ఞానికప్రణాళి, అవైజ్ఞానిక ప్రణాళియను రెండువిధములగు ప్రణాళికలచే లోకమునందలి సకలవ్యాపారములును సాగుచుండును. వైజ్ఞానిక ప్రణాళి యవలంబింపఁబడనంతవఱకు నాయా వ్యాపారము లవైజ్ఞానిక ప్రణాళిచేతనే నిర్వర్తింపఁబడుచుండును. వైజ్ఞానిక ప్రణాళిక్రమమునఁ బోగయోడలు మున్నగునవి నిర్మాణము కాకముందు జలప్రయాణ మవైజ్ఞానిక నౌకాదులచేతనే నిర్వహింపఁబడినది. సమాజనిర్వహణము గూడ నిటులే. వర్ణవిధానము సర్వాంగ సుందరముగ నేదేశమందెంతవఱకుఁ బ్రచలితము కాలేదో, అంతవఱకాదేశమం దవైజ్ఞానికమగు ప్రాథమిక స్థితియే గోచరమగుచుండును. భారతభూమియందుఁ దప్ప నితరములగు సకలదేశములందును ఇట్టి యవైజ్ఞానిక స్థితియే సమాజములయందుఁ బ్రచలితమగుచున్నది. ఇందువలననే భారతదేశము గర్మక్షేత్రమని చెప్పఁబడుచున్నది.

**వర్తమాన వర్ణాశ్రమ విధి దూషితము.**

ఇప్పుడు మనము తెలిసికొనఁదగిన విషయమేమన, వర్ణవిధానము భారతఖండమందిపుడు స్వాస్థ్య లక్షణములతో నొప్పుచున్నదా? యనునది. లేదనియే యీప్రశ్నకుత్తరము. భారతదేశమందు వర్ణవిధానము సమగ్రరూపమున సంస్థాపింపఁబడినను గొంతకాలమునకు దాని కనారోగ్యస్థితి సంభవించుటచే ననేక కష్టములును, బరివర్తనములును గలిగినవి. అట్లు కానియెడల జాతియొక్క వృద్ధావస్థయందు భారతీయుఁడు యుద్ధకార్యములనుండి విరమించి యుపకార వేతనము నొందిన జ్యేష్ఠభ్రాతవలె నితరజాతుల కుపదేశకునిగ నుండు సుఖస్థితినే స్వీకరించి యుండును. ఆ యనారోగ్యస్థితి యెద్దియో తెలిసికొనుట మనకుఁ గర్తవ్యము.

త్రేతాయుగ ప్రారంభమున నార్య జాతియందు విజ్ఞాన విచారము సంపూర్ణముగఁ బ్రకాశించుచుండుటచే నాసమయమున వర్ణాశ్రమ వ్యవస్థ స్థాపింపఁబడెను. * ప్రతి వ్యక్తియు నపుడు తన స్వభావానుసారముగ వర్ణనిర్ణయముఁ బొందెడి విధి యాకాలముననుండెను.

వృత్త్యను సార మగు బ్రాహ్మణత్వ నిరూపణము.

ఆయా వర్ణానుసారముగ నధికారమును బొందిన వారాయా వర్ణనిర్దిష్టములగు కర్మలను జేయుచుండిరి. శ్రమ విభాగవిధియు, స్వభావ నిరూపణ విధియుఁ దమకుఁ దోడ్పడుచుండ జగత్తునందలి సమస్త కర్మలును జక్కగ నిర్వర్తింపఁబడుచుండెడివి. తండ్రియొక్క వర్ణాశ్రమ ధర్మములే బిడ్డలకుఁగూడ స్వభావసిద్ధముగ నన్వయించుచుండెడివి. జాబాలి, గౌతముఁడు, జనశ్రుతి, చిత్రరథుఁడు మున్నగువారల వైదికేతిహాసములే యిందుల కుదాహరణములు. తండ్రివర్ణము నిర్దిష్టమగుచుండెడి పట్లఁ దత్సంబంధమగు స్వభావమును, వంశమును గూడ యోజించి వర్ణనిరూపణ చేయఁబడుచుండెడివారు. క్షత్రియుఁడగు నరిష్యంతుని వంశమం దగ్నివేశ్యుఁ డనువాఁడు స్వయంజాతు కర్ణనామ మహర్షి యయ్యెను. వాని వంశీయులందఱు నగ్నివేశ్యాయను లనఁబడువారలై ప్రసిద్ధ బ్రహ్మకుల సంభవులగుచున్నారు.

---

* ఆదౌకృతయుగే వర్ణో నృణాం హంస ఇతి స్మృతః
కృతకృత్యాః ప్రజాజాత్యా తస్మాత్కృత యుగంవిదుః
వేదః ప్రణవ ఏవాగ్రే ధర్మోఽహం వృషరూపధృత్
ఉపాసతే తపోనిష్ఠా హంసం మాం ముక్తకిల్బిషాః
త్రేతాముఖే మహాభాగ ప్రాణాన్మే హృదయాత్త్రయీ
విద్యాప్రాదురభూత్తస్యా అహమాసం త్రివృన్మఖః
విప్రక్షత్రియవిట్ఛూద్రా ముఖబాహూరుపాదజాః
వైరాజాత్పురుషాజ్జాతా య ఆత్మాచార లక్షణాః

భా. 11-17-9 to 12.

ఐలవంశమందు క్షత్రియుఁడగు హోత్రకుని పుత్రుఁడగు జహ్నువు బ్రాహ్మణుఁడయ్యెను. భరతవంశమునందు జన్మించిన భరద్వాజుఁడే వితథరాజు. వానివంశమందలి నరుఁడు మున్నగు వారలకు క్షత్రియ సంతానము కలిగెను. గార్గుఁడు మున్నగువారలకు బ్రాహ్మణ సంతానము గలిగెను. క్షత్రియుఁడగు భర్జస్వ్వి వంశమందు మౌద్గల్య గోత్రీయులగు శతానందుఁడు కృపాచార్యుఁడు మున్నగువారు జన్మించిరి. ఇట్టి యుదాహరణములు శాస్త్రములం దసంఖ్యములుగ నున్నవి. వానిలోఁ గొన్నియే యిందుఁ బొందుపఱచినాను. ఈవిధమగు ప్రకృత సంస్కార మేకాలమునఁ బూర్తిగ సాగుచుండెనో ఆకాలమున భారతీయుల యశస్సు మధ్యాహ్న సూర్యునివలె మిగుల ప్రభావవంతమై యుండెను. సర్వ జాతులును భారతీయులను జగత్ప్రభువులుగను, దండదాతలుగను, గురువులుగను, భావించి పూజించుచుండెడివారు. ఈజిప్టు, చైనా మున్నగుదేశములవార లాకాలమున భారతీయులయెడల భయభక్తులుగలిగి, వారలవలన సదుపదేశముల నందుచుండెడివారు.

**వర్ణ వ్యభిచారము.** వర్ణాశ్రమరూపమగు ధర్మము దేశమునఁ జాలకాలము విశుద్ధ రూపమునఁ బ్రవర్తించిన పిమ్మటఁ గాలక్రమమున క్షత్రస్వభావముగల జమదగ్నియు, నతని పుత్రుఁడగు పరశురాముఁడు నవైధరూపమున బ్రాహ్మణులమధ్యఁ బరిగణింపఁబడుటచే వారలు స్వార్థపరులై, స్వభావవిరుద్ధ ధర్మానుసారులై, బ్రాహ్మణులకును, క్షత్రియులకును, శాంతిభంగము కలిగించిరి. తన్మూలమున నాయుభయవర్ణములయం దేకలహ బీజము నాటఁబడెనో, దాని ఫలస్వరూపముగ నిప్పటి జన్మగతవర్ణ వ్యవస్థయేర్పడెను. కాలానుసరణముగ మన్వాదిశాస్త్రములందుఁ గూడ నీ యస్వాభావికవిధి గుప్తభావమునఁ బ్రవేశింపఁగాఁ దమ కుచ్ఛిన్నముప్రాప్తించునను నాశలేని క్షత్రియులు బౌద్ధధర్మముల సృష్టించి తన్మూలమున బ్రాహ్మణులను సర్వనాశనము సేయుటకుఁ దలపెట్టిరి. వారలెపుడట్లుచేసిరో దాని ప్రతిక్రియయుఁ

గూడ సంతబలవత్తరముగనే యోజింపఁబడెను. దీనికిఁ బర్యవసానముగ జన్మగతవర్ణవిధానము మఱింత దృఢమయ్యెను. ఒకవంక నీ కువ్యవస్థయు, నేఱొకవంక స్వదేశనిష్ఠయుఁ దమ్ముఁబట్టి పలార్చుచుండ భారతవాసు లగు నార్యసంతతి యిపు డుత్పన్నప్రాయమయ్యెను.

స్వభావ హీనతయే వర్ణ విశృంఖలతకు మూలము.

బ్రహ్మస్వభావములేని బ్రాహ్మణనామధారకులు స్వార్థపరత్వముతో ధర్మ శాస్త్రరచనకుఁదలపడి యితర వర్ణములను వంచించుటకు మొదలిడిరి. క్షత్రస్వభావములేని క్షత్రియులందఱును యుద్ధమం దసమర్థులగుటచే రాజ్యభ్రష్టులై తుదకు బౌద్ధధర్మ ప్రచారము సలిపిరి. వణిక్స్వభావములేని వైశ్యగణము జైనాది ధర్మప్రచారముసేయుచు భారతదేశమందలి విపులవాణిజ్యమును నాశనమొనర్చిరి. శూద్రస్వభావములేని శూద్రులందఱును తమ స్వభావమునకు విహితమగు కార్యములం దధికారులు కాకుండుటచే దస్యుప్రాయులైరి. ఇందువలన వేదాదిశాస్త్రచర్చలు దేశమునఁ గ్రమముగ రూపుమాసెను. మ్లేచ్ఛరాజులందఱును భరతఖండము నాక్రమించి యందధికారులైరి. ఓడవర్తకముపూర్తిగ రూపుమాసెను. సేవాధర్మముకూడఁ జక్కఁగా సాగలేదు. ఇట్లగుటచేఁ గలిపురుషుని యధికారము ప్రబలమయ్యెను.* అయ్యయో! సర్వజాతులకును శాసనకర్తయు, గురువునునగు భారతీయార్యజాతికి నేఁటి కెంతగతిపట్టెను! ఈదుర్దశ కేవలజాతివార్ధక్యదశచేతఁ గల్గినదిగాక యవైధ

* గృహస్థస్యక్రియాత్యాగో వ్రతత్యాగోవటోరపి
తపస్వినోగ్రామసేవా భిక్షోరింద్రియ లోలతా
ఆశ్రమాపశదాహ్యేతే ఖల్వాశ్రమ విడంబనాః
దేవమాయావిమూఢాం స్తానుపేక్షే తానుకంపయా
ఆత్మానంచే ద్విజానీయాత్పరం జ్ఞానధుతాశయః
కిమిచ్ఛన్ కస్యవాహేతోర్దేహం పుష్ణాతి లంపటః.

భా. 7-15-38 to 40.

వర్ణవిధానక్రమముచే సంభవించెనని యెలుఁగెత్తి చెప్పవచ్చును. ఏపరమేశ్వరుఁడు సర్వజీవులకును, సర్వవిధులకును నియంతయో, ఎవఁడు సర్వామంగళములను దొలఁగించి మంగళముల నొడఁగూర్పఁగల సమర్థుఁడో, అట్టిపరమేశ్వరుఁడు సంకల్పించినచో నొక శక్త్యావిష్ట పురుషుఁ డవతరించి యథార్థవర్ణధర్మమును మఱల సంస్థాపింపకుండునా? పురాణకర్తలుగూడ నావలెనే యిట్టియాశపెట్టుకొని కల్కిదేవుని యాగమనముకొఱకుఁ బ్రతీక్షించుచున్నారు. మఱు, దేవాపిరాజుల యుపాఖ్యానమునందుఁగూడ నిట్టిప్రతీక్షణము దృష్టమగుచున్నది. ఇఁకమనము ప్రకృతవిధి ననుసరింతుముగాక.

వర్ణమునుబట్టి కర్మాధికారము.

ఏవర్ణము వారికేకర్మలుచేయుటయం దధికారముగలదో, ఆవిషయము ధర్మశాస్త్రములందు రచింపఁబడియే యున్నది. ఈనాచిన్నిపొత్తమున దానినివివరముగ రచింపుట దుస్సాధము. అతిథులకొఱ కన్నదానము సేయుట, పవిత్రతకొఱకుఁ ద్రిషవణస్నాన మాచరించుట, దేవపూజనము, దేవీపూజనము, వేదపఠనము, గురుస్థానస్వీకరణము, పౌరోహిత్యము ఉపనయనాది వ్రతములు, బ్రహ్మచర్యము, సన్యాసము మున్నగు వానియందుఁ గేవలబ్రాహ్మణులకే యధికారము.

ధర్మయుద్ధము, రాజ్యశాసనము, ప్రజారక్షణము, పెద్ద పెద్ద దానములు సేయుట—వీనియందు క్షత్రియుల కధికారము.

పశుపాలనము, పశురక్షణము, కృషికార్యము, వాణిజ్యకార్యములందు వైశ్యుల కధికారము.

మంత్రరహితముగ దేవపూజనము, తక్కిన మూఁడు వర్ణములను సేవించుట యనువానియందు శూద్రుల కధికారము.

వివాహాదివ్రతములు, ఈశ్వరునియెడల భక్తి, పరోపకారము, సాధారణదానము లొనర్చుట, గురుసేవనము, ఆతిథ్యము, పావిత్ర్యము, మహోత్సవము, గోసేవనము, జగద్వృద్ధి కరణము, న్యాయ్యాచరణము మున్నగు సకలకార్యము లొనర్చుటయందు సర్వ వర్ణములయందలి స్త్రీలకును, పురు

షులకును, అధికారము గలదు. స్త్రీజనమునకు పతి సేవా కార్యమందే విశేషాధికారము గలదు. ఏ స్వభావముగలవారికే కర్మ యుపయోగించునో, ఆ స్వభావముగలవారికా కర్మ యొనర్చుటయం దధికారము గలిగియుండును. ఇదియే మూల సిద్ధాంతము. ఎవనికే కర్మలు చేయుటయం దధికారముఁగలదో, ఆ విషయ మెవరికి వారే తమ సరళబుద్ధి నుపయోగించి తెలిసికొనఁ గలిగియుండవలెను. అట్లు తెలిసికొనఁజాలనియెడల సమర్థుఁడగు గురువుచెంతకుఁ బోయి వాని నడిగి తెలిసికొనవలెను. నిర్గుణులగు భక్తగణమీ సకలవిషయములఁ గూర్చియు నింకను వివరముగఁ దెలిసికొన నిచ్ఛగించెనేని శ్రీమద్గోపాలభట్ట నిర్మితమగు "షట్క్రియాసార దీపిక" ను బఠింపనగును.



## ద్వితీయవృష్టి—చతుర్థధార.

## ఆ శ్ర మ వి చా ర ము.

శ్లో. నాహం విప్రోనచ నరపతిర్నాపి వైశ్యో నశూద్రో
నాహం వర్ణీ నచగృహపతి ర్నోవనస్థో యతిర్వా
కింతుప్రోద్యన్నిఖిలపరమానంద పూర్ణామృతాబ్ధే
ర్గోపీభర్తుః పదకమలయోర్దాస దాసానుదాసః.

వర్ణము, ఆశ్రమము.

మానవునిస్వభావము కర్మావిర్భావమునకును, మానవుని యాశ్రమము కర్మావస్థితికిని గారణములు. ఏ మానవుఁడే యాశ్రమమందుండునో, ఆ యాశ్రమమునే యాధారము చేసికొని యతని కర్మ యవస్థితి నొందుచున్నది. కావుననే వర్ణమును, ఆశ్రమమును, బరస్పరాధారభూతములుగ నుండును. ఈ కారణము బట్టియే కర్మను వర్ణాశ్రమ ధర్మముగఁ జెప్పుదురు.

బ్రాహ్మణ స్వభావమునకే బ్రహ్మచర్యాధికారము.

బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసముసని యాశ్రమములు నాలుగువిధములు. * బ్రాహ్మణ స్వభావముగలవారికే బ్రహ్మచర్యమం దధికారము. అట్టివాఁడు సంయత చిత్తుఁడై, శుద్ధాచారము గలిగి, యత్యంత వినీతభావములో, నానావిధము లగు శరీరకష్టముల నోర్చి, గురుకులమందు వసిం

---

* విప్రస్యాధ్యాపనాదీని షడన్యాసా ప్రతిగ్రహః
రాజ్ఞోవృత్తిః ప్రజాగోప్తు రవిప్రాద్వాకరాదిభిః 7.11.14.

చుచు నధ్యయనము సమాప్తియగుసంతవఱకు బ్రహ్మచర్యము నవలంబింప వలెను. అధ్యయనము పూర్తికాఁగానే గురువునకు దక్షిణ యొసఁగి వాని యనుమతి నొంది గృహస్థాశ్రమముసఁ బ్రవేశింపనగును.

మురారిగుప్తునిఁ బ్రశంసించు స్థలమున చైతన్య చరితామృతమం దిట్లు లిఖింపఁబడినది.

"ప్రతిగ్రహము సేయక కైకొనక ♦ వ్వారలదైనను ధనము
సతత మాత్మవృత్తి మూలమున నగు ♦ సలుపఁ గుటుంబ భరణము"

గృహస్థాశ్రమముసందు సర్వ వర్ణములవారి కధికారము గలదు. బ్రాహ్మణులు బ్రహ్మచర్యము సలిపినవెనుక గృహస్థాశ్రమము స్వీకరింతురు. క్షత్రియులు తమకుపకరించు సకల శాస్త్రములును యథోచితముగఁ బఠనము సేసి గురుకులమును విడిచి వచ్చి గృహస్థాశ్రమమును స్వీకరింతురు. వైశ్యులు పశుపాలనమునకును, వాణిజ్యమునకును, కృషికార్యమునకును ఉపయోగించు వేదవిద్యను మాత్ర మభ్యసించి వెనుక గృహస్థులయ్యెదరు. శూద్రగణము యుక్తవయస్సురాఁగానే గృహస్థ ధర్మ మంగీకరింతురు. ఏ మనుజుని కే వర్ణధర్మ మందధికారము గలదో తద్విషయ మతని కధ్యయనకాలను సమీపించుటకు మునుపే తండ్రిగాని, కుల పురోహితుఁడుగాని, ఆర్యమండలిగాని, భూ

చాతుర్వర్ణ్యమునకు గార్హస్థ్య ధర్మాధికారము.

---

వైశ్యస్తువార్తా వృత్తిస్స్యా న్నిత్యం బ్రహ్మకులానుగః
శూద్రస్యద్విజశుశ్రూషా వృత్తిశ్చ స్వామినోభవేత్ 7-11-15.
వృత్తిస్సంకరజాతీనాం తత్తత్కుల కృతాభవేత్
అచోరాణామపాపానా మంత్యజా స్తేవసాయినః 7-11-30.
వృత్త్యాస్వభావకృతయా వర్తమానస్స్వకర్మకృత్
హిత్వాస్వభావజంకర్మ శనైర్నిర్గుణతామియాత్.

భా. 7-11-32.

స్వామిగాని నిగ్రహింపవలసియుండును. ఏబాలునియం దేస్వభావము గనఁబడుచున్నదో, ఆ స్వభావానుగుణముగనే వానిచే నధ్యయనకార్యము చేయింపవలెను. అధ్యయనకార్యమం దొక్కింతయు నాసక్తి లేక, సేవాకార్యమం దభిలాషయు, దక్షతయుఁ గలవాని నధ్యయన కార్యాదులందు నియోగించుట నిష్ఫలమని యెఱింగి శూద్ర కర్మాభ్యాసము చేయించినచో నతనికి సేవాకార్యమునందుఁ బాటవము గలుగును. గృహస్థుఁడు కాఁగానే యర్థోపార్జనము చేయు టతని కావశ్యకము. వేఱు వేఱు వర్ణముల వారర్థోపార్జనమునకై వేఱు వేఱుపాయము లవలంబింతురు. యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహమునను నీయాఱును బ్రాహ్మణకర్మములు. వీనిలో యాజనము, అధ్యాపనము, ప్రతిగ్రహము ననువానిచే నర్థోపార్జనము చేయనగును. యజనము, అధ్యయనము, దానము ననువానిచే సాంసారిక స్థితియందుండి వ్యయము సలుపవలెను. క్షత్రియవర్ణము కరశుల్కాది గ్రహణము, అస్త్ర వ్యవసాయము మూలమున విత్తోపార్జనము చేసి సంసారపాలనమును, జీవికా నిర్వాహమును సలుపవలెను. పశుపాలనము, వాణిజ్యము, కృషికార్యము మూలమున వైశ్యగణమును, త్రివర్ణ సేవనముచే శూద్ర గణమును దమ తమ జీవికా నిర్వాహమొనర్పనగును. బ్రాహ్మణగణ మాపత్కాలమందు క్షత్రియులయు, వైశ్యులయు, ధర్మ మవలంబింపవచ్చును. కాని యెంతయో కఠినమగు నాపదవచ్చినప్పుడు తప్పఁ బైనిఁ జెప్పిన మూఁడు వర్ణములవారును శూద్ర ధర్మమవలంబింపరాదు. గృహస్థుఁడగు నతఁడు విధి పూర్వకముగఁ బెండ్లాడి బిడ్డలను గన నగును. పిండ ప్రదానముచేఁ బితృదేవతల కృతజ్ఞతా స్వీకారమును, యజ్ఞాచరణముచే దేవతాపూజనమును, అన్నాదికముచే నతిథిసేవనమును, సత్య వ్యవహారమూలమున సర్వభూతార్చనమును చేయనగును. పరివ్రాజకులును, బ్రహ్మచారులును గేవల గృహస్థ సాహాయ్యముచేతనే జీవించువారు గావున గృహస్థాశ్రమము సమస్తాశ్రమములకంటె శ్రేష్ఠమైనది. వాన

వానప్రస్థకృత్యములు.

ప్రస్థము మూఁడవ యాశ్రమము. వయఃపరిపాకము కలిగినంతనే తనభార్యను బుత్త్రునికప్పగించియో, తనను సంతానములేనియెడల నామెను దనవెంటఁ గొనిపోయియో గృహస్థుఁడు వనమందుఁ బ్రస్థానపూర్వకముగ వానప్రస్థాచరణము సలుపవలెను. అట్టిస్థితియందుఁ దనకుఁగల యక్కఱలన్నియు సర్వవిధములచేత నుపసంహరింపఁబడవలెను. నేలపైఁ బరుండుటయు, వల్కలముల ధరించుటయు, క్షౌరకర్మమును విడుచుటయు, మునివృత్తి నవలంబించుటయు, త్రిసంధ్యా స్నానమును, యథాసాధ్యముగ నభ్యాగతసేవనము, ఫలమూలభక్షణము. ఏకాంతస్థలమునఁ బరమేశ్వరారాధనము మున్నగునవి వానప్రస్థకర్మములు. సర్వవర్ణముల వారికిని వానప్రస్థాశ్రమమునం దధికారముగలదు.

సన్న్యాసకృత్యము.

సన్న్యాసమనునది చతుర్థాశ్రమము.* సన్న్యాసినే భిక్షుకుఁడనియు, బరివ్రాజకుఁడనియుఁ, బిలుతురు. పైనఁజెప్పిన యాశ్రమత్రయమందున్న వారలలో నెవరైనను నితాంత వైరాగ్యపరులును, సంసారమునందు మమతాశూన్యులును, సర్వకష్టములు సహించువారును, తత్త్వజ్ఞులును, జనసంగమందు స్పృహలేనివారును, బ్రహ్మపరులును, నిర్ద్వంద్వులును, సర్వజీవులయందును సమబుద్ధిగలవారును, దయాళువులును, నిర్మత్సరులును, యోగయుక్తులునైనచో వారలు సన్న్యాసాశ్రమస్వీకారమున కధికారులగుచున్నారు. సన్న్యాసిగణము సదా యీశ్వరచింతనమునే చేయుచుండును. పల్లెయందు నొకరాత్రికి మించి నివసింపరు. పట్టణమునం దైదురాత్రుల కధికముగ నివసింపరు. చాతుర్మాస్యము నొక

* యశ్చిత్తవిజయే యత్తః స్యాన్నిస్సంగోఽపరిగ్రహః
ఏకోవివిక్తశరణో భిక్షుర్భైక్షమితాశనః.

భా. 7-15-30.

యుచిత ప్రదేశమునందు విధివిహితముగఁ గడపుచుందురు. ప్రారంభావస్థయందు బ్రాహ్మణగృహములయందే భిక్ష స్వీకరింతురు. బ్రాహ్మణవర్ణము తప్ప నితరవర్ణము లెవ్వియు నీయాశ్రమమును స్వీకరింపుట కర్హములు కారు.

శారీరక సామర్థ్యముగాని, మానసిక సామర్థ్యముగాని లేని వారెట్టి యాశ్రమము నవలంబించుటకును బనికిరారు.

**దుర్బలులకు నాశ్రమాభావము.**

అట్టివారలాయా యాశ్రమవాసుల యనుగ్రహముచేతనే జీవింపవలసియుండును. వారలకు యథాసాధ్యముగ సాయముచేయుట యన్నియాశ్రమముల వారలకును విధియైయున్నది. స్త్రీలు గృహస్థాశ్రమమును, సందర్భానుసారముగ వానప్రస్థాశ్రమమును దప్ప నితరాశ్రమములను స్వీకరింపుటకు వారలకు హక్కులేదు. ఎవతయో ఒక యసాధారణశక్తిసంపన్నయగు నాఁడుది విద్యా, ధర్మ, సామర్థ్యములను సంపాదించి బ్రహ్మచర్య సన్యాసాశ్రమములను స్వీకరింపుటచేఁ దత్ఫలప్రాప్తి నందుటకు యత్నించిన యత్నింపవచ్చును, లేదా, పొందవచ్చును. కాని సాధారణముగఁ గోమలశ్రద్ధయు, గోమలశరీరమును, గోమలబుద్ధియుఁ గల స్త్రీలవిషయమై నిదియొక విధియని చెప్పుటకు మాత్రము వలనుపడదు.

**స్త్రీలకు గార్హస్థ్యమే యుపయుక్తాశ్రమము.**

బాగుగ నాలోచించినచో గృహస్థాశ్రమ మొక్కటియే యాశ్రమమని చెప్పవలెను. దీని నాధారము చేసికొనియే తక్కిన మూఁడాశ్రమములును సాగుచున్నవి. మానవజాతి స్వభావసిద్ధముగ గృహస్థధర్మ లక్షణములతో నొప్పుచుండును. విశేషాధికార లాభముగల యెవరెవరో స్వల్పసంఖ్యాకులు బ్రహ్మచర్యవానప్రస్థసన్యాసాశ్రమములను స్వీకరింతురు. అట్టివారలను మనము వేళ్ల

**గృహస్థాశ్రమమే సాధారణోపయోగాశ్రమము.**

పై లెక్కింపవచ్చును. అట్లయ్యును, నాయా యాశ్రమములందు కొన్నివిశేషాధికారములు లక్షితమగుచుండుటచే నీ నాలుగాశ్రమముల పృథక్స్థితి నిరూపింపనిచో సమాజజ్ఞానమునకు సంబంధించిన తాత్త్వికావస్థ సిద్ధింపనేరదు.

**ధర్మశాస్త్ర సమూహము.**

ఇరువది ధర్మశాస్త్రములందును, పురాణాదులందును, సమస్తస్మృతి శాస్త్రములందును గృహస్థాశ్రమ విధులన్నియు విపులముగ రచింపఁబడియున్నవి. సదాచార మను పేరితో మనువులును, ఋషులును, ప్రజాపతులును దమచేరచింపఁబడిన శాస్త్రములలో నాయా సమయములందు గృహస్థుఁ డేకార్యములు చేయవలయునో, ఏకార్యములు చేయఁగూడదో, తద్విషయము మాహ్నిక, పాక్షిక, మాసిక, షాణ్మాసిక, హార్షికవిధుల రూపమున లిపిబద్ధమొనర్చిరి. ఈవిధు లసంఖ్యములై దేశకాలభేదములచే వివిధరూపములతో నొప్పుచుండును. అందువలన వాని సంక్షిప్తతత్త్వమేతప్ప మఱియు వ్రాయుట కిచట వీలుచిక్కలేదు.



# ద్వితీయవృష్టి—పంచమధార.

## ఆహ్నికము.

శ్లో॥ సంధ్యావందన భద్రమస్తు భవతే, భోస్స్నానతుభ్యంనమో
భోదేవాపితరశ్చ తర్పణవిధౌనాహం క్షమఃక్షమ్యతాం
యత్రక్వాపి నిషీద్యచేతసి యదూత్తంసస్య కంసద్విషః
స్మారంస్మార మఘంహరామి తదలంమన్యే కిమన్యేనమే.

గృహస్థుని శారీరక మానసిక కృత్యములు.

బ్రాహ్మముహూర్తమున నిద్రలేచి, యాదినమునఁ బగటి యందును, రాత్రియందును బారమార్థికములను, ఐహికములు నగు నేయేకార్యములు చేయవలసి యుండునో, వాని నన్నింటి నొక్కమాఱు యోజించి స్థిరపఱచనగును. ప్రత్యూష కాలమున శారీరకవిధి కవిరోధియగు స్థానవిశేషమునఁ బురీషవిసర్జనముచేసి ముఖమును, బాహువులు మున్నగు సర్వేంద్రియములను శుభ్రపఱచుకొనవలెను. నిర్మల జలమందు స్నానముచేసి యథాయోగ్యముగ శుభ్రవస్త్రముల ధరింపవలెను. తదుపరిఁ దనవర్ణధర్మానుసారమగు ధనార్జనోపాయమరసి తన్మూలమున నర్థసంగ్రహ మొనర్పవలెను. శరీరావస్థను విరోధముకానిచో మధ్యాహ్నవేళనుగూడఁ దానమాడి యీశ్వరపూజనము, తర్పణాదికము మున్నగునవి యాచరింపవలెను. అప్పటి కన్నాదికము పచనమై సిద్ధముగ నున్నచోఁ గొంత సర్వభూతతృప్తికొఱకును, గొంతఁ బతితులకొఱకును, అసమర్థులకొఱకును వేఱుగనునిచి యతిథికొఱకు గృహప్రాంగణమందు నిలువఁబడి నిరీక్షింపవలెను. అతిథి దొరకనేని వానికి శ్రద్ధాపూర్వకముగ

భోజనమిడవలెను. తనయూరివారి కాతిథ్యమిడవలయునను విధి యెచ్చటను లేదు. ఇతరదేశములనుండి వచ్చినవారలును, సంబంధహీనులును, అకించనులును నగు భోజనాభిలాషివ్యక్తులకు ముఖ్యముగ నాతిథ్యమిడ నగును. అతిథి యొక్క గోత్రము, జాతి మున్నగువానినిఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నింపరాదు. పాపరహితుఁడగు బ్రాహ్మణుం డరుదెంచెనేని వానికిఁ దప్పక భోజనమిడవలెను. తదుపరి గర్భిణులకును, ఆశ్రితులకును, వృద్ధులకును, బాలురకును భోజనమిడి వెనుకఁ దాను భుజింపవలెను. తూర్పుదెసగఁగాని, ఉత్తరముఖముగఁగాని కూర్చుండి భుజింపవలెను. ప్రశస్తమును, బవిత్రమును, బాపకర్ములచేఁ దాఁకఁబడనిదియును, సుపథ్యమును, నగు నన్నాదికమును బరిశుద్ధమగు పాత్రమం దిడికొని భుజింపవలెను. అకాలమందు భుజింపరాదు. భోజనమైనవెనుక భగవచ్చింతనము సేయవలెను. సోమరితనము మాని యతిక్లేశసాధ్యములు కాని కార్యములు తదుపరి నిర్వహింపనొప్పును. సచ్ఛాస్త్ర చింతనము సేయుచుఁ దద్దివసశేషాంశమును గడపవలెను. సాయంసంధ్యవేళను సమాహితచిత్తముతో సంధ్యావందనము సేయవలెను. మధ్యాహ్నకాలమందువలెనే సాయంసమయమందుఁగూడ నతిథి ప్రభృతులను బక్వాన్నాదులతోఁ దృప్తిపఱచి వెనుకఁదానుభుజింపవలెను. అతిథి రాత్రివేళ శయనించుట కుచితమగుస్థానమును, శయ్యయు, నిడవలెను. గృహస్థమును, సంసజ్జితమును, మత్కుణ పిపీలికాదిశూన్యము నగు మంచమున శయ్యపైఁ దూర్పుతట్టునఁగాని, దక్షిణముతట్టునకుఁగాని శిరస్సునిడికొని పరుండవలెను. పడమటివైపునఁగాని, యుత్తరపు దిక్కునఁగాని తలపెట్టి పండుకొనినచో రోగములుకలుగును. విధియుల్లంఘించి స్త్రీ సాంగత్యము సేయరాదు. వేయేల? సంక్షేపముగఁ జెప్పవలసివచ్చినపుడు గృహస్థుఁడు శారీరిక మానసికవిధుల నుత్తమరూపమునఁ బరిపాలింపుచుఁ బాపరహితమగు నంతఃకరణముగలిగి, విశేషపరిశ్రమమూలమున ద్రవ్యసంపాదనము సేయుచుఁ దన నాధారముచేసికొని జీవించువారలను, గురుజనులను, అతిథులను, నిరా

శ్రితవ్యక్తులను లెస్సగఁబోషింపుచుఁ దనశరీరయాత్రను సలుపవలయుననియే చెప్పవలెను.

దైనిక కృత్యాదులు నిర్విఘ్న కర్తవ్యములు.

ఆహ్నికతత్త్వమందుఁ జెప్పఁబడిన విధులన్నియు నేఁటికాలమున సంపూర్ణరూపమున నాచరింపుటకు వలను పడదు. ఇతరదేశముల రాజనీతియు, వ్యవహారమును, దేశమందంతటను వ్యాపించినపుడు పూర్వమతనియమములను బాలించుట చాలఁగష్టము. ప్రస్తుతపు దొరతనమువారి సమస్తకార్యములును మధ్యాహ్నకాలమునందే నిర్వర్తింపఁబడుటచే ముందుగ భుజింపుటయు, వెనుక ధనోపార్జనకార్యముల నడుపుటయుఁ బ్రయోజనీయములైనవి. ఇంతియకాక కాలక్రమమున భారతదేశమున స్వాస్థ్యనీతియు మిగులవెనుకఁబడినది. అందువలన వేళదప్పి భోజనము, త్రిషవణస్నానము, రాత్రిజాగరణము మున్నగునవి సలుపుట కెవరికినిసాధ్యముకాదు. ఆహారము, వ్యవహారము, స్నానము, శయనము మున్నగు సకలకార్యములు నెట్లునిర్విఘ్నములుగను బాపరహితములుగను నిర్వహింపుట కవకాశముగనుండునో, అట్లే యవియన్నియు నాచరణీయములని మనమహర్షుల ముఖ్యతాత్పర్యము. కావున నాయా యాశ్రమముల వారందఱును నివృత్తిపరులును, శ్రద్ధావంతులును, నగుచుఁ దమతమ వివేచనానుసారముగ నాహ్నికకార్యములను సలుపుట యుక్తము.*

---

* ప్రవృత్తంచ నివృత్తంచ ద్వివిధంకర్మవైదికమ్
ఆవర్తతే ప్రవృత్తేన నివృత్తేనాశ్నుతేఽమృతమ్
హింస్రం ద్రవ్యమయం కామ్యమగ్నిహోత్రాద్యశాంతిదమ్
దర్శశ్చపూర్ణమాసశ్చ చాతుర్మాస్యం పశుస్సుతః
ఏతదిష్టం ప్రవృత్తాఖ్యంహుతం ప్రహుతమేవచ
పూర్తం సురాలయారామకూపాజీవ్యాది లక్షణమ్.

భా. 7-15-47 to 49.

శారీరిక, మానసిక, సామాజిక, పారలౌకిక నిష్ఠావిధుల సమూహమే యాహ్నిక కార్యములందుఁ బాలింపఁ బడుచున్నది. ప్రాతరుత్థానము, దేహసంస్కారము, ఉచిత పరిశ్రమము, స్నానము, సకాలభోజనము, బలకారకములును, ఆరోగ్యకరములును, పుష్టికరములును నగు ద్రవ్యములను భక్షించుటయును, స్వచ్ఛ జలపానము, విహారము, శుభ్రపఱచిన వస్త్రములను ధరింపుటయును, దొమ్మిదిగంటలకాలము దాటని నిద్రయు నను శారీరకవిధుల ననుదినమును బాలింపుట మనసుఁ గర్తవ్యము. దినమంతయు నిర్వహింపవలసిన కార్యములను జింతింపుటయుఁ, ధ్యానశిక్షయు, విషయ విచార శిక్షయు, భూగోళ, ఖగో, ళేతిహాస, రేఖాగణిత, తారకగణిత, సాహిత్య, పశుతత్త్వ, రసాయనతత్త్వ, చికిత్సాతత్త్వ, పదార్థతత్త్వ, జీవగతి తత్త్వాదులగు వివిధ విద్యలయొక్క పరిశ్రమము నుపయుక్తరీతిని సలిపి తన్మూలమున మనోనిష్ఠావిధినిఁ బాలింపనగును. న్యాయపూర్వకమగు ధనసంపాదనము, యథాసాధ్య సంసారపాలనము, ప్రయోజనీయమగు సామాజిక క్రియాసాధనము, జగదున్నతిని గూర్చుకార్యము లొనర్పుటయందు యథా సాధ్యప్రయత్నము, మున్నగునవాచరించి దైనికాహ్నిక క్రియలను నిర్వర్తింపనగును. సంధ్యావందనాదికమగు పరలోక ధర్మాచరణ సంబంధ క్రియల మూలమునఁ బారలౌకికాహ్నిక క్రియల నొనర్పుటుచితము. కర్మలలో నధికాంశమాహ్నికములే. కొన్ని కర్మములుమాత్రము పాక్షికములు, కొన్ని మాసికములు, కొన్ని షాణ్మాసికములు, కొన్ని వార్షికములు, మఱి గొన్ని విషమసామయికములును. నిత్యకర్మమాత్రమే యాహ్నికము. నైమిత్తిక కర్మ లన్నింటిలోఁ గొన్ని కర్మలు సమసామయికములు; కొన్ని విషమ సామయికములును.

ఆయా దైనికకృత్యములు.

గృహస్థుని జీవనము సర్వదా పుణ్యమయమును, పాపరహితమునునై యుండవలెను. పుణ్యమయ జీవన వ్యవస్థ యెంతవఱకును నిరూపింపఁబడి

నది. పాపశూన్యస్థితి జీవుని కలవడు నభిప్రాయముతో మిక్కిలి ప్రధానము లగు పాపములను గొన్నింటి నిచట వివరింతును. *

ప్రధానపాపములు పదునొకండువిధములు. వానిని గ్రిందఁ జూపుచున్నాను.

—పాప శ్రేణీ విభాగము.—

(1) హింస, లేక, ద్వేషము.
(2) నిష్ఠురత.
(3) క్రౌర్యము, లేక, కౌటిల్యము.
(4) చిత్తవిభ్రమము.
(5) మిథ్యా వ్యవహారము.
(6) గుర్వవజ్ఞ.
(7) లాంపట్యము.
(8) స్వార్థ సర్వస్వత.
(9) అపావిత్ర్యము.
(10) అశిష్టాచారము.
(11) జగన్నాశకార్యము.

నరహింస, పశుహింసయు.

(1) నరహింస, పశుహింస, దేవహింస యని హింస మూఁడువిధములు. ఇతరులకు నష్టము గలిగింపవలయు ననుకోర్కెకు హింస యని పేరు. ద్వేషమునుండి హింస యుత్పన్నమగుచున్నది. ఏదే నొక విషయమందాసక్తి కలిగియుండుటకు రాగమని పేరు. అట్లే

* స్తేయం హింసానృతం దంభః కామః క్రోధస్స్మయో మదః
భేదో వైరమవిశ్వాస స్సంస్పర్ధా వ్యసనానిచ
ఏతే పంచదశానర్థా హ్యర్థమూలా మతా నృణామ్
తస్మాదనర్థ మర్థాఖ్యం శ్రేయోఽర్థీ దూరతస్త్యజేత్.
భా. 11-23.18 & 19.

యేదే నొక విషయముపై విరక్తి గలుగుటకుఁ జేరు ద్వేషము. ఉచితరాగము పుణ్యవిషయముగనే పరిగణింపఁబడుచున్నది. అనుచితరాగమునకే లాంపట్యమని పేరు. రాగముయొక్క విపరీతధర్మమే ద్వేషము. ఉచితద్వేషము గూడఁ బుణ్యవిషయముగనే చెప్పఁబడుచున్నది. అనుచితద్వేషము ఈర్ష్యకును, హింసకును, గూడ మూలము. సంసారమునందుఁ బ్రవర్తింపుచుండు సర్వజనులును ఒకరియెడల నొకరన్యోన్య ప్రీతితో వ్యవహరించుట కర్తవ్యము. పాపబుద్ధిగలవాఁ డిందులకు వ్యతిరేకముగఁ బ్రవర్తించి యితరుల యెడ నీర్ష్యయు, హింసయుఁ బ్రకటించుచుండును. హింస యనునదొక గొప్ప పాపము. హింసాపరిత్యాగమే యందఱకుఁ గర్తవ్యము. నరహింస యత్యంత గురుతరపాపము. ఏనరుని మనము హింసింతుమో, ఆనరునియందుండెడి మాహాత్మ్య తారతమ్యమును బట్టి మన మొనర్చిన హింసకు గురుత్వలఘుత్వస్థితులు ప్రాప్తించుచున్నవి. బ్రాహ్మణహింస, జ్ఞాతిహింస, స్త్రీహింస, వైష్ణవ హింస, గురుహింస యను సకల హింసలును, నధికతర పాపయుక్తములు. పశుహింసయు సామాన్య పాపముగాదు. స్వార్థపరులై పశుహింస చేయునట్టి యుదరపరాయణులగు మానవులు మానవ ప్రవృత్తిని విడిచి పశుప్రవృత్తి నవలంబించిన వారగుచున్నారు. పశుహింస చేయుట మానిన కాని నరస్వభావము తేజోవంతము కానేరదు.

వేదాది శాస్త్రములందుఁ జెప్పఁబడిన పశుయాగము, బలిదానము మున్నగువాని యభిప్రాయము మానవుని పశుప్రవృత్తినిఁ గ్రమముగ సంకుచితపఱచుటయు, నట్టి ప్రవృత్తినుండి విరమింపుమని చెప్పుటయు ననియే.* వాస్తవముగఁ బశుహింస పశుధర్మమేకాని మానవధర్మముకాదు.

---

* లోకేవ్యవాయామిష మద్యసేవా, నిత్యాస్తుజంతోర్నహితత్రచోదనా
వ్యవస్థితిస్తాసువివాహయజ్ఞ, సురాగ్రహైరాసునివృత్తిరిష్టా
యద్ఘ్రాణభక్షో విహితస్సురాయా స్తథాపశోరాలభనం నహింసా
ఏవంవ్యవాయః ప్రజయానరత్యైఇమం విశుద్ధం న విదుస్స్వధర్మమ్.
భా. 11.5-11 & 13.

దేవహింస గూడ గురుతరమగు పాపము. ఈశ్వర పూజనముకొఱకు సకల మానవులును భిన్నభిన్న దేశములందు భిన్న భిన్న ప్రక్రియా విధానములు కలిగియున్నారు. ఆయా ప్రక్రియల నవలంబించుటచేతనే భగవత్తత్త్వోపాసనారూపమగు పరమధర్మము వారికి లభ్యమగుచున్నది. అనభిజ్ఞులును, అతాత్త్వికధర్మనిరతులు నగు నల్పబుద్ధులు తమ ప్రక్రియా వ్యవస్థయే శ్రేష్ఠమైనదని చెప్పుచు నన్యదేశములందలి వ్యవస్థలను నిందింతురు; ఇంతేకాక, అన్యదేశములందలి యీశ్వర మందిరములను, ఈశ్వర చిహ్నములను గూడ నాశనము సేయుదురు. పరమేశ్వరుఁ డొక్కఁడేకాని యిద్దఱుకారు. కావున నిట్టి నికృష్టకార్యము లొనర్చుటచే నా యద్వితీయుఁడగు పరమేశ్వరునే హింసించినవారగుచున్నారు. సత్పురుషులిట్టి పశుప్రాయములగు పనులు సేయక వానిని సదా నిరసించుటయే ధర్మము. *

దేవహింస.

(2) నర ప్రతినిష్ఠురత, పశుప్రతి నిష్ఠురత యని నిష్ఠురత రెండు విధములు. నరస్త్రీలయెడల నిష్ఠురతఁ జూపుటచేతనే లోకమునం దనేక విషమములగు నుత్పాతములు సంభవించినవి; దయాగుణము జగత్తును బూర్తిగఁ బరిత్యజించెను; నిర్దయారూపమగు నధర్మము జగత్తునఁబ్రవేశించెను. సిరాజ్ ఉద్దౌలా, నీరో (Sirajuddaulah, Nero) మున్నగు దుర్మార్గ వర్తనులచే లోకమున నెన్నియో అనర్థములు వాటిల్లెను. కావున నెవ్వరి మనమందు నిష్ఠురతా ప్రవృత్తి తలసూపియుండెనో, అట్టివారు దయాగుణము నభ్యసింపుటవలనను, దయాప్రకటితములగు కార్యములను జేయుచుండుటవలనను, తన్నిష్ఠురభావమునుఁ గ్రమముగఁ బరిత్యజింపనగును. ఇప్పుడు మనదేశమున

నిష్ఠురత.

* యేకైవల్య మసంప్రాప్తాః యేవాతీతాశ్చమూఢతామ్
త్రైవర్గికాహ్యక్షణికా ఆత్మానం ఘాతయంతి తే

భా. 11-5-16.

నెలకొనియున్న క్షుద్రమత సంప్రదాయములందుఁ బశువులయెడ నిష్ఠురత యంగీకరింపఁబడియున్నది. ఇది యాసంప్రదాయ వ్యవస్థాపకుల యప యశస్సునే చాటుచున్నది. స్వార్థపరత్వముచే నాలియు, జాలియు లేని కొందఱు జనులు బండ్లకుఁ గట్టు నెద్దులకును, గుఱ్ఱములకును, ఎంతటి కష్టము గలిగించుచున్నారో, అదియెవ్వరైనఁ జూచినచో గుండెలువ్రక్కలై తీఱును. అట్టిపశువులయెడ నిష్ఠురత మనము విడిచితీఱవలెను.

(3) క్రౌర్యము, లేక, కుటులతయనున దొకగొప్పపాపము. స్వార్థపరత్వముచేఁగాని, యభ్యాసవశతచేఁగాని యొక మనుజుఁడు వేఱొకమనుజునియెడల వక్రబుద్ధితో వ్యవహరించుటకుఁ గుటిలత్వమని పేరు. విశేషోద్వేగముగలిగించు కుటిలతకే క్రూరత్వమని పేరు. ఈరెంటియందు నాసక్తులగువారలు ఖలు లనఁబడుదురు.

కుటిలత.

(4) మాదకసేవనము, షడ్రిపుప్రాబల్యము, నాస్తికత, జాడ్యమనను నీనాల్గును చిత్తవిభ్రమము* సందలి భేదములు.

చతుర్విధ చిత్తవిభ్రమము (i) మాదకసేవనము.

మాదకసేవనముచే లోకమునందుఁ గలుగుచున్న యనర్థములనుగూర్చి వ్రాయుటఁ గష్టసాధ్యముగ నుండును. సమస్తపాపములును మాదకవస్తువు లనే యాశ్రయించి యున్నవనిమాత్రము ఘంటాపథముగఁ జెప్పవచ్చును. అన్నిరకముల సారాయిలును, గంజా, షిద్ధి, చరస్, నల్లమందు, పొగాకు, పోఁకలు మున్నగునవి మాదకద్రవ్యములుగఁ బరిగణింపఁబడుచున్నవి. మాదకములోఁ గొన్నిచిత్తమునకుఁ దీక్ష్ణతకలిగించి

* అభ్యర్థిత స్తదాతస్మై స్థానాని కలయేదదా
ద్యూతంపానం స్త్రియస్సూనా యత్రా ధర్మశ్చతుర్విధః
పునశ్చయాచమానాయ జాతరూపమదాద్విభుః
తతోఽనృతంమదః కామోరజో వైరంచ పంచమమ్.

భా. 1.17.37 & 38.

మనుజుని స్వాస్థ్యమును జెఱచును. నల్లమందు చిత్తమును మిగుల శిథిలపఱచి మానవునిఁ బశుమాత్రునిగ నొనర్చును. పొగాకు పైనిఁజెప్పిన చిత్తతీక్ష్ణతా శైథిల్యముల రెంటినిగలిగించి మానవప్రకృతికి జడత్వమునుగూర్చి తత్సేవకునిఁ దానులోఁబఱచుకొనును. మాదకసేవన మత్యంత భయానకమగు పాపము. దురభ్యాసమును గుదుఱ్చుటకై హితోపదేశము సేయుటకుఁదప్ప, మఱియేకారణముచేతనైనను మాదకసేవివద్ద కేనరుఁడును బోఁగూడదు.

(ii) షడ్రిపు ప్రాబల్యము.

కామక్రోధ లోభమదమోహమాత్సర్యములను నీయాఱును మానవ చిత్తమునను శత్రువులు. వీనికిఁ జిత్తము పైనధికారము కుదిరెనేని మానవుఁడు పాపాత్ముఁడగును. స్వచ్ఛందముగను, నిష్పాపముగను దేహయాత్రసాగుటకై వలయు నర్థోపార్జనముసేయించుప్రవృత్తినిఁ గామమనరాదు. తద్వ్యతిరిక్తమగు వాసననే కామమని చెప్పవలెను. ఈకామమే మనకు సమస్తోపద్రవములును గలిగించును. కామము పరిపూర్తికాదేని నదియేక్రోధముగఁ బరిణమించును. క్రోధము గలిగినచో దానినుండియే కలహము, నిష్ఠురభాషణములు, ఇతరులదేహములను నొప్పించుట, ఆత్మహత్యమున్నగు పాపకార్యములు చేయఁబడుచున్నవి. క్రమముగ లోభగుణముగూడఁ దలచూపి మనుజునిఁ బాపభూయిష్ఠునిగఁజేయును.

అందఱికంటె నేనుశ్రేష్ఠుఁడనని చెప్పుకొనుటయే మదము. మానవుఁడు తానెంత యల్పజ్ఞానుఁడనని చెప్పుకొనునో, అంతటి నమ్రగుణమతనికిఁగలుగును. మదపరిత్యాగమునుజేసియే తీఱవలెననుటచే యాథార్థ్య పరిత్యాగముగూడఁ జేయుమనియర్థముకాదు. తనవద్ద నేదైన సుగుణమున్నచో దానిపైఁ దానాధారపడియుండుట యుచితమేయగును. విశేషించి, "నేను భగవంతునికి దాసుఁడ" ననిఁ దన్నుఁగూర్చి చెప్పుకొనినచో మదగుణము తనచెంతకురాదు.

మోహము స్వభావసిద్ధముగఁ జెడుగుణము. ఒరులపచ్చ నోర్వలేని గుణమే మాత్సర్యము. ఇదియే సమస్తపాపములకును మూలము. ఈయాఱు గురుశత్రువులలో నేశత్రువు నరుని చిత్తము నాక్రమించినను దన్మూలమున నతనికిఁ జిత్తవిభ్రమము గలుగును.

చిత్తవిభ్రమమునుండియే నాస్తికత కలుగుచున్నది. నాస్తికత రెండు విధములు. పరమేశ్వరుఁడు లేఁడను నిశ్చయము గలిగియుండుట మొదటిది. పరమేశ్వరుఁడున్నాఁడో లేఁడో యనుసందేహము కలిగియుండుట రెండవది. నాస్తికత యెట్టిచిత్తవిభ్రమవిశేషమో అది మఱల మఱల మన కనుభవమునకు వచ్చుచునే యుండును. చిత్తవిభ్రమరూపమగు నున్మాదరోగముగల వారందఱును నాస్తికులైనఁగుదురు; లేదా, సందేహవాదులైన నగుదురు. చిత్తము స్వస్థతఁ జెందియున్నప్పుడు చాలమంది కీశ్వరవిశ్వాసము ప్రబలముగ నేయుండును. కాని యీపాడురోగ మంకురించినచో నది పటాపంచలై యెడకుఁబోవునో తెలియదు. ఒకవేళ నీరోగము మఱలఁ గుదిరినచో మఱల విశ్వాసముగలుగుచుండును. ఈ యున్మాదగ్రస్తులగు వారిలోఁగూడఁ గొంద ఱనుదినమును "హరే కృష్ణ" మున్నగు నామము లుచ్చరింపుచునే యుందురు. కాని వారిని బోయి యడిగినచో "నేనే ఆవస్తువు" నని చెప్పుదురు. ఇదంతయుఁ జిత్తవిభ్రమమే.

(iii) నాస్తికత.

జాడ్యము, లేక, ఆలస్యమనునదికూడఁ బాపములలెక్కలోఁ జేఱినదియే. జడతలేకుండఁ జేసికొనుట పుణ్యవంతులకుఁ గర్తవ్యము.

(iv) జాడ్యము.

(5) మిథ్యావ్యవహారము నాలుగువిధములు. ఎట్లనిన:—

(i) కల్లలాడుట (ii) ధర్మకాపట్యము (iii) వంచనము, లేక, మిథ్యాచరణము (iv) పక్షపాతము.

అబద్ధమాడుట సర్వథా నిషిద్ధము. అందులోఁ బ్రమాణము చేసి యసత్యము చెప్పుట యధిక దోషముగఁ జెప్పఁబడుచున్నది. కావునఁ గల్లలాడు టెట్టిసమయమందును, ఎట్టియవస్థయందునుగూడఁ దగదు. సంసారవిషయములందు సదా అసత్యములు పలుకుచుండువాని నందఱును మిగులఁ దృణీకారభావముతోఁ జూతురు.

(i) మిథ్యాకథనము.

ధర్మ (మత) కాపట్యము చాల భయంకరమగు పాపము. ఇట్టి పాపాసక్తులగు వారలను బైడాలవ్రతికులుగ లోకమునఁ జెప్పుకొందురు. తిలకధారణము, కంఠమునందు మాలలు, కాపీనము, బహిర్వాసనము, యజ్ఞోపవీతము మున్నగు ధర్మచిహ్నములన్నియు బైటనుఁ జక్కఁగఁ గనఁబడుచుండును. కాని లోపలవారలకు భగవద్భక్తి యుండదు. వీరలే ధర్మధ్వజులు.

(ii) ధర్మకాపట్యము.

మనస్సులోనుండున దొకటియు, బైటనుఁజెప్పునది నేఱొకటియుఁ గలిగి యెవరు లోకమందుఁ గపటవృత్తినాచరింపుచుందురో వారలనే శఠులనిచెప్పి, చూచినవారందఱును వారల నేవగింతురు.

(iii) వంచనము.

యథార్థపక్షమున నుండక నేకారణముచేతనైననేమి యన్యాయ పక్షమున నుండి దానిని సమర్థించుటకుఁ బేరు పక్షపాతము. ఇది యన్నివిధములచేతను వర్జనీయము.

(iv) పక్షపాతము.

(6) గుర్వవజ్ఞ మూఁడువిధములు. మొదటి తల్లిదండ్రుల ననాదరము సేయుట. రెండవది యుపదేశకుల ననాదరణము చేయుట. మూఁడవది యితర గురుజనుల ననాదరము సేయుట.

త్రివిధ గుర్వవజ్ఞ.

గురువులగువారు ప్రమాదవశమున నన్యాయముగ దండించినచో వారిపైనిఁ గొంచెమైనను గినుక వహింపరాదు. వినయముగను, నేర్పుతో

డను, వారలను బ్రసన్నులుగఁ జేయుటకే ప్రయత్నింపవలెను. గురుజనులిడు నట్టి న్యాయ్యములగు నాజ్ఞలను బరిపాలింపకుండుటయే గుర్వవజ్ఞ.

(7) అర్థలాంపట్యము, స్త్రీలాంపట్యము, ప్రతిష్ఠాలాంపట్యము నని లాంపట్యము మూఁడు విధములు.

త్రివిధ లాంపట్యము.

ధనమందును, విషయాదులయందును గల లంపటత్వమునకే యర్థలాంపట్యమని పేరు. అర్థలాంపట్య క్రమమున మానవుని ధనాశయు, విషయాశయు, నమితముగఁ బెఱిఁగి వాని సౌఖ్యము సంతయుఁ జెఱిచి వేయును. కావున నీలాంపట్యము దొలఁగుమార్గము సంక్షేపముగఁ జెప్పవలయునని, నిట్టియర్థముగాని, విషయముగాని యొకపరి సంప్రాప్తించినపుడు మఱల వానిపై నాస హృదయమునఁ బుట్టకుండునటులు చేయుటయే కర్తవ్యము.

స్త్రీలాంపట్యము మహాపాపములలో నొకటి. పరస్త్రీసంగము గాని, వేశ్యాసంగముగాని యెన్నఁడును జేయఁదగినవి కావు. తాను గట్టుకొన్న స్త్రీతో సహవాసము చేసినప్పుడు సైతము కొన్ని శారీరిక, సామాజిక విధులయందు దృష్టినిలిపియుంచుట యుక్తము. కొందఱుపురుషులు స్త్రీల చెప్పుచేతలలోఁ దిరుగుచుందురు. అట్టివారు సర్వనాశనమగుటలో సందేహములేదు. న్యాయవిరుద్ధముగ స్త్రీ సాంగత్యముచేసినచో దేహదౌర్బల్యము, జననేంద్రియముల కయథాపరిచాలనము, బుద్ధిహానియు దౌర్బల్యమును, నల్పాయుస్సుగల సంతానమును సంభవించును. మనదేశమునఁ బురుషుని కిఱువదియొక్క సంవత్సరములును, స్త్రీకిఁ బదునాఱుసంవత్సరములును, రాకపూర్వమే నిషేకమొనర్చుట చాల ననుచితమగుపని. పర్వదినమందును, స్త్రీ గర్భవతిగానున్నప్పుడును, ఋత్వవసానము సంభవించినపుడును, సంగము నిషేధింపఁబడుచున్నది. ధర్మప్రవృత్తినవలంబించి స్త్రీలాంపట్యమును హృదయమునుండి దూరస్థముచేయు టెల్లరకును గర్తవ్యము.

ప్రతిష్ఠాలాంపట్యమూలమున మానవుఁడొనర్చు సకలకార్యములును నితాంతస్వార్థపరము లగుచున్నవి. కావుననే ధానినిఁగూడఁ బాపమని చెప్పి, దూరగతముచేయుచున్నారు. ధర్మాచరణము నిఃస్వార్థభావముతో నొనర్చు టుచితము.

**స్వార్థ పరత్వము.**

(8) స్వార్థ సర్వస్వత మహత్తరమగు నొకపాపము. మానవ జీవనోన్నతి కొఱకును, బరలోకసంబంధమగు వాస్తవమంగళలాభముకొఱకును, జేయఁబడు సకలయత్నములకును స్వార్థమని పేరు. ఇట్టిస్వార్థమును విడువవలసిన విధిలేదు. ఎయ్యది తనకును, లోకమునకును ఒకేకాలమున మంగళసాధనమగుచున్నదో, అదియే భగవంతుని దగు నొక యాశ్చర్యకర ప్రకృతస్వార్థమని చెప్పనొప్పును. అట్టి స్వార్థమును విడిచితిమేని జగన్మంగళకార్యాచరణమునుండి విరమించినవారమే యగుచున్నాము. పరులకుఁ గేవలమమంగళముఁగూర్చు స్వార్థమే నిందనీయమగు స్వార్థమగుచున్నది. ఇట్టి స్వార్థపరత్వమువలననే తనపై నాధారపడియుండు వారియెడల నయథాకార్పణ్యము, ఇతరులను సత్కరింపుటయందు సంకుచితబుద్ధియును, విరోధము, చౌర్యము, అసంతోషము, అహంకారము, మాత్సర్యము, హింసయు, లాంపట్యము, అపచయము మున్నగు బహువిధపాపములు సంభవింపుచున్నవి. ఏమనుజుఁ డెంతవట్టు స్వార్థసర్వస్వత గలిగియుండునో, ఆమనుజుఁ డంతవట్టు తనకును, ఇతరులకును, అమంగళములఁ గూర్చువాఁడగుచున్నాఁడు. కావున స్వార్థసర్వస్వతారూపమగు పాపమును హృదయమునుండి తొలఁగించి దూరస్థము చేయకున్నచో మనుజుఁ డెట్టి సత్కార్యము చేయుటకును సమర్థుఁడై యుండఁడు. *

* ప్రాయేణదేవమున యస్త్వవిముక్తకామా,
మౌనం చరంతివిజనే పరమార్థనిష్ఠాః,
నైతాన్విహాయకృపణాన్ విముముక్షుఏకో,
నాన్యత్త్వదస్యశరణం భ్రమతోఽనుపశ్యే. భా. 7-9-44.

ద్వివిధమగు నపవిత్రత.

(9) శాకీరిక మానసిక భేదములను బట్టి యపావిత్ర్యము ద్వివిధము. శారీరికమైనను మానసికమైనను, నదియే దేశగతాపావిత్ర్యమనియు, కాలగతాపావిత్ర్యమనియు, పాత్రగతాపావిత్ర్యమనియు మూఁడు విధములగుచున్నది. పవిత్రతలేని దేశమునకుఁ బోయినప్పుడు దేశగతాపావిత్ర్యము కలుగుచున్నది. దేశములోని మనుజులు నింద్యచరిత్రులగునపు డాయాదేశముల కపవిత్రత వాటిల్లుచున్నది. కావుననే ధర్మశాస్త్రములం దకారణమ్లేచ్ఛదేశ గమనమునకును, వాసమునకును, అపావిత్ర్య దోషము చెప్పఁబడియున్నది. దేశజ్ఞానలాభముకొఱకును, అన్యదేశములకు మంగళమొసఁగూర్చుటకొఱకును, యుద్ధముచేసియో, కౌశలముఁ జూపియో ఆయాదేశములను దుష్టులబారినుండి తొలఁగించుటకొఱకును, లేక, ఆదేశములందు ధర్మప్రచారము చేయుటకొఱకును, మ్లేచ్ఛ దేశగమనము సేయుట నిషిద్ధము కాదు. మ్లేచ్ఛదేశములయందలి క్షుద్రవిద్యలను, క్షుద్రమతములను దా నలవఱ్చుకొనుటకుఁగాని, అచ్చటి జనులతో సహవాసముచేయు నభిప్రాయముతోఁగాని మ్లేచ్ఛదేశగమనము సేయునెడల యార్యజాతికిఁ దప్పక యవనతి కలుగును. ఇట్టి దోషము సంభవించినవారు ప్రాయశ్చిత్తార్హులగుదురు.

కర్మకాండవిషయమై, యధికమాసములు మున్నగువాని కపవిత్రత చెప్పఁబడినది. సకలకర్మలును నియమితరూపమున విభక్తములై యుండుటఁ బట్టి ఆయా నియమితకాలములయం దాయా కర్మలు చేయుట యుక్తము. అధిక మాసములయందును, గ్రహణములు మున్నగు పెద్దపెద్ద ఘటనా సమయములయందును, నియమితకార్యములను నిర్వర్తింపుట యక్రమము. ఏమన, నాయాపనులవిషయమై నాయా కాలము లకాలములనఁబడుచున్నవి. అకాలగతకార్యముల నపవిత్రత యాశ్రయించియే యుండును. అకాల స్త్రీగమనము, అకాల భోజనము, అకాల నిద్ర మున్నగు వ్యావహారిక కార్యములం దపవిత్రత ద్యోతితమగుచున్నది.

అపాత్రులచేఁ జేయఁబడు కార్యమునకుఁ దప్పక యపవిత్రత కలుగుచున్నది. త్రాఁగుఁబోతులును, స్త్రీయాదిలంపటులును జేసిన వంటకమునకును, దేవతాపూజనమునకును, అపావిత్ర్యదోషము సంభవించుచున్నది. శరీరమును, వస్త్రమును, శయ్యయు, గృహమును శుభ్రపఱుపనియెడల నపవిత్రత గలిగి తీఱును. మలమూత్ర విసర్జనము చేసినపిదప జలప్రక్షాళణముచే నపావిత్ర్య దోషమును బాపుకొనుటుచితము. భ్రమచేతను, మాత్సర్యముచేతను, జిత్తమున కపవిత్రత కలుగుచున్నది, వానికిఁ జిత్తమునం దిఱవీకుండుటయే కర్తవ్యము.

**అశిష్టాచారము.**

(10) అశిష్టాచారము గూడ నొక పాపకార్యమే. సత్పురుషుల వ్యవహారమునందుఁ గన నగు నాచారము నవలకుఁ ద్రోచి మ్లేచ్ఛాచారమే శ్రేష్ఠమైనదని స్థిరపఱచువార లశిష్టాచారులు. మ్లేచ్ఛ సహవాసము కొంతకాలము చేయుటచేఁ బవిత్రమగు వర్ణాశ్రమధర్మము తమకు రుచింపక మ్లేచ్ఛులవలెనే స్వేచ్ఛావిహారము సలుపువారు విజ్ఞానసిద్ధమగు సదాచారమునకు విరుద్ధముగ సంచరింపుటచేఁ బతితులగుచున్నారు. వీరుఁ గూడఁ బ్రాయశ్చిత్తార్హులే.

(11) జగన్నాశకార్యమైదువిధములు:—

—పంచవిధ జగన్నాశకార్యము.—

(i) సత్కార్యములకు వ్యాఘాతమొనర్చుట.
(ii) ఫల్గువైరాగ్యము.
(iii) ధర్మము పేరితో నసదాచార ప్రవర్తనము.
(vi) అన్యాయ యుద్ధము.
(v) అపచయము.

ఇతరు లెవరైనను సత్కార్య నియుక్తులైనపుడు వానికిఁ దాను స్వయముగఁగాని, పరుల మూలమునఁగాని వ్యాఘాతమొనర్చుటకుఁ జేయు ప్రయత్నమే జగన్నాశకార్యమనఁబడును.

భగవద్భక్తివలనఁగాని, జ్ఞానమువలనఁగాని సహజముగఁ బుట్టిన విషయవైరాగ్యమే యుత్తమమైనది. కాని ప్రయత్నపూర్వకముగ సంపాదించిన వైరాగ్యము కేవల మమంగళ జనకము. సంసారమందుండి గృహస్థ ధర్మము నుత్తమరూపమునఁ బాలించుట సాధారణ మానవులకుఁ గర్తవ్యము.

యథార్థ వైరాగ్యము.

యథార్థ వైరాగ్యము జన్మించినచో సన్న్యాసాశ్రమ విహితమగు నాచరణమునైన నవలంబింపవచ్చును. లేదా భగవత్సేవాపరుఁడగుచు గృహకార్య లంపటత్వము క్రమముగఁ దగ్గించుకొనుచునైన నుండవచ్చును. ఇట్లు చేయుటకే యథార్థవైరాగ్యమని పేరు. గృహనిర్వాహకము కష్టముగ దోఁచియో, లేక, గృహకల్లోలము లేవైనఁ గల్గుటచేతనో, కొందఱు గృహస్థ ధర్మమును విడుతురు. ఇది మిగులఁ బాపకార్యము. క్షణిక వైరాగ్యము గలిగిన మాత్రమున నాశ్రమ త్యాగము సేయుట కెవ్వరికి నధికారము లేదు. అజ్ఞానులగు కొందఱు తాముసేయునది తప్పని తెలియక, భక్తిని దఱువాత సంపాదింపవచ్చునని యాలోచించి, ముందు "బైరాగి" వేషము వేసి దాని కనుకూలమగు వైరాగ్య చిహ్నము లన్నియు ధరింతురు. ఇది కేవలము పిచ్చికార్యము. వారల వైరాగ్యము స్వభావసిద్ధముగఁ గలిగినదికాక క్షణిక వైరాగ్యమగుటచే వేషధారణచే భక్తి కలుగు టసంభవము. తుదకు జరుగునదేమనినఁ గొన్నాళ్లకీ వైరాగ్యము పూర్తిగ నంతరించి తద్వేషధారికి దుష్ప్రవర్తనమును, ఇంద్రియలోలత్వమును గలిగించును. సాధారణముగ నెవ్వఁడైనను దనకుఁ గలిగియున్న వైరాగ్యాధికారము ననుసరించియే తాను దద్రూపమగు నాచారమునందుఁ బ్రవర్తింపుటకు యోగ్యుఁడగుచున్నాఁడు. తమతమ యధికారముల కనురూపములుగ నేయే యాచారములు నిరూపింపఁబడినవో, ఆయా యాచారములే ఆయా యధికారుల విషయమై సదాచారములగుచున్నవి. * అధికార విచా

* స్వే స్వేఽధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః
విపర్యయస్తు దోషస్స్యాదుభయోరేష నిశ్చయః.
భా. 11-21-2.

రము నేయుచుండఁ దనకధికారము లేని యాచారము నవలంబించినపుడు తన
కును, లోకమునకును గూడ ననిష్టము వాటిల్లును. ఉచ్చాధికారమునకు
యోగ్యులుకాకున్నను గొందఱు దుష్టాలోచనములు మనమున నిడికొని,
ఆయధికారమునకు సంబంధించిన కార్యములన్నియును దాము నేయుచుం
దురు. ఇందువలనఁ గ్రమముగ జగన్నాశమే యగుచున్నది.

ధర్మ (మత) ము పేరితో దురాచారములు జరుగుట యనేక స్థలము
లందుఁ జూచుచున్నాము. కపట సన్యాసుల వర్ణాశ్రమ లోప రూపమగు
ధర్మ ప్రవర్తనమును, అట్లే నేడా, బాఉల్, కర్తాభోజా, దర్వేష్, కుంభ
పటియా, అతిబాడీ, స్వేచ్ఛాచారి, కపట బ్రహ్మవాది మున్నగు వార
లొనర్చు వర్ణాశ్రమ విరుద్ధ కృత్యములన్నియును, అత్యంతాహితకరములు.
ఇట్టి కార్యము లొనర్చువారు సంపాదించు పాపములు జగన్నాశన హేతు
వులుగ నెఱుంగవలెను. సహజీయుఁడు, నేడా, బాఉల్, కర్తాభోజా
మున్నగువారు నేయు నక్రమమగు స్త్రీసంపర్కము కేవల ధర్మవిరుద్ధమైనది.

రాజ్యవృద్ధికొఱకెన్నెన్ని యుద్ధములు చేయఁబడుచున్నవో, అవ
న్నియు నధర్మములును, జగన్నాశకములును నగు కార్యములు. ధర్మ
శాస్త్రములందు ధర్మయుద్ధమే చెప్పఁబడినది కాని యితర యుద్ధములు
చెప్పఁబడలేదు.

అర్థము, సమర్థత, సమయము, సామగ్రియు, న్యాయ రీతిని వ్యయ
పఱచుటయే విధి. అన్యాయరూపమున వ్యయపఱచినచో నపచయమనియెడి
పాపము సంభవించును. పాత్ర గౌరవలాఘవము

పాపము, అపరాధ లను బట్టి పాపములకు గురుత్వ లఘుత్వములు
మును. సిద్ధించుచున్నవి. గురుత్వ లఘుత్వాను సారముగనే
పాపము, పాతకము, అతిపాతకము, మహాపాత
కము మున్నగు నామములు కలుగుచున్నవి. సాధువులయెడలను, ఈశ్వరుని
యెడలను జేయఁబడుపాపము నపరాధమందురు. అపరాధమనునది పాపము

లన్నిటికంటెఁ గఠినమైనది కావున విడువఁదగినది. రాఁబోవు వృష్టియందు ముఖ్యప్రవృత్తి సహితమగు విధి విచారింపఁబడును.

త్రైవర్గిక ధర్మము, ఆపవర్గిక ధర్మమును.

ఈ చిన్నగ్రంథమందు ధర్మాధర్మములు, పాప పుణ్యములు, విధి నిషేధములు కేవల దిగ్దర్శనప్రాయముగనే విచారింపఁబడినవి. వీనింగూర్చి విశేషముగఁ దెలిసికొనఁగోరువారు మహాత్ములచే రచింపఁబడిన యిరువది ధర్మశాస్త్రములయందును, ఇతిహాసములయందును, పురాణములయందును, గల తత్సంబంధ విషయములను బఠింపనగును. నశ్వరమగు నీలోకమున ధార్మిక జీవన మొక్కటియే యుత్కృష్ట విషయము. కావున నందఱు నట్టి జీవనలాభము పొందుటకే ప్రయత్నింపు టుచితము.* సత్కర్మలన్నియును త్రైవర్గికములనియు, నాపవర్గికములనియు రెండువిధములు. త్రైవర్గిక ధర్మ మనిత్యమును, గర్మకాండమయమును, క్షుద్రమును, స్వార్థపరమును. ఆపవర్గికధర్మ ముచ్చస్థితి గలదియును, మోక్షస్థితి నిచ్చునదియు, నగుచున్నది. కృష్ణభక్తి రూపమగు విశుద్ధాపవర్గిక ధర్మ మన్నింటికంటె శ్రేష్ఠమును, బాలనీయమును. ఈధర్మమున మోక్షాభిసంధి యించుకయు లేదు. భక్తియే దానిస్వరూపము.

---

* వర్ణాశ్రమ వతాం ధర్మ ఏష ఆచార లక్షణః
సఏవ మద్భక్తియుతో నిశ్శ్రేయస కరః పరః.

భా. 11.18.48.



## ముఖ్య విధియను వైధీ భక్తియొక్క సాధారణ విచారము.

### తృతీయ వృష్టి—ప్రథమ ధార.

### వైధీభక్తిలక్షణము.

శ్లో. భక్తిస్త్వయి స్థిరతరా భగవన్! యది స్యా
ద్దైవేన నః ఫలిత దివ్య కిశోరవేషే.
ముక్తిస్స్వయం ముకుళితాంజలి సేవతేఽస్మాన్
ధర్మార్థ కామ గతయస్సమయ ప్రతీక్షాః.

ఆర్థికధర్మము, పారమార్థిక ధర్మమును.

శాస్త్రీయ విధినుండి యుత్పన్నమైన ధర్మమును వైధ ధర్మమందురు. వైధధర్మము రెండువిధములు. మొదటి దార్థికము, లేక త్రైవర్గిక వైధధర్మము. రెండవది పారమార్థికము, లేక, ఆపవర్గిక వైధ ధర్మము. ధర్మార్థకామము లను మూఁటికిని వర్గమని పేరు. వీనిచే నేధర్మము సాధింపఁబడుచున్నదో, అది త్రైవర్గిక ధర్మము. ఈ ధర్మమువలన శారీరక, మానసిక, సామాజిక, న్యాయపథ (Ethical) జీవనముల యున్నతి సాధింపఁబడుచున్నది; మఱియు శరీర పతనానంతరము స్వర్గసుఖము కలుగుచున్నది. స్వర్గసుఖ మనిత్యమైనది. దానిని భోగించి జీవుఁడు మఱలఁ గర్మభూమి కేతెంచును. ఇంతకు ముందు విస్తరింపఁబడిన వర్ణాశ్రమ ధర్మమే వాస్తవమగు నార్థికధర్మము. ధర్మార్థకామములను నీమూఁడు నొకదాని కింకొకటి ఫలమగుచుఁ జక్రాకారముగఁ బ్రవర్తింపుచుండును. జీవుఁడు వీనిచేఁ గర్మజడుఁడే యగుచుండును గాని ముక్తిలాభము నొందఁజాలఁడు. ఈ త్రైవర్గిక ధర్మమునకుఁ దాత్పర్య మైహికార్థలాభమే కనుక దీనికార్థిక

మను పేరు వచ్చెను. కర్మమునకెన్నెన్ని యవాంతరఫలములు గలవో వాని సముదాయమునకంతటికి నర్థమని పేరు. * అర్థము మఱలఁ గర్మరూపము వహించి యితరార్థములను గారణభూతమగుచున్నది. ఈధర్మార్థశృంఖలము పరిపూర్తి నొందినపిదప సంపాదింపఁబడు నర్థమునకే పరమార్థమనియు, నప

---

* బ్రహ్మవర్చసకామస్తు యజేత బ్రహ్మణస్పతిం
ఇంద్రమింద్రియకామస్తు ప్రజాకామః ప్రజాపతీన్
దేవీంతుమాయాం శ్రీకామస్తేజస్కామో విభావసుమ్
వసుకామో వసూన్ రుద్రాన్ వీర్యకామస్తు వీర్యవాన్
అన్నాద్యకామస్త్వదితిం స్వర్గకామోదితేస్సుతాన్
విశ్వాందేవాన్ రాజకామస్సాధ్యాన్ సంసాధకోవిశామ్
ఆయుష్కామోఽశ్వినౌదేవౌ పుష్టికామ ఇలాంయజేత్
ప్రతిష్ఠాకామ పురుషో రోదసీ లోకమాతరౌ
రూపాభికామోగంధర్వాం స్త్రీకామోప్సర ఊర్వశీం
ఆధిపత్యకామస్సర్వేషాం యజేత పరమేష్ఠినం
యజ్ఞంయజేద్యశస్కామః కోశకామః ప్రచేతసం
విద్యాకామస్తుగిరిశం దాంపత్యార్థ ఉమాంసతీం
ధర్మార్థఉత్తమశ్లోకం తంతుం తన్వన్పితౄన్ యజేత్
రక్షాకామః పుణ్యజనానో జస్కామోమరుద్గణాన్
రాజ్యకామోమనూన్ దేవా న్నిరృతిం త్వభిచరన్ యజేత్
కామకామో యజేత్సోమ మకామః పురుషంపరం
అకామస్సర్వకామోవా మోక్షకామ ఉదారధీః
తీవ్రేణభక్తియోగేన యజేతపురుషంపరం
ఏతావా నేవ యజతా మిహ నిశ్రేయసోదయః
భగవత్యచలోభావో యద్భాగవతసంగతః.

భా. 2-3-2 to 11.

వర్గమనియుఁ బేరు. బహుదేవతా నిష్ఠ, లేక, భగవన్నిష్ఠయే త్రైవర్గిక ధర్మ లక్షణము. ఇందులకుదాహరణ మిచ్చుచున్నాను. వివాహమనున దొకకర్మము. సంతానోత్పత్తి దానికర్థము. సంతానోత్పత్తి కర్మరూపము వహించినపుడు (సంతతివారు పితృకర్మ చేయునపుడు) పిండ ప్రదానరూపమగు నర్థము సాధింపఁబడుచున్నది. పిండప్రదానము మఱలఁ గర్మరూపము వహించినపుడు పితృలోకతృప్తియను నర్థము కలుగుచున్నది. పితృలోకతృప్తిచే సంతానమునకు మంగళరూపమగు నర్థము సమకూఱుచున్నది. సంతాన శుభోదర్కము మఱలఁ గర్మరూపము వహించినచో నది యితరార్థములకుఁ గారణమగుచున్నది. ఇవన్నియు ననిత్యఫలజనకములు.* సంతాన సుఖము, తదుపరి మోక్షజనితశాంతి,—యీరీతిగ బ్రహ్మసుఖపర్యంతము ధర్మార్థశృంఖలము సాగుచుండును. బ్రహ్మసుఖము స్వప్రకాశభూతమై పరమపురుష సేవారూపమున నెపుడు పరిణమించుచున్నదో, అపుడర్థశృంఖలము పరిపూర్తిఁ జెంది చరమ ఫలరూపమగు పరమార్థలాభ మొక్కటియే చేయుచున్నది. అపవర్గశబ్దము నకు మోక్షమనియు, భక్తియనియు రెండర్థములు గలవు. మోక్షప్రాప్తిచే నాత్మ జడముక్తమగుచు నిత్య ధర్మరూపమగు భక్తి లాభమునొందును.

ధర్మ మెంతపర్యంత మర్థమును మాత్ర ముద్దేశించుచుండునో, అంత పర్యంత మా ధర్మ మార్థికమనియే చెప్పఁబడును. కాని యెపు డది పరమార్థము నుద్దేశించునో, అపుడు దానినిఁ బరమార్థ ధర్మమనియే చెప్పనగును.

---

* తావత్స మోదతే స్వర్గే యావత్పుణ్యం సమాప్యతే
క్షీణపుణ్యః పతత్యర్వాగ నిచ్ఛన్కాలచాలితః
కర్మాణిదుఃఖోదర్కాణికుర్వన్ దేహేన తైః పునః
దేహమా భజతేతత్ర కింసుఖం మర్త్యధర్మిణః
లోకానాం లోకపాలానాం మద్భయం కల్పజీవినాం
బ్రహ్మణోఽపి భయం మత్తో ద్విపరార్థపరాయుషః.
భా. 11.10.26, 29 & 30.

ఆర్థికధర్మమునకే నైతికధర్మమనియు, స్మార్తధర్మమనియు నామాంతరములు.

**ఆర్థిక పారమార్థిక ధర్మముల పృథక్త్వము.**

పారమార్థికవైధ ధర్మమునకే సాధనభక్తి యని పేరు. నైతిక, మఱంగా, స్మార్తధర్మమందు నిర్వర్తింపఁబడు నిజ్య, వందనము, సంధ్యోపాసనము, యజ్ఞేశ్వరపూజనము మున్నగు నీశారాధనములు పారమార్థికములుగావు. ఏమన, నట్టి నిత్యములును, నైమిత్తికములును నగు నీశ్వరపూజనములచే, ధార్మికుని జడస్వభావపుష్టియు, సామాజికోన్నతియుమాత్రమే సాధింపఁబడుచున్నవి. అర్థసంపాదనమే యీపూజలన్నింటికిని ఫలమగుటయు, నట్టి యర్థలాభము నొందినవెనుక నీపూజలతోఁ బనిలేకుండుటయు, స్పష్టమే కనుక నీపూజలు కర్మరూపములే యగుచున్నవి. స్మార్తధర్మనీతులలో నీశ్వరపూజనముగూడ నొకనీతిమాత్రమే యగుటచేతను, నిత్యభగవదనుశీలనలక్షణము దానియందు లేకుండుటచేతను, అది పారమార్థికవిధి కానేరదు. లోకమునందుఁ గనఁబడు శారీరిక, మానసిక, సామాజిక సుఖసాధనములగు కర్మలన్నియును నైతికములు. తాత్త్వికరూపమున నీశ్వరు నంగీకరింపక ప్రవృత్తిశోధన నైతికకార్యమందుపాసనారూపముగ నంగీకరించుటచేఁ దత్పూజనము త్రైవర్గికధర్మమే యగుచున్నది. నాస్తిక ప్రధానుఁడగు కాంప్టే (Compte) అనునతఁడు చిత్తశోధనమగు నీశోపాసనాపద్ధతి నొకదానిని వెలువరించెను. కర్మమార్గమందలి యీశ్వరారాధనముగూడ నించుమించుగ నిట్టిదే. యోగశాస్త్రమం దీశ్వర ప్రణిధానముచేఁ జెప్పఁబడిన యోగసిద్ధికూడ తద్రూపమైనదే. కాని భక్తిశాస్త్రమునందుఁ జెప్పఁబడిన వైధీభక్తి వ్యవస్థమాత్రము విశుద్ధమగు కేవలాపవర్గిక ధర్మము. బాగుగ విచారించినచో నైతిక (స్మార్త) మతమునను సంబంధించిన విధిమయమగు నార్థికధర్మమునకును, ఈశానుగత్యరూపమగు నిత్యవైధ పారమార్థికధర్మమునకును ఇంతింతని చెప్పుటకు వీలులేని తాత్త్వికభేదము కలదు. ఈతాత్త్వికభేదము కర్మస్వరూపమునకు సంబంధించినదికాక చిత్తమునందలి నిష్ఠకు సంబంధించినదిగఁ జెప్పఁబడుచున్నది. నిరీశ్వరనైతికుల

కును, గర్మక్రియులగు స్మార్తగణమును, గేవలనైతికనిష్ఠనే ప్రధానముగఁ జెప్పి విధిమయార్థిక ధర్మముయొక్క యవధిని సంకుచితపఱచి ధర్మార్థకామములనే ప్రధానములుగఁజేసి, యాధర్మమునకుఁ ద్రైవర్గికాకారమునిడిరి. వైధపారమార్థిక భక్తగణము వైధార్థిక ధర్మఫలములగు ధర్మార్థకామములకు మొదట నపవర్గ (మోక్ష)మును, దదుపరి నిరుపాధిక ప్రీతిరూపమగు నపర్యాప్తఫలలబ్ధియును, జేర్చి, యాధర్మవర్త్మమును వృద్ధిపఱచి దానికే యాకృతిఁగలిగించిరో అదికేవలము భిన్నమగునదనియే తెలియనగును. నైతికధర్మము వాస్తవముగఁ బారమార్థికధర్మమునందుఁజేరిన యొకఖండ ధర్మవిశేషము. వైధధర్మమున కెపుడు పూర్ణత్వముసిద్ధించెనో, అపుడది ముఖ్యవిధియను పేరువహించి పారమార్థికధర్మముగఁ బరిణతినొందుచున్నది.* ఆర్థికవైధధర్మమున కున్నతిలాభము కలిగినచో నదియే పారమార్థికవైధధర్మమగుచున్నది. ఈశానుగత్యరూపమగు జీవుని నిత్యధర్మము నార్థికవైధధర్మముతోఁ జేర్చినచో నార్థికవైధధర్మమనెడి ముకుళము పారమార్థికవైధధర్మరూపమున వికసించును. సంసారమందున్న జీవుఁడు పారమార్థికధర్మము నవలంబించినను వర్ణాశ్రమగతమగు నైధార్థికధర్మమును విడువఁగూడదు. వర్ణాశ్రమ ధర్మసాహాయ్యముచే శరీరము, మనస్సు, సమాజము ననేక విధములుగఁ బుష్టిలాభము నొందుచున్నవి. అట్టిపుష్టిగలిగి మనుజుఁడు స్వచ్ఛందవృత్తితో సుఖాసీనుఁడయ్యెనేని వానియాత్మ పరమేశ్వరారాధనమొనర్చుచు నిత్యానందలాభము నొందుచుండును.† వైధార్థికధర్మము కర్మకాండ

---

* సవైపుంసాం పరోధర్మో యతోభక్తిరధోక్షజే
అహైతుక్యప్రతిహతా యయాత్మా సుప్రసీదతి
వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః
జనయత్యాసు వైరాగ్యం జ్ఞానంచ యదహైతుకం.

భా. 1.2.6 & 7.

† అతఃపుంభిర్ద్విజశ్రేష్ఠా వర్ణాశ్రమవిభాగశః
స్వనుష్ఠితస్య ధర్మస్య సంసిద్ధిర్హరితోషణం.

భా. 1.2.13.

యనియు, వైధపారమార్థికధర్మము భక్తి, లేక, సాధనభక్తియనియుఁ జెప్పఁబడుచున్నవి. కావున వైజ్ఞానిక విచారమందు గౌణవిధిరూపమగు కర్మ మొకపర్వముగను, ముఖ్యవిధిరూపమగుభక్తి వేఱొకపర్వముగను జెప్పఁబడినవి.

భక్తిలాభమునకు ద్వివిధ ప్రథ.

ఇచట మఱియొకవిషయముగూడ విచారింపవలసియుండును. జీవునికి భక్తిలాభము గలుగుటకు మార్గములు రెండుగఁ జెప్పఁబడినవి. అందొకటి క్రమోన్నతి ప్రథయు, రెండవది యాకస్మికప్రథయును. శ్రీచైతన్య చరితామృతమున మధ్యఖండమందు శ్రీరూపగోస్వామికి శ్రీమన్మహాప్రభువు క్రిందవివరించిన క్రమోన్నతి ప్రథ నుపదేశించెను.

—జీవశ్రేణీవిభాగము.—

" — బద్ధులగు ♦ జీవు లసంఖ్యాకములు
వానియందుఁగననగు రెండగు స్థా ♦ వరజంగమభేదములు
కానిపించు జంగమములఁ దిర్య ♦ క్స్థలజలచరభేదములు
వానియందు నత్యల్పసంఖ్యగల ♦ వారలు నిజముగ నరులు
ఆనరులం దధికసంఖ్య బౌద్ధులు ♦ యవనపుళింద శబరులు
వేదనిష్ఠులందు సగమునందిది ♦ వేషధారివర్తనము
వేదగర్హ్యపాపరతులు; వారికి ♦ లేదు ధర్మచింతనము
ధర్మాచారము గల వారలలోఁ ♦ గర్మనిష్ఠులే మెండు
కర్మనిష్ఠు లొక కోటియందు నొ ♦ కజ్ఞాని మాత్రమె యుండు
కోటిజ్ఞాన నిష్ఠులయందుండు నొ ♦ కొరుఁడు ముక్తపురుషుండు
కోటిముక్త జనులం దరుదుగఁ జి ♦ క్కనొక కృష్ణభక్తుండు
శాంతలక్షణము గలది సుమ్మి ని ♦ ష్కామమగు కృష్ణభక్తి
శాంతిదూరుఁడగు భుక్తిముక్తి వాం ♦ ఛలుగల దోసపువ్యక్తి.

భక్తజీవన సర్వశ్రేష్ఠత్వము.

వృక్షాదులగు సకలస్థావరములును ఆచ్ఛాదితచేతనములు. తిర్యక్కులు, జలచరములు, స్థలచరములును, సంకుచితచేతనములు. పుళిందులు, సవరలు మున్నగు వన్యజాతులును, విజ్ఞానశిల్ప సభ్యతాసంపన్నులగు మ్లేచ్ఛగణములును, నీతిశూన్యులు. బుద్ధుఁడు మున్నగు నిరీశ్వర మానవగణము కేవల నైతికులు. హృదయముచేఁగాక నోటిచే వేదప్రమాణము నంగీకరించువారు కల్పితసేశ్వరనైతికులు. ధర్మప్రవర్తకులగు వారలే వాస్తవసేశ్వర నైతికులు. వారిలో నెవరెవరో విశుద్ధతత్త్వజ్ఞాననిరతులుగూడ నుందురు. అనేక తత్త్వజ్ఞానులలోఁ గొందఱుమాత్రమే జడబుద్ధిముక్తులు. కోటిజడబుద్ధిముక్తులలో నెవరో యొకరు భక్తిని స్వీకరింతురు. సేశ్వరనైతికులలోనైనను భోగరూపమగు కర్మఫలమును, ముక్తిరూపమగు జ్ఞానఫలమును, సిద్ధిరూపమగు యోగఫలమును నభిలషించువారికి మాత్రము శాంతముగలుగదు. కేవలశాంతమును గూర్చునది కృష్ణభక్తియనియే చెప్పవలెను. వన్యజాతులలోఁజేరిన నరగణము మొదట సభ్యత్వముఁజెంది జ్ఞానపరాయణులగుటయు, దదుపరి నీతిపరులగుటయు, దఱువాత నీశ్వరవిశ్వాసముకలిగి ధర్మప్రవర్తకులగుటయు, వారలు మఱల భుక్తిముక్తిసిద్ధిరూపములగు నవాంతరఫలములను లోఁబడక కృష్ణభక్తి నంగీకరించుటయును నరజీవనముయొక్క క్రమోన్నతికి వైధసోపానములనుచు శ్రీమన్మహాప్రభుని వాక్యములవలన మనకుఁ దెలియుచున్నది. ఇదియే సర్వశాస్త్రములయందును జెప్పఁబడిన నిర్మలవిధానమును, నిశ్చయఫలజనకమగు మార్గమును.

శ్రీసనాతన గోస్వామికి శ్రీమన్మహాప్రభువు ఆకస్మికీప్రథ నిట్లుపదేశించెను.

" తరియించును సంసారధర్మములు ♦ జరుపుచునే యొక సుకృతి
ఉరునదీజలస్థితకాష్ఠము తా ♦ నొక తటీ దటిఁ జేఱుగతి. "

కృష్ణకృప, సాధువులకృప, పూర్వసాధన ఫలమునకుఁ గలిగినవిఘ్నము తొలఁగిపోవుట, యను నీమూఁడిఁటివలన నాకస్మికీప్రథ కలుగుచున్నది.

అచ్యోటఁ గ్రహమోన్నతిప్రథ కుంఠితమగుచున్నది. సమస్త విఘులకును విధాత యగు శ్రీకృష్ణభగవానుని స్వతంత్రేచ్ఛయే దీనికి మూలకారణము. ఇది యుక్తిచే సమంజసమగునది కాదు. సమస్త విపరీతధర్మములును సమంజస లాభమునొందుచున్న తత్త్వమందే నరబుద్ధి నతిక్ర మించి యుక్తిగత విరోధములుగఁ దోఁచువిధి యును, అనుగ్రహమును నను నీరెండును గూడ సమంజసలాభము నొందు చున్నవి. నీతిరహితుఁడగు వ్యాధుఁడు నారదకృపచే వైధ నీతిమార్గము నాశ్రయింపకయే భక్తజీవనలాభము నొందెను. శ్రీరామచంద్రుని కృపచే నాటవికయగు శబరి భావభక్తి లాభము నొందెను. ఈమె వన్యజీవనమున కును, భక్తజీవనమునకును నడుమనుండు నవాంతర జీవనభేదముల నభ్యసింప లేదు. భక్తజీవనము ప్రాప్తించినంతనే సభ్యజీవన నైతికజీవనగతములగు సమస్త సదంశములును దజ్జీవనమున కలంకార స్వరూపములగుటలో సందే హము లేదను విషయము మనము గ్రహింపవలసియుండును. *

భక్త జీవనమందు సమస్తనైతికగుణములు ననుస్యూతములు.

---

* సత్సంగేనహిదైతేయా యాతుధానాః ఖగామృగాః
గంధర్వాప్సరసోనాగా స్సిద్ధచారణ గుహ్యకాః
విద్యాధరామనుష్యేషు వైశ్యా శ్శూద్రా స్త్రియోఽంత్యజాః
రజస్తమప్రకృతయ స్తస్మిం స్తస్మిన్ యుగేయుగే
బహవోమత్పదంప్రాప్తా స్త్వాష్ట్రికాయాధవాదయః
వృషపర్వాబలిర్బాణో మయశ్చాథవిభీషణః
సుగ్రీవో హనుమాన్ఋక్షో గజోగృధ్రో వణిక్పథః
వ్యాధఃకుబ్జావ్రజేగోప్యో యజ్ఞపత్న్యస్తథాపరే
తేనాధీతశ్రుతిగణా నోపాసిత మహత్తమాః
అవ్రతాత ప్తతపస స్సత్సంగా న్మాముపాగతాః
భా. 11.12.3 to 7.

ఆకస్మికప్రథ మిక్కిలి యరుదుగఁ గలుగునదియును, అచింత్యమును, కావున నది కలుగునను విశ్వాసముతో నుండక క్రమోన్నతి ప్రథ నవలంబించుటయే మానవుని కుచితము. అట్టిస్థితిలో నేదే నొక సమయమున నొకాస్మికప్రథ తనంతటఁ దాను సంభవమైనచో సర్వోత్తమేకదా?

క్రమోన్నతి ప్రథ ననుసరించి జీవుఁడు తాను బ్రస్తుతమే స్థితియందుండెనో, ఆస్థితికంటె నుచ్చమగు జీవన స్థితి యందుఁ బ్రవేశింపుటకు విశేష ప్రయత్నము సేయవలెను. స్వభావస్థములగుచు నేవైన మంగళ బీజము లెవనియందైన నున్నచోఁ దన్మూలమున జీవునికిఁ గాలక్రమమున నుచ్చగతి సంప్రాప్తించును. కాని యడుగడుగునందును విఘ్నములుంటచే ననేకస్థలములయందుఁ గాంక్షితఫలము లభింపకపోవచ్చును. కావున నుచ్చజీవనమునకై ప్రయత్నించువారు సర్వథా జాగరూకులై యుండవలెను. ఒక జీవన స్థితిని విడిచి వేఱొక జీవనస్థితియందడుగుపెట్టఁ దలఁచునతఁడు రెండు విషయములు బాగుగ గమనింపవలసి యుండును. మొదటి విషయమిద్దియనఁ, దా నేజీవన స్థితి నుండెనో అద్దానియందు దృఢస్థితి గలుగుటకు నిష్ఠను సంపాదించుట. రెండవది, తా నే జీవనస్థితియందు దృఢపడుఁడయ్యెనో దానిని వదలి యుచ్చ

క్రమోన్నతి కొఱకు నియమాగ్రము పరిత్యాజ్యము.

---

యం నయోగేన సాంఖ్యేన దానవ్రత తపోఽధ్వరైః
వ్యాఖ్యాస్వాధ్యాయసన్యాసైః ప్రాప్నుయా ద్యత్నవానపి
భా. 11.12.9.

తస్మాత్త్వముద్ధవోత్సృజ్య చోదనాం ప్రతిచోదనాం
ప్రవృత్తించ నివృత్తించ శ్రోతవ్యం శ్రుతమేవచ
మామేక మేవ శరణమాత్మానం సర్వదేహినాం
యాహి సర్వాత్మభావేన మయాస్యాహ్యకుతోభయః.
భా. 11.12.14 & 15.

జీవనస్థితియం దడుగిడఁ దలంచినపు డుచ్చ సోపానముపై నొకయడుగు దృఢముగ నిలిచిన పిమ్మటనే క్రిందిమెట్టుపై నున్న రెండవయడుగును దీసి పై మెట్టునఁ జేర్చుట. ఇట్లొనర్చినపు డేక సోపాన నిష్ఠాత్యాగము, నపరసోపాన నిష్ఠాప్రాప్తియు నొక్కకాలమందే సంభవించుచున్నది. పదార్పణము తొందరగఁ జేయఁబడినచోఁ గాలు జాటిపడుటయు, మిగుల విలంబముగఁ జేయఁబడినచో ఫలప్రాప్తి దూరీభూతమగుటయు, సంభవించును. వన్యజీవనము, సభ్యజీవనము, కేవల నైతికజీవనము, కల్పిత నేశ్వర నైతికజీవనము, సాధన భక్తి జీవనము మున్నగు నన్ని సోపానములను గ్రమోన్నతి విధి క్రమమున నతిక్రమించి జీవుఁడు ప్రేమమందిరమునఁ బ్రవేశించుచున్నాఁడు. ఏదే నొక సోపానముపైఁ దొందరగఁ బదార్పణము చేసినచో విఘ్నములు వాటిల్లి యధఃపతనము గలుగును. ఏదేనొక సోపానమున జాలము చేసినచో జీవుఁడు మందబుద్ధియై తన యున్నతిప్రాప్తినిఁ జెఱచుకొనును. కావున వ్యస్తతా విలంబములు రెండును విఘ్నములుగనే యెంచి, నిష్ఠాత్యాగ నిష్ఠాగ్రహణములు యథాయోగ్యములుగఁ జేయుచుఁ గ్రమపద్ధతిని జీవనోన్నతి సంపాదింపనగును. "కృపభక్తి నాకేలఁ గలుగలే" దనుచు ననేకులు దుఃఖించుట గలదుకాని తద్భక్తి సోపానమందుఁ బదార్పణము సేయుటకు వారెట్టిప్రయత్నమును జేయరు. అసభ్యావస్థయందునో, సభ్యతావస్థయనెడి జడవిజ్ఞానావస్థయందునో, లేక నిరీశ్వరనైతికము, సేశ్వర నైతికము లనఁబడు నవస్థలయందునో నిష్కారణముగఁ జిక్కువడి యున్నతి సాధనము నొనర్పరు.* ఒక సోపానమందే నిలువఁబడి దానిని వదలకుండువారల కుచ్చ సోపానలబ్ధియు, సౌధాగ్ర గమనప్రాప్తియు నెట్లు చేకూఱఁగలదు? వైధభక్త జనులనేకులు భావలబ్ధికొఱకుఁ బ్రయత్నమే సేయరు కాని యది రాలేదని

---

* అత్యాహారః ప్రయాసశ్చ ప్రజల్పో నియమాగ్రహః
జనసంగశ్చ లౌల్యంచ షడ్భిర్భక్తిర్వినశ్యతి.

శ్రీ ఉపదేశామృతమ్.

మాత్రము చింతపడుచుందురు. వర్ణాశ్రమాభిమానులగు ననేకులు వర్ణధర్మ నిష్ఠయందు మిక్కిలి యాసక్తి గలవారగుటచే భావప్రేమాది లాభముల యెడల నుపేక్ష వహించియుందురు. అందువలన వారల క్రమోన్నతికి వ్యాఘాతము సంభవించుచున్నది. కాని శ్రీచైతన్యశిక్షామృత లాభమునొందిన ధన్యాత్ములును, సుకృతులును, అతి శీఘ్రముగ నున్నతి లాభము నొందుదురు. మానవుని క్షుద్ర జీవితకాలమందయినను సామాన్య వర్ణాశ్రమ ధర్మ నిష్ఠనుండియే నిరుపాధికమగు ప్రేమరత్నము సహజముగ లభించుచున్నది. యథార్థక్రమోన్నతి విధి నవలంబించువారికి మఱియొక జన్మమెత్తవలసిన యవసరముండదు. కాని యెవఁడు తనజీవితమును భాగ్య ప్రవాహమున కప్పగించివేయునో, అట్టివాని జీవితము చచ్చిన చేఁపవలె భవసముద్రమును జేఱుకొని యందు దూఁగాడుచుఁ బోటువేళను బైకెగయుచు, పాటువేళను వెనుకకుఁ బోవుచునుండును. కాని యది గమ్యస్థానము నెన్నఁడును బొందజాలదు.*

జ్ఞాన కర్మాన్యాభిలాషాదులచే ననావృతమగు ననుకూల కృష్ణానుశీలనమే భక్తి.

పైనిఁ జెప్పఁబడిన రెండువిధములగు భక్తియొక్క సామాన్యలక్షణము వైధీభక్తియందు లక్షితమగుచున్నది. భక్తియొక్క సామాన్యలక్షణ మిట్లు చెప్పఁబడుచున్నది:— స్వవృత్తిని బుష్టి యొనర్చుకొను నభిలాషము తప్ప వేఱొక యభిలాషము లేక, జ్ఞాన కర్మాదులచే నావరింపఁబడక, అనుకూల భావమునఁ జేయు కృష్ణానుశీలనమే భక్తి యనఁబడును. † అనుశీల

---

* మాంహి పార్థ! వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేపి యాంతి పరాంగతిమ్.
కింపునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా
అనిత్యమసుఖంలోక మిమంప్రాప్య భజస్వమాం.
గీ. 9.32 & 33.

† అన్యాభిలాషితాశూన్యం జ్ఞానకర్మాద్యనావృతం
ఆనుకూల్యేన కృష్ణానుశీలనంభక్తిరుత్తమా.
భక్తిరసామృతసింధువు.

నమే భక్తిస్వరూపము. కర్మమార్గమందలి యే యీశ్వరానుశీలనము వర్ణాశ్రమ ధర్మ విచారమున వివేచింపఁబడుచున్నదో, అది నైతిక కార్యవిశేషముకాని భక్తి కాదు. తద్వివేచనమున నీతియే ప్రభువు. ఈశ్వరానుగత్యరూపమగు వృత్తి యీ ప్రభునియొద్ద దాసరూపమున నుండును. జ్ఞానమార్గమందు విచారింపఁబడు నిర్విశేషబ్రహ్మను గూర్చి చేయు ననుశీలనము శుష్క జ్ఞానమయము. ఇచ్చట జ్ఞానము ప్రభువు. ఈశానుగత్యరూపమగు వృత్తి దాస స్వరూపము. అది భక్తియే కాదు. కావున భగవదనుశీలనమే భక్తి. * ఆయనుశీలనముగూడ సర్వదా యానుకూల్య భావయుతమగుటయే యావశ్యకము. అనుశీలనము ప్రాతికూల్యమయమైనచో నది భక్తి యనఁదగదు. కావున జీవనమును భక్తి కనుకూలించుదానిగఁ జేసి భక్త్యనుశీలనము చేయుటయే యుచితము. సంసారమందుండు సమస్త జీవులకును శరీర సంబంధ జనితమగు కర్మయును, దేహాత్మ సంబంధ విచార రూపమగు జ్ఞానమును, అనివార్యములు. కాని భగవదనుశీలనము నీ జ్ఞానకర్మ లావరించెనేని భక్తి యచట నిలువఁజాలదు. ఈశానుగత్యరూపవృత్తి కెచ్చోట జ్ఞానకర్మలపైఁ బ్రభుత్వము సిద్ధించెనో, అచ్చోట భక్తికిఁ దావేర్పడుచున్నది.

---

* దేవానాం గుణలింగానా మానుశ్రవిక కర్మణే
సత్త్వఏవైకమనసో వృత్తిస్స్వాభావికీతుయా
అనిమిత్తా భగవతి భక్తిస్సిద్ధే ర్గరీయసీ
జరయత్యాసు యాకోశం నిగీర్ణమనలోయథా.

భా. 3.25.32 & 33.

మద్గుణశ్రుతిమాత్రేణ మయిసర్వగుహాశ్రయే
మనోగతిరవిచ్ఛిన్నా యథాగంగాంభసోఽంబుధౌ
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్
అహైతుక్యవ్యవహితా యాభక్తిః పురుషోత్తమే.

భా. 3.29.12 & 13.

భగవదనుశీలనమే జీవితముయొక్క ప్రధానకార్యమని వైధభక్త జనమెఱింగియున్నారు. సర్వదా అనుకూల భావముతోనే వారు భగవదనుశీలన మొనరింతురు. భయముచేఁగాని, ద్వేషముచేఁగాని ప్రేరితులై యనుశీలన మొనరింపరు. ప్రీతి సహితమగు ననుశీలనమే యొనరింతురు. దీని నే యానుకూల్యమందురు. వర్ణాశ్రమధర్మము నాశ్రయించి వారలు జీవయాత్ర నిర్వహించు కాలమునఁ దద్ధర్మమూలమగు నీతిని బ్రధానముగను, భగవదనుశీలనము నప్రధానముగను సేయక, తదనుశీలనమునకు నీతినే పరిచారికను జేసి నైతిక వ్యవహార మొనరింతురు. ఆత్మ జడాతీతావస్తువనియును, చిత్తత్త్వమనియును, స్పష్టముగ ననుభవనీయమగుటకై తాము సేయు జ్ఞాన విచారము భగవదనుశీలనమునకు దాస రూపముగ నుంతురుగాని తదనుశీలన వృత్తిపై నది ప్రభుత్వస్థాపనము చేయుట కంగీకరింపరు. సంసారమందుండి వారలు సేయు కర్మలును, జ్ఞానవిచారమును, వారల భక్తికున్నతి సాధనములగుటకే యుద్దేశింపఁబడినవిగాని వేఱొక యభిలాషతోఁ జేయఁబడినవి కావు. ఇదియే వైధ భక్తజనుల జీవనము.

ఆత్మ మూలమును, కృష్ణాను శీలనానుగత్యమును నగు దేహమనో చాలనమే వైధీభక్తి.



## తృతీయవృష్టి—ద్వితీయధార.

---

### భక్త్యనుశీలనవిధి.

---

శ్లో. జిహ్వైకతోఽచ్యుత! వికర్షతిమా వితృప్తా
శిశ్నోఽన్యత స్త్వ గుదరం శ్రవణం కుతశ్చిత్
ఘ్రాణోఽన్యతశ్చపల దృక్క్వచ కర్మశక్తిః
బహ్వ్యస్సపత్న్య ఇవ గేహపతిం లునంతి.

వర్ణాశ్రమరూపధర్మము నాచరింపుచు జీవయాత్ర సేయుచుండు వైధభక్తజనము తమచిత్తమును కృష్ణపాద పద్మములయందుఁ జేర్పుటకు సదాప్రయత్నము సేయుచుందురు. ఇదియే భక్తియోగము.*

భక్తియోగము.

---

* సర్వతో మనసోఽసంగమాదౌ సంగంచసాధుషు
దయాం మైత్రీం ప్రశ్రయంచ భూతేష్వద్ధాయథోచితం
శౌచం తపస్తితిక్షాంచమౌనం స్వాధ్యాయమార్జవం
బ్రహ్మచర్యమహింసాంచ సమత్వం ద్వంద్వసంజ్ఞయోః
సర్వత్రాత్మేశ్వరాన్వీక్షాం కైవల్యమనికేతతాం
వివిక్తచీరవసనం సంతోషం యేనకేనచిత్
శ్రద్ధాం భాగవతేశాస్త్రే నిందామన్యత్ర చైవహి
మనోవాక్కర్మదండంచ సత్యం శమదమావపి
శ్రవణం కీర్తనం ధ్యానం హరే రద్భుత కర్మణః
జన్మకర్మగుణానాంచ తదర్థేఽఖిలచేష్టితమ్
ఇష్టం దత్తం తపోజప్తం వృత్తం యచ్చాత్మనః ప్రియం
దారాంత్సుతాన్ గృహాన్ప్రాణాన్ యత్పరస్మై నివేదనం.

భా. 11.3.27 to 32.

వైధభక్తగణమునకు భగవదనుశీలనమే కర్తవ్యము. అది యైదు విధములు.

—పంచవిధవైధభక్తి.—

(1) శరీరగతానుశీలనము.
(2) మనోగతానుశీలనము.
(3) ఆత్మగతానుశీలనము.
(4) ప్రకృతిగతానుశీలనము.
(5) సమాజగతానుశీలనము.

ఈ యైదింటిని నేను క్రమానుసారముగ విచారింతును. మొదట శరీరగతానుశీలనముగూర్చి చెప్పెదను. శరీరగతానుశీలన మేడువిధములు (బాహ్యేంద్రియ సముదాయముగూడ దీనిలోఁ జేరినదే).

సప్తవిధదైహికానుశీలనము.

(1) శ్రవణగతానుశీలనము.
(2) కీర్తనగతానుశీలనము.
(3) ఆఘ్రాణగతానుశీలనము.
(4) దర్శనగతానుశీలనము.
(5) స్పర్శగతానుశీలనము.
(6) స్వాదుగతానుశీలనము.
(7) అంగగతానుశీలనము.

వీనిలో శ్రవణగతానుశీలనము మఱల మూఁడువిధములు.

—త్రివిధ శ్రవణగతానుశీలనము.—

(1) శాస్త్రశ్రవణము.
(2) భగవన్నామ శ్రవణము, లేక, భగవద్విషయక సంగీతశ్రవణము.
(3) భక్తిపూరకోపన్యాస శ్రవణము.

---

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.

గీ. 9.26.

భగవత్తత్త్వవిచార శ్రవణమును, భగవల్లీలాది వర్ణనరూపమగు శ్రీమద్భాగవత గ్రంథమును వినుటయు, వైష్ణవజీవన చరిత్రములు వినుటయు, వైష్ణవ గృహములందుఁ బురాణములను, ఇతిహాసములను వినుటయు శాస్త్ర శ్రవణ మనఁబడును. అవైష్ణవసిద్ధాంతముల నవలకుఁద్రోచి మహానుభావులచే రచియింపఁబడిన సకల తత్త్వగ్రంథములను వేదాంత తాత్పర్యసహితముగ వినుటయే ప్రధానభగవదనుశీలన కార్యముగ నెఱుఁగనగును. భగవద్భక్తియే సర్వశాస్త్రముల తాత్పర్యము. ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వతారూపఫలము, అర్థవాదము, ఉపపత్తి యను నీయాఱును శాస్త్రతాత్పర్యమును బోధించుటకు లింగములని చెప్పఁబడుచున్నవి. ఈ యాఱులింగములచే నిర్దేశింపఁబడిన హరిభక్తియే సమస్తవైదికశాస్త్రముల తాత్పర్యము.

కేవల మింద్రియతృప్తి కొఱకుఁగాక భగవల్లీలావర్ణన మూలమున భక్తివృత్తికిఁ బుష్టికలిగించు సకలవిధములగు సంగీతములునువినుట యుక్తము. కర్ణేంద్రియమున కానందము గల్గించునట్టియు, విషయవాంఛలతో నిండియున్న చిత్తమునకు విషయానురక్తినిఁ బెంపొందఁజేయునట్టియు, సంగీతమును దూరముగవిడిచిపెట్టవలెను. భగవత్సేవా కాలములయందు జరుగుచుండు గీతావాద్య వందనాదికములను వినుట లాభకరము.

**పంచవిధ కీర్తనగతానుశీలనము.**

కీర్తనగతానుశీలనము మిగుల నుత్కృష్టమైనది. భక్తిశాస్త్రసంబంధ కీర్తనము, నామలీలాది కీర్తనము, విజ్ఞప్తి, జపము నని కీర్తనమైదువిధములు. నామలీలాది కీర్తనము, ఉపన్యాసరూపముగను, గథారూపముగను, వ్యాఖ్యారూపముగను, గీతారూపముగను, నిర్వర్తింపనగును. విజ్ఞప్తి ప్రార్థనమయమనియు, దైన్యబోధకమనియు, లాలసామయమనియు, మూఁడువిధములు. మంత్రముయొక్క సులఘూచ్చారణమే జపము.

**ఆఘ్రాణ గతానుశీలనము.**

భగవదర్పితములగు పుష్పచందన తులసీధూపమాల్య కర్పూరాది గంధద్రవ్యముల నాఘ్రాణించుటచే ఘ్రాణేంద్రియ మూలమగు భగవదనుశీలనము చేయఁబడుచున్నది. అనర్పిత ద్రవ్యాఘ్రాణముచేఁ దుష్టమగు నింద్రియ విషయరాగమే వృద్ధిఁబొందుచున్నది. ఇయ్యది ప్రయత్నపూర్వకముగఁ ద్యజింపవలెను.

**దర్శన గతానుశీలనము.**

శ్రీవిగ్రహదర్శనము, తత్కృపాదృష్టిలాభము, భగవద్భక్తదర్శనము, భగవత్తీర్థ భగవన్మందిర భగవద్యాత్రాది దర్శనము, భగవత్తత్త్వస్మారకములగు చిత్రాదిదర్శనము మున్నగువానిచే దర్శన గతానుశీలనము సేయుట కర్తవ్యము. దర్శనేంద్రియవృత్తి జీవునికి బహిర్ముఖరూపాది దర్శనప్రాప్తి మాత్రము గలిగించి యతనిని విషమ విషయకూపమునఁ ద్రోచివేయును; కావున దానినిఁ బరిత్యజింపవలెను. లోకమునందుఁ గననగు సమస్త విషయములందును భగవత్సంబంధమును గ్రహింపుట కర్తవ్యము.

**స్పర్శ గతానుశీలనము.**

త్వగింద్రియమూలమున స్పర్శకార్యమగుచున్నది. బహిర్ముఖ శరీరములను, ద్రవ్యములను దాఁకుటమాని, సేవాకాలమున భగవన్మూర్తి స్పర్శాహ్లాదమును బొందుటయే వైధభక్తజనులకుఁ గర్తవ్యము. భగవద్భక్తజనులను స్పర్శించుటచేతను, ఆలింగనము సేయుటచేతను, ఇంతయని చెప్పుటకు వీలులేని సుఖము కలుగుచున్నది. స్పర్శేంద్రియము మిగుల బలవత్తరమైనది. దానిమూలముననే జీవున కసత్సంగము, స్త్రీ సంగము మున్నగు పాపములు సంభవింపుచున్నవి. భగవద్భక్తులనుదప్ప నితరుల నెట్టిసందర్భములయందైనను స్పర్శింపమను దృఢప్రతిజ్ఞను భక్తజనులు సదా కలిగియుండవలెను. కేవల శరీరమాత్రస్పర్శయే స్పర్శయనిపించుకొనదు. శరీరసంలగ్న మూలమునఁ జిత్తమునకును, ఇంద్రియముల

కును, ఏది సుఖము కలిగించునో అదియే స్పర్శము. స్పర్శేంద్రియమే కాక సమస్తేంద్రియ కార్యములను స్పర్శశబ్దముచే సంగ్రహింపఁబడుచున్నవి.

ప్రసాదాస్వాదనమనియు, శ్రీచరణామృతాస్వాదనమనియు, స్వాదుగతానుశీలనము రెండువిధములు. భక్తజనము భగవత్ప్రసాదమును దప్ప మఱిదేని నారగింపరాదు. రసనమును బహిర్ముఖ వస్తుభక్షణమందే వినియోగింపుచుండినచోఁ గ్రమముగ బహిర్ముఖతావస్థయే ప్రబలమగును. భగవత్ప్రసాదము, భగవద్భక్తప్రసాదమునను నీరెండే యారగింపఁదగినవియును, భక్తివృత్తికిఁ బుష్టిఁగలిగించునవియును.

స్వాదుగతానుశీలనము.

అంగగతానుశీలనము పండ్రెండు విధములు:—

—అంగగతానుశీలనము.—

(1) తాండవము.
(2) దండప్రణామము.
(3) అభ్యుత్థానము.
(4) అనువ్రజ్య.
(5) అధిష్ఠానస్థానగమనము.
(6) పరిక్రమము.
(7) గురుజన పరిచర్యయు, భక్తజనపరిచర్యయు.
(8) శ్రీమూర్తిపరిచర్య.
(9) అర్చనము.
(10) భగవద్భావమిశ్రిత పుణ్యజలస్నానము.
(11) వైష్ణవ చిహ్నధారణము.
(12) హరినామాక్షరధారణము.

తాండవమునకు నృత్యమని పేరు. దండమువలె నేలను సాష్టాంగపడి భగవన్నుతి చేయుటయే దండప్రణామము. శ్రీవిగ్రహదర్శనము కొఱకును,

భగవద్భక్తుల దర్శనముకొఱకును, దానెదురుపోయి వారిని సంభావింపుటయే అభ్యుత్థానము. వారలను వెన్నంటినడచుటయే యనువ్రజ్య. శ్రీమందిరములు, భగవత్తీర్థములు, వైష్ణవాలయములు మున్నగు సవధిష్ఠానస్థానములు. వానిం దర్శింపుటకై ప్రయత్నపూర్వకముగ మనము పోవలయును. నిర్దిష్టములగు నుపకరణములతో భగవంతునిం బూజించుటయే యర్చనము. భగవచ్చింతనముసేయుచు గంగా యమునా ప్రభృతినదులయందు స్నానము సేయుటయే పుణ్య జలస్నానము. గురువు ప్రసాదించు తిలకము, మాలికలు మున్నగు వైష్ణవ చిహ్నములును, శరీరమునందుఁ జందనముతో హరినామాక్షరములును ధరింపుట వైధభక్త జనులకందఱకును శ్రేయస్కరము.

**దైహికానుశీలన మంతయు భక్తిమిశ్రిత మగుటయే కర్తవ్యము.**

ఇన్నివిధములగు శరీరగత భగవదనుశీలనము వైధభక్త జనులకుఁ గర్తవ్యరూపమునఁ జెప్పఁబడెను. బద్ధజీవుఁడు శరీరోపాధి గలవాఁడు కావున నాశరీరమున కేవిధముచేతను బహిర్ముఖతావస్థ రాకుండుటను, అది సుసంపన్నముగ నుండుటను, ఏ యే కార్యము లొనర్పవలెనో, అవియన్నియు భగవద్భావ మిశ్రితములుగ నాచరింపఁబడినచోఁ దన్మాత్రమున భగవదనుశీలనము పుష్టియగును. ఇదియే వీని తత్పర్యము.

**పంచవిధ మానసికానుశీలనము.**

ఇఁక మనోగతానుశీలనము విచారింపుదము. శరీరగతములగు సమస్త కర్మములును మనఃకర్మములే యగుచున్నవి. కాని మనోగతములగు కొన్నికర్మములు శరీరచేష్టలరూపముగ వ్యక్తము కాకయుండును. ఆకర్మములన్నియును మనోగతములను నామముపొంది శరీరగతములగు కర్మలకంటె వేఱుగఁ జెప్పఁబడుచున్నవి. స్మృతి, చింత, చిత్తస్రమత, భావము, జిజ్ఞాస, జ్ఞానసంగ్రహము ననునవి శుద్ధమనోగత కార్యములుగ నిర్ణయింపఁబడినవి. మనోగతానుశీలన మైదువిధములు:—

(1) స్మృతి (2) ధ్యానము (3) శరణాపత్తి (4) దాస్యము (5) జిజ్ఞాస.

స్మృతి.

నామస్మృతి, మంత్రస్మృతి యని స్మృతి రెండు విధములు. తులసీ మాలచే సంఖ్యాక్రమమున హరినామము చేయుట నామ స్మృతి. వ్రేళ్లపై లెక్కించుచుఁ జేయు మంత్రస్మరణమునకు మంత్ర స్మృతి యని పేరు.*

ధ్యానము.

స్మృతికిని, ధ్యానమునకును గల భేదమేమనిన స్మృతియందు నామ మంత్రముయొక్క రూపము, గుణము, లీల మున్నగునవి యస్పష్టరూపమున నుదయించును. ధ్యానమందు రూపము, గుణము, లీల మున్నగునవి సుస్పష్టరూపమునఁ జింతనము చేయఁబడుచున్నవి. ధ్యానము దీర్ఘకాలము నిలిచినచో ధారణయగును. ధ్యానము గాఢమైనచో నిధిధ్యాసమగును. కావున ధ్యానమే ధారణానిధి ధ్యాసలను గ్రోడీభూత మొనర్చుచున్నది.

శరణాపత్తి.

శరణాపత్తిగూడ మనోగత కార్యవిశేషమే. సమస్త ధర్మాధర్మములను విడిచి జీవుఁడు శరణాపన్నుఁ డగుట యొక భక్తివిశేషము.† వైధభక్తగణ మంతటి యధికారలాభమును బొందుటలేదు. భగవంతుఁ

---

* యేతుసర్వాణి కర్మాణి మయిసన్న్యస్య మత్పరాః
అనన్యేనైవయోగేన మాంధ్యాయంత ఉపాసతే
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్
భవామి సచిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్.
గీ. 12-6 & 7.

† సర్వకర్మాణ్యపి సదాకుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్.
గీ. 18-56.

డొక్కఁడే యాశ్రయింపఁదగినవాఁడను నిశ్చయబుద్ధియే వారలకు శరణాపత్తి యగుచున్నది. కర్మజ్ఞానముల సాయముతో వారికిఁ బనిలేదు.

భగవద్దాస్య మొక మానసిక భావము. *

దాస్యము. వైధభక్తగణము రస విశేషాంతర్గతమగు దాస్యమును సంపూర్ణముగఁ జవిచూడఁ జాలరు.

జిజ్ఞాస యనునది భక్తజనులకుఁ బ్రధానకార్యము. † భగవత్తత్త్వ జిజ్ఞాస కలిగినంతనే మొదట గురుపాదాశ్రయమును, దదుపరి దీక్షయు, వెనుక భజనప్రక్రియా జ్ఞానమును బొందనగును. తత్త్వజిజ్ఞాసచేఁగాక

జిజ్ఞాస.

మఱి యేవిధముగ బద్ధజీవుఁడు శ్రేయోలాభము పొందఁగలఁడు? సద్ధర్మము గూర్చి ప్రశ్నించుటయే ప్రధానాంగముగ భక్తిశాస్త్రమునందు వర్ణింపఁబడుచున్నది.

ఆత్మగతానుశీలన మీక్రింద వివరించినరీతిగ నాఱువిధములు.

(1) సఖ్యము.
(2) ఆత్మనివేదనము.
(3) భగవంతునికొఱకే సమస్తకర్మల నాచరింపుట.
(4) అవసరమగునంతవఱకే విషయ స్వీకారము.
(5) భగవంతునికై సర్వభోగవర్జనము.
(6) సాధుమార్గానువర్తనము.

---

* మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు
మామేవైష్యతి సత్యంతే ప్రతిజానే ప్రియోసి మే.

గీ. 18.65.

† భక్త్యామామభిజానాతి యావాన్ యశ్చాస్మితత్త్వతః
తతోమాం తత్త్వతోజ్ఞాత్వా విశతే తదనంతరమ్.

గీ. 18.55

వైధభక్తజనులకు సంబంధించి చెప్పఁబడిన యాత్మ పరిచయమందు జడబద్ధమగు నాత్మ చెప్పఁబడినది కాని జడముక్తాత్మ చెప్పఁబడలేదు. పరిశుద్ధాత్మకుఁ బ్రాకృతాహంకారముండదు. వైధభక్త జనులయాత్మ, జడబంధనమునుండి విడివడుటకుఁ బ్రయత్నింపుచుండును. అందువలన వారలకుఁ బ్రాకృత సంబంధము తెగిపోవుచున్నను బ్రాకృతాహంకారము మాత్రము వారలను విడువదు. * అట్టి యవస్థయందుండు నాత్మ వైధభక్తి సాధనకాలమందుఁ దన సంబంధమగు నొక భావవిశేషమును విచారించును; అట్టి విచారమునకు నాత్మగత భగవదనుశీలనమని పేరు.

వైధభక్తుఁ డప్రాకృతాహంకారమునుండి సంపూర్ణముగ ముక్తుఁడు కాఁడు.

మొదట భగవంతుఁడు తన కత్యంతప్రియ సఖుఁడను భావము కలుగును. కాని యాసఖ్యము రసగత సఖ్యముకంటె భిన్నమైనది. ఈ సఖ్యమే రసగత సఖ్యమునకు బీజస్వరూపము.

వైధభక్తుని యాత్మగత భగవదనుశీలనము.

భగవంతుని పాదపద్మమం దాత్మ తన సర్వస్వమును నివేదించును. "నాదని చెప్పునదంతయు నేను భగవంతుని కర్పించివేసితి" నను నిశ్చయ బుద్ధి కలిగి వైధభక్తుఁ డాత్మరక్షణమునుగూర్చి ప్రయత్నింపఁడు. శరీరగత మనోగతములగు కర్మల నతఁ డేవేవి చేయునో, అవియన్నియు భగవంతుని నుద్దేశిం

దేహ మన ఆత్మలు భగవంతుని కొఱకే నియోజ్యములు.

* వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే

చిన్ను చేయుచుండును. తన భార్య, మిత్రుఁడు, గృహము, పశువులు, ధనము, సంపత్తి, శరీరము, మనస్సు మున్నగునవన్నియును భగవత్సేవ కొఱకగు నుపకరణములని యతఁడు తెలిసికొనును. "సమస్త విషయములు భగవంతునివే. వానిలో నేవి నాకు మిక్కిలి యావశ్యకములో, వానిని భగవత్సేవయం దుపయోగించు నిమిత్తమే నేను భగవంతునివద్దనుండి ప్రసాదరూపమున స్వీకరించితిని. ఇంతకుమించి యితర ద్రవ్యములతో నాకుఁ బని లేదు" అని తత్కాలమం దతఁడు భావించుచుండును. భగవంతునికొఱకతఁడు సమస్త భోగములును బరిత్యజించును.

సాధువర్త్మానువర్తనము.

పూర్వులును, వారికిఁ బూర్వులును నగు భక్తజను లేది సాధుమార్గమని స్థిరపఱచిరో దానినే తాను స్వీకరించి శక్తివంచనము లేకుండ దాని ననువర్తించును.

వైధభక్తుఁడు శరీరగత మనోగతాత్మగతానుశీలనము చేయుటచేతనే సంతుష్టి నొందఁడు. ఏమన శరీరమనఆత్మల

దేశకాల ద్రవ్యగత భగవదనుశీలనము.

కతిరిక్తమును, ఆవరణరూపమును నగు నొక ప్రాకృత జగత్తతనికి దృష్టిగోచర మగుచున్నది. అతఁడిట్లనుకొనును.—"నాశరీరమును, శరీరాంతర్గతమగు నా మనస్సును, ఆత్మయు నీజగత్తునందు సూక్ష్మాతి సూక్ష్మములగు క్షుద్రాంశములు. ఈజగమంతయు నాప్రభువును గూర్చియే చింతనము సేయుగాక. నాకన్నులతో నేను ఏ యనంతకాలమును, అనంతదేశమును జూచుచున్నానో, వెండియు వస్తు స్వరూపములుగ నేయే ద్రవ్యములను గనుచున్నానో, అవియన్నియు నాప్రభుని యర్చనమునకై సామగ్రులగునుగాక.

---

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి
సమఃసర్వేషు భూతేషు మద్భక్తిం లభతేపరామ్.

గీ. 18.52 to 54.

ప్రభువు నాకన్నులయెదుట సర్వత్ర నాట్యమాడుచుండునుగాక. మఱియు సమస్త వస్తువులును ప్రభుని నుపాసింపుటకే నియోగింపఁబడును గాక." అను నిట్టిభావములు గలిగి ద్రవచిత్తుఁడై యతఁడు దేశకాల ద్రవ్య గత భగవదనుశీలనము సేయుచుండును.

ప్రకృతిగతానుశీలన మిూఁక్రింద వివరించినరీతిని మూఁడువిధములు:—

(1) దేశగతానుశీలనము *

(2) కాలగతానుశీలనము †

(3) ద్రవ్యగతానుశీలనము ‡

దేశగతానుశీలనము—తీర్థభ్రమణము, తీర్థవాసము.

విష్ణుసంబంధములగు తీర్థములకుఁ బోవుట, భగవదధిష్ఠానములగు స్థానములకుఁ బోవుట, వైష్ణవుల గృహములను, జీర్ణాలయములను దర్శింపుటకై యాత్రవెడలుట, అని దేశగతానుశీలనము మూఁడువిధములు. ద్వారక, పురుషోత్తమ క్షేత్రము (శ్రీ జగన్నాథము), కాంచి, మథురామండలము, శ్రీ నవద్వీపమండలము మున్నగునవి విష్ణుసంబంధతీర్థములు. ఆయాస్థానములయందు భగవల్లీలా కథనము కర్ణగోచరమగుచుండును. దానియందు శ్రద్ధగలిగి యాయా తీర్థములందుఁ గ్రుమ్మఱుటయు, నేదే నొక తీర్థమునందు వాసము సేయుటయును,

---

* అథ దేశాన్ప్రవక్ష్యామి ధర్మాదిశ్రేయ ఆవహాన్
స వై పుణ్యతమో దేశ స్సత్పాత్రం యత్రలభ్యతే.
భా. 7.14.28.

† తప్తే శ్రేయసః కాలానృణాం శ్రేయోవివర్ధనాః
కుర్యాత్సర్వాత్మనైతేషు శ్రేయోఽమోఘంతదాయుషః.
భా. 7.14.25.

‡ పాత్రంత్వత్ర నిరుక్తం వై కవిభిః పాత్రవిత్తమైః
హరిరేవైక ఉర్వీశ యన్మయం సచరాచరమ్.
భా. 7.14.35.

కర్తవ్యములు. భగవచ్చరణామృతరూపయగు గంగానదియందును, భగవత్సేవాపరాయణయగు యమునానదియందును శ్రద్ధతో స్నానము సేయనగును. ఏయే స్థానములయందు భగవంతుని యర్చావతార రూపమగు శ్రీమూర్తిసేవనము జరుగుచుండునో, ఆస్థలముల కన్నిటికిని బోవలయును. పరమభాగవతులగువారల గృహములును, గ్రామములును, సకల స్థానములును, సదా వైష్ణవ జనపాలసములును, ఆశ్రితములు నగును. శ్రీ చైతన్యదేవుని పార్శ్వవర్తులగు మహానుభావుల జన్మస్థానములును, నివాస స్థానములును ప్రయత్నపూర్వకముగ దర్శింపనగును. ఈ సకల తీర్థములకుఁ బోవుచు, నందు నివసింపుచు, నచ్చటఁ బ్రతిదినమును భగవత్కథలను, భగవద్భక్తుల కథలను వినుచుండినచో భగవంతుఁడగు శ్రీకృష్ణచంద్రునియం దనురాగము జనించును.

కాల గతానుశీలనము, శ్రీహరి వాసర ప్రభృతి.

కాలగతానుశీలనము సర్వదా విధిగా జేయఁదగినది. పదునైదు దినములు సంసారసంబంధమగు నానావిధ కార్యములను నిర్వర్తించిన వెనుక హరివాసరమందు నిద్రాహారములు విడిచి భగవదనుశీలనము సేయుట జీవునకి ముఖ్యకర్తవ్యము. దినమంతయు హరిలీలాప్రసంగములతోఁ గడపుట మిగుల శ్రేయస్కరము. బరమభాగవతుల జీవితములందే యే పెద్దపెద్ద ఘటనలు గలవో, తత్సంబంధములగు దినములనుగాని, తిథులనుగాని పరిపాలింపుట యత్యంత కర్తవ్యము.

ద్రవ్య గతానుశీలనము, ధాత్రాశ్వత్థ గో విప్రపూజనము.

ద్రవ్యగత భగవదనుశీలన మనేకవిధములు. వానిని లెక్కింపుట ద్రవ్యములను లెక్కింపుటవలెనే చాలఁ గష్టము. కావున వానిలోఁ గొన్నిటి నుదాహరించినచో సముదాయజ్ఞాన మేర్పడుచున్నది. వృక్షమునన దొక ద్రవ్యవిశేషము. ఆద్రవ్యమునందు భగవదనుశీలనము చేయవలయుననిన నత్యంత పవిత్రము

అగు రావి, యుసిరిక, తులసి మున్నగు వృక్షములందు భగవచ్చింతనము సేయనగును. శ్రీమూర్తి యొక ద్రవ్యవిశేషము. కావున జీవుని శుద్ధచిత్తమందుఁ బ్రతిఫలించిన భగవత్స్వరూపమునుయొక్క

**శ్రీమూర్తి సేవనము.**

యవతారరూపమగు నా శ్రీమూర్తిని సేవించుట మిగులఁ గర్తవ్యము. పర్వతములలో గోవర్ధన పర్వతమును, నదులన్నిఁటిలో గంగా యమునా నదులును, బశుగణమందు గోవులును, గోవత్సములును, భగవదనుశీలనమునకు నిదర్శనస్వరూపములు.* మానవ వ్యవహారమందు శయనము, ఆసనము మున్నగువాని నుపయోగించు సమస్త సామగ్రులును, అట్లే చందన గంధ ద్రవ్యాదులును, వస్త్ర తైజస పర్యంకాది సముదయమును, శ్రీమూర్తి సేవనార్చనాసమయములం దుపయోగమునకై భగవంతునికర్పింపఁదగినవిగ నిర్దేశింపఁబడినవి. ఎవరెవరికే ద్రవ్యము లతిప్రియములో, ఆయా ద్రవ్యములు భగవదర్పితములైనచో వైధసేవనము సర్వాంగ సుందరమగును. శ్రీమూర్తు లష్టవిధములు.† వైధభక్తుని దృష్టి యెట్లుండుననినఁ, దన శరీరమన ఆత్మలతోడను,

**అష్టవిధశ్రీమూర్తులు.**

వ్యావహార్యములగు దేశకాల ద్రవ్యములతోడను, దాను భగవదనుశీలనము సేయుచుండియును, అట్లు చేయుటచేఁ దన కపారమగు నానందము గలిగియుండియును, దన యనుశీలనమం దింకను గొంచెము కొఱఁతయున్నదనియే చెప్పుచు చిత్త

---

* తస్మాత్పాత్రంహి పురుషం యావానాత్మాయథేయతే
దృష్ట్వా తేషాంమిథో నృణా మవజ్ఞానాత్మ నాంనృప!
త్రేతాదిషు హరేరర్చా క్రియాయై కవిభిఃకృతా.
భా. 7-14-39 & 40.

† శైలీదారు మయీలౌహీ లేప్యాలేఖ్యాచసైకతీ
మనోమయీమణిమయీ ప్రతిమాష్టవిధాస్మృతా.
భా. 11-27-12.

క్షోభము నొందను. ఇతరమానవులతోఁ దనకట్టి సామాజిక సంబంధము గలదో దాని ననుసరించి భగవదనుశీలనము చేసినచోఁ దనకుఁ బూర్ణసుఖము ప్రాప్తించునను సభిప్రాయముతో నతఁడు సమాజగతానుశీలన విధిని గూడ నేర్పఱచెను. *

సమాజగతానుశీలనము నాలుగు విధములు. ఎట్లన,

—నాల్గువిధములగు సమాజగతానుశీలనము.—

(1) సద్గోష్ఠీమహోత్సవము.
(2) వైష్ణవ జగత్సమృద్ధి.
(3) వైష్ణవ సంసార పత్తన నిర్మాణము, ఉన్నతి కరణము.
(4) వైష్ణవధర్మము సర్వజీవులకును బోధించు ప్రయత్నము.

భక్తసహవాసమును, వారలతోఁ గూడి మహోత్సవాదు లొనర్చుటయును.

పరమేశ్వర భక్తులతో సహవాసము సేయుట, వారలతోపాటు ప్రసాద మారగించుట, హరికథలు వినుట, హరిగానము సేయుట మున్నగు నానా ప్రకార శుద్ధానందజనకములగు కార్యము లాచరింపుచు మహోత్సవాదులు జరుపనగును. అట్టి భక్తులలో మధుర రసానుభవము గలవారున్నచో వారలచే శ్రీమద్భాగవత ప్రభృతి రసగ్రంథముల యర్థము తెలిసి

శ్రీమద్భాగవతార్థాస్వాదనము.

కొననగును. సద్గోష్ఠీవిచారమందు భక్తాపరాధము కలుగకుండుటకై రెండు విషయములు బాగుగ గమనింపఁదగును. వైష్ణవాపరాధవిషయమై మన మతి జాగరూకతతో నుండవలయునని శ్రీమన్మహాప్రభువు సెలవిచ్చెను. పూర్తిగఁ గపటస్వభావము గలవారలను బహిర్ముఖులుగ భావించి పరిత్య

* ఏవం కృష్ణాత్మనాథేషు మనుష్యేషుచ సౌహృదమ్
పరిచర్యాం చోభయత్ర మహత్సు నృషు సాధుషు.
భా. 11-3-33.

జింపుటొకటి. * సరళస్వభావము గలవారితో సద్వ్యవహారము సేయుట రెండవది. అట్టివారితోఁ జేయనగు వ్యవహారము మఱల రెండువిధములు. మొదటిది సేవనమును, రెండవది మర్యాదయును. యథార్థవైష్ణవుని సహవాసము దొఱికినచో వానితో నంతరంగ సంగమును, వాని కంతరంగ సేవయు నొనర్పవలెను. సామాన్య వైష్ణవుల నందఱను మర్యాద మాత్రము సేయనగును. ఆ మర్యాదకూడ బహిర్ముఖ సేవారూపమున నవశ్యముగఁ జేయవలయును. సాధారణ వైష్ణవుల నందఱను మూఁడు విధములుగ విభజింపవచ్చును.

బహిర్ముఖ సంగ త్యాగము.

ప్రకృత వైష్ణవులను సేవింపుటయు, సాధారణ వైష్ణవులను మర్యాదసేయుటయును.

—సాధారణ వైష్ణవులు త్రివిధము.—

(1) తాము వైష్ణవులు కాకున్నను భక్తితత్త్వమే సర్వోత్తమమైనదని సిద్ధాంతము సేయువారు.

(2) తాము యథార్థవైష్ణవులు కాకున్నను వైష్ణవులయెడల శ్రద్ధకలిగి వైష్ణవ చిహ్నములను, వైష్ణవాభిమానమును గలుగువారు.

(3) తాము ప్రకృతవైష్ణవులుగాక, వైష్ణవాచార్యుల వంశమందు జన్మించి వైష్ణవ చిహ్నములను వైష్ణవాభిమానమును అంగీకరింపువారు.

కృష్ణభక్తి యెవనియందెంతవట్టు నిర్మలమును, గాఢమునునై యొప్పుచుండునో, ఇతరులయెడలఁ దనశక్తి నెవఁ డెంతవట్టు వినియోగింపఁగల సమర్థుఁడో, అతఁ డంతవట్టు ప్రకృతవైష్ణవుఁడు. విమలనగు కృష్ణ భక్తి కొంచెమైనను హృదయమందుఁ గలుగు

విమలకృష్ణభక్తియు, నితరులకు శక్తిసంచార మొనర్చు సామర్థ్య

* తతోదుస్సంగముత్సృజ్య సత్సుసజ్జేతబుద్ధిమాన్
సంతఏవాస్య ఛిందంతి మనోవ్యాసంగముక్తిభిః
భా. 11.26.26.

మును ప్రకృతవైష్ణవ వాఁడు ప్రకృతవైష్ణవుఁడగుటకు సందేహములేదు.

**ప్రకృతవైష్ణవ లక్షణములు.** వైష్ణవునియొక్కయు వైష్ణవసంగము, వైష్ణవ మర్యాదయొక్కయు నిరూపణ చేయఁబడినది. దీనిని గమనింపక వైష్ణవుఁడు కాని వానిని వైష్ణవునిగ భావించి వానితో సంగమును, వానికి మర్యాదయుఁ జేసినయెడల భక్తి క్షీణించిపోవును.* కాఁబట్టి

**కపటభక్తసంగము భక్తిక్షయకారి.** వైష్ణవచిహ్నములు ధరించువారిలోను, వైష్ణవాభిమానము కలవారిలోను, క్రిందవివరించిన వారలనుమాత్ర మవశ్యముగఁ బరిత్యజింపనగును. అట్టివారలయెడల గౌణవిధియందుఁ జెప్పఁబడిన సర్వజన సామాన్యమర్యాదనే నెఱపి వారలను సంతోషపెట్టవలెను. వారలను భక్తగోష్ఠులలోనికిఁ దోడ్కొనిపోరాదు. "సంయోగి" వైష్ణవులను చేరితో వ్యవహరింపఁబడువారు శుద్ధభక్తులైనప్పుడే శుద్ధవైష్ణవ సంగయోగ్యులు కాఁగలరు :—

—కపటవైష్ణవులు.—

(1) కేవలము కొంటెతనముకొఱకు వైష్ణవచిహ్నములు ధరించువారు.

(2) వైష్ణవుల కభేదవాదమును బోధించు నుద్దేశము మనమున నిడుకొని వైష్ణవాచార్య పరంపర లోనివారుగఁ దమ్ముఁగూర్చి చెప్పుకొనువారు.

(3) అర్థలోభముచేఁగాని, ప్రతిష్ఠాలోభముచేఁగాని, లేక నేదైన భోగవాంఛగలిగిగాని వైష్ణవపక్షములోని వారుగఁ దమ్ముఁగూర్చి చెప్పుకొనువారు.

---

* కృష్ణేతి యస్యగిరి తం మనసాద్రియేత,
దీక్షాస్తిచేత్ ప్రణతిభిశ్చ భజంతమీశం
శుశ్రూషయాభజన విజ్ఞమనన్య మన్య,
నిందాదిశూన్యహృద మీప్సితసంగలబ్ధ్యా.

శ్రీఉపదేశామృతమ్.

తన యాశయముల కనురూపములగు నాశయములుగల స్నేహితులతోఁ దప్ప నితరులతో రసప్రసంగము లెన్నఁడును జేయరాదు. వైష్ణవలోకమును విస్తరింపఁ జేయు సందర్భమున వైష్ణవసంగమునే తప్ప నితర సంగమును గోరరాదు. తాను బెండ్లాడిన స్త్రీకి వైష్ణవ సంప్రదాయమునందే దీక్షనిప్పించి తన శక్తివంచనములేకుండ వైష్ణవతత్త్వమామెను బోధింపవలెను. ఎంతటి ధన్యాత్మునికోగాని వైష్ణవ పత్నీలాభము సంభవింపదు. అట్టి వైష్ణవ పత్నితోఁగూడి వైష్ణవజగత్సమృద్ధి నొనర్చుచుండెనేని బహిర్ముఖవిషయచింతనను మఱికలుగనేరదు. తనకు బిడ్డలుకలిగిరేని వారినందఱను భగవద్దాసులనియే పిలువ నగును. భగవద్దాసులసంఖ్యను వృద్ధిపఱచుచుంటినని తా నానందింపు చుండుట యుక్తము.

బహిర్ముఖ సంసారము, వైష్ణవ సంసారమును

బహిర్ముఖుల సంసారమునకును, వైష్ణవసంసారమునకును, నిష్ఠాభేదముతప్ప నాకారభేదమేమియు లేదు.

నిష్ఠామాత్ర భేదమే కాని యాకృతిభేదము లేదు.

బహిర్ముఖుఁడగు వ్యక్తికూడ వివాహ మాడును; ధనార్జనము నేయును; ఇల్లు గట్టుకొనును; న్యాయదృష్టితో సకలకార్యములు నిర్వహింపును; మఱియు సంతానవంతుఁడుఁగూడ నగును. కాని యతని నిష్ఠ యెట్లుండుననిన, నీరీతిగఁ దా నొనర్చునందులకు ఫలముగ నైహిక సుఖవృద్ధియో, ఆత్మసుఖవృద్ధియో తప్ప వేఱొండు సంకల్పింపఁబడదు. వైష్ణవులుగూడ బహిర్ముఖులవలెనే సమస్తకార్యములొనర్చుచున్నను వానిఫలముఁ దా మభిలషింపరు; భగవత్సేవారూపముగనే ఆయా కార్యములను నిర్వహింతురు. కావున వైష్ణవజీవనము శాంతి భూయిష్ఠముగ నుండును. బహిర్ముఖుల జీవితాదర్శము లున్నతిలాభమును, భుక్తిముక్తులు నగుటచేఁ దత్సంబంధములగు కామక్రోధములకు వారు సదావశులగుట వలన వారలకు శాంతిగలుగదు. వైధభక్తిగణము వైష్ణవ సంసారములను స్థాపించి యుఁ దన్మూలమున భక్తిచింతనము లోకమందు సమృద్ధమగుటకై తదున్నతి సాధన మొనరింతురు.

సర్వజీవులయెడలను దయఁ గలిగియుండుట యనునది వైష్ణవప్రధాన భూషణము. సకలజీవులను వైష్ణవులనుగఁ జేయ వలయునను నాత్రముతో వార లనేకోపాయము లాలోచింపుచుందురు. జీవులకుఁగల పరస్పర సంబంధము యోజించువిషయము నాలుగువిధము లగు భేదము గలది.

సర్వజీవుల యెడ దయయే వైష్ణవ స్వభావము.

(1) ప్రేమ (2) మైత్రి (3) కృప (4) ఉపేక్ష.

పరమేశ్వరుని కర్పించునది ప్రేమ. శుద్ధ భగవద్భక్తులయెడఁ జూపునది మైత్రి. కనిష్ఠాధికారులయెడలను, బహిర్ముఖులగు జీవులయెడలను నెఱపునది కృప.* ఏజీవులు తమభాగ్యవశతచే సాధుసంగలాభమునొంది భక్తిమార్గమునఁ బోవుటకు యోగ్యులగుచున్నారో, అట్టి వారియెడలఁ బరమభాగవతు లపరిమితకృపనుజూపుచు, వారికిఁ బరమార్థశిక్షనిడి శక్తిసంచారపూర్వకముగ వారి నుద్ధరింతురు. మందభాగ్యులగు కొందఱు ఖండవిజ్ఞానసంపన్నులై కుతర్కములుచేయుచు నేవిధముననైన నాత్మోన్నతి ప్రయత్నమొనర్పరు. వారలయెడల నుపేక్షకలిగియుండుటే కర్తవ్యము.

---

* ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సుచ
ప్రేమమైత్రీ కృపోపేక్షాయః కరోతి సమధ్యమః.

భా. 11-2-46.



# తృతీయవృష్టి—తృతీయధార.

## అనర్థవిచారము.

శ్లో. నైషాంమతిస్తావ దురుక్రమాంఘ్రిం
స్పృశత్య నర్థాపగమో యదర్థః
మహీయసాం పాదరజోభిషేకం
నిష్కించనానాం నవృణీత యావత్.

వైధ భక్తియందు భక్తికి ప్రతికూలములగు నిషిద్ధాచారములు త్యాజ్యములు.

పూర్వోక్తమగు నైదువిధములచేఁ జెప్పఁబడిన భగవదనుశీలనము వైధభక్తజనులకుఁ గర్తవ్యకర్మము. కర్తవ్యకర్మమాచరింపుచుండినను దానికి వ్యాఘాతములు గలిగించు నిషిద్ధాచారములు గొన్నిగలవు. వానినిఁ బ్రయత్నపూర్వకముగ వర్జింపుటగూడ వారికిఁ గర్తవ్యమే. నిషిద్ధాచారములు క్రిందవివరించిన రీతిగఁ బది విధములు :—*

—దశవిధ నిషిద్ధాచారములు.—

(1) బహిర్ముఖ జన సంగము.†
(2) అనుబంధము.

---

* నాసచ్ఛాస్త్రేషు సజ్జేత నోపజీవేత జీవికాం
వాదివాదాం స్త్యజేత్తర్కాన్ పక్షంకంచిన్న సంశ్రయేత్
నశిష్యాననుబధ్నీత గ్రంథాన్నైవాభ్యసేద్బహూన్
నవ్యాఖ్యాముపయుంజీత నారంభా నారభేత్క్వచిత్.
భా. 7-13.7 & 8.

† సత్సంగాచ్ఛనైస్సంగ మాత్మజాయాత్మజాదిషు
విముంచేన్ముచ్యమానేషు స్వయం స్వప్నవదుత్థితః.
భా. 7-14-5.

(3) మహారంభాద్యుద్యమము.
(4) బహుగ్రంథ కళాభ్యాసము, వ్యాఖ్యానవాదమును.
(5) కార్పణ్యము. *
(6) శోకాదులకు వశీభూతమగుట.
(7) అన్యదేవతల నవమానపఱచుట. †
(8) సకలభూతములకు నుద్వేగము కలిగించుట.
(9) సేవాపరాధము, నామాపరాధమును.
(10) భగవన్నిందయు, భాగవతనింద ననుమోదించుటయు, ప్రేరేపించుటయును.

—షడ్విధ బహిర్ముఖ జనము—

(1) బహిర్ముఖజను లాఱువిధములు, ఎట్లనిన:—
(i) నీతిరహితులును, ఈశ్వర విశ్వాసరహితులును.
(ii) నీతియుక్తులయ్యును, నీశ్వరవిశ్వాసము లేనివారు.
(iii) ఈశ్వరుని నీతికధీనునిగఁజేయు సేశ్వరనైతికులు.
(iv) మిథ్యాచారులు, లేక, దాంభికులు (బైడాలవ్రతులు, బకవ్రతులు, వారలచే వంచింపఁబడినవారును.)

---

* జిహ్వైకతోఽచ్యుత వికర్షతిమా వితృప్తా
శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్
ఘ్రాణోఽన్యతశ్చపల దృక్క్వచ కర్మశక్తి
ర్బహ్వ్యస్సపత్న్య ఇవ గేహపతిం లునంతి.

భా. 7-9-40.

† హరిరేవ సదారాధ్యోయత స్సర్వేశ్వరేశ్వరః
ఇతరే బ్రహ్మరుద్రాద్యా నావజ్ఞేయాః కదాచన
ముముక్షవో ఘోరరూపాన్ హిత్వాభూతపతీ నథ
నారాయణ కలాశ్శాంతా భజంతిహ్యనసూయవః

భక్తిరసామృతసింధువు.

(v) నిర్విశేషవాదులు.

(vi) బహిరీశ్వర వాదులు.

నీతిని, ఈశ్వరునిఁగూడ నంగీకరింపనివారు వికర్మ (లేక, అకర్మ) పరాయణులు. నీతిలేనివారు స్వేచ్ఛావిహారమం

నీతిహీనులును, నిరీశ్వర వ్యక్తులును.

దాసక్తిగలిగియుందురు. ఇంద్రియసుఖ సంపాదనము కొఱకును, స్వార్థసాధనము కొఱకును, నీతిహీనులును, నిరీశ్వరులు నగువారు లోకమున కనేకవిధములగు నమంగళములను గలిగింతురు. కొందఱు వ్యక్తులు నీతినంగీకరింతురుగాని యీశ్వరు నంగీకరింపరు. ఈశ్వర విశ్వాసరహితమగు నీతి సర్వథా భయశూన్యమును, కర్తవ్యపూర్ణమునని వారు వాదింతురు. ఈశ్వర విశ్వాసమందు నీతి యొక ప్రధానాంగమని వారలెఱుంగరు. ఈశ్వరవిశ్వాసము లేనిచో నైతికవిధానమంతయు వ్యర్థమగును. ఈవిషయము ఫలకాలమున స్పష్టపడును. నిరీశ్వరనైతికులు తమ యవసరమునుబట్టి తమ నీతిని స్వార్థమునకు బలియిడరను నమ్మకమెక్కడిది?

నైతిక నిరీశ్వరవ్యక్తులు, లేక, నిరీశ్వర కర్ములు.

వారి నడవడినిఁ బరీక్షించినచో వారల పనికిమాలిన యూహలన్నియుఁ దేటఁబడఁ గలవు. స్వార్థబలము ప్రబలమై తమ నీతికి విరుద్ధముగఁ దోఁచినచో, "నటనుండి నఱుకొని ర" మ్మనిన రీతిగఁ దమనీతినే ముందుగ బలిదానమిత్తురు. రెండవతెగలోని వారు నిరీశ్వరకర్ములు. మూఁడవతెగలోని బహిర్ముఖులు సేశ్వరకర్ములు. ఈసేశ్వర కర్ములందు మఱల రెండుతెగలు.

సేశ్వర కర్ములందు రెండుతెగలు.

నీతివర్తనమం దీశ్వరవిశ్వాసము తమప్రధాన కర్తవ్యములలో నొకదానిగ నెంచుచు నీశ్వరుని యస్తిత్వమంగీకరింపనివారు మొదటితెగ. వీరు ఈశ్వరు నొకనినిఁగల్పించి తమనీతి ఫలప్రదాయియగుటకు వానికి శ్రద్ధాపూర్వక ప్రణిధానమొనర్చి నీతిఫలమగు సత్ప్రవర్తనము తమకుఁ గూడినంతనే యీ

శ్వరు నవలకుఁ ద్రోచివైతురు. రెండవ తెగకుఁ జేరిన నేశ్వరకర్మల మత ప్రకార మీశ్వరోపాసనారూపమగు సంధ్యావందనాది కార్యములొనర్చినచోఁ జిత్తశుద్ధికలుగును. చిత్తశుద్ధిచే బ్రహ్మజ్ఞానముగలుగును. బ్రహ్మజ్ఞానముగలిగినపిదప జీవునికి వేఱొండుకర్తవ్యములేదు. కావున నీశ్వరునితో జీవునికిఁగల సంబంధము పాంథసంబంధముమాత్రమే; నిత్యసంబంధమెన్నఁటికిని గాదు. ఈవిధముగ నీరెండుతెగల వారి భక్తియు బహిర్ముఖ భక్తియగుచున్నది.

వీరందఱును భక్తికి బహిర్ముఖులు.

మిథ్యాచారులు నాలుగవ తెగలోని బహిర్ముఖులు. వీరు బైడాలవ్రతికులు, తద్వంచితులు నని రెండు విధములు. బైడాలవ్రతికులకు నిజమగు భక్తియుండదు. కాని భక్తిచిహ్నములను మట్టుకు వారు సదా ధరింతురు. తమ మనస్సులందేవో కొన్ని దురాలోచనములుండ నేయుండును. ఆయాలోచనములు తెలిసినచో వాస్తవ భక్తులు వారలను జాలఁ దిరస్కారభావముతోఁ జూతురు. లోకమును వంచించుటకై యీబైడాలవ్రతికులు భక్తిపేరు వెట్టి యొక యధర్మమార్గమును లోకమునకుఁ బ్రదర్శింతురు. అజ్ఞానులనేకులు వారలబహిర్వేషముఁజూచి వంచితులై వారలమార్గము నవలంబించి భగవద్బహిర్ముఖులగుదురు. బయటికి దివ్యములగు భక్తిచిహ్నములు, సర్వదా భగవన్నామము, లోకవిషయములం దనాసక్త్యభినయము, సమయస్ఫూర్తిగల సంభాషణములు—యివన్నియు గోచరింపుచుండును. లోపల కాంతాకనకములయందలి వ్యామోహము మున్నగు భయంకరములగు నాంతరంగిక పాశములు పనిసేయుచుండును. ఇట్టి సంప్రదాయము లనేకము లచ్చటచ్చటఁ గలవు.

అక్లే, కపటాచారులును, గనక కామినీప్రతిష్ఠాలోలుపులును.

నిర్విశేషవాదు లైదవ తెగకుఁ జేరిన బహిర్ముఖులు. వారి మతము ప్రకారము భక్తినాచరింపుటచేఁ జిత్తశుద్ధి గలుగును. చిత్తశుద్ధిచే తత్త్వము స్పష్టీభూతమగును. ముక్తియే తత్త్వము. జీవుని సర్వనాశనమే

నిర్విశేషవాదులు.

ముక్తి. జీవనామముగల విశేషము నాశనమై పూర్ణమందు లీనమైనచో నొక నిర్విశేషావస్థ కలుగును. వారిమతమందు భక్తియు, భగవంతుఁడును ననిత్య పదార్థములు. దాస్యబోధ కేవలము సాధనమేకాని ఫలముకాదు. ఇచ్చట వారిమతముఁగూర్చి విపులముగ విచారింపఁబడదు కాని సంక్షేపముగాఁ జెప్పు నదేమన నీమతావలంబులు భక్తజనులదృష్టియందు బహిర్ముఖులు; కావున వర్జనీయులు. వారలను విడువనిచో వారలసాంగత్యమున భక్తినాశనమగును.

బహీశ్వరవాదులు. బహీశ్వరవాదుల కేకనిష్ఠ సహజముగ నుండదు కావున వారల సాంగత్యముచేఁగూడ భక్తినిష్ఠ చెడిపోవును.*

ఈయాఱుతెగలగు బహిర్ముఖజనులతో వైధభక్తజనులు సాంగత్యము సేయరాదు.

సంగమననేమి? ఒకసభయందు వారలతోఁగలసి కూర్చుండుటయు, ఒకయోడనెక్కి నదీప్రయాణ మొనర్చుటయు, ఒక్కరేవున వారితో స్నానము సేయుటయు, ఒకయంగడియందువారితోపాటు క్రయవిక్రయములు చేయుటయు, సంగమనిపించుకొనదు. ఒకానొకవ్యక్తితో నాంతరంగిక సోదర భావమున వ్యవహరింపుటే సంగమనఁబడును.† ఇట్టిసంగము బహిర్ముఖ జనులతోఁ జేయరాదు.

---

* యథాతరోర్మూలనిషేచనేన, తృప్యంతి తత్స్కంధ భుజోపశాఖాః
ప్రాణోపహారాచ్చ యథేంద్రియాణాం, తథైవ సర్వార్హణ
మచ్యుతేజ్యా.
భా. 4.31.14.

† దదాతి ప్రతిగృహ్ణాతి గుహ్యామాఖ్యాతిపృచ్ఛతి
భుఙ్క్తేభోజయితేచైవ, షడ్విధం ప్రీతిలక్షణం.
శ్రీ ఉపదేశామృతమ్.

(2) అనుబంధము వైధభక్తజనుల కొక నిషిద్ధాచారము. అనుబంధము నాలుగు విధములు:—ఎట్లన,

(i) శిష్య మూలానుబంధము

(ii) సంగి మూలానుబంధము

(iii) భృత్య మూలానుబంధము

(iv) బాంధవ మూలానుబంధము

ధన జనలోభములచే ననధికారులగువారలను శిష్యులుగ స్వీకరింపుట వలన సంప్రదాయమునకుఁ గళంకము గలుగును. కావునఁ దగిన పాత్రుఁడు దొరకనిచో వైధభక్తులు శిష్యగ్రహణమే చేయరాదు.

భక్తుఁడు కానివానితో సహవాసము చేసిరేని వైధభక్తుల కనేకములగు ననర్థములు వాటిల్లును. కావున సంగిగ్రహణము సేయకుండుటయే వారికి మేలు. ముఖ్యముగ నభక్తులతోడి సంగము సేయరాదు.

భగవత్పరాయణులుగాని భృత్యులను సంగ్రహింపుటచే మిక్కిలి కీడు వాటిల్లును.

ఎవరితోనైనను నూతన బాంధవము సేయఁదలఁచినప్పుడువారు భక్తులగుదురో లేదో, వారల భక్తి యెట్టిదో ఎంతటిదో జాగరూకతతోఁ బరీక్షింపసగును.

(3) మహారంభాద్యుద్యమము మూఁడవస్థలయందుఁ బూర్తిగఁ బరిత్యాజ్యము. ఉద్యమకర్తకుఁ ధనాభావము గలిగినప్పుడా యుద్యమము నట్టె విడువవలెను. ముసలితనమానసన్నమై జీవిత సమాప్తికాలము తటస్థించుచున్నపుడు పెద్ద పెద్ద కార్యములు తలపెట్టరాదు.

మహారంభాదిప్రయాసము పరిత్యాజ్యము.

అనేకులు తోడ్పడినకాని యేకార్యము చేయసాధ్యపడదో, అట్టి సాహాయ్య సంపత్తికి సులభోపాయ మెచ్చట లేదో, అట్టికార్యము నుద్యమించుట వలన నెట్టి శ్రేయస్సును లేదు. మీఁదు మిక్కిలి తన హరిభజనమునకు

వ్యాఘాతము గలుగును. మఠము, ప్రార్థనగృహము, మందిరము, సభాగృహము మున్నగు పెద్దపెద్ద కట్టడముల నిర్మాణము పైనిఁ జెప్పినరీతిని దుస్సాధముగఁ దోఁచినచో దానివిషయమై ప్రయత్నముగూడఁ జేయరాదు.

బహుగ్రంథ కళాభ్యాస వ్యాఖ్యాన వర్జనము.

(4) భక్తగణము భక్తిశాస్త్రమును, దదనుగతములగు జ్ఞానకర్మ శాస్త్రములను బఠింపవలెను. కాని కాలము చాలదని చెప్పుచు ననేక గ్రంథములలో నొక్కొక్క యంశము మాత్రము చదివి విడిచిపెట్టరాదు. చదువనెంచిన గ్రంథమును సమగ్రముగఁ జదువనిచోఁ గేవల నిరర్థకవాద పరాయణత్వమేర్పడి చివరకుఁ దర్కపండితులలోఁ బరిగణింపఁబడుదురు. ఏదైన నొక యుపన్యాసమునుగాని, వ్యాఖ్యానమునుగాని, వినినంతనే యందలి మంచి చెడ్డల నేమియు నాలోచింపక యందువిషయమై ప్రతివాదములు మొదలిడు స్వభావముగలవారు కొందఱుందురు. భక్తజనుల కిది మిగుల నిషిద్ధకార్యము.

త్రివిధకార్పణ్యము.

(5) భక్తజనులకుఁ గార్పణ్య మత్యంత దూషణీయము. వ్యవహారకార్పణ్యము, అర్థకార్పణ్యము, శ్రమ కార్పణ్యము నని కార్పణ్యము మూఁడు విధములు.

అభ్యుత్థానము, అంతస్స్నిగ్ధతయుఁ బ్రకటింపుచు వైష్ణవులతో వ్యవహరింపవలెను. లౌకిక సన్మాన పురస్కారములు నెఱపుచు బ్రాహ్మణులతో వ్యవహరింపవలెను. యథాయోగ్యముగ వస్త్రములను, ఉత్తరీయములను నిడి పాల్యగణమును సత్కరింపవలెను. సరియగు మూల్యము నిడి యితరుల ద్రవ్యమును గ్రహింపవలెను. కరశుల్కాదులిడుచుఁ బరిపాలకులకుఁ దోడ్పడవలెను. సత్కరించినవారియెడలఁ గృతజ్ఞత చూపుటయు, దరిద్రులకన్నాదు లిడుటయు, రోగుల కౌషధదానము, శీతార్తులకు వస్త్రదానము మున్నగునవి యొనర్పుటయు సద్వ్యవహారలక్షణము. లోకమునందలి వ్యవహార యోగ్య

లందఱితోడను యథాసాధ్యముగ వ్యవహరించినచోఁ గార్పణ్యదోషము గలుగదు. వారల కిచ్చుట కేమియు లేనిచో మధురవాక్యములచేతనైన నందఱను సంతోషము కలుగునట్లు వ్యవహరించిన నదే చాలును. మధుర భాషలచేఁ గొందఱితోడను, అర్థదానముచేఁ గొందఱితోడను, దేహశ్రమచేఁ గొందఱితోడను, సద్వ్యవహారము సలుపవలెను. వ్యవహారకార్పణ్యము భక్తుల విషయమున నిషిద్ధము.

(6) వశవర్తిత యనున దొక ప్రధానదోషము. అది నాలుగు విధములు:—ఎట్లన,

—చతుర్విధ వశవర్తిత్వము.—

(i) శోకాదులకు వశమగుట.

(ii) అభ్యాసమునకు వశమగుట.

(iii) మాదకాదులకు వశమగుట.

(iv) కుసంస్కారములకు వశమగుట.

శోకాదులకు వశవర్తిత్వము.

సంసారమునఁ బడియున్న జీవులకు శోకము, క్షోభము, క్రోధము, భయము, లోభము, మోహము మున్నగునవి కలుగుచుండుటకు లెక్కలేని కారణములుగలవు. వైధభక్తుల కట్టి కారణములు కలిగినను వారు శోకాదులకు వశవర్తులు కాఁగూడదు. అందువలనఁ దమకు లాఘవము గలుగుటయేకాక భక్తివిచారమునకు సంపూర్ణవ్యాఘాతము కూడఁ గలుగును. కావున నిందువిషయమై భక్తుఁడు జాగరూకుఁడై యుండవలెను.

అభ్యాసములకు వశవర్తిత్వము.

పగలు నిద్రించుట, సూర్యోదయమైన వెనుకఁ గూడ నిద్రింపుచుండుట, అకారణ తాంబూలచర్వణము, అకాలపానము, భోజనము, అకాలశౌచాదిగమనము, ఉత్తమ శయ్యలపైఁ బరుండుట, ఉత్కృష్ట పదార్థముల నారగించుట

మున్నగు నభ్యాసములకు లోఁబడెనేని కొంతకాలమునకు వానికవరోధములు గలిగినప్పుడు చాలవ్యసనము గలుగును. ప్రాణధారణమున కెంతవఱకావశ్యకమో, అంతమాత్రమే విషయభోగము సేయుచు నిట్టి యభ్యాసములకు వైధభక్తుఁడు వశీభూతుఁడు కాఁగూడదు. మాదకద్రవ్యములను సేవింపుటచే ననేకములగు ననర్థములు కలుగును. విశేషించి యట్టి యభ్యాసములకు వశీభూతుఁడైనవానికి సోపాధికభక్తియే కలుగుచున్నది. మద్యము, గంజాయి, నల్లమందు, చరస్, సిద్ధి, గుళి యనెడి మాదకముల విషయమై చెప్పనక్కరయేలేదు నశేగదా తుదకుఁ బొగాకు కూడ భక్తుఁడు తాఁకరాదు. ఇట్టివి సేవింపుట భక్తిశాస్త్రమునకు విరుద్ధము.. ధూమపత్రసేవనమునకు మిక్కిలి యలవాటు వడినవారు దానికి బానిసలై తత్సేవనాభిలాషతో దుస్సంగమందైనఁ జేరుదురు. *

మాదకములకు వశవర్తిత్వము.

కుసంస్కారములకు లోఁబడి ప్రవర్తించుటొక యుత్పాతమువంటిది. కుసంస్కారములచే పక్షపాతబుద్ధి కలుగును. పక్షపాత మెప్పుడు కలిగెనో సత్యమునం దాదరము మఱి యుండదు. † భక్తచిహ్నములను ధరించుట వైధభక్తిలో నొకయంగముగఁ జెప్పఁబడినది. దానిచే దేహగత భగవదనుశీలనము నిర్వర్తింపఁబడుచున్నది.

కుసంస్కార వశవర్తిత్వము.

---

* లోకేవ్యవాయామిషమద్యసేవా, నిత్యాస్తుజంతోర్నహితత్రచోదనా
వ్యవస్థితిస్తాసు వివాహయజ్ఞ సురాగ్రహైరాసు నివృత్తిరిష్టా.
యేత్వనైవం విదోసంత స్తబ్ధాస్సదభిమానినః
పశూన్ద్రుహ్యంతి విస్రబ్ధాః ప్రేత్యఖాదంతితేచ తాన్.

భా. 11-5-11 & 14.

† యేకైవల్యమసంప్రాప్తాః యేచాతీతాశ్చమూఢతాం
త్రైవర్గికాహ్యక్షణికా ఆత్మానం ఘాతయంతితే.

ఇట్లుండ నా చిహ్నధారణమే భక్తికిఁ బ్రధాన లక్షణమను నిశ్చయబుద్ధి యెపుడైనఁ గలిగినచో నదియే సంప్రదాయ పక్షపాతరూపమగు కుసంస్కారమగుచున్నది. ఇట్టి కుసంస్కారమూలమున చిహ్నరహితులగు సాధు భక్తజనులయెడల ననాదరబుద్ధి కలుగుచున్నది. దీనికి ఫలితమేమన, దన సంప్రదాయమందుఁ దనకు సాధుసంగలాభము చిక్కనపుడీ కుసంస్కారమూలమున నన్యసంప్రదాయములయందైన సాధుసంగ లాభముకొఱకుఁ బ్రయత్నింపుటకు బుద్ధిపుట్టదు. సాధుసంగముచేఁ దప్ప వేఱొకవిధముగ భక్తియున్నతిలాభము పొందుటకు మార్గమే లేదు. కావున నిట్టి కుసంస్కారము భక్తుని కుత్సితప్రాయమగుచున్నది. మఱియును, వర్ణాశ్రమ ధర్మ సంలగ్నత యను కుసంస్కారమునకు వశవర్తుఁడైనవానికి దానికంటె నుచ్చగతి రూపమగు భక్తితత్త్వమం దభిరుచి జన్మింపదు. మీఁదు మిక్కిలి తమ యాత్మనాశమునకే హేతువగు భక్తవిద్వేషము కూడ సంభవించితీఱును.

దేవాంతర విద్వేషము నిషిద్ధము.

(7) ఇతరదేవతల నవమానపఱచు టత్యంత నిషిద్ధకార్యము.* భగవదవతారములనియు, భగవదధికార ప్రాప్తజీవులనియు, నవతారములు రెండువిధములు. భగవదవతారములలో వేనియందైనను దిరస్కారబుద్ధి లేకుండుట మిగుల నావశ్యకము. ఇందువిషయమై

---

ఏత ఆత్మహనోఽశాంతా అజ్ఞానే జ్ఞానమానినః
సీదంత్యకృతకృత్యా వై కాలధ్వస్తమనోరథాః
భా. 11-5-16 & 17.

* సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్గుణాస్తై
ర్యుక్తః పరః పురుష ఏక ఇహాస్యధత్తే
స్థిత్యాదయే హరివిరించి హరేతి సంజ్ఞాః
శ్రేయాంసి తత్రఖలు సత్త్వతనో ర్నృణాంస్యుః
ముముక్షవో ఘోరరూపాన్ హిత్వాభూతపతీం స్తథా
నారాయణ కలాఃశాంతాః భజంతేహ్యనసూయవః

సందేహింపవలసిన దేమియును లేదు. భగవత్కృపాబలముచే లోకశాసనము, లోకపాలనము చేయుటను సమర్థత గలిగిన జీవులు దేవతలుగనే పరిగణింపఁబడుచున్నారు. "సమశీలా భజంతిహి" యను సామ్యముగ నా జీవులనెందఱుజీవులో ఆశ్రయింపుటయు, బూజింపుటయు, గలదు. అట్టిదేవతల ననూయతోఁ జూచుటయు, అవమానింపుటయు, భక్తజనులకుఁ దగనికార్యము. వారలను యథాయోగ్యముగఁ బూజించి కృష్ణభక్తి తమకుఁ గలుగునట్లు వరమనుగ్రహింపుఁడని వారలను బ్రార్థింపవలెను. కాని యెట్టిజీవులనుగూడ నవమానింపరాదు. ఏయేదేశములం దేయే ప్రతీకములతో సకల దేవతాపూజనము నిర్వర్తింపఁబడుచున్నదో, అట్టి పూజనమును భక్తుఁడు పూర్తిగ సన్మానింపవలెను కాని యాక్షేపింపరాదు. ఏమన నట్టి ప్రతీకముల మూలముననే మందాధికారులగు జీవులకందఱకును భక్తిమార్గమునఁ బ్రాథమిక శిక్షణము లభించుచున్నది. ఆక్షేపణబుద్ధిచే నరుల కహంకారము వృద్ధియగును; అకించనబుద్ధి నాశనమగును; హృదయము భక్తికి స్థానమగుటకు మఱి యవకాశముండదు.

(8) భూతములకుద్వేగముగలిగించుట చాల నింద్యమగుకార్యము.*
తాను భుజింపుటకో అన్యులకైనను జీవహింస చేయుట
ఏ ప్రాణులకైన భూతోద్వేగకార్యమే. అమంగళ వాక్యములు

---

రజస్తమఃప్రకృతయః సమశీలా భజంతిహి
పితృభూతప్రజేశాదీన్ శ్రియైశ్వర్యప్రజేప్సవః.
భా. 1.2.24, 27 & 28.

* యద్యధర్మరతస్సంగా దసతాం వా జితేంద్రియః
కామాత్మా కృపణో లుబ్ధస్త్రైణో భూత విహింసకః
పశూనవిధినాలభ్య ప్రేతభూతగణాన్ యజన్
నరకానవశో జంతుర్గత్వా యాత్యుల్బణం తమః.
భా. 11.10.27 & 28.

**నుద్వేగము గలిగించుట నిషిద్ధము.**

పలికి యితరుల కాందోళనము కలిగించుట, ఇతరులను నిందించుట, ఇతరులతోఁ గలహింపుట పరుషము లాడుట, కూట సాక్ష్యములు చెప్పుట, ఆత్మభోగము కొఱకితరుల సుఖమును జెఱచుట, మున్నగు భూతోద్వేగ కార్యము లసంఖ్యములు గలవు. వైధభక్తులు ప్రయత్నపూర్వకముగ నిట్టి కార్యములనుండి విరమింపవలెను. పరహింస, చౌర్యము, పరధనాపహరణము, ఆఘాతకరణము, పరస్త్రీలోభము మున్నగునవి కూడ భూతోద్వేగకరములే.

**వైష్ణవుఁడు సర్వజీవ దయాపరుఁడు.**

భూతోద్వేగ సంబంధమున నొకవిషయము విచారింపవలసియున్నది. భక్తి గలిగినవారికి సర్వజీవులయెడలను దయగలిగి యుండుట స్వాభావిక ధర్మము. *'దయ' అనునది భక్తికంటె వేఱగునది కాదు. ఏవృత్తి పరమేశ్వరున కర్పింపఁబడినపుడు భక్తియనియు, ప్రేమయనియు, బిలువఁబడుచున్నదో అది అన్య జీవులయెడల నెఱపఁబడినపుడు మైత్రీ, కృపా, ఉపేక్షా స్వరూపమగు దయయే యగుచున్నది. ఇది జీవుని నిత్య స్వధర్మాంతర్గత భావవిశేషము. వైకుంఠా (ముక్తా)వస్థయందుఁ గేవల మైత్రియనియు, బద్ధావస్థయందుఁ బాత్రవిశేషమునుబట్టి మైత్రి, కృప, ఉపేక్షలనియును నామములు గల భావములన్నియు నిత్య స్వధర్మగతమగు దయయొక్క వేఱువేఱు రూపములే. సంసారమందుఁ బ్రవర్తింపుచున్న జీవునియందు దయాగుణమే మిగుల ముకుళిత స్థితియందుండి స్వదేహ నిష్ఠారూపము వహించియుండును. అది కొంచెము వికసించెనేని స్వగృహవాసి జీవనిష్ఠారూపము వహించును. మఱి కొంచెము వికసించెనేని స్వవర్ణనిష్ఠగను, మఱి కొంచెము వికసించెనేని స్వదేశవాసి స్వజాతినిష్ఠగను, ఇంకను

---

* తస్మాత్సర్వేషు భూతేషు దయాం కురుత సౌహృదం
భావమాసుర మున్ముచ్య యయాతుష్య త్యధోక్షజః.

భా. 7-6-32.

వికసించెనేని స్వదేశవాసి సర్వజన నిష్ఠగను, మఱి యింకను వికసించెనేని సర్వమానవ నిష్ఠగను, బూర్తిగ వికసించినచో సర్వజీవ నిష్ఠార్ద్రిభావవిశేషముగను, భిన్నభిన్న రూపములు వహించును. ఇంగ్లీషుభాషలో పేట్రియాటిజమ్ (Patriotism) అనునది స్వదేశవాసి స్వజాతి నిష్ఠాభావ విశేషము. ఫిలాంత్రపి (Philanthropy) అనునది సర్వమానవ నిష్ఠాభావ విశేషము. భక్తజను లీ భావములలో దేనియందును అనురక్తులై యుండరారు. ఎట్టి భూతములకు నుద్వేగము కలిగింపనట్టియు, సర్వజీవులయెడల నార్ద్రితాస్వరూపమైనట్టియు, దయయొక్కటే భక్తుల కలంకారరూపమగు వర్ణనీయభావము.

(9) సేవాపరాధములు, నామాపరాధములు అనువాని విషయమై వైధభక్తగణము సదా అప్రమత్తులై యుండనగును.

పంచవిధ సేవాపరాధములు.

సేవాపరాధములును, నామాపరాధములును వేఱువేఱుగ నిరూపింపఁబడుచున్నవి. వరాహ, పద్మ పురాణములయందుఁ జెప్పినరీతిగ సేవాపరాధములైదు విధములు:—ఎట్లన,

(1) సాధ్యమత యత్నాభావము.
(2) అవజ్ఞ.
(3) అపవిత్రత.
(4) నిష్ఠాభావము.
(5) గర్వము.

శ్రీవిగ్రహసేవా సందర్భమునఁ జేయఁబడునట్టియు, శాస్త్రములన్నిఁటియందు నుల్లేఖింపఁబడినట్టియు నపరాధములన్నియుఁ బైనిఁజెప్పినరీతిగఁ బంచప్రకారములేయని స్థిరపఱుపఁబడినవి. అపరాధముల నన్నిఁటిని వివరింపుట దుస్సాధము. ఏ కొన్ని యపరాధములు పద్మ, వరాహపురాణాదులలో వివరింపఁబడినవో, అవియే యిచ్చట సంక్షిప్తముగ వివరింపఁబడును.

**సాధ్యమత యత్నాభావము.**

కావలసినంత ద్రవ్యమున్నను శ్రీమూర్తిసంబంధములగు నియమితోత్సవములు సేయకుండుట, సమర్థత యున్నను గౌపచారములతోఁ బూజనము నిర్వర్తింపుట, ఆయాకాలములందు దొరకు ద్రవ్యములను ఫలములను బ్రయత్నపూర్వకముగ సంపాదించి భగవంతుని కర్పింపకుండుట, భగవంతునికి స్తవము, వందనము, దండప్రణామము సమర్పింపకుండుట, దీపారాధనము సేయకుండ భగవన్మందిరమునఁ బ్రవేశించుట మున్నగు కార్యములన్నియు సాధ్యమత యత్నాభావమునుండి బయలుదేఱినవే.

**అవజ్ఞ.**

వాహనము నెక్కియు, బాదుకలు తొడిగికొనియు భగవన్మందిరమునకుఁ బోవుటయు, శ్రీమూర్తిసన్నిధిని బ్రణామము సేయకుండుటయు, ఒకచేతితోఁ బ్రణామముసేయుటయు, వ్రేలితో భగవన్మూర్తినిఁ జూపించుటయు, శ్రీవిగ్రహము నెదుటఁ బ్రదక్షిణముసేయుటయు, భగవంతునియెదుటఁ గాళ్లు చాఁపుకొని కూర్చుండుటయు, పర్యంకబంధనముతోఁ గూర్చుండి భగవత్స్తోత్రములను బఠించుటయు, శ్రీవిగ్రహము నెదుట శయనము, భోజనము మున్నగునవి సలుపుటయు, బిగ్గఱగా మాట్లాడుటయు, ఒకరితో నొకరు సంభాషించుటయు, విషయాంతరములను స్మరణకుఁదెచ్చుకొని యేడ్చుటయు, కలహము, ఇతరులనుగూర్చి ప్రసంగించుటయు, అధోవాయు పరిత్యాగము, తెచ్చిన ద్రవ్యములలో నగ్రభాగ మితరులకిడి యవశిష్టభాగము భగవంతునికి నివేదింపుటయు, శ్రీమూర్తివైపు వీఁపుద్రిప్పి కూర్చుండుటయు, శ్రీవిగ్రహము నెదుట నితరులను కైవారముసేయుటయు, శ్రీమూర్తి నకాలమున దర్శించుటయు (భగవన్మందిరద్వారము తెఱచియుండు కాలమునకు వ్యతీతమగునది యకాలము), మున్నగు కార్యములన్నియు సేవనమునకు సంబంధించిన యవజ్ఞతలు.

ఎంగిలినోటితోఁగాని, చేతితోఁగాని, లేక, నేలువిధమగు నశుచిగల దేహముతోఁగాని భగవన్మందిరమునఁ బ్రవేశించుటయు, బఱురోమములతో నిర్మింపఁబడిన వస్త్రమును ధరించి శ్రీమూర్తిని సేవించుటయు, బూజాసమయమున నిష్ఠీవనము విడుచుచుండుటయు, సేవాసమయములం దితర విషయములను జింతింపుచుండుటయు, మున్నగు ననేకాపవిత్రతా లక్షణములు నింద్యములుగ వర్ణింపఁబడినవి.

అపవిత్రత.

భగవత్సేవకుఁ బూర్వమే జలపానముసేయుట, నివేదింపఁబడని అన్నమును, జలమును ఆరగించుట, తత్సేవాదర్శనములు నిత్యముసేయకుండుట, తనకుఁ బ్రియమగు పదార్థములును, ఆయాకాలములందు దొరకు సుఖాద్యఫలాదులును, భగవంతుని కర్పింపకుండుట, ఏకాదశినాఁ డుపవాసము సేయకుండుట—ఇవన్నియు నిష్ఠాభావములు.

నిష్ఠాభావము.

సేవాకాలమునందుఁ దన్నకించన భగవద్దాసునిగఁ జెప్పుకొనుట సర్వోత్తమము. అట్లుచేయక తాను గొప్పవాఁడననియు, దనపూజయే శ్రేష్ఠమగు పూజయనియు, నభిమానపూర్వకముగఁ జెప్పుటయే సేవాకాలీనమగు గర్వము. తనవైభవమంతయుఁ బ్రకటించుటకై యనేక సామగ్రులతోడను, వివిధాడంబరములతోడను, శ్రీమూర్తిని సేవించుటకూడ గర్వమనఁబడుచున్నది.

గర్వము.

ఈ యైదు విధములగు సేవాపరాధము లొనరింపకుండ శ్రీమూర్తిసేవన మాచరింపవలెను. ఈయపరాధములు విగ్రహప్రతిష్ఠాతకును, అర్చకునకును, సాధారణభక్తజనులకును సంబంధించునవి.

హరిభజనముసేయువారు నామాపరాధములు సేయుదురు. కావునఁ బ్రయత్నపూర్వకముగ వానిని వర్జింపుటయే వారికిఁ గర్తవ్యము.

—దశవిధ నామాపరాధములు.—

నామాపరాధములు పదివిధములు :—ఎట్లన,

(1) సాధునింద.
(2) శివాదిదేవతలు భగవంతునికంటె స్వతంత్రులని చెప్పుట.
(3) గుర్వవజ్ఞ.
(4) వేదశాస్త్రములయు, దదనుగత శాస్త్రములయు, నింద.
(5) హరినామ మహిమము ప్రశంసామాత్రమే యనుట.
(6) హరినామమునకుఁ బ్రకారాంతరమగు నర్థమునుగల్పించుట.
(7) హరినామబలముచేఁ బాపకార్యము లొనర్చుట.
(8) హరినామముతో నితరశుభకర్మలకు సమానత్వముచెప్పుట.
(9) శ్రద్ధలేనివారికి నామోపదేశము సేయుట.
(10) నామమహత్త్వమును వినినను నామమందుఁ బ్రీతిలేక పోవుట.

(i) సాధునింద.

నైతిక ధర్మశాస్త్రములందుఁ బరనిందయొక్కటే దోషరూపముగ వర్ణింపఁబడినది. కాని దోషతారతమ్యమును విచారించునట్టి తాత్త్వికధర్మ (భక్తి) శాస్త్రమునందు సాధునిందయే ప్రధానాపరాధములలో నొకటిగ వర్ణింపఁబడినది. సాధువులను నిందించువారలకు సాధుసంగలాభము గలుగుట యసంభవముగనుక వారలభక్తి యున్నతస్థితికిరాఁజాలదు. కృష్ణపక్షచంద్రునిమాడ్కి దినదినము క్షీణించి పోవుచుండును. అట్లే భక్తజనుల హృదయమందుండు భక్తివృత్తియు సాధునిందా దోషముచేతనే నానాఁటికి నశించిపోవును. వర్ణాశ్రమధర్మము తమచే నుత్తమరూపమున ననుష్ఠింపఁబడుచున్నను భక్తసాధుసంగము తమకు లభింపకుండుటచేతను, సాధునిందాపరాధము తాము సదా చేయుచుండుటచేతను, మానవుల హృదయ సీమలయందుండు భక్తివృత్తిపూర్తిగ నణఁగిపోవును. భక్త

జనులను నిందించుట యను నపరాధక్రమమున వర్ణాశ్రమాచారనిష్ఠగల పురుషులు క్రమముగ నధఃపతితులై నిరీశ్వర నైతికులుగనో, తుదకు నీతివిహీనులుగనో పరిణామముబొంది పశుప్రాయులుగ వ్యవహరించు టనేకస్థలములయందుఁ జూడఁబడుచున్నది. కావున సాధునిందను జేయకుండుటయే మానవుని కర్తవ్యము.

(ii) శివాదులగు దేవతలు స్వతంత్రులును ఈశ్వరులును ననుట.

శివుఁడు మున్నగు దేవతల నెవరు భిన్నదేవతలుగ భావింతురో; మఱియు భగవంతుని వారలకంటె భిన్నునిగ నెవరుభావింతురో, వారు బహ్వీశ్వరవాదులగు చున్నారు. అట్టివారలు నిష్ఠాశూన్యులై భక్తులనిపించుకొనరు. వాస్తవముగఁ బరమేశ్వరుఁ డొక్కఁడనునదియే తత్త్వజ్ఞానము. ఇట్టి తత్త్వజ్ఞానము లేకపోవుటచే వారలజ్ఞానులును, అపరాధులును, అగుచున్నారు.

శివాదిదేవతలు గుణావతారములు లేక, భగవద్భక్తులు.

శివాదిదేవతల నామములు హరినామములకంటె భిన్నములైనవికావు. కావున శివాదిదేవతలు భగవదవతారవిశేషములనియో, భగవద్భక్తులనియో చెప్పుటుచితము. కాని కొందఱు శివుఁడే పరమపురుషుఁడనియు, విష్ణువాతని యవతారమనియు, వాదింతురు. శివనామమందు నిష్ఠగలిగి విష్ణునామస్వాతంత్ర్యమును వారంగీకరింపరు. ఇట్టివాదము సంప్రదాయక తర్కమగుటచే దీనివలనఁ జీవుఁ డెట్టి ఫలమును గలుగదు. ఒక్కఁడగు పరమేశ్వరుని భజింపుటే మనకుఁ గర్తవ్యము. హరినామనిష్ఠయే మనకావశ్యకము. నిర్గుణతత్త్వమే చరమతత్త్వము. సత్త్వరజస్తమోగుణ విశిష్టులగు సకలదేవతలును భగవదవతారములని మాత్రము తెలిసికొని వారలయెడల నెట్టియసూయయు, ననాదరమును గనుపఱుపక నిర్గుణుఁడును, విశుద్ధ సత్త్వగుణాధిష్ఠితుఁడును నగు హరి నొక్కని నే భజించుట కర్తవ్యము. వేదశాస్త్రమును, దదనుగతశాస్త్రములును మనకేమార్గమును జూపింపుచున్నవో, ఆమార్గమునువిడిచి పెడదారులను

మనము ద్రొక్కినచో నుత్పాతములు సంభవించునని మనము పూర్తిగ భావింపవలెను.

విష్ణువు నిత్యసచ్చిదానంద ఘన నిత్యసాకార మూర్తి.

ఏయే శాస్త్రములందు శివ, ప్రకృతి, గణేశ, సూర్యేంద్ర ప్రభృతుల యుపాసనము చెప్పఁబడెనో, ఆయాశాస్త్రములందు వారలు సగుణదేవతలనియు, నిర్గుణబ్రహ్మలాభమునకు అవి కల్పింపఁబడిన యుపాయరూపులనియు, స్థిరపఱుపఁబడియేయున్నది.* భక్తిశాస్త్రమునందు హరిని సచ్చిదానంద సాకారపరమతత్త్వముగనే వర్ణించినారు. హరిసేవనమువలన బ్రహ్మలాభమగునను సిద్ధాంతములేదు. కావునఁ గల్పితదేవతలను భగవంతునితో సమానులుగఁ జేయరాదు. శివాదిదేవతలే సిద్ధస్వరూపులని చెప్పినచో నద్వైతవాదము, భక్తివాదముకూడ నాశనమగును. కావున శాస్త్రమును దాఱుమాఱుసేయకుండ దేవతలందఱను భగవద్భక్తులుగనో, భగవంతుని గుణావతారములుగనో వర్ణింపుట పండితులకుఁ గర్తవ్యము. అట్లు వారిని భావింపనిచో నిత్యసిద్ధస్వరూపుఁడగు భగవంతునియెడల మన మపరాధుల మగుదుము.

(iii) గుర్వవజ్ఞ.

గుర్వవజ్ఞ యనునది ప్రధానాపరాధము. సాధకునకుఁ దనగురువునందచలమగు శ్రద్ధయుదయింపనంతవఱకును గురుదత్తమగు నుపదేశమునందు సంపూర్ణమగు విశ్వాసముకలుగదు. విశ్వాసము కలుగనంతవఱకు భజనము మున్నగునవి సాగనేఱవు. కావున మనము దీక్షాగురువు, శిక్షాగురువులయెడల నిశ్చలమగు శ్రద్ధకలిగియుండవలెను. మహాత్ముల యుపదేశ

---

* యేప్యన్యదేవతా భక్తాయజన్తే శ్రద్ధయాన్వితాః
తేపి మామేవ కౌంతేయ ! యజంత్యవిధి పూర్వకమ్
యాంతిదేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా, యాంతి మద్యాజినోపి మామ్.

గీ. 9.23 & 25.

ములనతిక్రమించు బుద్ధిప్రబలియుండువారు గుర్వవజ్ఞాపరాధముచేసిన వారలగుదురు. పరమతత్త్వనిష్ఠ వారల కుదయింపదు.

(iv) వేద వేదానుగత శాస్త్రనిందనము.

ఋగ్యజుస్సామాథర్వవేదములును, దదనుగతములగు సకల పురాణములును, మహాభారతమును, ఇరువది ధర్మశాస్త్రములును, పాంచరాత్రము మున్నగు సమస్త సాత్త్వికతంత్రములును, హరినామమహిమను, హరిభక్తిమాహాత్మ్యమును, వేయినోళ్లతో నుద్ఘోషించుచున్నవి. ఆశాస్త్రములన్నియు యథార్థములగు శాస్త్రములు. వానిని నిందించువారు భక్తితత్త్వమందున్నతిలాభము నొందఁజాలరు. ఈశాస్త్రములయందాదరములేక హరిభక్తివిషయమై నూతసమార్గము లాలోచింపువారు జగదుత్పాతకారకు లగుచున్నారు. ఇప్పుడిప్పుడు బయలుదేఱుచున్న సేశ్వర మతసమూహములన్నియు నిపుడు చెప్పినదానికుదాహరణములు. దత్తాత్రేయ, బుద్ధ, బ్రహ్మ, థియాసఫీ మున్నగు మతములను విచారించినచో నీవిషయము స్పష్టపడును. వీనిమూలతాత్పర్యమును విచారించితిమేని సాధ్యవస్తువును గూర్చిన సాధనోపాయములు వీనియన్నిఁటియందు నొకేరూపమున గోచరింపుచుండును. భాషాభేదమునుబట్టియు, వ్యవహారభేదమును బట్టియు, సాధనప్రక్రియ లాయాదేశములయందుఁ గొంతభేదముగనున్నను ఈమతముల తాత్పర్యము మొత్తముమీఁద నొక్కటియే. విజ్ఞానదృష్టితోఁ జూచువారలకు వీనియందలిభేదము స్పషపడఁగలదు. వేదశాస్త్రము నిత్యమైనది. దానియందుఁ జెప్పఁబడిన సాధనప్రక్రియ యంతయు సనాతనమైనది. తదనుగత శాస్త్రములయందు జెప్పఁబడిన ప్రక్రియకూడ వేదసమ్మతమగు ప్రక్రియయే. కాని దంభముకొఱకును, నూతన ప్రక్రియా ప్రకాశకులను కీర్తినొందుటకొఱకును, నూతనమతములను స్థాపించువారలు దంభమతస్థాపకులనియే వ్యవహరింపఁబడుదురు. ఆమతములన్నియు నిస్సారములగుటచేఁ దన్మతావలంబులాచరించు హరిభక్తి జగత్తున కుత్పాతజనకముగ నుండును.

పుణ్యకర్మ లనేకములుగలవు. వానిఫలములుమాత్రము వాస్తవములుకావు. కాని బహిర్ముఖులగు లోకులు వానియందుఁ బ్రవర్తింపుటకై వానిఫలములు కీర్తింపఁబడుచున్నవి.* ఈఫలకీర్తనమునకే లోకమునందు గర్మ ప్రశంసయనిపేరు. హరినామ మాహాత్మ్యమును వినిన యనేక మందభాగ్యులు దానినిఁగూడఁ బ్రశంసయనియే చెప్పుదురు. కాని హరినామఫలము నిత్యమైనది. దాని యితరఫలము లేవేవి కలవో వాని నేశాస్త్రమును గీర్తింపఁజాలదయ్యెను. లోకమునందు భజన సంకేతము లెన్నెన్నిగలవో వానియన్నింటిలోఁ హరినామమే సంక్షిప్తసార స్వరూపము. అట్టి హరినామమును బ్రశంసామాత్రముగా నెవరు భావింతురో వార లపరాధులు.

(v) హరినామము స్తుతివాదమనుట.

ప్రకారాంతరముగ హరినామమున కర్థకల్పనముచేయుట యొక మహాపరాధము. హరిశబ్దము సహజముగఁ బరమ రసాధార సచ్చిదానంద విగ్రహుఁడగు శ్రీకృష్ణునే నిరూపించుచున్నది. శ్రీవిగ్రహతత్త్వమును లెస్సగ దెలిసికొనుటకు సమర్థతలేనికొందఱు హరిని నిరాకారునిగ భావించి 'బ్రహ్మ' శబ్ద 'హరి' శబ్దముల కేకార్థమే చెప్పుచు నిరాకారుఁడగు హరినొకనినిఁ గల్పింతురు. మఱికొందఱు 'హరి' యనినఁ గృష్ణుని కస్వయించుననను భయముతోఁ దాము హరినామోచ్చారణముసేయు సమయమున 'నిరాకారహరి,' 'చిదానందహరి' యనుచు గుణవాచక ప్రయుక్తముగ హరిని స్మరింతురు. ఇట్లుచేయుటచే వారలు హరినామమున కర్థాంతరము నేఁ గల్పించుచున్నారు. ఇది పెద్ద యపరాధము. ఇట్టి యపరాధమును జేయువారలహృదయము శుష్కజ్ఞానమయమై రసశూన్యమగుచున్నది.

(vi) హరినామమున కర్థకల్పనము సేయుట.

---

* వేదోక్తమేవ కుర్వాణో నిస్సంగోఽర్పిత మీశ్వరే
నైష్కర్మ్యాం లభతే సిద్ధిం రోచనార్థా ఫలశ్రుతిః.
భా. 11.3.50.

(vii) హరినామ బలముచేఁ బాపప్రవృత్తి గలుగుట.

హరినామబలముచేఁ బాపాచరణబుద్ధికలుగుటొక ప్రకాండమగు నపరాధము. పాపప్రవృత్తియు, విషయానురాగమును సమానముగ నివారింపఁబడుచుండు నప్పుడే హరినామమందనురాగము జన్మించును. హరినామము నాశ్రయించినవారికిఁ బాపములు చేయుటయందు సహజముగ నభిరుచి యుండదు. కాని యెవరు హరినామమాలికను జేతియందిడుకొని లోలోపల ననేక పాపకార్యముల నాలోచింపుచుందురో, అట్టి మందభాగ్యులాత్మవంచనమే యొనరింపుచున్నారు. పాపము లొనర్చుటకు సంసిద్ధులై యున్న కొందఱు తమ మనస్సులందు, "నేనీ పాపముచేసినగాని నాకార్యము కొనసాగనేఱదు. వెనుక హరినామస్మరణముచేసి పాపమును గడుగుకొనవచ్చును; కావునఁ బాపాచరణముచే నాకార్యమును నేను సాధించుట మేలు." అను నిట్టి దుష్టాలోచనలు గలిగియుందురు. ఇట్టి యపరాధములకు వేనికిని లోఁబడక యకించనభావముతో హరినామస్మరణముచేయుట జీవునికిఁ గర్తవ్యము.

(viii) హరినామ మన్యశుభకర్మలతో సమమైనదనుట.

యజ్ఞము, తపస్సు, యోగము, స్వాధ్యాయము, వర్ణధర్మము, ఆశ్రమధర్మము, ఆతిథ్యము మున్నగు ననేక పుణ్యకర్మములు గలవు. కర్మజడులగు మానవులు హరినామమునుగూడ నొకకర్మవిశేషముగనే భావించి యితరపుణ్యకర్మలతోఁ జేర్చి చెప్పుదురు. ఇది యొకమహాపరాధము. అనిత్యమగు కర్మయెచ్చట? నిత్యానందస్వరూపమగు హరినామమెచ్చట? నాస్తికులకును, గేవల నైతికులకును, గర్మపరాయణులకును జిత్తశుద్ధి యుండనందున వారలకు హరినామమం దధికారము లేదు.

అధికారము లేనివారలకును, శ్రద్ధ లేనివారలకును హరినామ ముపదేశించుట చవిటినేలను విత్తనములు నాటుటవలె నిరర్థకమగుచున్నది. ధనాపేక్షతో శ్రద్ధలేని మనుజులకు హరినామ ముపదేశించువాఁడు హరినామ విక్రయుఁ డనఁబడును. అట్టివాఁ డమూల్యమగు రత్నము నతి తుచ్ఛ వినిమయముచే వెల లేకుండఁ జేసి హరిభజనమునందుఁ దానును చ్యుతుఁడగుచున్నాఁడు.

(ix) అశ్రద్ధ ధానులకు హరి నామోపదేశము.

విస్మయమగు హరినామముయొక్క మహాత్మ్యము వినినప్పటికిని మనుకా రాహంకార పరవశు లగుటచేఁ దన్నామమునందుఁ బ్రీతి కలుగని వారు మిక్కిలి మందభాగ్యులు. వారు శ్రేయోదూరులును, అపరాధులును.

(x) నామ మాహాత్మ్యము వినియును దానియందుఁ బ్రీతికలుగకుండుట.

శుద్ధభక్తి లీ పదివిధములగు నపరాధములను జేయకుండ భగవద్భక్తి సేయనగును. వైధభక్తగణము భగవన్నిందయు, భాగవత నిందయు, దదనుమోదన సాహాయ్యములును మనస్సుచేతనైన నాదరింపరాదు. ఏ సభలయందైన నిట్టి నిందలు చేయఁబడుట తనకుఁ దెలిసెనేనిఁ దనవద్ద యోగ్యత యున్నచోఁ దన్నిందకులతో వెంటనే ప్రతిఘటింపవలెను. అట్టి యోగ్యత లేనప్పుడుకాని, ప్రతివాదము చేసినను నిష్ఫలమని తనకుఁ దోఁచినప్పుడుగాని, బధిరునివలె వ్యవహరింపుచుఁ దన్నిందలను జెవినిబట్టించుకొనరాదు. ఆస్థలమునుండి కూడ వెంటనే లేచిపోవలెను. గురుదేవుని ముఖమునుండి యిట్టి నింద లెప్పుడైన వినుట తటస్థించినచోఁ దగు వినయముతో నా యపరాధమును వానికిఁ గనఁబఱచి దానినుండి యతఁడు విరమింపునట్లు ప్రయత్నింపవలెను. కాని భక్త జనద్వేషముతో నతఁడు సదా మాటలాడుచుండెనేని వానిని వెంటనే విడిచి మఱియొక యుపయుక్త గురువు నాశ్రయించుటయే కర్తవ్యము.

భగవన్నిందాదులు.

శుద్ధభక్తులకీ దశాప రాధములు పరిత్యాజ్యములు.

ఇట్టి దశవిధనిషిద్ధాచారములను బూర్తిగఁ ద్యజించి వైధభక్తులు పూర్వోక్తమగు పంచవిధ భగవదనుశీలనమును శ్రద్ధాపూర్వకముగ నాచరింపుచుఁ దమ భక్తివృత్తియొక్క యున్నతిలాభము కొఱకు సర్వవిధములఁ బ్రయత్నింపుట వారికి విధాయకమగుచున్నది.



## తృతీయవృష్టి—చతుర్థధార.

### గౌణముఖ్యవిధులకుఁ గల పరస్పర సంబంధ విచారము.

శ్లో. కామాదీనాం కతినగదితాః పాలితా దుర్నిదేశా
స్తేషాంజాతా మయినకరుణా నత్రపా నోపశాంతిః
ఉత్సృజ్యైతా నథయదుపతే! సాంప్రతం లబ్ధబుద్ధి
స్త్వామాయాత శ్శరణమభయం మాంనియుఙ్క్ష్వాత్మదాస్యే.

కర్మకాండకును వైధ భక్తికిని గల భేదము.

స్వధర్మ రూపమగు కర్మకాండకును, వైధశుద్ధభక్తికిని గల భేద మేమి? ఆరెంటికిని జాల భేదము గలదు. జడ విషయములందు నిర్వేదము గలిగిన యతఁడు జ్ఞానయోగమున కధికారి. కామ్య బుద్ధి గల పురుషుఁడు కర్మయోగమునకధికారి. భగవత్తత్త్వము నందు శ్రద్ధగలిగి యధిక నిర్వేదమును, అధిక కర్మాసక్తియులేని పురుషుఁడు భక్తియోగమున కధికారి.* వర్ణాశ్రమ ధర్మ రూప స్వధర్మమును, శరీర యాత్రయు, దేహమునకుఁ గలుగు తొమ్మిదియవస్థలును, † సామాజికక్రియ

---

* నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహకర్మసు
తేష్వనిర్విణ్ణచిత్తానాం కర్మయోగస్తు కామినాం
యదృచ్ఛయామత్కథాదౌ జాతశ్రద్ధస్తుయఃపుమాన్
అనిర్విణ్ణోనాతిసక్తో భక్తియోగోఽస్యసిద్ధిదః

భా. 11.20.7 & 8.

† నిషేకగర్భజన్మాని బాల్యకౌమార యౌవనం
వయోమధ్యం జరామృత్యు రిత్యవస్థా తనోర్నవ.

భా. 11.22.47.

లును, గర్మకాండయందును జెప్పఁబడినవి; భక్తి గ్రంథములయందును గలవు. కాని కీని రెంటికిని భేద మెచ్చట నున్నదనిన, గర్మకాండయందు బహీశ్వర సేవయు, నింద్రియ ప్రీతిరూపమగు కామమును, జడీయ సన్మానమును, గొన్ని కొన్ని విధములగు జీవహింసలును, జన్మనుబట్టి వచ్చిన వర్ణమును సన్మానింపుటయు, మొదలగు భక్తి విరుద్ధములైన యనేకావస్థలు గలవు. వైధభక్త జీవనమందు విష్ణు సేవనము, అప్రాకృత విషయములందుఁ బ్రీతి, వృత్తినిబట్టి యేర్పడిన వర్ణముగల బ్రాహ్మణులయొక్కయు, భక్తులయొక్కయు సేవ, సర్వ భూత దయారూపమగు నహింస, మున్నగు కొన్ని లక్షణములు కనఁబడుచున్నవి. ఇపుడు తెలిసికొనఁదగినదేమన, నింతవఱకుండే వర్ణాశ్రమ ధర్మము చెప్పఁబడినదో దానికిని, వైధభక్తికిని గల సంబంధమేమి యనునది. ఇంకను స్పష్టముగఁ జెప్పవలయుననిన, వర్ణాశ్రమధర్మమును ధ్వంసము చేసిగాని, పరిత్యజించిగాని వైధీభక్తి నాచరింపవలయునా? లేక యాధర్మమును యథావిధిగఁ బాలింపుచు భక్త్యనుశీలనముకొఱకు వైధభక్తి మార్గము నవలంబింపవలయునా? అను విషయము స్థిరపడవలసియున్నది. శుద్ధ భక్తికి సాధనములని యుద్దేశించియే శరీరపాలనము లెస్సగఁ జేయుటయు, మానసవృత్త్యనుశీలన రూపమగు నున్నతి సాధనమును, సామాజిక మంగళచర్యయు, నాధ్యాత్మిక శిక్షయు, వర్ణాశ్రమ ధర్మముయొక్క ముఖ్య తాత్పర్యము * లని యింతకుఁ బూర్వమే చెప్పఁబడినది. మానవుఁడెంత

* ఏతత్సంసూచితం బ్రహ్మం స్తాపత్రయచికిత్సితమ్
యదీశ్వరే భగవతి కర్మబ్రహ్మణిభావితం
ఆమయో యశ్చభూతానాం జాయతే యేన సువ్రత
తదేవహ్యామయంద్రవ్యం నపునాతి చికిత్సితం
ఏవంనృణాం క్రియాయోగాః సర్వేసంసృతిహేతవః
తఏవాత్మ వినాశాయ కల్పంతే కల్పితాఃపరే

వఱకు జడశరీరధారియై యుండునో, అంతవఱకును వర్ణాశ్రమ ధర్మ ప్రయోజనము నెవ్వఁడును స్వీకరింపకుండ నుండఁజాలఁడు. స్వీకరింపనిచోఁ బైనిఁ జెప్పిన నాలుగువిధములగు శిక్షలును లేక మానవజీవనము కుపథగామి యగునుగాని శ్రేయోదాయకము కాఁజాలదు. కావున శారీరిక, మానసిక, సామాజిక, ఆధ్యాత్మిక బలసాధనముకొఱకు వర్ణాశ్రమ విధానమును లెస్సగఁ దెలిసికొని దానినిఁ బాలింపవలెను. వర్ణాశ్రమ ధర్మపాలనము జీవుని చరమ ప్రయోజన మెంతమాత్రమును గాదు. కనుకఁ దద్ధర్మానుకూలమగు భక్త్యనుశీలనమే సేయనగును. భక్త్యనుశీలనముకొఱకే వర్ణాశ్రమ ధర్మపాలనము ప్రయోజనీయమగుచున్నది. కాని వర్ణాశ్రమధర్మము బహుకాల సాధ్యమగు కార్యమగుటచే దాని నాచరింపుచున్నపుడు భక్త్యనుశీలనమున కవకాశముండునా?* అట్టి యవకాశము లేనపుడేమిచేయఁదలయును? ఇందునుగూర్చి ముందుగ మన మాచరింపవలసినదేమన, శరీర మన స్సామాజికాధ్యాత్మిక సత్త్వముల రక్షణము, పోషణము నిర్వర్తింపఁబడనిచో వీనికంటె మహత్కార్యమగు భక్తి యెట్లాచరింపఁబడును? అతిశీఘ్రముగ మృత్యువు సంభవించుటచేఁగాని, చిత్త

వర్ణాశ్రమ ధర్మముతో వైధీభక్తికిఁ గల సంబంధము.

వర్ణాశ్రమధర్మసాధనము చరమ ప్రయోజనము కాదు.

---

* యదత్రక్రియతేకర్మ భగవత్పరితోషణం
జ్ఞానంయత్తదధీనంహి భక్తియోగ సమన్వితమ్.
గృణంతి గుణనామాని కృష్ణస్యాను స్మరంతిచ
కుర్వాణా యత్రకర్మాణి భగవచ్ఛిక్షయా సకృత్.
భా. 1.5.32 to 36.

† నహ్యంతోఽనంతపారస్య కర్మకాండస్యచోద్ధవ
సంక్షిప్యవర్ణయిష్యామి యథావదనుపూర్వశః.
భా. 11.27.6.

శీలనము మున్నగు వ్యాధులు సంభవించుటచేఁగాని, సమాజ విప్లవకారణముగ దుస్సంగ దుష్టాచారము లలవడుటచేఁగాని, యప్రాకృత తత్త్వశిక్షణము లభింపనిచో భక్తికంకుర రూపమగు శ్రద్ధ మానవహృదయమందుదయించుట కెట్లవకాశముగ నుండును? ఇఁక వర్ణాశ్రమ ధర్మాచరణము విడిచి స్వేచ్ఛావర్తనము నవలంబించినచో శారీరిక మానసిక స్థితు లతిప్రమత్తతనొంది యథేచ్ఛావర్తనమందాసక్తి వహించును. మనుజుఁడు చెడు కార్యము లొనర్చుటకుఁ బూర్తిగ నలవాటుపడును. మఱి భక్తి యేవిధముచేతనైన నుదయించుట కవకాశముండదు. కావున వర్ణాశ్రమధర్మము కొంత విలంబకార్యమైనను దానిని భక్తిసాధనమున కనుకూలరూపమున గ్రహింపుటయే మానవునికిఁ గర్తవ్యము.* వైధభక్త్యనుశీలనము క్రమముగ సాగు

భక్త్యనుశీలన సోపానములు.

చుండెనేని దాని విలంబ (దీర్ఘసూత్రితా) లక్షణము గూడఁ గ్రమముగఁ దొలఁగిపోవును. దాని యంగములన్నియుఁ గ్రమముగ భక్త్యంగములుగఁ బరిణామము నొందును. మొదట వర్ణాశ్రమధర్మమును జక్కఁగఁ బరిపాలింపుచు శ్రీమన్మహాప్రభు వుపదేశించిన యైదు విధములగు భక్తినిగూడ సాధ్యమైనంతవఱ కనుశీలన మొనర్పవలెను. వర్ణాశ్రమ ధర్మాంగములయం దేదైన భక్తికిఁ బ్రతికూలముగ నున్నచో దానినిఁ గ్రమముగ విడిచివేయుటయే మేలు. ఇట్లొనర్చుటచేఁ దుదకు భక్తిజీవనమందు వర్ణాశ్రమధర్మము భక్తిచేఁ బవిత్రమగుచుఁ బరమ సాత్త్వికభావము నొంది సాధనభక్తికి దాసరూపమగుటచేఁ గర్మయు, భక్తియు నొకదానికొకటి విరోధము లేకుండ వర్తించుచుండును. భక్త్యనుశీలన క్రమమున బ్రాహ్మణ జీవన మకించనత్వ లాభమునొంది భక్తిచేఁ బవిత్రమగు [illegible]

* శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం.

గీ. 18.47.

జీవనముతోఁ బారమార్థిక సమత్వము నొందును. శూద్రజీవనముగూడ భగవత్సేవచేతను, భాగవతసేవచేతను, ఉత్కృష్టస్థితి నొంది యకించన స్వభావయుక్త విప్రజీవనముతో సామ్యము వహించును. అప్పుడు భక్తజన భ్రాతృభావముయొక్క పవిత్రతచేఁ జాతుర్వర్ణ్యజీవన ముజ్జ్వలత వహించి వైకుంఠజీవనముయొక్క ప్రారంభస్థితిని బొందుచున్నది. దేహాత్మాభిమానముచేఁ గలిగెడు నుపద్రవములు తగ్గినచో జీవులయొక్క సర్వ సమత్వము సహజముగ వ్యవస్థాపితమగును. *

**వర్ణాశ్రమము, వైధీ భక్తియు.**

వర్ణాశ్రమ ధర్మరూపమగు సేశ్వర నైతిక జీవన ముదయించినంతనే నిరీశ్వర నైతిక జీవనము దానియందు లీనమై నిర్దోషభావమున నెట్లు పరిణతి నొందుచున్నదో, అట్లే సేశ్వర నైతిక జీవనము గూడ వైధభక్తి యుదయించినంతనే పూర్వదోషమును బరిత్యజించి వైధభక్తజీవనరూపమున నొక యపూర్వపరిణామము నొందును. వర్ణాశ్రమ ధర్మమునం దీశ్వరభజన మాయానీతులయందొక నీతిమాత్రముగనే పరిగణింపఁబడుచుండునుగాని భక్తజీవనమం దీ ధర్మము సన్నివేశమైనపుడు జీవుని సమస్త కర్తవ్యములయందు నీశ్వర భజనమునకుఁ బ్రధానత్వ మీయఁబడుచున్నది. వర్ణాశ్రమ ధర్మగతములగు నితరనీతులన్నియు నీశ్వర భజనమునకు దాసరూపమున నపుడు ప్రవర్తించుచుండును. మొదటఁ జూచినపు డీమాఱుపాటు సామాన్యముగఁ గనుపడవచ్చునుగాని భక్తినిష్ఠ ప్రబలమగుచుండ మానవజీవనమున కది మఱియొక యుత్కృష్టరూపమును బ్రసాదించును. వర్ణాశ్రమ ధర్మజీవనమందును, వైధభక్తజీవనమందును నిట్లొక యపూర్వమగు భేదము లక్షితమగుచున్నది.

---

* విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః.
గీ. 5-18.

ఎట్టి నరునికైనను భక్తియం దధికారము గలదని శాస్త్రములు ఘోషించుచున్నవి. భక్తియే జీవుని సహజధర్మము గనుక భక్తి సంపాదనమునకై యందఱును యత్నింపుట కర్తవ్యము. * కావున వర్ణాశ్రమగతములగు నాలుగువర్ణములయందును, నాలుగాశ్రమములయందును గల సమస్త పురుషులకును భక్తియందధికారముగల దనుమాట యంగీకరింపఁబడినట్లే. అంతేకాక నంత్యజులుగూడ నరులుగనే భావింపఁబడి భక్తి కధికారులగుచున్నారు. వారలకు భక్తియం దధికారముండుట నిజమేకాని భక్తి లాభముకొఱకు వారంత యవకాశస్థితియం దుండరు. వారల జన్మమును, సంసర్గమును, గర్మయు, బ్రవృత్తియు నవైధములగుటచే వారిజీవన మెల్లపుడును జడాసక్తమైనదగుచుఁ బశుజీవనముతో సమానముగ నుండును. ఉదరపోషణకొఱకు వారందఱు స్వార్థపరులును, బరద్రోహశీలురును, నిర్దయులు నగుచున్నారు. వారల హృదయము మిగులఁ గఠినముగ నుండును. కావున వారలకు భక్తిమార్గ మతి ప్రయత్నపూర్వకముగ లభించుచున్నది. † వారల భక్తితత్త్వాధికారము గూర్చి తెలిసికొనవలెనని శ్రీహరిదాస ఠాకురు, నారద శిష్యుఁడగు వ్యాధుఁడు, జేసను, పాలు మున్నగు భక్తజనుల యితిహాసములను జదివితిమేని మనకు స్పష్టపడును. ఇంతేకాక వారందఱు ననేక కష్ట

నరమాత్రులకందఱు కును భక్త్యధికారము గలదు.

---

* నహ్యచ్యుతం ప్రీణయతో బహ్వాయాసోఽసురాత్మజాః
ఆత్మత్వాత్ సర్వభూతానాం సిద్ధత్వాదిహ సర్వతః

భా. 7-6-27.

† సుఖమైంద్రియకం దైత్యా దేహయోగేన దేహినాం
సర్వత్రలభ్యతేదైవా ద్యథాదుఃఖ మయత్నతః
తత్ప్రయాసో నకర్తవ్యో యత ఆయుర్వ్యయఃపరం
నతథా విందతే క్షేమం ముకుందచరణాంబుజమ్.

భా. 7-6-8 & 9.

ములు వదని భక్తిపథ లాభము నొందినట్లును, వారల భక్తజీవన మీ ప్రపంచమున నధికకాలము నిలువనట్లును గూడ స్పష్టపడును. భక్తి సేయుట కందఱి మనుష్యులకు నధికారము గలదను మాట సత్యమేకాని యిందు లో వర్ణాశ్రమాచారముగల పురుషులకు ముఖ్యముగఁ దదనుశీలనమందు సంపూర్ణ సౌకర్యముగలదు. అధికారము, సౌకర్యముగూడఁ గలిగియుండి యను వర్ణాశ్రమాచారు లనేకులు బహిర్ముఖులగుటయే చూచుచున్నాము.* ఇందులకుఁగారణము విదితము. నరజీవన మనేక సోపానములుగల ఘట నా విశేషము. అంత్యజజీవన మన్ని సోపాన ములయం దట్టడుగు సోపానము. నిరీశ్వర నైతిక జీవనము రెండవసోపానము. సేశ్వరనైతిక జీవ నము మూఁడవసోపానము. వైధభక్తజీవనము నాలుగవసోపానము. ఇఁక రాగమయభక్త జీవ నము తత్సోపానముపైనున్న యవస్థానవిశేషము. జీవుఁ డేసోపానమునం దుండునో, దానికిఁ బైనున్న సోపానమునకుఁ బోవుటకు వానికి సహజ ముగఁ బ్రవృత్తి గలిగియుండును. ఆప్రవృత్తి క్రమమున వేగిరపడికాని, యసమయమందుఁగాని యొకసోపానము విడిచి వేఱొక సోపానముపైకిఁ బోకుండుటకును, ఒకసోపానముపై నుత్తమరూపమునఁ గాలునిలిచిన పిదప నే పైసోపానమునకుఁ బోఁగలుగుటకును, సోపాననిష్ఠారూపమగు నధికా రము పూర్తిగ వివరింపఁబడెను. పైసోపానమునందుఁ గాలువెట్టుట కధికా రము ప్రాప్తించిన సమయమందు నిమ్నసోపాననిష్ఠను విడచుట కర్తవ్యము.

నరజీవనము సోపా నమయమగు నొక ఘట నా విశేషము.

* యన్నామధేయం మ్రియమాణ ఆతురః,
పతన్ స్ఖలన్వా వివశో గృణన్ నరః
విముక్తకర్మార్గళ ఉత్తమాం గతిం
ప్రాప్నోతి యక్ష్యంతి నతం కలౌజనాః.

భా. 12-3-44.

భక్తజీవనమే సోపానోపర్యవస్థానము. అట్లువిడువక దానియందే బద్ధులైయుండు నేసది నియమాగ్రహ కుసంస్కార మనఁబడును. ఈ కుసంస్కార బలముచేత నే యంత్యజులు తమకుఁ బైసోపానమగు నిరీశ్వరనైతిక జీవనము నాదరింపరు. నిరీశ్వరనైతికులు కాల్పనిక సేశ్వరనైతిక జీవనము నాదరింపరు. కాల్పనిక సేశ్వరనైతికులు వాస్తవసేశ్వరనైతికులను ద్వణీకరింతురు.

నియమాగ్రహము. వాస్తవసేశ్వరనైతికులు వైధభక్తుల నవమానింతురు. అట్లే వైధభక్తులుగూడ రాగాత్మికాభక్తి ననాదరము సేయుదురు. ఈ కుసంస్కార దోషమువలన నే వర్ణాశ్రమ ధర్మప్రవర్తకు లనేకులు వైధభక్తి ననాదరము సేయుదురు.* ఇందువలన వారికిభక్తి కెట్టిభంగమును రాదుగాని తమయొక్క మందభాగ్యత నే యది వెల్లడించును. ఉచ్చసోపానమందున్నవారు క్రిందిసోపానముపై నున్నవారి యున్నతివిషయమై యాతురపడుట సహజము. కాని నిమ్నసోపానమందున్నవారికి భాగ్యోదయమగు నంతవఱకు నాత్మసోపాననిష్ఠను విడుచుటకును, ఉచ్చసోపానమును బొందుటకును బుద్ధి పుట్టనే పుట్టదు.

కర్మయు, భక్తియు. వర్ణాశ్రమ ధర్మరూపమగు సేశ్వరనైతిక జీవనము భక్తిభావ పరిణామము నొందుటచే భక్తజీవన మగుచున్నది. కాని యెంతవఱకు సేశ్వరనైతిక జీవనము స్వస్వరూపమును విడిచి భక్తజీవన స్వరూపము వహింపదో అంతవఱకు దానికిఁ గర్మ యనియే పేరు. కర్మయెన్నఁడును భక్త్యం

---

* విప్రాద్ద్విషడ్గుణ యుతా దరవిందనాభ
పాదారవింద విముఖాచ్ఛ్వపచం వరిష్ఠం
మన్యేతదర్పిత మనోవచనే హితార్థ
ప్రాణం పునాతి సకులం నతుభూరి మానః.

భా. 7-9-10.

గము కాదు. అది పరిణామావస్థయందు భక్తిసాధక స్వరూపమున నుద యించును. అప్పు డది భక్తియని పిలువఁబడును గాని కర్మయను పేరు మఱి దాని కుండదు. భగవత్సంబంధిని యగు శ్రద్ధ యుదయించినచోఁ గర్మాధికారము తొలఁగిపోవును. కర్మాంగములగు సంధ్యావందనాదికములు ధర్మనీతి గతములగు కర్తవ్య కర్మవిశేషములు కాని శ్రద్ధచే జన్మించిన భక్తికార్యములుగావు. భగవత్సంబంధిని యగు శ్రద్ధ యుదయించినంతనే భగవదానుగత్య రూపములగు సమస్తభక్తికార్యములును సాధకునికిఁగల భగవత్తత్పరతచే విశేషాదరణీయము లగుచున్నవి. సంధ్యావందన కాలమునం దెచటనైన హరికథ జరుగుచుండె నేని దానికిఁబోవుండ సంధ్యావందనాదికమే నిర్వర్తింపవలయునను కోరికపుట్టదు. సంధ్యావందనాదికమునకుఁ దాత్పర్యరూపముగనున్న భక్త్యంగము సంప్రాప్తించినపుడు దానిని విడిచి యితరాంగములను స్వీకరింపుటచే నేమిప్రయోజనమని సాధకుఁ డప్రుడు తెలిసికొనును.

**జ్ఞానవైరాగ్యములు భక్త్యంగములు కావు.**

జ్ఞానవైరాగ్యములను రెండును చిత్తమునకుఁ గఠినతగొల్పి భక్తికి విరోధములుగ నేర్పడుటచే నవి యెప్పటికిని భక్త్యంగములు కావు. కాని యవి భక్తిమార్గమునఁ బ్రవేశింపుటకుఁ బూర్వము కొన్నికొన్ని స్థలములయందు సాధకున కుపకారకములుగ నుండును. కొన్నికొన్ని స్థలములయందు భక్తిమార్గమునఁ బ్రవేశించిన వెనుకఁగూడఁ బ్రథమావస్థయందుఁ గొందఱకుఁ గొంతసాహాయ్యభూతముగ నుండును. జ్ఞానవైరాగ్యములతో భక్తికిఁగల సంబంధము వేఱొకస్థలమందు నిరూపింపఁబడును.

శ్రీ "హరిభక్తివిలాసము" నందు వైధభక్తియొక్క యంగములన్నియు విచారింపఁబడినవి. "భక్తిసందర్భ" గ్రంథమునందుఁగూడ దీని యంగములన్నియు నవవిధభక్తులు వివరించు సందర్భమున సన్నివిష్టమొనర్పఁబడినవి. శ్రీ "భక్తిరసామృతసింధువు" నందు వైధభక్త్యంగము లఱువది

నాలుగు నిరూపింపఁబడినవి. వానిలో వైదంగములు ముఖ్యములుగఁ బరిగ ణింపఁ బడుచున్నవి. అవి యేవన,—

—ఐదుమాత్రమే ముఖ్యభక్త్యంగములు.—

(1) శ్రీమూర్తిని సేవింపుటయందలి ప్రీతి.

(2) రసికులవలన శ్రీమద్భాగవతార్థమంతయు నెఱుంగుట.

(3) తనయభిప్రాయముల కనురూపములగు నభిప్రాయములు గలవారితో స్నేహమును, దనకంటె శ్రేష్ఠులగు సాధుల తోడి సంగమును.

(4) నామసంకీర్తనము.

(5) వ్రజవాసము.

ఏసాధకుని కేయంగమం దధికరుచి గలిగియుండునో, ఆయంగమే వానికి విశేషాదరణీయమగుచున్నది. ఒకానొకయంగమునం దభిరుచిగలదని చెప్పినప్పు డితరాంగములయెడల ద్వేషము జన్మించుననుటకాదు. అయినను నిందువిషయమై యప్రమత్తతతో నుండుటయే కర్తవ్యము.

వైధభక్త్యంగములమూలము విచారించుసందర్భమున రెండువిషయములు మనము గ్రహింపవలసి యుండును. అవి యేవన,—(1) భగవంతుఁడు జీవునిచే నియతముగ స్మరింపఁదగినవాఁడు. అట్టి స్మరణమున

విధి నిషేధము.

కేయేకార్యము లనుకూలములుగనుండునో వానినాచరింపుటయే సాధకుల కందఱకును విధి.

(2) భగవంతుని మఱచుటయే జీవుని యమంగళములకు మూలము. ఏయేకార్యములు భగవంతుని స్మరింపుటకుఁ బ్రతికూలములుగ నుండునో వాని నాచరింపుకే సాధకులయెడ నిషేధము.

మూలవిధిరూపములగు నీరెంటియందును దృష్టినిలిపి, నియమాగ్రహమును బొత్తుగఁ ద్యజించి సాధకగణ మొకానొక సమయమం దొకానొకవిధి నాదరింపుటకును, వేఱొకసమయమందు దానినిఁ బరిత్యజింపుటకును, సమర్థత గలిగియుందురు. వైధభక్తులే నిజమైన సాధకులు. అవస్థాభేదముచే వారు మూఁడువిధములు:—

త్రివిధ వైధసాధకులు.

(1) శ్రద్ధావంతులగు సాధకులు (2) నైష్ఠిక సాధకులు (3) రుచియుక్తసాధకులు.

సాధనక్రమము.

శ్రద్ధావంతులగు సాధకులు తమశ్రద్ధాబలముచే గురుపాదముల నాశ్రయించి దీక్షను స్వీకరించి సాధువులతోఁ గూడి హరిభజనము సేయుచుందురు. సాధుసంగమునఁ జేసి భజనముసేయఁగా జేయఁగా సర్వానర్థములును దూరములగును.* అనర్థములు తొలఁగినంతనే శ్రద్ధ విశుద్ధమై నిష్ఠారూపముగఁ బరిణామము నొందును. నిష్ఠయుఁ గ్రమముగ నభిలాషరూపము నొంది రుచియనుపేరు వహించును. సాధనభక్తియొక్క యున్నతిలాభ మింతవరకే. రుచియుఁ గ్రమముగ నాసక్తియై కొంతకాలమునకు భావస్వరూపము వహించును. అది వేఱొకస్థలమున వివరింపఁబడును.

---

* తేవై విదంత్యతి తరంతిచ దేవమాయాం
స్త్రీశూద్రహూణ శబరాఅపి పాపజీవాః
యద్యద్భుత క్రమ పరాయణ శీలశిక్షా
స్తిర్యగ్జనా అపికిము శ్రుతధారణా యే.

భా. 2-7-46.



# చతుర్థవృష్టి.

## రాగానుగాభక్తి విచారము.

శ్లో. కృష్ణభక్తి రసభావితా మతిః
క్రీయతాం యది కుతోఽపి లభ్యతే
తత్ర లౌల్య మపి మూల్యమేకలం
జన్మకోటి సుకృతైర్న లభ్యతే.

ఇంతవఱకుఁ గేవల వైధీభక్తినే నేను విచారించితిని. సాధనభక్తి యందు వైధీభక్తియను నంగమేకాక నింకొక విధియు, రాగమును. యంగముగూడఁ గలదు. దానిపేరు రాగానుగా సాధనభక్తి. హరితోషణము రెండువిధములుగ సాధింపవచ్చునని నే నింతకుఁ బూర్వమే చెప్పియున్నాఁడను. విధికిసంబంధించి యొక విధమగు సాధనమును, రాగమునకు సంబంధించి మఱియొక విధమగు సాధనమును నేర్పడుచున్నవి. ఈస్థలమందు విధికిని, రాగమునకును గల తాత్త్వికభేదమును విచారింపుటావశ్యకము. కర్తవ్యబుద్ధి ననుసరించిన విచారముతో నే యీశ్వరసాధనప్రణాళి నిర్మింపఁబడినదో దానిని వైధీభక్తి యందురు. కర్తవ్యబుద్ధిచే నేనియమము స్థిరపఱుపఁబడెనో, దానిపేరు విధి. స్వాభావికమగు రుచివలన నుత్తేజితమగు భక్తిపేరు రాగము. ఇష్టవస్తువు నందలి స్వాభావికమగు పరమావిష్టతయే రాగమనఁబడుచున్నది. రాగము ఏవస్తువువంకఁ బఱువెత్తునో అదియే దానికిష్టవస్తువు. రాగమునకు విచారముతోఁగాని, కర్తవ్యాకర్తవ్యవివేచనముతోఁగాని ప్రయోజనములేదు. రాగము సిద్ధవృత్తిస్వరూపము. జడబద్ధుఁడగు జీవుని యాత్మయందలి

రాగము దేహాత్మాభిమానరూపమగు వికారము చెందినపు డింద్రియార్థముల నే తనకు విషయములుగ స్వీకరించును. పుష్పములయం దొకరికిని, భక్ష్యములయం దింకొకరికిని, పేయములయందు వేఱొకరికిని, ఒకరికి మాదక ద్రవ్యములయందును, ఇంకొకరికి వస్త్రములయందును, మఱియొకరికి నగరు (మేడ) లయందును, వేఱొకరికి స్త్రీలయందును రాగము జనించుటచే సమస్తజీవులకును సంసారము ప్రాప్తించెను. ఈకారణముచేత బద్ధజీవునికి భగవంతునియెడల రాగము దూరమయ్యెను. రాగరూపమగు భక్తి జీవులయం దరుదయ్యెను. కావున నియ్యెడ హితాహిత విచారపూర్వకమగు భగవదుపాసనమొక్కటియే కర్తవ్యమైనది. ఈహితాహిత వివేచనమునుండియే విధిప్రాదుర్భూత మగుచున్నది.

**విధి—రాగములు విపరీత తత్త్వములు కావు.**

విధిని సాధించు ప్రయత్నమందే రాగముయొక్క స్వాస్థ్యానుసంధానము సేయనగును. విధి యొకప్పుడును రాగమునకు విపరీత తత్త్వముకాదు. ఇంగ్లీషు భాషయందు విధిని రూల్, రైట్, రిచుయలిజమ్ (Rule, Rite, Ritualism) అని చెప్పుదురు. రాగమును ఫ్రీ స్పాంటేనియస్ అటాచ్మెంట్ (Free spontaneous attachment) అని చెప్పుదురు. విధియు, రాగమును భిన్నభిన్న తత్త్వములైనను శుద్ధావస్థయం దేక తాత్పర్య విశిష్టములైననే. నిర్మల విధిరాగమునను సైఁదోడు. నిర్మల రాగము భగవదిచ్ఛారూపమగు విధి ననుగమించును. భగవత్పక్షమున విధికి జయమును, జీవపక్షమున రాగమున కాదరమును జెప్పఁబడుచున్నవి. జడజగత్తున విధికిని, రాగమునకునుగల విపరీతభావము రాగముయొక్క యస్వాస్థ్య నిబంధనచేఁ గలిగినదే. రాగము మఱల స్వాస్థ్యలాభమునొందెనేని విధి యప్పుడు స్వకార్యనిర్వాహక మొనర్చినదగుచుఁ దనంతటఁదానే సహజముగఁ దొలఁగిపోవును. కావున స్వాస్థ్యస్థితినొందిన రాగమే జీవునివిషయమై సర్వప్రధానముగఁ జెప్పఁబడుచున్నది. వస్తుగతరాగ మెంతయధమమో, సద్వస్తుగతరాగ మంతయుత్తమము. ఔషధమునకును, శరీరమునకు నెట్టి

సంబంధమో విధికిని రాగమునకును అట్టిసంబంధము. రాగముచేనగు కార్యములనంతములు; కాని విధికార్యము రాగమును రక్షింపుటయు, పోషింపుటయు మాత్రమే. రాగము పుష్టమైనచో నది విధియొక్క సాయమును మఱియపేక్షింపదు. శుద్ధుఁడును, జడముక్తుఁడునునగు జీవుఁడుతప్ప వేఱొకఁడు విశుద్ధ భగవద్రాగమున కాశ్రయుఁడు కాఁజాలఁడు. విశుద్ధ భగవద్రాగమునకే రాగాత్మికాభక్తి యని పేరు.

నిర్మలవిధి రాగమునకు సహకారి.

నిర్మలరాగము విధ్యనుగతము.

భగవల్లీలల కుపకరణరూపముగ నున్న శుద్ధజీవుఁడే రాగాత్మికాభక్తి కధికారి. వ్రజవాసులనుఁ దప్ప మఱియెవరికిని రాగాత్మికాభక్తియందధికారములేదని తత్త్వజ్ఞాన విచారమునందుఁ జూపఁబడినది. అదియిచ్చట దిగ్దర్శనమాత్రముగ నుల్లేఖింపఁబడుచున్నది. భగవంతుఁడగు శ్రీకృష్ణచంద్రునికి వ్రజవాసులర్పించు రాగాత్మికాభక్తిని గూర్చి శాస్త్రములయందలి వర్ణనమువినుటచే దానిననుకరింపవలయునను లోభగుణము జన్మించి యే భక్తి యాచరింపఁబడుచున్నదో అదియే రాగానుగాభక్తి. అదియుత్తేజకమగుటకుఁ గారణమిచట సద్వస్తువిషయకమగు లోభమేకాని శాస్త్రయుక్తియు, విధియుఁ, గారణములు కావు. జీవప్రవృత్తి నుత్తేజకమొనర్పుట కనేకోపాయముల నవలంబించి విధి తత్ప్రయత్న మొనర్చుచుండ, భాగ్యవశమున సద్వస్తులోభమొక్కఁడే తత్కార్యసాధన మొనరింపఁ గలిగినపుడీభక్తిని సాధనకాలమందైనను వైధీభక్తియని పిలువరాదు. అది నిజముగ రాగానుగాభక్తియే. కావున సాధనభక్తి వైధసాధనభక్తియనియు, రాగానుగాసాధన భక్తియనియు, రెండువిధములు. వైధసాధనభక్తి యింతకుఁబూర్వమే వివరింపఁబడినది. రాగానుగాసాధనభక్తి యిపుడు వివరింపఁబడును.

రాగాత్మికాభక్తి, రాగానుగాభక్తి.

రాగాత్మికాభక్తి రసాస్వాదము జేయువారేయే భావములతో శ్రీకృష్ణచంద్రునికిఁ బ్రీతిఁ గొలుపుదురో, ఆయాభావములు తనకుఁ గలుగవలెనను పూర్ణాభిలాషముగల యతఁడే రాగానుగాభక్తి కధికారి. వైధీసాధనభక్తియం దేయేయంగములుగలవో వానినన్నిఁటినిగూడ రాగానుగాభక్తి స్వీకరించును. వైధభక్తులు విధిమూలమున నుత్తేజితులై సకలాంగముల నంగీకరింప రాగానుగాభక్తిసాధకులు రాగానుగా ప్రవృత్తిమూలమున నాయా కార్యములందు నియుక్తులగుచున్నారు. శరీరయాత్ర కుపకరించు శారీరిక మానసిక సామాజిక కార్యములన్నియు బద్ధజీవుని జీవన నిర్వాహమునకై ప్రయోజకములగుచున్నవి. ఆజీవనమును బహిర్ముఖస్థితినుండి కాపాడుటకొఱ కాచరింపఁబడు భక్తిసాధనమందుఁ బ్రయోజకములుగ నేవైధభక్తిక్రియ లింతకుఁబూర్వము వివరింపఁబడినవో, అవియన్నియు రాగానుగాభక్తి సాధకులకుఁగూడఁ బ్రయోజకములగుచున్నవి. రాగానుగాభక్తికి సాధనమంతరంగ స్వభావముగలది. కావున సాధనకాలమందలి జీవన మేభావమును గ్రహింపఁగలిగియుండును? అంతరంగసాధనమున కుపయోగించుటకై వైధభక్తికి సంబంధించిన సకలాంగములను స్వీకరింపనిచో జీవిత మకాలమున ముగియుటచేఁగాని, లేక యది బహిర్ముఖమగుటచేఁగాని రాగానుగావృత్తికుంఠితమై పోవుచున్నది. ముఖ్యముగ భగవచ్చింతనము సర్వభావములతోఁ జేయఁబడనిచో నంతరంగసాధనము పుష్టిలాభమొందుటగాని, సురక్షితమగుటగాని, సంభవింపనేఱదు. రాగానుగావృత్తి పుష్టిలాభమునొందినను శ్రవణము, కీర్తనము మున్నగునంగము లొకప్పుడును విడువఁదగినవి కావు. సేశ్వరనైతికజీవనము భక్తజీవనమందుఁ బరిసమాప్తినొంది భిన్నరూపము ధరించినట్లు వైధభక్తిజీవనము రాగానుగాభక్తిజీవనమం దొకించుక పరిణతిలాభమునొంది యొకానొక స్వాధీనలక్షణముతోఁ గూడిన పృథగ్భావమును ధరించుచున్నది. స్థలవిశేషమునుబట్టి విధివర్గమందుఁ గొన్నికొన్ని న్యూనాధిక భావములును, మఱికొన్ని స్థలములయందు రూపాంతరభేదములును, గోచరమగుచున్నవి. ఈభేదములన్నియు భక్తుల జీవితచరిత్రములు గమనించినచోఁ

దేట తెల్లముకాఁగలవు. ఈసకల పరివర్తనములును, ఏదేనొకశాస్త్ర విధి ననుసరించి కలిగినవికావు; భక్తుల రుచిభేదములచే నుత్పన్నములైనవి. కావున వీనికి సరియైన యుదాహరణము లిచ్చుటకేమియు నవకాశములేదు. కేవల వైధభక్తినిగూర్చి విచారించునపుడే యుదాహరణ లిడుట కవకాశ ముండును. రాగాత్మికాభక్తియందుఁగల విభాగవిచారమును, సంబంధ విచారమును రాగానుగాభక్తియం దవశ్యముగనుండును. వాని వివరము భక్తిరస తంత్రమునందుఁ గననగును. ఇచ్చట విపులముగ వ్రాసినచోఁ బున రుక్తిదోషము వాటిల్లును. సంక్షేపముగఁ జెప్పవలయుననిన రాగానుగా భక్తి రాగాత్మికా భక్తివలెనే రెండువిధములు. ఎట్లన.—

—రాగానుగాభక్తి ద్వివిధము.—

(1) కామరూపభక్తి.
(2) సంబంధరూపభక్తి.

విషయములను భోగింపవలెనను నభిలాషమే కామ మనఁబడును.

కామరూపము.

బద్ధజీవుని కింద్రియార్థములే విషయములు. కావున నింద్రియతృష్ణకే పండితులు కామమును పేరిడిరి. పరతత్త్వస్వరూపుఁడగు భగవంతుఁడు విషయరూప ముగ వరింపఁబడు నపుడావిషయ భోగాభిలాషము ప్రేమ యనఁబడును. కామమునకును, ప్రేమమునకును విషయభేదము తప్ప స్వరూపభేదములేదు. నిత్యసిద్ధజీవరూపులగు వ్రజగోపికలకు విషయాంతరము లేనందునఁ బ్రేమయే వ్రజతత్త్వమునఁ గామమగుచున్నది. కావుననే వ్రజమందుఁ గామమునకును, ప్రేమకును భేదములేదు. వారల రాగాత్మికాభక్తి కామరూపమైనది. వారి భక్తి ననుకరించునట్టి జీవుని రాగానుగాభక్తియు నట్టే కామరూపమైనది. జలమునకును, పిపాసకునుగల సంబంధము మించి వేఱొకవిధమగు సంబంధము సాధ్యసాధకులనడుమ గోచరింపనందున నట్టిది సంబంధమనుటకే యవకాశములేదు. కామరూపమగు రాగానుగాభక్తియందుఁ గృష్ణసుఖము తప్ప నితరసుఖములకై దేనికించుటయు, బ్రయత్నించుటయు, లేదు.

ప్రభుదాససంబంధము, సఖాసంబంధము, పితాపుత్రి సంబంధము, వివాహిత స్త్రీపురుషసంబంధము అనునీనాలుగు

**సంబంధరూపము.** ముఖ్యసంబంధములు గల రాగాత్మికా భక్తినే సంబంధరూపమైనది. దాని ననుకరించు జీవుని సంబంధరూపమగు రాగానుగాభక్తి సాధనకాలమందు విదితమగుచున్నది.

వ్రజవాసి భక్తుల యొకానొకభావమందు సాధకుఁడు తలఁపుఁగొని వారి యనుచరునిగఁ దన్నుఁదాను స్థిరపఱచుకొని

**సిద్ధదేహముతోఁడి భజనము.** వారి ననుగమించుచు వారలభావము తానొంది సిద్ధదేహముతో నంతరంగ భగవద్భజనము సేయును. ప్రేమయొక్క ప్రారంభరూపమగు భావముదయించు నంతవఱకుఁ దనభజన కనుకూలించు వైధీభక్త్యంగముల నన్నింటిని బహిరంగ సాధనములుగ నంగీకరించితీఱును. తన భావమునకు శాస్త్రమును, యుక్తియు ననుకూలించునెడల నతఁడు వానియనుశీలన మొనరించును. మఱియుఁ గృష్ణునియొక్కయు, కృష్ణ భక్తజనులయొక్కయు, సశ్రద్ధ సేవయు, దచ్చరిత్రాపఠనమును, భక్తిపీఠములగు స్థలములందు స్థూలదేహముతో నివాసమును, లేక, మానసిక వ్రజవాసమును సాధకుఁ డొనరించును.

శాస్త్రగతమును, యుక్తిగతమును నగు విధియే వైధీభక్తిలబ్ధికిఁ గారణము. రాగానుగాభక్తి లాభమునకు శ్రీకృష్ణునియొక్కయు, కృష్ణభక్తుల యొక్కయు, గరుణయే యేకమాత్ర కారణము. కొందఱు వైధీభక్తి ప్రేమ భక్తియొక్క మర్యాదాస్వరూపమని చెప్పుచు దానికి మర్యాదామార్గమను నామమిడిరి. ప్రేమభక్తిని బోషించునదే రాగానుగాభక్తియని వారిమతము. కాని వైధీభక్తి యైశ్వర్యజ్ఞానముతో సదా కూడుకొనియుండును. రాగానుగాభక్తియం దొకప్పుడును ఐశ్వర్యజ్ఞానముండదు. వైధభక్తులు కొన్ని కొన్ని స్థలములందు వైధీప్రవృత్తినే యవలంబింతురు. రాఁబోవు వృష్టి యందు రాగజనిత భగవద్భక్తుల లక్షణములు మున్నగునవి విచారింపఁ బడును.

---

# పంచమవృష్టి—ప్రథమధార.

---

## భా వ భ క్తి వి చా ర ము.

---

### —భా వ భ క్తి.—

---

శ్లో. భువనవిభవ హేతవేప్యకుంఠ
స్మృతి రజితాత్మ సురాది భిర్విమృగ్యాత్
నచలతి భగవత్పదారవిందా
ల్లవ నిమిషార్థ మపి యస్స వైష్ణవాగ్ర్యః.

ప్రేమభక్తియే సాధనభక్తికి ఫలము. ప్రేమ భక్తికి రెండవస్థలు గలవు. ప్రథమావస్థ భావము; రెండవది ప్రేమము.

**ప్రేమభక్తి ద్వివిధావస్థ గలది.**

ప్రేమ సూర్యునితోను, భావము సూర్యకిరణములతోను, ఉపమింపఁబడుచున్నది. భావము విశుద్ధ సత్త్వస్వరూపమై రుచి మూలమునఁ జిత్తమును మెత్తఁబఱచును. ఇంతకు ముందు భక్తియొక్క సామాన్యలక్షణములు వివరించినపు డుల్లేఖింపఁబడిన కృష్ణానుశీలనకార్యము లేయవస్థయందు శుద్ధసత్త్వస్వరూపము వహించి రుచిమూలమునఁ జిత్తమునకు మృదుభావ మొదవించుచున్నవో, ఆ యవస్థనే భావమందురు.

**భావము, ప్రేమము, రతి.**

భావము మనోవృత్తియందుదయించియు మనోవృత్తిస్వరూపమునే వహించును. భావము వాస్తవముగ స్వయంప్రకాశ రూపమే. కాని మనోగతమగుటచేఁ బ్రకాశ్యరూపమున వెలుఁగొందును. ఇప్పుడు భావమును చెప్పఁ

బడుచున్నదానికే రతి యను మఱియొక పేరు గలదు. రతి స్వయముగ నాస్వాద స్వరూపమయ్యును గృష్ణాదివిషయముల నాస్వాదింపఁజేయుటకు హేతురూపముగ నొప్పుచుండును. రతి చిత్తత్త్వ విశేషముగాని జడమునకు సంబంధించిన తత్త్వము కాదని ముఖ్యముగ గుర్తింపవలెను. బద్ధజీవునికి జడ విషయములయెడలఁ గలుగు రతి జీవుని చిద్విభాగ గతభావముయొక్క జడ మయవికారమే. జడజగత్తునందుండి భగవదనుశీలనము సేయుకాలమందా రతి యే సంవిదాంశముచే భగవద్విచారసంబంధములగు నన్ని విషయముల నాస్వాదించుటకు హేతువగుచున్నది. ఆకాలమందే హ్లాదిన్యంశముచే నది భగవదానంద దాయకమగుచున్నది. ప్రేమమను కల్పవృక్షమునకు రతియే బీజ స్వరూపము. ఇతర భావము లరుదెంచి రతికిఁ దోడ్పడినప్పుడు భావోదయరూపమున నదియే ప్రేమ వృక్షమును బ్రకటించును. రసతత్త్వవిచార మందిందులకుదాహరణములు విశేషముగఁ జూడ నగును.

రతియే ప్రేమ కల్పతరువునకు బీజము.

రతియనునది ప్రేమయొక్క యత్యంత సూక్ష్మాంశవిశేషము. దానికంటె స్వరూపగత సూక్ష్మాంశము వేఱొకటి యుండఁబోదు. సూఱను నంకెయందొకటియనున దెట్లఖండితాతి సూక్ష్మవిభాగమో, అట్లే ప్రేమ తత్త్వమందు రతి యనునదొక యఖండిత సూక్ష్మ విభాగము. సాధనభక్తియందుఁ గననగు రుచి, శ్రద్ధ, ఆసక్తి మున్నగునవన్నియును రతియొక్క భగ్నాంకవిశేషములు. శ్రద్ధయు రుచియు సాధనాంగములుగ లేనియెడల సాధనపూర్తిగ విఫలమగును. వర్ణాశ్రమాది ధర్మమునందుల్లేఖింపఁబడిన శ్రద్ధయు, రుచియుఁ గూడ రతియొక్క భగ్నాంకములగుట నిజమేకాని యవి పైనిఁజెప్పిన భగ్నాంకములయొక్క ప్రతి బింబ రూపములగు భావములు. నీతి విరుద్ధ జీవనమందు రతియొక్క భగ్నాంకములన్నియు

రతియే ప్రేమయొక్క సూక్ష్మాంశము.

రతియొక్క వికృతియు, స్వీయప్రకృతియు.

మిగుల వికృతములుగనుండును. నైతికజీవనమందవి యొకింత విధిబద్ధములుగ నుండును. సేశ్వర నైతిక జీవనమం దవి యధికతర విధిబద్ధములుగ నున్నను మొత్తముపైని వికృతప్రాయములే. సాధన భక్త జీవనమందు వానికి వికారముండదు. అయిన నవి భగ్నాంకములగుటచేఁ బూర్ణాంక స్థితి యొసఁగూడదు. భాగవత జీవన మావిర్భవించినంతనే యేకాంకస్థలీయమగు రతి లక్షితమగుచున్నది. పూర్ణాంకస్థలీయమగు రతి యుదయించినంతనే జీవనము చరితార్థత నొందుచున్నది. రతి సంపన్నుఁడగు పురుషునకు దేహత్యాగపర్యంతము ప్రపంచ సంబంధముండును. ప్రపంచోన్ముఖతయే రతియొక్క వికృతి. ఈశోన్ముఖతయే యావికృతికిముక్తి; అనఁగా స్వీయ ప్రకృతి.

రతి లేక భావము రెండువిధములు. ఎట్లన,—

(1) సాధనాభినివేశజభావము.

(2) ప్రసాదజభావము.

వీనిలో సాధనాభినివేశజభావము మఱల రెండువిధములు. ఎట్లన,—

(1) వైధసాధనాభినివేశజభావము.

(2) రాగానుగాసాధనాభినివేశజభావము.

శ్రద్ధావంతులగు సాధకులయొక్క సాధనాభినివేశమే క్రమముగఁ బరమేశ్వరునియెడల రుచి పుట్టించును. ఆ రుచి మఱల సాధనాభినివేశము చేతనే యాసక్తిగఁ బరిణమించి మఱల నదియే రతిరూపమునఁ బుష్టిలాభము నొందును. ఇదే సాధనయొక్క ఫలక్రమము. శ్రీ నారదుని జీవనమే వైధ సాధనాభినివేశజ భావమున కుదాహరణము. పద్మపురాణమందు రాగానుగాభక్తులు స్త్రీభావ ప్రాప్తినొందుటయే రాగానుగా సాధనాభినివేశజ భావమున కుదాహరణము.

ప్రసాదజభావము రెండువిధములు. ఎట్లన,—

(1) కృష్ణప్రసాదజభావము.

(2) భక్తప్రసాదజభావము.

—త్రివిధ కృష్ణప్రసాదము.—

కృష్ణప్రసాదజభావము మఱల మూఁడువిధములు. ఎట్లన,—

(1) వాచికము.

(2) ఆలోకదానము.

(3) హార్దము.

భగవంతుఁడెవనియెడలనైనను ప్రసన్నుఁడగుచు సంభాషణముచే వానికానందము గలిగించినపుడది వాచికప్రసాదమగుచున్నది. భగవంతుఁడు స్వయముగ దర్శనమిచ్చి యనుగ్రహించినపుడది యాలోకదానమనఁబడును. హృదయమందుత్కృష్టభావ ముదయించినపుడది హార్దప్రసాద మనఁబడును.

భక్తప్రసాదజ భావము.

నారదుఁడు మున్నగు భక్తుల యనుగ్రహముచేత ననేక జీవుల హృదయములందు భావోదయమయ్యెను. అదియే భక్తప్రసాదజభావము. * భక్తులయందొక మహత్తరమగు శక్తి యుదయించును. వారాశక్తిమూలమున నితర జీవుల కనుగ్రహపూర్వకముగ శక్తిసంచార మొనరింతురు. నారదుని కృపచేఁ బ్రహ్లాదునకును, వ్యాధునకును, నైసర్గికమగు రతి సంప్రాప్తించెను.

శక్తి సంచారము.

శక్తిసంచార సందర్భమున కొన్నిమాటలు చెప్పవలసియున్నది. ప్రేమభక్తుల శక్తి యపారమైనది. పాత్రత యున్నను లేకున్నను వారి కనుగ్రహము కలిగెనేని నెవరికైనను వారు శక్తి

* గుణైరలమసంఖ్యేయైర్మాహాత్మ్యం తస్యసూచ్యతే
వాసుదేవే భగవతి యస్యనైసర్గికీ రతిః.

భా. 7.4.36.

సంచారము సేయఁగలరు. భావభక్తులను సాధనభక్తులపైఁ గృపగల్గినచో వారు తమ్ము ననుగమించునంతటి శక్తి సంచారము భావభక్త లొనర్పఁ గలరు. తమ తమ పవిత్రవర్తన బలముచే బహిర్ముఖులనుఁగూడ బూర్వజన్మ సుకృతి క్రమమునఁ బరమేశ్వరునియందు రుచి పుట్టింపఁజాలుదురు. వైధ సాధనపరులును, రాగానుగా సాధనపరులును నగుభక్తులు శిక్షచేతను, ఉదాహరణపూర్వకముగను, బహిర్ముఖజనుల ప్రాక్తన సుకృతి ననుసరించి వారలనుఁ బరమేశ్వరునియందు శ్రద్ధ గలుగునట్లొనర్పఁగలరు. *

ఇచట విచారింపవలసిన మఱియొక విషయముకూడఁ గలదు. సాధన క్రమమున జీవులను భావభక్తి లభించుట ప్రాయికమేకాని ప్రసాదజ భావము మిక్కిలి యరుదుగ సిద్ధించుట లోకమందుఁ గనుచున్నాము. అత్యంత కనిష్ఠాధికారికూడఁ బ్రసాదక్రమమున భావాధికారముఁ బొందఁ గలుగును. సమస్తవిధులకును బ్రభువగు భగవంతుని యచింత్యశక్తి యొక్కటే యిందులకుఁ గారణము. ఇట్టి యనుగ్రహము నెఱపుట భగవంతుని పక్షమున నన్యాయమని చెప్పుచు నెవ్వరు నభిమానము జూపరాదు. ఏమన, సర్వ స్వతంత్రుఁడగు శ్రీకృష్ణచంద్రుఁ డిట్టి యధికారము కలిగియుంటలో నన్యాయమేమున్నది? న్యాయ్యమన నేమి? పరమేశ్వరునిచ్ఛయే న్యాయ్యము. వాని యిచ్ఛవలన నేయే విధులుత్పన్నములైనవో వానినిఁ బాలించుటయే న్యాయపక్షమని జనులు చెప్పుదురు. స్వతంత్రేచ్ఛామయుఁడగు వ్యక్తి చెంగట విధి యతి క్షుద్రస్థితి నవలంబించి సదా వాని యధీనమందేయుండును. మనుష్యులు తమకేవి ప్రమాణములని చెప్పుదురో అట్టి ప్రమాణము

---

* వాణీగుణానుకథనే శ్రవణంకథాయాం
హస్తౌచకర్మసు మనస్తవ పాదయోర్నః
స్మృత్యాం శిరస్తవ నివాస జగత్ప్రణామే
దృష్టిస్సతాం దర్శనేఽస్తు భవత్తనూనాం.

భా. 10.10.39.

లచే నే న్యాయా న్యాయములు స్థిరపడుచున్నవో ఆసమస్త ప్రమాణములకును శ్రీకృష్ణచంద్రుఁ డన్నివిధములచేత నతీతుఁడు.

భక్తభేదమును బట్టి రతి యైదువిధములు. రసవిచారము సేయుచోట

భక్తభేదమును బట్టి రతి పంచవిధములు.

నివి ప్రత్యేకముగ నిరూపింపఁబడును. ఏమానవుని హృదయమందు భావాంకురము పొడసూపెనో వాని జీవన మతి పవిత్రమైనది. వైధభక్తజనుల జీవితమందు రతి యుత్పన్నమైనచో నా కారణమున జీవితమందు స్వాభావికముగఁ గలుగవలసిన మార్పులన్నియు నవశ్యముగ సంభవించును. విధి బంధనము లనేకములు శిథిలమైపోవును. ఆచారముగూడ నొకింత స్వచ్ఛందవృత్తి నవలంబించును. వైధ భక్తజీవన మొకర్రమాఱుగ భావజీవనరూపముగ మార్పునొందకపోయినను భావుకుఁ డొనరించు కార్యములన్నియు విధి స్వతంత్రములుగఁ గానవచ్చును. ప్రకృత స్థితియందున్న పూర్ణరతియే వాని సమస్త కార్యములను నియమించును. *

---

* క్వచిద్రుదంత్యచ్యుత చింతయాక్వచి,
ద్ధసంతినందంతి వదంత్య లౌకికాః
నృత్యంతి గాయంత్యనుశీలయం త్యజం,
భవంతి తూష్ణీం పరమేత్యనిర్వృతాః.

భా. 11.3.36.

శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణే,
ర్జన్మాని కర్మాణిచ యానిలోకే
గీతాని నామాని తదర్థకాని,
గాయన్విలజ్జో విచరేదసంగః.

భా. 11.2.39.

వదతిక్వచిదుత్కంఠో విలజ్జో నృత్యతి క్వచిత్
క్వచిత్తద్భావనాయుక్త స్తన్మయోఽనుచకారహ
క్వచిదుత్పులకస్తూష్ణీ మాస్తేసంస్పర్శ నిర్వృతః
అస్పంద ప్రణయానంద సలిలా మీలితేక్షణః.

భా. 7.4.40 & 41.

భావుకుఁడు స్వేచ్ఛావృత్తి సంపన్నుఁడని చెప్పుటచే వానివలన లోకమున కేదైన నుద్వేగము కలుగునని భావింపరాదు.

భావము లోకో త్పాత విషయము కాదు.

భావుకునకు మొట్టమొదటఁ బుణ్యపాపములయం దభిరుచితగ్గిపోవును. తనకుఁ గర్తవ్యమని చెప్పుచు భావుకుఁడెట్టికర్మయు నొనర్పఁడు. ఇతరుల నెవరి నైన ననుకరింపవలెనను ప్రవృత్తి యతనికిఁ గలుగనే కలుగదు. శరీరమున ఆత్మసామాజిక పోషణక్రియలన్నియును బూర్వాభ్యాసవశతచే సనాయాసముగ నతనిచే నిర్వర్తింపఁబడుచుండును. అతనికిఁ బుణ్యకర్మలయెడల నుదాసీనత యుండునుగాని యాకారణముచేఁ బాపకార్య ప్రవృత్తి సంభవింపనేరదు. రతి పరిచాలనక్రమమునందుఁ గొన్ని కొన్నిచోట్ల నైతికాచారమునకు వైగుణ్యము కనఁబడినను దానినిఁ గని వైధభక్తు లనూయపడరాదు. భావసంపన్నుఁడగు పురుషుఁడు సర్వవిధములచేతను గృతార్థుఁడు. అట్టివాని నవమానపఱచినచో వైదభక్తుని భక్తి ధనమంతయు నాశనమగును. భావ భక్తజీవనమును, సాధనభక్తజీవనమును ఇంచుమించుగా నొకదాని నొకటి పోలియుండును. అయినను భావజీవనము దొకానొక నూతన లక్షణము సర్వదా విచారణీయముగనే యుండును.



## పంచమవృష్టి—ద్వితీయధార.

### భావుక లక్షణము.

శ్లో. అతిభూమి మభూమి మేవవా
వచసాం వాసిత వల్లవీ హృదం
మనసా మపరం రసాయనం
మధురా ద్వైత ముపాస్మహే మహః.

భావుక లక్షణము లన్నిఁటిలో నీదిగువవివరించిన తొమ్మిదియుఁ బ్రధాన లక్షణములు:—

—నవవిధ భావుక లక్షణము.—

(1) క్షాంతి.
(2) అవ్యర్థకాలత్వము.
(3) విరక్తి.
(4) మానశూన్యత.
(5) ఆశాబంధము.
(6) సముత్కంఠ.
(7) సర్వదా నామగానమందు రుచిగలిగియుండుట.
(8) కృష్ణ గుణాఖ్యానమం దాసక్తి.
(9) కృష్ణవసతి స్థలములయందుఁ బ్రీతి.

(1) క్షాంతి. క్షోభ, మనఁగా జిత్తమున కుద్వేగము గలుగుటకుఁ గారణము సంభవించినను భావుకుని చిత్తము కలఁతనొందదు. ఎవరైనను దనపై శత్రుత్వము వహించినను, దన యాత్మీయుల కెవరికైనఁ గష్టముగాని, మృత్యువు

గాని సంభవించినను, ఏదైననొక సొత్తుపోయినను, సంసారమునందుఁ గల హానిగాని, పీడగాని సంభవించినను వానివిషయమై భావభక్తుఁడు తాత్కాలికమగు ప్రతిక్రియమాత్ర మొనరించునుగాని యతనిచిత్తము భగవంతుని పాదపద్మములందే లగ్నమై యుండుటచే నది యెన్నఁటికిని క్షుభితముగాదు. క్రోధము, కామము, లోభము, భయము, ఆశ, శోకము, మోహము, అనునవి చిత్తక్షోభమునకుఁ దెరువులు.

(2) అవ్యర్థ కాలత్వము. భావుకుఁడు వ్యర్థముగఁ గాలము పోఁగూడదను వ్యాకులత కలిగి భావదృష్టితో సర్వకార్యము లొనరింపుచు భగవదనుశీలనము సేయుచుండును. ఏకార్యము దాను సేయవలసివచ్చినను దాని కుపకరించు భగవల్లీలాస్మరణ మొనరింపుచుఁ దదాచరణకాలమందు శ్రీకృష్ణభావోద్దీప్తి నభిలషించును. సమస్తకార్యములను భగవద్దాస్య రూపముగ నతఁ డొనరించును.

(3) విరక్తి. ఇంద్రియములకు విషయములగు వానియన్నిఁటియందును స్వాభావికముగఁ గలుగు నరుచి విరక్తియనఁబడును. భావోదయమైనచో నీవిరక్తి ప్రబలమగును. భావసంపన్నులగు పురుషుల కింద్రియార్థములయందరుచి యుదయించును. కాని భగవద్విషయకములగు నింద్రియార్థములయందు వారి కత్యంత ప్రీతి గలిగియుండును. విర్క్త్ (విరక్త) భావాజీలను నొకతెగ గలదు; వారు బైరాగివేషము ధరించి తాము విరక్తులమని చెప్పుకొందురు. విరక్తియనఁగా దానికి సంబంధించు బాహ్య చిహ్నములు ధరించుటమాత్రమే కాదు. భావోదయ క్రమమున నింద్రియార్థములయందరుచి జనింపకుండ విరక్తవేషముదాల్చుట కేవలము విధిబాహ్యము. విరాగియన నర్థమేమి? భావోదయమగుటచే విరక్తి గలిగినవారికి సంసార నిర్వాహక మెంతమాత్రమును సుకరముగనుండదు. హరిభజనమున కనుకూలత

గలుగనివారు ఖోగేచ్ఛనుబూర్తిగ నుపసంహరించుకొని సామాన్యముగు క్షుద్రవసనము, బొంత, కమండలువు మున్నగునవి ధరించి భిక్షాటన మొనరింపుచు శ్రీమహాప్రసాదసేవతోఁ జీవితము గడపుచుందురు.* ఇట్లు కొంత కాలము జరుగునేని వారికాజీవనము పరిపాటియగుటలో సందేహములేదు.

---

* బిభృయాచ్చేన్ముని ర్వాసః కౌపీనాచ్ఛాదనం పరం
త్యక్తం న దండపాత్రాభ్యా మన్యత్కించిద నాపది
దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం పిబేజ్జలం
సత్యపూతాం వదేద్వాణీం మనఃపూతం సమాచరేత్
ఏకశ్చరే స్మహీమేతాం నిస్సంగ స్సంయతేంద్రియః
ఆత్మక్రీడశ్చాత్మరత ఆత్మవాన్ సమదర్శనః
అన్వీక్షే తాత్మనోబంధం మోక్షంచ జ్ఞాననిష్ఠయా
బంధ ఇంద్రియవిక్షేపో మోక్ష ఏషాంచ సంయమః
జ్ఞాననిష్ఠో విరక్తోవా మద్భక్తోవా నపేక్షకః
సలింగా నాశ్రమాం స్త్యక్త్వా చరే దవిధిగోచరః
వేదవాదరతో నస్యాన్న పాషండీ నహైతుకః
శుష్కవాద వివాదేచ నకంచిత్పక్షమాశ్రయేత్
నోద్విజేత జనాద్ధీరో జనంచో ద్వేజయేన్నతు
అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన
దేహముద్దిశ్య పశువద్వైరం కుర్యాన్న కేనచిత్
ఏక ఏవ పరోహ్యాత్మా భూతేష్వాత్మ న్యవస్థితః
అలబ్ధ్వా నవిషీదేత కాలేకాలేఽశనం క్వచిత్
లబ్ధ్వానహృష్యేద్ధృతి మానుభయం దైవ యంత్రితమ్
ఆహారార్థం సమీహేత యుక్తం తత్ప్రాణధారణం
తత్త్వం విమృశ్యతే తేన తద్విజ్ఞాయ విముచ్యతే
యదృచ్ఛయోపపన్నాన్న మద్యాచ్ఛ్రేష్ఠముతాపరమ్
తథావాస స్తథాశయ్యాం ప్రాప్తం ప్రాప్తం భజేన్మునిః

ఇట్టిపరివర్తన కధికారము గలిగి యుండుటగూర్చి శ్రీగురుదేవునితో సంప్ర దించి యది సర్వశాస్త్ర సమ్మతముగ నున్నట్లేర్పడినచో నపుడు "బైరాగి" వేషధారణము సార్థకమగును. కాని యిప్పటివేషధారణము మిగుల నమంగళ జనకముగ నున్నది. భావ సంపన్నత లేక పోవుట నరేకదా తుదను వైధభక్తియందుఁగూడ నిష్ఠలేని యనేకులు క్షణవైరాగ్యము గలుగుటచేఁ గాని, యథేష్టముగ విహరింపుచు సుఖజీవనము సేయుటకొఱకుఁగాని, బైరాగివేషము ధరింతురు. భార్యాభర్తలు కలహించుటచేతఁగాని, సంసార సంబంధములగు కష్టములు కలుగుటచేతఁగాని, వివాహము కాకపోవుటచేతఁ గాని, దేశ్యలు తనువృత్తిని విడిచిన తఱువాతగాని, యేదేనొకమాదక ద్రవ్య వశమున నున్నప్పుడుకాని, కేవల మవివేకముచేతఁగాని, కలిగెడి సంసార వైరాగ్యమునే క్షణవైరాగ్యమందురు. అట్టి క్షణవైరాగ్యము కలిగిన యిప్పటివారు కొందఱొక బావాజీయొద్దకుఁగాని, గోస్వామి యొద్దకుఁగాని, తత్క్షణమేపోయి, వానికిఁ గొంతధనమర్పించి కాపీనమును, బహిర్వాసమును గ్రహింతురు. ఇందుకు ఫలమేమన, నత్యల్పకాలములోనే వారికా వైరాగ్యము తొలఁగిపోవుటచే విగతవిరాగులగునట్టి యాస్త్రీ పురుషు లింద్రియపరవశులై యక్రమ సంసారములను నిర్మాణమొనరింతురు; లేదా లోలోపల నింద్య ప్రవర్తన మవలంబించి తన్మూలమున నింద్రియతృప్తి నొందుచుందురు. వారికిఁ బరమార్థముతో నేమియు సంబంధములేదు. ఇట్టి దుష్టవిరాగిగణము నొకర్మాఱుగా నవలకు సాగనంపనిచో భక్తలోకమున కెట్టిశ్రేయస్సును గలుగనేరదు. ఇంతకుముందు వర్ణాశ్రమధర్మవిచారమున నక్రమవైరాగ్యము జగన్నాశ కార్యరూపమగు పాపముగఁజెప్పఁబడినది. ఆ యక్రమవైరా-

రతి కలుగనివారు బయటికి విరక్తిభావము గ్రహింపుట సకలో త్పాత హేతువు.

---

యస్త్వసంయత షడ్వర్గః ప్రచండేంద్రియ సారథిః
జ్ఞాన వైరాగ్య రహితస్త్రిదండ ముపజీవతి.

భా. 11.18.15 to 40.

గ్యము వర్ణాశ్రమధర్మగతమగు సన్న్యాసాశ్రమమునకుఁ సంబంధించిన పాప కార్యము. కాని యిప్పుడుచెప్పఁబడిన యవైధవైరాగ్యము భక్తజీవనగత మహాపరాధని శేషము. శ్రీమద్గోపాలభట్ట గోస్వామికృతమగు "సత్క్రియా చారదీపిక" యొక్క పరిశిష్ట ప్రకరణమం దీవిచారమంతయుఁ జూడసగును.

వైష్ణవ "బైరాగి" నామము ధరించినవారిలో యథార్థభక్తిచే వైరాగ్యలాభము పొందినవా రతిస్వల్ప సంఖ్యాకులైయుందురు. అట్టివారి చరణములకు నేను సదా దండప్రణామ మాచరింతును. అవైధ బైరాగు లీక్రింద వివరించినరీతిగ నాలుగు తరగతులుగ నుందురు:—

నాలుగు విధములగు నవైధ "బైరాగులు"

(1) మర్కట వైరాగి.
(2) కపటవైరాగి.
(3) అస్థిరవైరాగి.
(4) ఔపాధికవైరాగి.

మర్కటవైరాగి.

వైరాగ్య మేమాత్రమునులేక విరాగివలె వేషభాషల నవలంబించి స్వేచ్ఛావిహారము సలుపుచు నింద్రియ నిగ్రహము లేకపోవుటచే సర్వానర్థముల ననుభవించువాఁడు మర్కట వైరాగి యని శ్రీమన్మహాప్రభువు సెలవిచ్చెను.

కపటవైరాగి.

"మహోత్సవాదులలో వైష్ణవులతోపాటు నాకును భోజనము జరిగిపోవునుగదా? నేనెట్టి తప్పు పనులు చేసినను నేను చచ్చినతఱువాత నాదరణ పూర్వకముగా నాదేహ సంస్కారాదులు చేయువారు వైష్ణవులే గదా? గృహస్థులందఱును నాకుఁదగిన మర్యాదచేసి భోజనమిడుచు గంజాయి, పొగాకు మాత్రమేకాక నాయనర్థచేష్టలకొఱకు వలయు ధనము గూడ నిడుదురుగదా?" అను నిట్టి దుష్టాలోచనలతో బైరాగివేషము వేయువారు కపటవైరాగులు.

అస్థిరవైరాగి.

కలహము, నష్టములు, ధనలోపము, అనారోగ్యము, వివాహము కాకుండుట మున్నగు కారణములచేఁ గలిగెడు క్షణ వైరాగ్యమునుబట్టి వైరాగ్యవేషము దాల్చు వారస్థిర వైరాగులు. వారల వైరాగ్యమెంత కాలమో ఉండునదికాదు. కనుక వారలతిశీఘ్రముగఁ గపట వైరాగులగుదురు.

ఔపాధికవైరాగి.

మాదక ద్రవ్యములు సేవించుటచే సంసారము సేయుట కెట్టియోగ్యత యులేక నిపాసనుయమం దౌపాధిక హరిభక్తిని బ్రకటించుట కభ్యాసపడినవారును, అభ్యాసముచే లభించిన రతిమూలమున భక్తిలక్షణములను బ్రకటించుట కలవడినవారును, జడరతి నాశ్రయించి తన్మూలమున శుద్ధరతిని సాధింపఁ జూచువారును, వైరాగ్యవేషధారులగు నౌపాధిక వైరాగులనఁబడుదురు.

యథార్థవైరాగ్యము భక్తజీవనమున కలంకారము.

పైనిఁజెప్పిన రకరకములగు వైరాగ్యములన్నియుఁ దుచ్ఛములు, దుష్టములు, నమంగళసాధనములును. భక్తిమూలమునఁ గలిగెడి వైరాగ్యమే భక్తజీవనమునకు వన్నెఁ దెచ్చునది. మొదట వైరాగ్యమును సంపాదించి తదుపరిభక్తిని సంపాదింపఁబూనుట అసహజమును, అమంగళ జనకమును. భావసంపన్నులగు పురుషులకైనను, స్త్రీలకైనను యథార్థమగు విరక్తియే యలంకారము వంటిదని తెలియనగును. విరక్తి యనునది భక్త్యనుభావ స్వరూపమైనది కాని భక్త్యంగమెన్నఁడును గాదు.

మానశూన్యత.

తాను సర్వోత్తముఁడయ్యును నట్టి యభిమానమేమియు లేకుండుటయే మానశూన్యత. ఉత్కృష్టతలేనివారు గూడ మానశూన్యులే. కాని యట్టి మానశూన్యత భక్తజీవనమున కలంకారముగఁ జెప్పఁదగదు.

భావసంపన్నుఁడగు పురుషుఁడు తనకు భగవత్ప్రాప్తి సంభవించు నను దృఢనిశ్చయము కలిగియుండుటచే నాశాబంధ ముత్పన్నమగును. అప్పుడు కుతర్కజనిత సందేహములేవియు నతనికిఁ గలుగవు.

ఆశాబంధము.

తన యభీష్ట మెప్పుడులభించుననుచు మిక్కిలి తత్తఱిల్లు చుండుటయే సముత్కంఠ యనఁబడును. భావ సంపన్నుఁడగు వ్యక్తికి భగవంతుఁ డొక్కఁడే నిజాభీష్ట వస్తువు. వానియందే యతఁడు సముత్కంఠ గలిగి యుండును.

సముత్కంఠ.

—నామగానమందు సదారుచిగలిగి యుండుట.—

భావ సంపన్నుఁడగు పురుషునకు భగవన్నామ గానమందే సదా యభిలాషయుండును; తదితరములెవ్వియు నతనికి రుచింపవు.

— కృష్ణగుణాఖ్యానమం దాసక్తి. —

భగవంతుని గుణగణములు కీర్తింపుటయందే జాతభావపురుషునకు సర్వదా ఆసక్తి గలిగియుండును. * రుచియొక్క గాఢతరావస్థయే ఆసక్తి; గాఢతమావస్థ రతి.

భగవంతుని వసతిస్థలములయందుఁ బ్రీతి గలిగియుండుట భావ సంపన్నుఁడగు పురుషుని లక్షణములలో నొకటి. ప్రపంచ గతములనియు, ప్రపంచాతీతములనియు భగవంతుని వసతిస్థలములు రెండు విధములు. ప్రాకృత జగత్తునందలి హరి లీలాపీఠములన్నియుఁ

కృష్ణవసతి స్థలముల యందలి ప్రీతి.

---

* నాత్యంతికం విగణయంత్యపి తే ప్రసాదం
కిం వాన్యదర్పితభయం భ్రువ ఉన్నయైస్తే
యేఽంగత్వ దంఘ్రిశరణా భవతః కథాయాః
కీర్తన్యతీర్థ యశసః కుశలా రసజ్ఞాః.

భా. 3.15-48.

ప్రపంచగతములు. పరాభక్తియోజనాపూర్వకముగ వానిని భక్తినేత్రముతోఁ గనినపుడవియే ప్రపంచాతీత వసతిస్థలములకు నిదర్శన స్వరూపములగు చున్నవి. చిజ్జగత్తొక్కటియే ప్రపంచాతీత వసతిస్థలము. శుద్ధచిజ్జగత్తు, భౌమచిజ్జగత్తు అని చిజ్జగత్తు రెండువిధములు. విరజానది కావలనున్న పరవ్యోమమే శుద్ధచిజ్జగత్తు. అచ్చటనుండు భిన్నభిన్న రసపీఠరూపములగు నాయా ప్రకోష్ఠములందు భగవంతుఁ డాయారసోచితములగు స్వరూపములను ధరించి యాయా రసోపకరణ రూపులగు శుద్ధజీవులతోఁగూడి నిత్యవిరాజమానుఁడై యుండును. ఆయాప్రకోష్ఠములకు సంబంధములగు రసముల నాస్వాదించుటయందుఁ గోర్కెగల బద్ధజీవులయొక్క భక్తిపూరిత హృదయములందలి చిద్భాగముల యందుఁగూడ భగవంతుఁడు తత్తద్రసోపయోగి స్వరూపములతోఁ బ్రకాశించుచుండును. కావున వైకుంఠము, భక్తహృదయమనను నీరెండును భగవంతునియొక్క అప్రాకృతవసతి స్థలములే. ప్రపంచమధ్యగతములగు భగవల్లీలా స్థానములును, భక్తుల భజనపీఠ సముదాయమును, భగవంతుని ప్రపంచవిజయములని చెప్పఁబడుచున్నవి. శ్రీధామ బృందావనము, శ్రీధామ నవద్వీపము మున్నగు భగవల్లీలాస్థానములును, శ్రీనిత్యానంద ప్రభుని శిష్యులు నివసించిన పంద్రెండు పవిత్రస్థానములును [ద్వాదశపాట (పీఠ)], నైమిశారణ్యము మున్నగు మహాభాగవతుల క్షేత్రములును, గంగాతీరము, తులసీక్షేత్రము, భగవత్కథాస్థానములును, శ్రీవిగ్రహాధిష్ఠాన సమూహములును, భగవంతుని వసతిస్థలములు.* భావ సంపన్నుఁడగు పురుషుఁ డీస్థలములయందు నివసింపుట కెల్లపుడు గోరుచుండును.

---

* పుణ్యాబత వ్రజ భువో యదయం నృలింగ
గూఢః పురాణపురుషో వనచిత్రమాల్యః
గాః పాలయన్ సహబలః క్వణయంశ్చ వేణుం
విక్రీడయాంచతి గిరిత్ర రమార్చితాంఘ్రిః.

భా. 10-44-14.

# పంచమవృష్టి—తృతీయధార.

## జ్ఞా న వి చా ర ము.

శ్లో. జ్ఞానేప్రయాస ముదపాస్య నమంత ఏవ
జీవంతి సన్ముఖరితాం భవదీయవార్తాం
స్థానేస్థితా శ్శ్రుతిగతాం తనువాఙ్మనోభిః
యేప్రాయశోఽజిత! జితోప్యసితై స్త్రిలోక్యాం.

భావ సంపన్నులగు పురుషులకు జ్ఞాన విచారముతో నేమిపని యున్నదో, ఆవిషయము తెలిసికొనుట కెవరెవరి

పంచవిధజ్ఞానము.

కైనను గోర్కెయుండవచ్చును. భావోదయము కాకపూర్వము వైధీభక్తిని సాధించుకాలమందుఁ బురుషునకు భాగవత శాస్త్రాదితమగు సమస్త వేదాంతతత్త్వము నొకమాదిరిగ నవగాహనమగుటయు, నజ్ఞానరూపమగు ననర్థము తొలఁగిపోవుటయు, గూడ సంభవించును. భావోదయమైనతరువాత దాని నాస్వాదించుట వినా జ్ఞానముయొక్క యే యితరాంశమును విచారింపఁబడదు.

జ్ఞాన మయిదు విధములు. ఎట్లన,—

(1) ఇంద్రియార్థ జ్ఞానము.
(2) నైతికజ్ఞానము.
(3) ఈశ్వరజ్ఞానము.
(4) బ్రహ్మజ్ఞానము.
(5) శుద్ధజ్ఞానము.

ఇంద్రియార్థజ్ఞానము.

ఇంద్రియ విశిష్టులగు జీవమాత్రులకే యింద్రియార్థజ్ఞానము కలుగుట కవకాశము గలదు. బాహ్యజగత్తునందలి సకల భావములను సన్నసరముల వెంట నింద్రియమూలకముగ మెదడునకుఁ జేఱును. అంతరింద్రియరూపమగు మనస్సుయొక్క ప్రసనవృత్తిచే నాభావములన్నియు గ్రహణరూపము వహించును. దాని రెండవ వృత్తిమూలమున నా భావములనన్నియు నది స్మృతిరూపమున సంగ్రహించును. దాని తృతీయవృత్తిమూలమునఁ దనకనుకూలములగు భావములను స్వీకరించియు, బ్రతికూలములగు వానిని నిరాకరించియు, గల్పనము విభావనము మున్నగు కార్యముల నొనరించును. దాని నాలుగవ వృత్తిమూలమున నాభావముల నన్నిఁటిని జాతులుగ విభజించి లఘు సంఖ్యాకములుగ నొనర్చును ; కొన్ని సమ్మిశ్రితములగు లఘుభావములను మఱల విభజించి వాని సంఖ్యను వృద్ధిపఱచును. దాని యైదవ వృత్తిమూలమున సంసజ్జితములగు (లెస్సగఁగూర్చఁబడిన, well-arranged) నా భావములనుండి సరియైన యర్థము బయలువెడలుచున్నది. దీనినే యుక్తి యందురు. యుక్తిచేతనే కార్యాకార్యములు నిర్ణయింపఁబడుచున్నవి. యుక్తిమూలముననే మానసికములును, జడీయములును నగు సమస్తవిజ్ఞానములును నిఃసృతములైనవి. జడవిజ్ఞానము పలుతెఱంగులు. ఎట్లనిన,—

—ఆయుర్వేదజ్ఞానము, సంగీతవిజ్ఞానము మున్నగునవి.—

(i) జడగుణవిజ్ఞానము (Science of matter and motion)

(ii) చౌంబక విజ్ఞానము (Magnetism)

(iii) వైద్యుత విజ్ఞానము (Electricity)

(iv) ఆయుర్వేద విజ్ఞానము (Medicine)

(v) దేహ విజ్ఞానము (Physiology)

(vi) దృష్టి విజ్ఞానము (Optics)

(vii) సంగీతవిజ్ఞానము (Music)

(viii) తర్క శాస్త్రము (Logic)

(ix) మనస్తత్వశాస్త్రము (Mental Philosophy)

మున్నగునవి. ద్రవ్యగుణవిజ్ఞానము, ద్రవ్యశక్తి విజ్ఞానములవలన శిల్పకర్మ కారుకర్మతత్త్వము (Art and manufacture) లావిర్భవించినవి. విజ్ఞాన శిల్పముల పరస్పర సహానుభూతిచే లోకమునందుఁ బెద్దపెద్ద కార్యములు సాధించుట కవకాశము కలుగుచున్నది. ధూమయానము (Railway), తటిద్వార్తావాహము (Electric wire), అర్ణవపోతము (Ships), గృహమందిర నిర్మాణము (Architecture), మున్నగునవన్నియు నింద్రియ జ్ఞానములును, తత్ప్రేరిత కర్మలును, దేశజ్ఞానము (భూగోళ సమాచారము) కాలజ్ఞానము (అబ్దబోధము) (Geography and Chronology), జ్యోతిషము (Astronomy) మున్నగున వింద్రియార్థజ్ఞానములు. పశు వృత్తాంతజ్ఞానము (Zoology), పార్థివజ్ఞానము (Minerology), శస్త్ర చికిత్స (Surgery) నెందలుగాఁగలవి కూడ నింద్రియార్థజ్ఞానములే. ఈజ్ఞానమందే సంబద్ధులుగ నుండఁగోరువారు దీనిని సాక్షాత్ జ్ఞానము (Positive Knowledge) గఁ జెప్పుదురు. కాని మానవప్రకృతి కేవల మింద్రియ జన్యమగు సాక్షాత్ జ్ఞానముతో మాత్రము తృప్తిజెందక యున్నత జ్ఞానాధికారము నభిలషించుచుండును.

నైతికజ్ఞానము.

ఇంద్రియార్థజ్ఞానమందు జగన్మంగళా మంగళ విచార పూర్వకమగు నొక నీతితత్త్వమును జేర్చుటచే నైతికజ్ఞాన ముద యించుచున్నది. మనస్సున కనుకూలములగు విషయములందుఁ బ్రీతియు, బ్రతికూలవిషయములందు ద్వేషమును మున్నగు సుఖదుఃఖములు కలుగుటకుఁ గారణములగు మాత్రా స్పర్శములే నైతికజ్ఞానమునకు విషయములు. ఏతద్విషయ సంయోజనా క్రమముచేతనే యొక నీతిశాస్త్రము యుక్తిమూలముగఁ గల్పింపఁబడినది. ప్రీతి కున్నతిలాభము కల్పించుట, ద్వేషమును సంకుచితపఱచుట, తచ్ఛాస్త్రము యొక్క యావశ్యక విధానమైయున్నది.

నీతి యనేకవిధములు. ఎట్లన,—

—రాజనీతి, శరీరనీతి మున్నగునవి.—

(i) రాజనీతి (Politics)

(ii) దండనీతి (Penal Code)

(iii) వణిజ్నీతి (Laws of Trade)

(iv) ప్రయోజన విజ్ఞానము (Utilitarianism)

(v) శ్రమవిభాగము (Division of Labour)

(vi) శరీరనీతి (Rules of Health)

(vii) సంసారనీతి (Socialism)

(viii) జీవన నీతి (Rules of Life)

(ix) భావసాధనము (Training and Development of Feelings)

మున్నగునవి. కేవల నైతికజ్ఞానమందుఁ బరలోకజ్ఞానముగాని, యీశ్వరజ్ఞానముగాని, సంలబ్ధమై యుండవు. కొందఱీ నైతికజ్ఞానమునే సాక్షాత్ జ్ఞానముగ భావించి దీనిని నిశ్చయజ్ఞానము (Positivism) గఁ జెప్పియున్నారు. కాని మానవ ప్రకృతియందు వేఱొక యున్నతజ్ఞానమును సంపాదించుట కనువగు ప్రవృత్తి యుండుటచేఁ గేవల నైతిక జ్ఞానముతో మానవుఁడు సంతృప్తినొందఁజాలఁడు. నైతికజ్ఞానమందుఁ బేర్కొనఁబడిన ధర్మాధర్మములు, పుణ్యపాపములును గేవలము నామమాత్రములు. వానికి శారీరక, మానసిక, సామాజిక ఫలములు మాత్రము గలవు. మరణాంతమందైనను గీర్త్యపకీర్తులు తప్ప వేఱుఫలములు మనుజునకుఁ గలుగనేరవు; కలుగునను నాశయు లేదు.

ఈశ్వరజ్ఞానము. లోకమునందలి సమస్త వస్తుసంఘటనమును, వానికిఁ గల పరస్పర సంబంధమును, ఒకదాని కొఱఁతలను దీర్చుటకును, దాని నున్నతస్థితికిఁ దెచ్చుటకును వేఱొకటి తోడ్పడువిధానమును గమనించి జగత్తు స్వయం

భువము కాఁజాలదని నరయుక్తి స్థిరపఱచెను. ఒకానొక ప్రధాన జ్ఞాన స్వరూప తత్త్వమునుండి యీ ప్రపంచ మావిర్భవించెననియు, నా జ్ఞాన స్వరూపుఁడు జగత్పూజ్యుఁడనియు, సర్వశక్తి సంపన్నుఁడనియు, గొందఱు చెప్పుదురు. * అతఁడు సముదాయ సృష్టి నొసగెనని యు, మనము కృతజ్ఞతతో నతనినిఁ బూజింపు టుచితమనియు, నతఁడు సంతోషించునేని మన కనేక సౌఖ్యము లొసగూడుననియు, మన కోఱంతలన్నియుఁ దీఱుననియు, గొందఱు చెప్పుదురు. ఇట్టి యస్థిర సిద్ధాంతము లనేకమాలోచింపుచు నీరీతిగ నైతికజ్ఞానమం దీశ్వర విశ్వాసమును జేర్చి యీశ్వరజ్ఞానమును వారు సంస్థాపించుచున్నారు. సేశ్వర జ్ఞానవాదులగు కొందఱ మతము ననుసరించి కర్తవ్యకర్మాచరణమునకు బహుమానరూపముగ స్వర్గాదిభోగములును, నకర్తవ్యములగు కర్మల నొనర్పుటచే నరకాదిక్లేశములును కలుగుచున్నవి. వర్ణాశ్రమ ధర్మములు, అష్టాంగ యోగాదిక్రియలు, దపఃక్రియలు, ఆయా దేశములందలి భిన్నభిన్న నామములతోడి యీశ్వర సాధనరూపములగు ధర్మవ్యవస్థలు మొదలగునవి యీశ్వరజ్ఞానముచేఁ గలుగు భిన్నభిన్న విధానములుగ నెఱుంగనగును. ఈజ్ఞానమందుఁ గర్మలు సమస్తమును, జ్ఞానము కొంచెముగను, నంతర్గతములుగనుండును. ఈజ్ఞానముచే జీవునికి నిత్యసిద్ధస్వరూపబోధ కలుగదు. కావున నేతద్జ్ఞానావస్థితులగు పురుషులకు దీని క్షుద్రతా స్వభావము గోచరించినంతనే యున్నతజ్ఞానము తమకెట్లు ప్రాప్తించుననుచు వారు

---

* శ్రేయస్త్వం కతమద్రాజన్కర్మణాత్మన ఈహసే
దుఃఖహానిః సుఖావాప్తిః శ్రేయస్తన్నేహచేష్యతే.
నజానామి మహాభాగ పరంకర్మాపవిద్ధధీః
బ్రూహి మే విమలంజ్ఞానం యేనముచ్యేయ కర్మభిః.
భా. 4-25-4 & 5.

శ్రేయసామిహసర్వేషాం జ్ఞానం నిశ్రేయసంస్మృతం
సుఖంతరతి దుష్పారం జ్ఞాననౌర్వ్యసనార్ణవం.
భా. 4-24-75.

తత్తటిల్లుచుందురు. అట్టి తత్తఱపాటు నొందుచు నోపిక చాలమిచేఁ దద్జ్ఞానలబ్ధికొఱకుఁ దామొప్పినయంతవట్టు యుక్తిని మాటిమాటికిఁ జేషణ మొనరింతురు. కాని యాయుక్తి తన కతీతమగు దానినిఁ జేఱుట కసమర్థ మగుటచే ముందుకుఁ జనుట కధికారములేక శబ్దములయొక్క లక్షణార్థమును మాత్ర మాశ్రయించి తన యధికారానుసారము వారలను వ్యతిరేకచింత నొదవించును. ప్రపంచమంతయు నాకారభూయిష్ఠము గనుకఁ బ్రాప్యతత్త్వము నిరాకారముగ నుండుననియు, సర్వము వికారమయము గనుకఁ బ్రాప్యతత్త్వము నిర్వికారమనియు, సర్వము గుణమయము గనుకఁ బ్రాప్యతత్త్వము నిర్గుణమనియు, సర్వము సవిశేషము గనుకఁ బ్రాప్యతత్త్వము నిర్విశేషమనియు, నీప్రకారము లక్షణావృత్తిమూలమున విచారము సల్పి వార లొక నిర్విశేషతత్త్వమును గల్పించి యా తత్త్వమందుఁ దమ చరమగతినిఁ గనుఁగొనఁ జూతురు. ఈరీతిగ నీశ్వరజ్ఞానము బ్రహ్మజ్ఞానముగఁ బరిణమించును. కాని యెవరు ధీరులై యాత్మ (తమ) యందే చిత్తత్త్వము కొఱ కన్వేషణము సలుపుదురో, అట్టివారికిఁ బంచమ జ్ఞానరూపమగు శుద్ధజ్ఞానము లభించును. బ్రహ్మజ్ఞానమే చతుర్థజ్ఞానము. బ్రహ్మజ్ఞానానుసార మీజగత్తు మిథ్యయు, నవిద్యాకల్పితమను వస్తువొక్కటే; దాని పేరు బ్రహ్మ. జగత్తు కలదను విశ్వాసము కేవల మాయామాత్రము. అవిద్యాశ్రితుఁడగు బ్రహ్మయే జీవుఁడు. అవిద్య నశించెనేని జీవుఁడే బ్రహ్మ. అప్పుడతనికి శోక మోహ భయములు కలుగవు. దీనినే మాయావాదమనియు, నద్వైతవాదమనియు, జెప్పుదురు. ఇంగ్లీషు భాషలో దీనిని ప్యాంథీయిజమ్ (Pantheism) అందురు. మాయావాదమనియు, వివర్తవాదమనియు నద్వైతవాదము రెండువిధములు. జగత్తనునది లేనే లేదు; మాయామూలమున జగత్ప్రతీతి గలుగుచున్నదనుట మాయావాదము.

బ్రహ్మజ్ఞానము.

మాయా వాదము, వివర్తవాదమును.

వివర్తవాద మొకవిధముగ మాయా కార్యము నంగీకరించును. అది మఱల వికారమనియు, వివర్తమనియు, రెండువిధములు.

వికారము, వివర్త మును. సత్యమంగీకరింపఁబడియు దానియం దన్యథాబుద్ధి గలుగుటయే వికారము. ఎట్లన, దుగ్ధమంగీకరింపఁబడి దానియం దన్యవస్తు రూపమగు దధివికార మావిర్భవించుచున్నది. సత్యమంగీకరింపఁబడక దానియందుఁ దోఁచు ప్రతీతి జ్ఞానము వివర్తమనఁబడుచున్నది. ఎట్లన, రజ్జువునందు సర్పజ్ఞానము, ముత్తెపుఁజిప్పయందు రజతజ్ఞానము. మాయావాద వివర్తవాదములం దింకను నెక్కువిధములగు జీవవాదప్రభృతి భిన్నభిన్నమతములు గోచరించుచున్నవి. కాని వానిమూలసిద్ధాంతవిషయములందు వానికన్నిఁటికి నైక్యమేర్పడును. వాని సంక్షేపవిచార మిక్రిందఁ గనఁగను:—

(1) బ్రహ్మ వినా వేఱొక వస్తువు లేదు. ఉన్నట్లు ప్రతీతి గలిగినే నది సత్యము కాదు; వ్యావహారిక ప్రతీతిమాత్రమే.

(2) జీవుఁడు లేఁడు; ఉన్నయెడల నది బ్రహ్మవికారముగాని, వివర్తము గాని యగును.

(3) జగత్తు మిథ్యా స్వరూపము.

(4) జీవాభిమానము గల వాఁడట్టి యభిమానము విడువఁ గలిగినేనిఁ దత్క్షణమే బ్రహ్మయగును.

(5) ముక్తియే చరమప్రయోజనము.

(6) బ్రహ్మ నిర్గుణుఁడును, నిశ్శక్తికుఁడును.

వ్యవహారమునందుఁ గనఁబడుదానికి విరుద్ధముగ నేదేని మనము చెప్పఁ దలఁచినచో నతి జాగరూకతతోఁ జెప్పవలయునే కాని లేనిచోఁ దానికిఁ బ్రమాణముఁ జూపఁజాలనియెడల లోకము మనలను బిచ్చివాండ్ర క్రింద లెక్కసేయును. జగత్తు సత్యమనియే లోకప్రతీతి. జీవుఁ డొక క్షుద్ర విశేష వస్తువనదికూడ సహజప్రతీతియే. సమస్తమునకును బ్రహ్మయే కర్తయు, నియా

మనుడును, బాలకుఁడు ననుమాట కూడ యుక్తిచే సాధించి యితరులను విశ్వసింపఁజేయవచ్చును. "నేను లేను. నాకన్నులతో నేను జూచుచున్న యీ దృశ్యసృష్టి కూడ నేను జూచిన విధమున లేదు. అన్నిఁటికి సంతర్భూతముగ నొక సత్యమున్నది. దాని నాశ్రయించి భానస్వరూపమగు నీ సమస్త ప్రతీతియుఁ గలిగినది." అని యిట్లు ప్రస్తావించువాఁడెవఁడు? ఈప్రస్తావకుఁడు భ్రాంతతత్త్వస్వరూపుఁడగు జీవుఁడేయైనచో వానియొక్క యితర ప్రస్తావనలవలెనే యీ ప్రస్తావన కూడ మిథ్యయే కావలెను. మాదకసేవనము చేయువార లీవిధమగు ప్రస్తావనలు సర్వదా చేయుచునే యుందురు. వార లొకొక్కప్పుడు తాము పాదుసాలమనియు, నవాబుల మనియుఁ జెప్పుకొనుచు నట్టియభిమానముతో వ్యవహరింప నుద్యుక్తులగుటఁ గూడ మనము చూచుచున్నాము. అట్టివారలు "మేము బ్రహ్మల" మని చెప్పుకొనుటలో సందేహమేమున్నది? భ్రాంతి యనేకవిధములు. వానిలోఁ గుతర్క జనితభ్రాంతి, చిత్తపీడనముచేఁ గలుగు భ్రాంతి, మాదకసేవచేఁ గలుగు భ్రాంతియుఁ బ్రధానములు. ఇట్టి విషమభ్రాంతి కలుగుటకుఁ దర్కహతమగు నరబుద్ధియే కారణమగుచున్నది. యూరపుదేశమందు ప్యాంథీస్టు (Pantheist) లని చెప్పఁబడువారీమతమువారే. వారిలో స్పైనోజా (Spinoza) యను పండిత ప్రవరుఁడీ మత పరాకాష్ఠను జవిజూచినవాఁడు. అమెరికా మున్నగు దేశములందు థియాసఫిస్టు (Theosophist) మత ప్రచారము చేయువారుకూడ నద్వైతవాదులే. పండితాభిమానులచేఁ బోషింపఁబడెడి మతములను విచారశక్తిలేనివారలు సహజముగ నామోదింతురు. మనదేశమందు దత్తాత్రేయుఁడు, అష్టావక్రుఁడు, శంకరుఁడు మున్నగు తర్కప్రియులగు పండితాభిమానులీమతమునే యీపద్ధతులతో విస్తరింపఁ

భ్రాంతి.

ప్యాంథీస్ట్.

థియాసఫిస్ట్.

దత్తాత్రేయుఁడు, అష్టావక్రుఁడు, శంకరుఁడు.

జేసియున్నారు. నేఁటి భాగవతమతావలంబులు తప్ప నితరమతముల వారందఱు నీమతము ననుసరించువారే. ముఖ్యముగ బ్రాహ్మణులయం దీమతము ప్రబలియున్నది. ఇట్లిది వ్యాపించుటకుఁ గారణమేమన, దీనివలెనే భ్రాంతిలబ్ధములగు నితరమతములన్నియు నీమతమున కధీనములైనచో నశింపకుండ చిరస్థాయిగ నుండఁగల వనుటయే. ఏమనుజుఁడైనను, ఏసంప్రదాయమైనను, బహువునొకదానినిఁ దెచ్చి, దానియం దీశ్వరభావనచేసి పూజించెనేని సహజముగ నద్వైతవాదము వానికిఁ బ్రాప్తించును. అద్వైతవాదమును వారలంగీకరింపుటకుఁ గారణమేమనిన, నీశ్వరబుద్ధితోఁ బహువును ధ్యానించినచో సాధకునకుఁ జిత్తశుద్ధియు, జిత్తస్థైర్యమును గలుగుటయు, నట్లు శుద్ధమగు నాచిత్తమును బహువిషయమునుండి మఱలించి యద్వైత తత్త్వమందు నియోగింపుట కవకాశముండుటయు, దన్మతాభిప్రాయము. అద్వైతమతమం దిట్టి వ్యవస్థయుండుటచేతనే యందఱు నద్వైతమతమే తమ్ముద్ధరింపఁ గలదని చెప్పుచుఁ దానినే పూజింతురుగాని మూలతత్త్వమందలి దోషగుణమును మాత్రము గమనింపరు. విశుద్ధభక్తివాదు లద్వైత తత్త్వమును లెస్సగ విచారించి దానికిఁ బరమనమస్కారమిడి జీవుని సహజధర్మమగు భక్తినే యనుశీలన మొనరింతురు.*

---

* నైవేచ్ఛత్యాశిషః క్వాపి బ్రహ్మర్షి ర్మోక్షమప్యుత
భక్తిం పరాం భగవతి లబ్ధవాన్ పురుషేఽవ్యయే.

భా. 12.10.6.

నైకాత్మతాంమే స్పృహయంతికే చిన్మత్పాద సేవాభిరతా మదీహాః
యేఽన్యోన్యతో భాగవతాః ప్రసజ్య సభాజయంతో మమపౌరుషాణి.

భా. 3.25.34.

అద్వైత మతముయొక్క మూలసిద్ధాంతమేమో యించుకవిచారింతము.

అద్వైతవాద విచారము.

జగత్తునందుఁ గనఁబడునట్టి సమస్త జడీయవస్తువులను ద్రవ్యజాతి విభాగముచేతను, సూక్ష్మమూలాను సంధానమూలమునను, ద్రవ్యసంఖ్యను లఘుపఱచి 'జడ' మలను నామము వానికిడిరి. తదుపరి చేతనమయములగు సకలవస్తువులను 'చేతస' జాతీయ వస్తువులనుచు స్థిరపఱచిరి. ఏవృత్తిచే నీవస్తునిర్దేశములు రెండును జేయఁబడినవో, అది యుక్తికంతర్గతమగు మనోవృత్తివిశేషము. చిత్తవృత్తి కేదిమూలమో దాని నరయు టా చిత్తము చేయఁగల పనికాదు. కనుక ననేక విధములుగ యుక్తిపేషణమొనర్చి తుదకీ చేతనములకును, జడములకును మూలతత్త్వముగ నొక నిర్విశేషబ్రహ్మను గల్పించిరి. తదుపరి

జగత్తు బ్రహ్మవికారము

యాబ్రహ్మయే పాలు పెరుగుగ మాఱిన విధమున తాను జగద్రూపముగ వికృతినొందెననియు, లేదా, ముత్తెపుఁజిప్పయం దొకానొక సమయమున రజతభ్రాంతి కలుగునట్లును, త్రాఁటియందుఁ బాముభ్రాంతి గలుగునట్లును, ఆబ్రహ్మయందే జగత్తనెడిభ్రాంతి కలిగెననియు, వచించిరి. ఈసిద్ధాంత

---

సాలోక్యసార్ష్టిసామీప్య సారూప్యైకత్వమిత్యుత
దీయమానం నగృహ్ణంతి జనామత్సేవనం వినా
స ఏవ భక్తియోగాఖ్య ఆత్యంతిక ఉదాహృతః
యేనాతివ్రజ్య త్రిగుణా న్మద్భావాయోపపద్యతే.

భా. 3.29.14 & 15.

నకించిత్సాధవోధీరా భక్తాహ్యేకాంతి నోమమ
గృహ్ణంత్యపి మయాదత్తం కైవల్యమపునర్భవం.

భా. 11.20.35.

బ్రహ్మయందు జగద్భ్రాంతి.

నిర్మాణముకొఱకుఁ గల్పనయు, యుక్తియుఁ జాలశ్రమ పడెననుట నిజమేయైనను దీనియందలి భ్రాంతిదోష మడుగద్దునను గోచరింపుచునే యుండును. బ్రహ్మకంటె వేఱగు వస్తువే లేనిచో నీజగత్కల్పన మెట్లు సంభవించినట్లు? రజ్జువునందు సర్పభ్రాంతియను నుదాహరణము గేవల మసంభవము. ఏదిరజ్జువో, ఏదిసర్పమో యిచ్చటఁ జూడఁబడుటకు రజ్జువుబ్రహ్మ స్థలీయమగునపుడు సర్పమను వేఱొకవస్తువుండదుగదా యిట్టి సర్పభ్రాంతి యెటనుండివచ్చెను? ఈయుదాహరణముచే నద్వైతము సిద్ధింప నేరదు. శుక్తి రజతోదాహరణముగూడ నిట్టిదే. దుగ్ధ వికారము దధియగుటచే, దుగ్ధస్థలీయుఁడగు బ్రహ్మయొక్క వికారమే జగత్తయినచో దధియెట్లు సత్యవస్తువో అట్లే జగత్తుకూడ సత్యవస్తువైతీఱును. ఇట్లు నద్వైతమునకు రక్షణోపాయములేదు. అద్వైతమతమునకు సంబంధించిన యుదాహరణములన్నియు యుక్తివిరుద్ధములే. యుక్తిచే నద్వైతమతమును స్థాపించుట కవకాశములేదు. అయితే, యుక్తిని విడిచిపెట్టెదమను కొందము. ఇఁక నామతమును స్థాపించు వారెవ్వరు? సహజజ్ఞాన (commonsense) మని చెప్పుదువేని నదికుదురదు. సహజజ్ఞానమునందు భేదప్రతీతియుండుటచే నది నశించుటకు మనకు యుక్తిమఱల సాయపడ వలెను. పోనీ, వేదమే యద్వైతమతము నుపదేశించె నందుమేని నదియుఁ గూడ నసంభవము. ఏమన, నద్వైతమతవాదు లేయేశ్రుతులను దమ మతపోషకములనుచు నాధారముగ స్వీకరించిరో, ఆయాశ్రుతులయందే యద్వైతమతపోషకములగు వాక్యములతోపాటు ద్వైతమతపోషకములగు వాక్యములు గూడఁ జేఱియున్నవి. సిద్ధాంతవిషయమునందు వేదమునకు మతపక్షపాతమించుకయులేదు. బాగుగవిచారించినచో సకలవేదములు నద్వైత మతమునను, ద్వైతమతమునను నతీతమగు నచింత్యభేదాభేదజ్ఞానమునే సిద్ధాంతీకరించుచున్నవని మనకుఁ

అచింత్య భేదాభేద

తత్త్వమే వేద తాత్ప ర్యము. దేటఁబడఁగలదు. వివదమానములగు నీరెండు మతములనుగూడ నిరసించు నభిప్రాయముతోడనే యాయాస్థలములయం దుభయమత పోషకములగు వాక్యము లుపయోగింపఁబడినవి. కేవలాద్వైతమతమే వేదమతమనుట వాస్తవముకాదు. వేదశాస్త్రము సిద్ధజ్ఞానావతార స్వరూపమును, నిష్పాక్షికమును. వేదమునందు మతవాదమెచ్చటను లేదు. సహజజ్ఞానము, వేదశాస్త్రము, యుక్తి, సహజానుభూతి, సిద్ధజ్ఞానము, ప్రత్యక్షానుమాన రూపములగు సకలప్రమాణములు,—వీనిలో నెవ్వియు నద్వైతవాదమును బోషింపనేరవు. భ్రాంతతర్కము, అయుక్తవిశ్వాసము నను నీరెండే తన్మతపోషకములు.* జీవుఁడు ముక్తుఁడైనచో బ్రహ్మయగునను విషయము రూపకాలం

---

* ఏతైరుపద్రుతో నిత్యం జీవలోకః స్వభావజైః
సకరోతి హరేర్నూనం కథామృత నిధౌ రతిం

ప్రజాపతి పతిస్సాక్షా ద్భగవాన్గిరిశోమనుః
దక్షాదయః ప్రజాధ్యక్షా నైష్ఠికాస్సనకాదయః
మరీచి రత్ర్యంగిర సౌపులస్త్యః పులహఃక్రతుః
భృగుర్వసిష్ఠ ఇత్యేతే మదంతా బ్రహ్మవాదినః
అద్యాపి వాచస్పత య స్తపోవిద్యా సమాధిభిః
పశ్యంతోపి నపశ్యంతి పశ్యంతం పరమేశ్వరం
శబ్దబ్రహ్మణి దుష్పారే చరంత ఉరువిస్తరే
మంత్రలింగై ర్వ్యవచ్ఛిన్నం భజంతోనవిదుః పరం
యదాయ మనుగృహ్ణాతి భగవానాత్మభావితః
సజహాతి మతింలోకే వేదేచ పరినిష్ఠితాం
తస్మాత్కర్మసు బర్హిష్మన్న జ్ఞానాదర్థకాశిషు
మార్థదృష్టిం కృథాః శ్రోత్రస్పర్శే ష్వస్పృష్ట వస్తుషు
స్వంలోకం నవిదుస్తేవై యత్రదేవో జనార్దనః
ఆహుర్ధూమ్రధియోవేదం సకర్మక మతద్విదః.

భా. 4-29-41 to 48.

కారముగఁ జెప్పినచో నిర్దోషముగ స్వీకరింపఁబడును. జడాభిమానము పోయినచో బ్రహ్మాభిమానము కలుగుటుచితమే. కాని యాబ్రహ్మయందలి స్వగతభేదరూపమగు స్వాద్యస్వాదక స్వాదనరూపభేదత్రయము బ్రహ్మభూతవ్యక్తి కపుడ నివార్య ధర్మమగుచున్నది. ముక్తియన నేమి? చిత్తత్త్వ స్వరూపుఁడగు జీవునికి జడాభిమానము వదలిపోవుటయే ముక్తి. ముక్తియనునది క్షణకార్య విశేషము. నిత్యసిద్ధులగు జీవులచే ముక్తి యేవిధముచేతనైనను స్వీకరింపఁబడదు. ఏమన, వారొకప్పుడును బద్ధులుగారు. ముక్తియొక్క ప్రయోజన మేమి? కేవలబద్ధజీవులకే ముక్తితోఁ బ్రయోజనము. జీవులు రెండువిధములు. ఈవిషయము శుద్ధజ్ఞాన విచారమందు వివరింపఁబడును. ముక్తియనునది సర్వజీవులకును సంబంధించిన తత్త్వముకాదు గనుక నది జీవునిచరమ ప్రయోజనమని చెప్పుటకు వలనుపడదు. ప్రేమయే సకల జీవులకును సంబంధించిన తత్త్వము. కావునఁ బ్రేమయే ప్రయోజనము.

ముక్తియన నేమి? జీవుని జడాభిమాన సమాప్తియే ముక్తి.

ప్రేమ సకలజీవులకును సంబంధించిన తత్త్వము. కావున నదియే ప్రయోజనము.

అద్వైతవాదమందు బ్రహ్మ నిర్విశేషుఁడనియు, నిశ్శక్తికుఁడనియుఁ జెప్పఁబడినది. బ్రహ్మ నిర్విశేషుఁడనుటచే సవిశేషములగు నితర ప్రాపంచిక వస్తువులకంటె భిన్నుఁడని చెప్పుటయే యభిప్రాయము. ఆనిర్విశేషత్వముగూడ బ్రహ్మయొక్క యొక విశేషగుణముగనే పరిగణింపఁ బడుచున్నది. బ్రహ్మశక్తిహీనుఁడే యైనచో సృష్టమో, లేక, భ్రాంతిమయమో యైన యీజగత్తున కస్తిత్వమెటనుండివచ్చెను? ఈమతముప్రకారము బ్రహ్మ వ్యతీతమగు వేఱొక వస్తువే లేనందున బ్రహ్మశక్తియే యగత్యముగఁ బ్రపంచకారణమని చెప్పక తీఱదు. ఇంకను జెప్పవలసిన ముఖ్యవిషయము లధికముగ నున్నందున నద్వైతవాదఖండన మింతటితో నిలుపుదును.

బ్రహ్మజ్ఞానమని చెప్పఁబడు నీనాల్గవ తెగజ్ఞానము శుద్ధజ్ఞానాంకుర రూపమగు నీశ్వరజ్ఞానముయొక్క వికృతిరూపమగుచున్నదనిమాత్ర మిచటఁ జెప్పవలసియున్నది. శంకరాచార్యుఁడు, అష్టావక్రుఁడు, దత్తాత్రేయుఁడు, నానక, కబీరు, గోరక్షనాథుఁడు, శివనారాయణుఁడు మున్నగు వారందఱు నీచతుర్థశ్రేణికి సంబంధించిన జ్ఞానమును బ్రచారణసలుపు నాచార్యులని తెలియనగును. పైనఁజెప్పిన జ్ఞానాంకురమునుండి యుదయించిన శుద్ధజ్ఞానము నం దీయద్వైతవాదముండదు. శుద్ధజ్ఞానమును విచారింపఁబూనితిమేని గ్రంథము పెద్దదగుటయేకాక జీవుని నిత్యధర్మవిచారముకొఱ కుద్దేశింపఁ బడిన యీగ్రంథమున దానికి స్థానమేచిక్కదు. కావున శుద్ధజ్ఞాన విచారమిచట సంక్షేపముగ నొనరింతును.*

శుద్ధజ్ఞాన మైదువిధములగు ననుభవ స్వరూపముగలది. ఎట్లన:—

—పంచవిధ శుద్ధజ్ఞానము.—

(1) పరేశానుభవము.
(2) స్వానుభవము.
(3) స్వధర్మానుభవము.
(4) ఫలానుభవము.
(5) విరోధానుభవము.

---

* తత్కర్మ హరితోషం యత్సావిద్యా తన్మతిర్యయా
హరిర్దేహభృతా మాత్మాస్వయం ప్రకృతిరీశ్వరః
తత్పాదమూల శరణం యతః క్షేమోనృణామిహ
సవై ప్రియతమశ్చాత్మా యతోన భయమణ్వపి
ఇతివేద సవైవిద్వాన్ యోవిద్వాన్ సగురుర్హరిః.

భా. 4-29-49 to 51.

పరేశానుభవము మఱల బ్రహ్మానుభవము, పరమాత్మానుభవము, భగవదనుభవము నని మూఁడు విధములు.* 

**పరేశానుభవము.** జగత్తు సందలి సమస్త సవిశేషచింతలకును విపరీతమగు నొకానొక నిర్విశేష చింతాగత పరేశభావమునకే బ్రహ్మయనిపేరు. పరేశతత్త్వము సర్వవిధములచేతను స్వప్రకాశమైనది.

**బ్రహ్మానుభవము.** జ్ఞానానుశీలనము చేయుజీవులకొఱకుఁ బరేశానుభవము పైనిఁజెప్పిన మూఁడువిధములుగఁ బ్రకాశించును. కేవల చింతాపేషణ మొనర్చుటచే వ్యతిరేకావస్థయందుఁ బరేశతత్త్వమునకుఁ గలుగు నిర్విశేషావస్థయే బ్రహ్మ యనఁబడును. అది పరేశతత్త్వముయొక్క నిత్యసిద్ధ స్వరూపముగాదు. చింతాశీలురగు వ్యక్తుల కద్వైతవాదదోషస్పర్శ తగులని సమయమున వారి కీయుపాయముచే నొకవిధమగు పరేశసంబంధము ప్రాప్తించుచున్నది. ఇది పరేశానుభవమని చెప్పినచో నది మిగుల సామాన్యమైనదగుటచేఁ దుదకుఁ బరమానంద ప్రదముకాఁజాలదు. దీనియందు రతికూడ నొకింతఁ జేఱియుం డును గాని సంబంధాభావముచే నది పుష్టిలాభము నొందఁజాలదు. సనకాది మహాత్ములీరతియం దాసక్తులగుటచే శాంతరసాశ్రయులుగ నుదాహరింపఁ బడుచున్నారు.

**పరమాత్మానుభవము.** పరమాత్మానుభవమే ద్వితీయ పరేశానుభవము. తృతీయ శ్రేణికి సంబంధించి యే యీశ్వరజ్ఞానము నిరూపింపఁ బడినదో దాని చరమావస్థయందుఁ బరమాత్మానుభవ ముదయించును. బద్ధజీవులనుఁ గర్మఫలముల నొసంగుచు, సర్వకర్మలకును దానే ప్రయోజక కర్తయగుచు, జగత్తునం దనుప్రవేశ మొనర్చిన పరేశానుభవమునకుఁ బరమాత్మయనిపేరు. అష్టాంగ

---

* జ్ఞానం విశుద్ధం పరమార్థమేకమనంతరం త్వబహిర్బ్రహ్మ సత్యం
ప్రత్యక్ప్రశాంతం భగవచ్ఛబ్దసంజ్ఞం, యద్వాసుదేవం కవయోవదంతి.
భా. 5-12-11.

యోగాదులచే నే యీశ్వర ప్రణిధానము వ్యవస్థాపింపఁబడెనో, ఆ యీశ్వరుఁడు పరమాత్మయొక్క కాల్పనికమగు నట్టియో, లేక, వాస్తవికమగు నట్టియో, అవతారవిశేషము. వీని నే శాస్త్రము లందుఁ బురుషుఁడందురు. వ్యష్టిప్రకాశమనియు, సమష్టి ప్రకాశమనియుఁ బరమాత్మకు రెండు విధములగు ప్రకాశముగలదు. సమష్టి ప్రకాశముచే నతఁడు విరాట్టు—బ్రహ్మాండ విగ్రహుఁడు—అగుచున్నాఁడు. వ్యష్టిప్రకాశముచే నతఁడు జీవునికి సహచరుఁడై యతనిహృదయమం దంగుష్ఠప్రమాణ పురుషావతారముతో సదా నివసించుచుండును. కర్మమార్గమందు వాస్తవికుఁడగు నీశ్వరుఁ డుద్దేశింపఁబడెనే నది కర్మకర్తయగు పరమేశ్వర యుపాసనమే యగుచున్నది. చింతయొక్క చరమావస్థయందుపాసనీయుఁడగు బ్రహ్మయొక్క సాక్షాత్కార మెట్లగుచున్నదో, ఆట్లే కర్మయొక్క చరమావస్థయం దుపాసనీయుఁడగు పరమాత్మయొక్క సాక్షాత్కార మగుచున్నది.

పరమాత్మయొక్క ద్వివిధ ప్రకాశము— వ్యష్టి, సమష్టి.

భగవదనుశీలనమే మూఁడవదియు, గడపటిదియు నగు పరేశానుభవము.* స్వరూపవిశిష్టుఁడై, సర్వశక్తిమంతుఁడై, సమస్త గుణాధారుఁడైన పరేశతత్త్వమే భగవంతుఁడు. మూలతత్త్వము విచారించినచో భగ

భగవదనుభవము.

---

* జ్ఞానంయతః ప్రతినివృత్తగుణోర్మి చక్ర,
మాత్మప్రసాద ఉభయత్ర గుణేష్వసంగః
కైవల్యసమ్మత పథస్త్వథ భక్తియోగః
కోనిర్వృతో హరికథాసు రతిం నకుర్యాత్.

భా. 2.3.12.

జ్ఞానం మే పరమం గుహ్యం యద్విజ్ఞాన సమన్వితం
సరహస్యం తదంగంచ గృహాణగదితం మయా

వంతునికంటె వేఱగు స్వతంత్రవస్తువు లేదు. భగవంతుఁడు శక్తిమంతుఁడు. అతని యచింత్యశక్తి ప్రభావముచే సమస్త జీవరాసులును, సమస్త బ్రహ్మాండములును, సృష్టింపఁబడెను. శక్తిమంతునికంటె శక్తి భిన్నమైనది కాదు. జగత్తును, జీవులును భగవచ్ఛక్తియొక్క పరిణామము లగుటచే మూలతత్త్వ విచారమునుబట్టి యవి భిన్నపదార్థములు కాఁజాలవు. కాని తటస్థవిచారమును బట్టి శక్తిశక్తిమంతుఁడను వస్తువు కాఁజాలదు గనుకఁ దటస్థ విచారక్రమమున జీవజగత్తులు భిన్నభిన్న పదార్థనులు. ఈవిధమున మనము యుగపద్భేదాభేదము స్వీకరింపనిచో సత్యమునకుఁ జరితార్థతకలుగదు. ఈయుగపద్ధర్మ మెట్లు సంభవమగుననికాని, యుక్తిచే నిది యెట్లు సాధింపనగుననికాని, యడిగినచో దాని కుత్తర మిచ్చుచున్నాను. ఈ ధర్మము భగవంతుని స్వరూపమునే యాశ్రయించియున్నది. భగవంతుని యచింత్య శక్తివలననే విపరీతధర్మములు సామంజస్యము నొందుచున్నవి. యుక్తి సహజముగ క్షుద్రమగు వృత్తి కావున నీ ధర్మము పొలిమేరకైన నదిరాఁజాలదు.† భగవంతునియిచ్ఛయు,

భగవంతుఁడు శక్తిమంతుఁడు.

జీవజగత్తులు భగవచ్ఛక్తి పరిణామములు.

యుక్తి వృత్తి పరతత్త్వమును స్పృశింపఁజాలదు.

---

యావానహం యథాభావో యద్రూపగుణకర్మకః
తథైవ తత్త్వ విజ్ఞానమస్తుతే మదనుగ్రహాత్
అహమేవాసమేవాఽగ్రే నాన్యద్యత్సదసత్పరం
పశ్చాదహంయదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహం
భా. 2-9-31 to 33.

† సఖల్విదం భగవాన్కాల శక్త్యాగుణప్రవాహేణ విభక్తవీర్యః
కరోత్యకర్తేవ నిహంత్యహంతా చేష్టావిభూమ్నః ఖలుదుర్విభావ్యః
భా. 4-11-18.

నిర్వికారత్వము, సవిశేషత్వము, నిర్విశేషత్వము, అచింత్యత్వము, భక్తి గమ్యత్వము, నిరపేక్షత్వము, భక్తపక్షపాతిత్వము మున్నగు పెక్కు విపరీత ధర్మములు భగవంతుని విగ్రహమునందు సమంజసము లగుచుండ నచట స్వరూపగతమగు నభేదమును, తటస్థ విచారగతమగు భేదమును యుగపద్ధర్మములుగ నేల యంగీకృతములు కావు? * కేవలాద్వైతమును స్థాపించు పెట్టి భ్రమజనితమగు కార్యమో, కేవలద్వైతమును స్థాపించుట గూడ నట్టి భ్రమజనితమగు కార్యమే. భగవంతుని నిజసిద్ధవిగ్రహము సమస్త జగముల కంటెను, సమస్త జీవులకంటెను భిన్నమైనది. † అతఁడు స్వశక్తిచేతనే సమస్త చేతనాచేతనములకును నిత్యత్వము, సత్యత్వమును సిద్ధింపఁజేసియున్నాఁడు. ఈకారణముచేతనే వేదమొకప్పు డద్వైతవాక్యములను, మఱియొకప్పుడు ద్వైతవాక్యములను బ్రయోగించుచుండును. భగవదనుభవమే ముందుఁ జెప్పఁబడిన బ్రహ్మానుభవ పరమాత్మానుభవముల చరమావస్థానము. ఈరెండనుభవములును, జీవుని జ్ఞానకర్మరూపములగు శాఖాద్వయమును, బరేశతత్త్వముయొక్క ఖండానుభవ మాత్రములు. భగవదనుభవము కేవల విశుద్ధ భగవచ్ఛక్తిరూపమగుచు సాక్షాద్దర్శనముచే సంభవించుచున్నది. స్వరూపప్రాప్తి గల వస్తువే సత్యమగువస్తువు. వస్తుస్వరూప మెచట నిర్దిష్టము కాలేదో అది వస్తుగుణ విశేషమాత్రమే. బ్రహ్మమును, బరమాత్మను

---

* యస్మిన్ విరుద్ధగతయోఽప్యనిశం పతంతి,
విద్యాదయోవివిధశక్తయ ఆనుపూర్వ్యాత్
తద్బ్రహ్మ విశ్వభవమేక మనంతమాద్యం,
మానందమాత్ర మవికార మహంప్రపద్యే.

భా. 4-9-16.

† యథామహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను .
ప్రవిష్టాన్యప్రవిష్టాని తథాతేషు నతేష్వహం.

భా. 2-9-35.

స్వరూప నిర్దేశము లేదు. వస్తుగుణ పరిచయముచేతనే వారు తెలియఁబడుచున్నారు. కావున వారిరువురికిని ముఖ్యావస్థితిలేదు. భగవంతుని గౌణావస్థితి మాత్రులుగనే వారు చెప్పఁబడుచున్నారు.

భగవంతుఁడు సర్వవృత్తిగమ్యుఁడు.

ఇందువలన వారొక్కొక్క వృత్తిచేతనే పొందఁబడుచున్నారు. భగవంతుఁడు సర్వవృత్తిగమ్యుఁడు. సమస్తవృత్తులకు నధీశ్వరియగు భక్తి యన్నివృత్తులను దన యొడియందిడుకొని భగవంతుని సాక్షాద్దర్శనము సేయును. ఆమెయొక్క దర్శనవృత్తి చరితార్థతనొందినచో దాని యధీనమందుండెడి సమస్తవృత్తులును సంతృప్తిఁ జెందును.

భగవదనుభవము నాలుగు విధములు. ఎట్లన,—

—చతుర్విధ భగవదనుభవము.—

(1) కర్మప్రధానీ భూతానుభవము.

(2) జ్ఞాన ప్రధానీ భూతానుభవము.

(3) కర్మజ్ఞానోభయ ప్రధానీభూతానుభవము.

(4) కేవలానుభవము.

జీవునకు జడసంబంధము విడువనంతవఱకు నొకేమాదిరి భగవదనుభవము వానికిఁ గలుగనేరదు. కర్మప్రధానబుద్ధిగల కొందఱు భగవంతుఁడు కర్మఫలదాతయనుచు వానిని భక్తితో సేవించుటచేఁ గర్మప్రధానీభూత భగవదనుభవము ప్రకాశితమగుచున్నది. జ్ఞాన ప్రధానబుద్ధి గల కొంద ఱీశానుగ్రహముకొఱకు భక్తిసేవన మందు నియుక్తులగుటచే జ్ఞాన ప్రధానీ భూత భగవదనుభవము ప్రకాశితమగుచున్నది. జ్ఞాన కర్మలను రెంటియందును సమాన నిష్ఠగలవారు కూడ నట్లే భక్తిసేవన మొనరించుటచే నుభయప్రధానీభూత భగవదనుభవలక్షణము ప్రకాశితమగుచున్నది. ఫలకాలమం, దనఁగా, జడవిముక్తి గలుగుకాలమున నీమూఁడువిధములగు భగవదనుభవము మహిమ జ్ఞానయుక్తమగు భగవదనుభవ రూపమున గోచరించును. ఇట్టి జ్ఞానముగల

వారు భగవంతునికిఁ బారిషదులై సాలోక్య, సార్ష్టి, సామీప్యములను మూఁడుగతుల నొందుదురు. సాధనకాలమందు రాగానుగా మార్గ గతమగు కేవల సాధనము నాచరించువారికి ఫలకాలమునఁ గేవలానుభవరూపమగు జ్ఞానోదయమగుచున్నది.* భగవదనుభవము (i) మహిమ జ్ఞానరూపానుభవమనియు, (ii) కేవల జ్ఞాన రూపానుభవమనియు, రెండు విధములు.

**ద్వివిధ భగవదనుభవము.**

మహిమజ్ఞాన రూపానుభవమునకుఁ బరవ్యోమవాసియు, ననంత బ్రహ్మాండనాయకులకుఁ బ్రభువును, బరమైశ్వర్యపతియు, శ్రీనివాసుఁడును, నగు శ్రీమన్నారాయణుఁడే విషయము. కేవల జ్ఞానమిశ్రిత మహిమ జ్ఞానమునకు మధురా నాథుఁడును, ద్వారకా నాథుఁడును, భగవంతుఁడునునగు శ్రీకృష్ణచంద్రుఁడు విషయము. శుద్ధ కేవలజ్ఞానమునకు వ్రజనాథుఁడగు శ్రీకృష్ణుఁడొక్కఁడే యనుభవ విషయమని తెలియనగును. మహిమ జ్ఞానానుభవమునకును, కేవల జ్ఞానానుభవమునకును గల భేదము నిత్యమును, భగవత్తత్త్వగతమును. ఈభేదము సాధనకాలమున మాత్ర మీ

---

* తజ్జన్మ తానికర్మాణి తదాయుస్తన్మనోవచః
నృణాం యేన హి విశ్వాత్మా సేవ్యతే హరిరీశ్వరః
కిం జన్మభి స్త్రిభిర్వేహ శౌక్లసావిత్రయాజ్ఞికైః
కర్మభిర్వాత్రయీప్రోక్తైః పుంసోఽపి విబుధాయుషా
శ్రుతేన తపసావాకిం వచోభిశ్చిత్తవృత్తిభిః
బుద్ధ్యావా కిం నిపుణయా బలేనేంద్రియరాధసా
కింవాయోగేనసాంఖ్యేన న్యాసస్వాధ్యాయయోరపి
కింవాశ్రేయోభిరన్యైశ్చ న యత్రాత్మప్రదోహరిః
శ్రేయసామపిసర్వేషామాత్మాహ్యవధిరర్థతః
సర్వేషామపిభూతానాం హరిరాత్మాత్మదఃప్రియః

భా. 4.31.9 to 13.

ప్రపంచమును గోచరించుననుట సత్యముకాదు. రెండు విధములగు భగవదనుభవములును వైకుంఠతత్త్వానుగతములును, నిత్యములని యెఱుంగవలెను.

మహిమ జ్ఞానానుభవమే కానీ, కేవలానుభవమే కానీ, భగవదనుభవము త్రివిధము. ఎట్లన,—

(1) స్వరూపగత భగవదనుభవము.

(2) శక్తిగత భగవదనుభవము.

(3) క్రియాగత భగవదనుభవము.

భగవంతుని స్వరూపము.

భగవంతుని నిత్యవిగ్రహమే భగవంతుని స్వరూపము. ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యమునను నీయాఱును భగవంతుని స్వరూపగతగుణములు. జడవస్తువుల యందువలె గుణ గుణిభేదము ప్రకృతి కతీతతత్త్వమగు భగవంతునియందు లేదు. అయినను గుణసమూహమం దేదేనొక గుణమునకుఁ గర్తృత్వమేర్పడినప్పుడా గుణమే ప్రాధాన్యభావము నొంది యితరములగు నన్ని గుణములకు నాధార రూపమున నొప్పుచుండును. శ్రీ (శోభ) యనునది గుణముగఁ బరిగణింపఁ బడినపు డదియే సమస్తగుణములకు నాధారమగునని తెలిసికొనవలెను.

శ్రీయే పరమాశక్తి.

శ్రీ యే భగవద్విగ్రహ రూపిణియగు పరాశక్తి. ఆవిగ్రహమునం దితర గుణములు స్థిరనివాసమేర్పఱచుకొని భగవంతునియఖండత్వము, సర్వప్రభుత్వము, అనంతవీర్యత్వము, అనంతయశము, సర్వజ్ఞత్వము, సర్వవిధాతృత్వము నను వానినిఁ గ్రమరూపమునఁ బ్రకటించుచుండును.

నిత్యవిగ్రహము, నిత్యయగు భక్తి.

భగవంతుని నిత్యవిగ్రహము నంగీకరింపనివారలు భక్తివృత్తి నిత్యత్వ లాభము నొందఁజాలరు. అచింత్య విగ్రహుఁడగు భగవంతుఁడు చిత్ప్రపంచమందు సూర్యునివలెఁ బ్రకాశించుచుఁ జంద్రునివలె నానంద విస్తారకుఁ

డగుచుండును. విగ్రహమనిన జడీయమగు విగ్రహమును స్థూల జడ బుద్ధిగల మానవులు మాత్రమే చేయుదురు. జడజగత్తునందు

చిద్విగ్రహము.

జడ విగ్రహముల మూలమున భిన్నత్వమేరీతిగ సిద్ధించుచున్నదో, అట్లే చిజ్జగత్తునందుఁ గూడ నట్టి చిద్విగ్రహములమూలమున భిన్నత్వ మేర్పడుటచే భగవంతుఁడుకూడ నన్యచిత్పదార్థములకంటె భిన్నుఁడగుచున్నాఁడు. భగవంతుని చిద్విగ్రహము సర్వ చిత్తత్వములకును బరమాకర్షకరమును, బ్రభుస్థానమును, అగుచున్నది. జడజగత్తునందుఁ గల విశేషధర్మము జడజగత్తుతోడనే యుత్పన్నమై దానితోడనే లయమగుననుట సరికాదు. జడతత్త్వము చిత్తత్వముయొక్క ప్రతిఫలిత తత్త్వవిశేషమైన విధముగనే విశేష ధర్మముగూడ నారీతిగఁ జిద్గత ధర్మమగుచున్నది; ప్రతి ఫలితమగు జడమునందుఁ బ్రతి ఫలిత ధర్మరూపముగనే ప్రకాశించుచున్నది. విశేషతత్త్వము భగవద్గతమగు తత్త్వము కానిచో నెట్టి సృష్టియు సంభవము కానేరదు సరేకదా జీవుఁడు కూడ నస్తిత్వ ప్రాప్తినొంది జడవిచారము సేయఁజాలఁడు. చిద్గతమగు నా విశేష ధర్మముచేతనే పరమేశ్వరుని శక్తియు, నిచ్ఛయు, సమస్త క్రియలును విచిత్రతాలాభము నొందుచున్నవి. భగవంతునిశరీరము సమస్త వైకుంఠతత్త్వములకంటె భిన్నముగనున్నను అది సర్వత్ర యనుస్యూతముగనే యున్నది. నేయేల? వైకుంఠముయొక్క ప్రతిఫలనరూపముగ నున్న యీ జడ జగత్తునందుఁగూడ యుగపద్ధర్మముచే నంతటను బూర్ణరూపమున నిండియున్నది. కావున భగవంతుని స్వరూప విగ్రహ మలౌకికమును, నచింత్యమును నగుచున్నది. * ఆ స్వరూప సూర్యునియొక్క గుణకిరణ రూపుఁడగు బ్రహ్మ యనంతమగు జగత్తునకుఁ బ్రాణస్వరూపుఁడుగ నొప్పుచున్నాఁడు. పరమా

---

* సర్వేషామపి భూతానాం భావార్థో భవతిస్మ ఙతః
తస్యాపి భగవాన్ కృష్ణః కిమతద్వస్తురూప్యతాం.

భా. 10.14.57.

త్మయు సమష్టి జగత్తునకును, వ్యష్టి జగత్తునకును, నియామకుఁడగుచు విరాజిల్లుచున్నాఁడు. భగవత్స్వరూపము బ్రహ్మరూపమును, బరమాత్మరూపమును వహించి సర్వవ్యాపకముగ నున్నను నది నిత్య వైకుంఠస్థమగు లీలావిగ్రహవిశేషము. ఐశ్వర్య ప్రధాన ప్రకాశమందావిగ్రహమున లోకానోకయాకృతి గలుగును. ఆమూర్తి యనంతమూర్తులగుచు నాయా లీలల కాశ్రయమై యుండును. మాధుర్య ప్రధాన ప్రకాశమం దావిగ్రహము శ్రీకృష్ణరూపము వహించి చిద్విలాస సమూహములయొక్క యనేకాంతరంగిక ప్రభావములతో నొప్పుచు నిత్యవ్రజలీలా పరాయణమై యుండును. † రసతత్త్వమయహృదయులే యీ లీలల ననుభవింపఁగలవారు. భగవత్స్వరూపము నిత్యసిద్ధము. ఆ స్వరూపమున కవస్థానము, చిన్మయధామము, ఉపకరణములు, చిన్మయకాలము, సంగీజనము గూడఁగలదు. తత్త్వరసగతులగు వారలకు మాత్ర మీవిషయము గోచరము కాఁగలదు. ఆస్వరూపము నాశ్రయించి యనంతములగు చిద్విలాసములు నిత్య నూతన రూపములతోఁ బ్రవహింపుచుండును. అతని స్వరూపము, అవస్థానము, ఉపకరణములు, సంగీజనము, విలాసములు ననునవన్నియుఁ జిన్మయములును, నిత్యములును, బరమోపాదేయములును, నిర్దోషములును, సమస్తశుద్ధజీవాశయముల కేకమాత్ర నిలయములును.

నిర్విశేషకల్పనము.

జడజగత్తు రుచింపనట్టియు, నుచ్చజగత్తును బొందుట కుపలబ్ధియేర్పడనట్టియు, నవస్థయందున్న మానవులే నిర్విశేష కల్పనముసేయువారు. గంభీరరూపమున విచారముసేయఁజాలక వారలీజగత్తునం దేయేభావ

---

† యన్మర్త్యలీలౌపయికం స్వయోగ
మాయాబలందర్శయతా గృహీతం
విస్మాపనం స్వస్యచ సౌభగర్ధేః
పరంపదం భూషణ భూషణాంగం.

భా. 3.2.12.

ములుగలవో వానికి విపరీతములగు భావముల సమష్టిచే నుచ్చజగత్తు నిర్మింపబడినదని వారు సిద్ధాంతీకరింతురు. జడజగత్తునం దాకారము, వికారము, గుణము, విశేషము, ఛాయ, కర్మ, బహుత్వమనను సకలభావములుగలవు. వానికి విపరీతములగు భావములన్నియు, నసంగా, నిరాకారము, నిర్వికారము, నిర్గుణము, నిర్విశేషము, అచ్ఛాయ, నైష్కర్మ్యము, అద్వయము ననునవి యేకత్రితమగుటచే నేజగత్తు ప్రకటితమగుచున్నదో, అదియే యుచ్చజగత్తు. ఈసిద్ధాంతము కేవలము యుక్తిమిశ్రితమైనదో కాదో బాగుగ నాలోచించి చూడుఁడు. యుక్తి జడమునుండియే యుత్పన్నమైనది. దానినిఁ జేపణను సేయఁగాఁ జేయఁగా నదియొక విపరీతభావనను గల్పించెను. కావున నీసిద్ధాంతము కాల్పనికమగు నవస్థావిశేషము. చిదాలోచనచే సాధింపఁబడిన సిద్ధాంతమిది కాదు. సరియే. వస్తులక్షణమేదియో, అవస్తులక్షణమేదియో, ఆ యుక్తినే చెప్పుమందము.

**వస్తులక్షణము.** యుక్తికి నిజముగఁ బక్షపాతముకాని, కుసంస్కారముగాని లేనియెడల నది యవస్తువనఁగా నసత్త (ఏదిలేనిదో యది) యని యవశ్యముగఁజెప్పును. వస్తువనఁగా సత్త (ఉండునది) యని చెప్పును. అశాకృతమగు నీజగత్తు అవస్తువైనచో దానిం గూర్చిన సిద్ధాంతములును, బరిశ్రమములును, సర్వము మిథ్యలగును. అటు కాక వస్తువేయైనచో నేవస్తువైనను లక్షణవిహీనముగ నుండదుగదా? వస్తులక్షణమేమి? వస్తువని చెప్పినంతమాత్రమున దాని కస్తిత్వమును, విశేషమును, గ్రియయు, బ్రయోజనమును ఉండితీఱునుగదా?

అస్తిత్వములేనిచో నప్పుడే నాస్తిత్వమువచ్చి వస్తువే లేకుండఁ బోవును. విశేషములేనిచో నపుడు దానికి స్వతంత్ర వస్తుత్వములేదు. క్రియ లేనిచో దాని పరిచయ మభావమగుటచే నది భావమాత్రమని చెప్పఁబడును. ప్రయోజనములేనిచో దానిని స్వీకరించుట వృథయగును. ఉచ్చజగత్తునే వస్తువని యగత్యముగఁ జెప్పవలెను. అపుడు దాని కస్తిత్వమును, విశేష

మును, క్రియయు, ప్రయోజనమునుగూడఁ గలుగుచున్నవి. జడజగత్తునకు విపరీతములగు ధర్మములుగలది వస్తువని యెవరు చెప్పినట్లు? నేనే చెప్పుచున్నానంటివేని నీసిద్ధాంతము భిక్షాలబ్ధ సిద్ధాంతమగుచున్నది. విశుద్ధరూపమున నాలోచించితివేని నాయుచ్ఛజగత్తు దోషశూన్యమైనదనియు, జడముకంటె విలక్షణమైనదనియు, మాత్రమే చెప్పుటకు వీలగుచున్నది. జడముకంటె విపరీతమైనదని చెప్పినచో నొక యపక్వసిద్ధాంత మరుదెంచి నిన్నాక్రమించును. విపరీతవస్తువున్నదో లేదో దాని పరిచయ మెవరికిని లేదు. అట్టి వస్తువును నేనుగ్రహింతునంటివేని నీసిద్ధాంతము మాదకజనిత సిద్ధాంతము వంటిదగును. జడముయొక్క హేయత్వము వర్జించుట యను లక్షణముచే జడవిలక్షణమగు జగత్తు ననుభవమునకుఁ దెచ్చుకొంటిమేని నిట్టిదోషము కలుగనేరదు. ఇంతకును యుక్తిరూపమగు యంత్రము జడమును విడిచి జడముకంటె వేఱగు నెట్టిసత్తావిశేషము దరికైనఁబోఁజాలదు. కాని జీవుని చిద్భాగమునకు సంబంధించిన విశుద్ధజ్ఞానలక్షణముగల యాత్మ ప్రత్యయవృత్తిమూలమున నుచ్ఛజగద్గతమగు నస్తిత్వమును, విశేషమును, క్రియయు, ప్రయోజనమును నొకించుకఁ దెలియుట కవకాశముఁగలదు. చిద్వస్తువునకస్తిత్వము, విశేషము, క్రియయు, ప్రయోజనమును లేవని చెప్పుదువేని నది చిత్తత్త్వమే కాదు. యుక్తివాద నిరతులు కుసంస్కారమును విడిచి యీవిషయమును నిష్పాక్షికముగ విచారించినచో సత్యము తేటఁబడఁగలదు.*

శక్తిగత భగవదనుభవముచే జీవుని సమస్త సంశయములను దూరీభూతములగుచున్నవి. భగవంతుని శక్తి యచింత్యము, నవితర్క్యము,

* ఇదంహివిశ్వం భగవానివేతరో, యతోజగత్స్థాననిరోధసంభవాః
తద్ధిస్వయంవేద భవాంస్తథాపి మే ప్రాదేశమాత్రం భవతఃప్రదర్శితం
అతోమహాభాగ భవానమోఘదృక్ శుచిశ్రవాస్సత్యరతోధృతవ్రతః
ఉరుక్రమస్యాఖిల బంధముక్తయే సమాధినానుస్మర యద్విచేష్టితం.
భా, 1.5.20 & 13.

భగవచ్ఛక్తి యచింత్యము.

సపరిమేయము.† వస్తురూపమున భగవత్స్వరూపముకంటె నభిన్నత్వమును, గార్యరూపమున భిన్నత్వమునుగలిగి యతనిశక్తిప్రకాశించును. నరబుద్ధి నెంతదూరము పనియోగించినను భగవచ్ఛక్తిని గూర్చి యది యిదమిత్థమను సిద్ధాంతమెన్నఁడును జేయఁజాలదు. ఒకవేళ నట్లు సేయుటకుఁ బ్రయత్నించెనేనిఁ బసువువలె నిశ్చేష్టతనొంది కొంతవడికి నిరాశ చేసికొనును. ఆపరాశక్తి సమస్తవిపరీతగుణములకు నాశ్రయమగుచు వానిని నియమించుచున్నది. ఇచ్ఛయు, నిర్వికారతయు, విశేషత్వము, నిర్విశేషత్వమును, ఏకస్థానవ్యాపిత్వము, సర్వవ్యాపకత్వమును, వైరాగ్యము, రాగవిలాసమును, నైష్కర్మ్యము, గ్రియయు, యుక్తియు స్వేచ్ఛామయతయు, విధియు, స్వాధీనతయు, బ్రభుత్వముఁ గైంకర్యమును, సర్వజ్ఞత్వము జ్ఞానసంగ్రహమును, మధ్యమాకృతియు, నపరిమేయత్వమును, సర్వార్థసిద్ధియు, బాలచేష్టయు, మున్నగు సకలవిపరీతగుణములు నీశక్తినాశ్రయించి సామంజస్యమును బొందుచున్నవి. ఆపరాశక్తియొక్క చిత్ప్రభావముచే భగవత్స్వరూపమును, విగ్రహమును, లీలాస్థానములును, లీలోపకరణ సమూహమును నిత్యత్వమువహించి ప్రకాశించుచున్నవి.* ఆశక్తియొక్క జీవప్రభావక్రమముచే ననంతసంఖ్యగల

---

† అహో భాగవతీ మయా మాయినా మపి మోహినీ
యత్స్వయం చాత్మవర్త్మాత్మా నవేదకిముతాపరే.
భా. 3.7.39.

నమో నమస్తుభ్య మసహ్యవేగ
శక్తిత్రయా యాఖిలధీగుణాయ
ప్రపన్నపాలాయ దురంతశక్తయే
కదింద్రియాణా మనవాప్యవర్త్మనే.
భా. 8.3 28.

* యథాత్మ మాయాయోగేన నానాశక్త్యుపబృంహితమ్
విలుంపన్ విసృజన్ గృహ్ణన్ బిభ్రదాత్మాన మాత్మనా.
భా. 2.9.27.

ముక్తజీవులును, బద్ధజీవులును, అనంత చిత్కాలమునం దవస్థితిలాభము నొందుచున్నారు. ఆశక్తియొక్క మాయాప్రభావముచే లెక్కకు మీఱిన జడమయ జగత్తు లావిర్భవించి బద్ధజీవులకుఁ బాంథనివాస రూపములై వ్యాపించియున్నవి. ఆయాప్రభావములయొక్క సంధిన్యంశముచే నాయా ధామములయందలి దేశమును, గాలమును, స్థానమును, ద్రవ్యమును, భిన్న భిన్నోపకరణములును బ్రాదుర్భూతములయ్యెను. సంవిదంశముచే భావ, జ్ఞాన, సంబంధసమూహము లావిర్భవించి యాయాధామములయందలి భావ వైచిత్ర్యమును బ్రకటించెను. హ్లాదిన్యంశముచే నాయాధామములయం దుప యోగించు నానందస్వరూపాస్వాదనమునకగు సర్వవిధములగు కార్యము లును సంపాదితము లగుచున్నవి. ఇంతయేల? తనశక్తి కర్తృత్వముచేతనే భగవంతుఁడు ప్రకాశలాభము నొందుచున్నాఁడని యొక్కమాటలో చెప్ప వచ్చును.

క్రియాగత భగవదనుభవము రసవిచారమందు వర్ణింపఁబడును గావున నది యిచ్చట వివరింపఁబడలేదు.

స్వానుభవము. స్వానుభవము శుద్ధజ్ఞానమందలి ద్వితీయప్రకరణము. జీవుని స్వరూప జ్ఞానమే స్వానుభవ మనఁబడుచున్నది. జీవుని స్వరూపమెయ్యది? భిన్నభిన్న ప్రకృతులకు వశీభూతులగు మానవులీప్రశ్నమునకు భిన్నభిన్నము లగు నుత్తరముల నిత్తురు. నీతివిరుద్ధ (అంత్యజ) జీవనముచేయువారు ప్రాకృత పదార్థముల నాయాభాగముల లెక్కను సమ్మేళనముసేయుటచే మానవకళే బరమును, దానియందుండెడి సమస్తయంత్రములు నుత్పన్నమయ్యెననియు, నాయంత్రములన్నియుఁ జలించుటచే నాకానొక జ్ఞానపర్వముదయించె

---

క్రీడస్యామోఘ సంకల్ప ఊర్ణనాభిర్యథోర్ణుతే
తథా తద్విషయాం దేహి మనీషాం మయి మాధవ.

భా. 2.9.28.

సనియు, దజ్ఞానగుణ విశిష్టయంత్రసమన్వితమగు నరదేహమే జీవుఁడనియు, నరదేహము హతమయ్యేనేని జీవుఁడు నశించుననియు, బహువులను జీవులనఁ గూడదనియు, జెప్పుదురు. నైతికజీవనము సేయువారుకూడ నిదేవిధముగ నుత్తర మిత్తురుగాని జీవుఁడు నీతిపరాయణుఁడనియు, నీతివిరుద్ధములును, నీతియుక్తములునగు కార్యములచేతనే పశువునకును, మనుజునకును భేద మేర్పడెననియు, గూడఁజెప్పుదురు. కల్పితనేశ్వరనైతికులుగూడ నిదేవిధ ముగ నుత్తరమిచ్చుచు జీవుని సామాజికశ్రేయస్సుకొఱ కీశ్వరు నొకనినిఁ గల్పించి వానియందు విశ్వాసముంచుటయు, వాని యధీనముననుండు టయు, నుచితమనికూడ వచింతురు. వాస్తవనేశ్వర నైతికులు జీవుని నీశ్వ రుఁడే మాతృగర్భమందు సృజించెననియు, గర్తవ్యపాలనముచే జీవునికి స్వర్గాదిభోగములు కలుగుటకు యోగ్యత యేర్పడుచున్నదనియు, ననత్కా ర్యము లొనరింపుటచే నరకప్రాప్తి గలుగుచున్నదనియుఁ జెప్పుదురు. కాని మాతృగర్భమునకు రాకపూర్వము జీవుఁడెట్లుండె నేమయ్యెనను సమాచారము వారలెఱుఁగరు; అట్లే పరలోకతత్త్వముకూడ వారికి స్పష్టముగాఁ దెలియదు. కావున జీవునికి, జడమునకుఁగల సంబంధము వారి కవగాహనము లేదు.* ఇఁక బ్రహ్మజ్ఞానపరాయణుల సిద్ధాంతముప్రకారము జీవుఁడు

---

* బాలిశాబతయూాయంవో అధర్మే ధర్మమానినః
యేవృత్తిదం పతింహిత్వాజారం పతిముపాసతే
అవజానంతి యేమూఢా నృపరూపిణమీశ్వరం
నానువిందంతి తే భద్రమిహలోకే పరత్రచ
కోయజ్ఞపురుషో నామయత్రవో భర్త్తి రీదృశీ
భర్తృస్నేహ విదూరాణాం యథాజారేకుయోషితాం
విష్ణుర్విరించో గిరిశ ఇంద్రోవాయుర్యమోరవిః
పర్జన్యోధనదస్సోమఃక్షితి రగ్నిరపాంపతిః
ఏతేచాన్యేచ విబుధాః ప్రభవోవరశాపయోః
దేహేభవంతి నృపతే స్సర్వదేవ మయోనృపః

వాస్తవముగ బ్రహ్మయే. అతఁడవిద్యచేత బద్ధుఁడైనాఁడు. అవిద్యాబంధ మెడలెనేని జీవుఁడు బ్రహ్మయేయగును. అనునిట్టి యస్ఫుటము, నసంపూర్ణము, దోషయుక్తము, లగు సిద్ధాంతములచేఁబీడితులై వారుగూడ స్వస్వరూపజ్ఞానము సంపాదింపనేరరు. విశుద్ధజ్ఞానముగలవారు తెలిసికొనఁ గలిగిన దేమన, గష్టభూయిష్ఠమగు నీసంసారమునందు జీవుఁడు సదానివసించువాఁడు కాఁడు. జీవుఁడిపుడు పొందియున్నదేహము నిత్యదేహము కాదు.

జీవుఁడు చిత్తత్త్వము, నణుచైతన్యుఁడును.

జీవుఁడు చిత్తత్త్వము. భగవంతుఁడు విభుచైతన్యుఁడును, జీవుఁడణుచైతన్యుఁడును. భగవంతుఁడు సూర్య సదృశుడును, జీవుఁడు తత్కిరణ సదృశుఁడును. భగవంతుఁడు పూర్ణసచ్చిదానందుఁడును, జీవుఁడు చిదానందకణ విశేషమును. చిద్విపరీత లక్షణము కలిగియుండుటచే జడజగత్తుగాని, జడముగాని భగవత్తత్త్వమునకు సమీప తత్త్వములు కానేరవు. జీవుఁడు చిద్వస్తువగుటచే భగవంతుని కత్యంత సమీపసంబంధము గలవాఁడగుచున్నాఁడు. భగవంతుని కెట్లొక స్వరూపవిగ్రహముగలదో జీవునికిఁగూడ నట్లే నిత్యమగు నొక చిద్దేహముగలదు. ఆచిద్దేహము వైకుంఠస్థానమందే ప్రకటితమగుచున్నది.

చిద్దేహము రెండావరణములలో నడఁగియుండును.

జడజగత్తునందది బద్ధావస్థనొంది రెండావరణములలో నణఁగియుండును. దానిలో మొదటి యావరణమునకు లింగావరణమని పేరు.* అహంకారము, మనస్సు, బుద్ధియనునవి లింగజగత్తునందలి తత్త్వవిశేషములు. జడజగత్తు కంటె

---

తస్మాన్మాం కర్మభిర్విప్రా యజధ్వం గతమత్సరాః
బలించ మహ్యం హరత మత్తోఽన్యః కోఽగ్రభుక్పుమాన్.

భా. 4.14.23 to 28.

* యావల్లింగాన్వితో హ్యాత్మా తావత్కర్మనిబంధనమ్
తతో విపర్యయః క్లేశో మాయాయోగోఽనువర్తతే. —భా. 7.2.47.

లింగజగత్తు సూక్ష్మమైనది గనుక లింగావరణముగూడ సూక్ష్మమైనదే. స్థూలజగత్తునందుఁగల యాత్మబుద్ధికిని, స్థూలమే నేనను నభిమానమునకును, నహంకారమని పేరు. జీవుఁడు తనకు జడసంబంధము రాకపూర్వము తనకుఁ గల చిద్దేహమునం దభిమానము కలిగియుండుట న్యాయ్యమును, స్వాభావికమును కాని జడసంబంధము కలిగిన వెనుక జడపదార్థములయందుఁ దాను జేయు నాత్మాభిమాన మాపాధికమును, నన్యాయ్యమును.† దీనికే మఱియొక పేరవిద్య. ఈయహంకారమే జీవుని జడమునకు బంధించుసూత్రము. జడమునందుఁ జేటి జీవుఁడెపుడు దానియం దభినివేశము నొందునో, అపుడా యహంకారము స్థూలమై చిత్తమగుచున్నది. తదుపరి యెపుడది జడ విచారము సేయుటకు మొదలిడునో, అపుడది మఱియొకించుక స్థూలమై బుద్ధి యను పేరు వహించుచున్నది. తదుపరి యింద్రియముల మూలమున సాక్షా జ్జడవిచారము సేయునపు డదియే మనస్సగుచున్నది. అహంకారము మొదలుకొని మనస్సు పర్యంతముగల తత్త్వములు శుద్ధజీవునికి సంబంధించినవి కావు; జడమునకు సంబంధించినవియు గావు. కావున వానికి లింగమని పేరు. శుద్ధావస్థయందు జీవునికిఁ గల చిద్దేహము, చిత్కార్యము, చిదనుశీలనమును లింగదేహమునందొకించుక యనుభవమునకు వచ్చుటచే నామధ్యవర్తి తత్త్వమునే లింగమందురు. లింగబద్ధజీవునకుఁ దన చిద్దేహమునందు గల యహంకార మమకారములు జడసంగముచే మిగులఁ గుంఠితములగుచు లింగదేహమం దవి యావిర్భవించుటచేఁ జిద్దేహగతమగు తత్పరిచయము లుప్తప్రాయమును, విస్మృతప్రాయమును గూడ నయ్యెను. మీఁదు మిక్కిలి లింగదేహమునం దిపు డుదయించిన యహంకారము, దానికి జడసంబంధము గలుగుటచే నా యహంకా

లింగావరణము.

† వితథాభినివేశోఽయం, యద్గుణేష్వర్థ దృగ్వచః
యథామనోరథ స్స్వప్నస్సర్వమైంద్రియికం మృషా.
భా. 7-2-48.

రమే దానియం దారోపితమగుచున్నది. జీవుఁడు తన చిద్దేహమందుఁ దనకుఁ గల కృష్ణదాసత్వాభిమానము పూర్తిగ రూపుమాని యవుడు విషయదాసత్వాభిమానమును బూర్తిగ వహించుచున్నాఁడు. ఇట్టి యవస్థయందు జీవునికి మాయాబంధము కలుగుచున్నది. జీవుని చిద్దేహమునకుఁ బ్రథమావరణము లింగదేహమును, ద్వితీయావరణము స్థూలదేహమును. స్థూలదేహమొనరించు సకల కర్మలయొక్క ఫలములను లింగదేహ మభిలషించుటచే దానికి దేహాంతరప్రాప్తి కలుగుచున్నది. స్థూల, లింగగతుఁడగు జీవునికిఁ గర్మచక్రమును, దుష్ప్రజ్ఞానతరంగములును, సాధారణముగ నివృత్తి నొందఁజాలవు.

స్థూలావరణము.

తత్త్వజ్ఞులగు పురుషులు కర్మ యనాదియు, నంతవంతమునగు సత్త్వమని స్థిరపఱచిరి. ఏ కర్మ జడ జగత్తునందుఁ దప్ప నేఱొక చక్కనిలేదో, ఆకర్మ జీవుఁడు ముక్తినొందుచుండ నశింపుచున్నదను విషయము తత్త్వవాదులందఱు నంగీకరించినదే. కాని కర్మ యెట్లనాదియైనదో ఆ విషయము మాత్రము చాలమందికి స్పష్టముగాఁ దెలియదు. జడకాలము చిత్కాలముయొక్క జడప్రతిఫలన రూపమగుచుఁ గర్మ వ్యవహారమున కుపయోగించు జడద్రవ్య విశేషమగుచున్నది. జీవుఁడు వైకుంఠమందుఁ జిత్కాలము నవలంబించును. ఆకాలమునను భూత భవిష్యత్తులను రెండవస్థలును లేవు. కేవల వర్తమానావస్థయే కలదు. జడబద్ధుఁడైనపుడు జీవుఁడు జడకాలమునందుఁ బ్రవేశించి భూతభవిష్యద్వర్తమాన రూపములగు మూఁడుకాలములను సేవింపుచు సుఖదుఃఖముల నందుచుండును. జడకాలము చిత్కాలముచేఁ గలిగినదైనను జిత్కాలముయొక్క యనాదిత్వముతోఁ గూడుకొన్న జీవుని జడకర్మయొక్క ప్రారంభరూపమగు భగవద్వైముఖ్యత జడకాలమునకుఁబూర్వమే కలిగెను. కావున జడకాలసంబంధమగు తటస్థ విచారమందుఁ గర్మయొక్క ఆది జడకాలమునకుఁ బూర్వస్థమగుటచేఁ గర్మ అనాది యని చెప్పుటకుఁ గారణమైనది. స్పష్టముగఁ జెప్పవలయుననిన, గర్మ జడకాలము

కర్మ అనాది యెట్లు?

నకు సంబంధించి యనాది యగుచు, జడకాలము నందే యంతమొందుటచేఁ గర్మ నశించుచున్నదని చెప్పుట యుక్తివిరుద్ధము కాఁజాలదు. జడకాలము నందుఁ గర్మ కాది లేదుగాని యంతము గలదు.

ఈవిచారముచేఁ దెలిసిన సిద్ధాంతము ప్రకారము ముక్తజీవులనియు, బద్ధజీవులనియు, జీవులు రెండువిధములు. ఐశ్వర్యమయ మాధుర్యమయ భేదములచే ముక్తజీవులు మఱల రెండువిధములు. బద్ధజీవు లైదువిధములు. ఎట్లన,—

ముక్తజీవులు, బద్ధజీవులు.

—పంచవిధ బద్ధజీవులు.—

(1) పూర్ణవికచిత చేతనములు.
(2) వికచిత చేతనములు.
(3) ముకుళిత చేతనములు.
(4) సంకోచిత చేతనములు.
(5) అచ్ఛాదిత చేతనములు.

ముక్తజీవుల విచారము మొదట ముగింతును. నిత్యముక్తులనియు, బద్ధముక్తులనియు ముక్తజీవులు రెండువిధములు. ఎన్నఁడును జడబద్ధులు కాకుండ నిరంతర వైకుంఠ వాసముచేయువారు నిత్యముక్తులు. కపట రహితమును, స్వార్థరహితమును నగు నిరంతర భగవత్సేవయే వారి స్వభావమును, ఆచరణమును. భగవంతుని యనంతలీలలయందు వారు సహకారులుగ నుందురు. తన యచింత్యశక్తిచే భగవంతుఁడు ప్రపంచమునం దవతరించునపు డనేక ముక్తజీవులు వానితోఁగూడఁ బ్రపంచమునకు విచ్చేయుదురు; కాని వారెన్నఁడును జడబద్ధులుకారు. మఱల భగవంతునితోడనే వారు శుద్ధధామమునకుఁ బోవుదురు. ఆజీవులందఱును నిత్యసిద్ధులును, భగవంతుని నిత్యపరికర స్వరూపులును. వార లసంఖ్యాకులు. బద్ధముక్తజీవుల యాచర

ద్వివిధముక్తజీవులు.

ణము గూడ నన్నివిధములచేతను నిత్యసిద్ధుల యాచరణమువలెనే యుండును గాని వారు బద్ధభావమునుండి ముక్తులగుటచే వారలకు జడజగత్తునందలి సమస్తవిషయములు నవగాహనములైయుండును. కొన్నికొన్ని సమయములందు వారు జడజగత్తునకు విచ్చేసి యోగ్యులగు జీవులకు భగవన్నిర్దేశమును గృపాపూర్వకముగఁ బ్రకటింతురు. తమతమ సిద్ధదేహములతో వారు తమ యిచ్ఛవచ్చినట్లు విహరించి మఱల శుద్ధధామమునకుఁ బోవుదురు. ఇట్లు విహరించుటచే వారలకు మఱల బద్ధత్వముకలుగదు.* ముక్త జీవుల యాశ్రయములును, అహంకారము, చిత్తము, మనస్సు, ఇంద్రియములు, శరీరముగూడఁ జిన్మయములే. వారల కితరులతో సహవాసము చేయవలయునను గోర్కెయుండదు. భగవత్సేవాతృష్ణయే వారు సదాకలిగి యుందురు. భగవత్సన్నిధిని సదా వర్తింపుచుండుటచేఁ దమతమ విశేషత్వానుసారము భిన్నభిన్న సంబంధగతములగు విచిత్రసేవనము లనురక్తిమై నొనరింపుచుందురు. ఐశ్వర్యభావమం దాసక్తిగలవారి సేవాలాభము దాస్యపర్యంతముండును. మాధుర్యభావముగలవారు సఖ్య, వాత్సల్య, శృంగార సేవాలాభములొందుదురు. జీవులందఱును దమతమభావముల కనురూపములగు స్వభావముగలిగి కొందఱు స్త్రీత్వమును, గొందఱు పురుషత్వమునవలంబింతురు. ఇట్లుచెప్పుటచే జడదేహ ధారులకువలె వారలకు స్త్రీ వ్యవహారము, సంతానోత్పత్తి, శారీరిక మలాదివిసర్జనము సంభవించునని యెంచరాదు. భగవత్ప్రసాదరూపమగు చిత్పదార్థ సేవ

చిద్ధామమందు హేయమగు నదిలేదు.

---

* అంతర్బహిశ్చలోకాం స్త్రీన్ పర్యేమ్యస్కందిత వ్రతః
దేవదత్తా మిమాంవీణాం స్వరబ్రహ్మ విభూషితామ్
మూర్ఛయిత్వా హరికథాం గాయమానశ్చరామ్యహం
అనుగ్రహా న్మహావిష్ణో రవ్యాహతగతిః క్వచిత్.

భా. 1.6.32 & 33.

నముచే వారల ప్రీతిధర్మము పుష్టిలాభము నొందుచుండును. భగవత్సేవనముకొఱకుఁ బరస్పరసఖీసఖి సంగమచట నిరంతర ప్రవర్తకమై యుండును. అచ్చటశోకము, భయము, మరణమును లేవు. లోపమనుశబ్దమచట నుండదు. అచ్చటి కాలము చిన్మయమైనది. అందు భూతభవిష్యత్తులు లేవు. కేవల వర్తమానకాలమునందే యచ్చటి సమస్త వ్యాపారములును సాగుచుండును.* సిద్ధజ్ఞానగతమగు స్మృతికార్యము వర్తమానకాలమం దనాయాసముగ లభ్యమగుచుండుటచే నచట స్మృతియొక్క ప్రయోజనమే లేదు. నేను సదా కృష్ణదాసుఁడననుచుఁ దన్నుఁదా నెఱుంగుటకే శుద్ధాహంకారము. శుద్ధాహంకారమని పేరు. ఆనంద మచట ననుదినము నిత్యనూతనరూపమొందుచు నధికతరఘనీభూత మగుచుఁ బ్రకాశించుచుండును. తృప్తియనున దచట లేనేలేదు. లోభమును, ఆనందమును, బ్రచురరూపమున నచట నవ్యవహితపద్ధతిని దనరారుచుండును. భగవత్సేవోపయోగములగు రసముల ననుసరించి యపూర్వములును, నిత్యములునగు ప్రకోష్ఠము లచటఁ బెక్కులు గలవు. రసము లన్నింటిలో శృంగార రసమే సర్వప్రాధాన్యము. అందులో సంబంధరూప శృంగారముకంటెఁ గామరూపమగు శృంగారము బలవత్తరమైనది. ఆరసమునకుఁ బీఠస్వరూపమగు నిత్యబృందావన మచట నన్నింటి కుపరిభాగమందు విరాజమాన మగుచుండును. సకల రసములయందును భగవంతుఁడు స్వయం సేవ్యుఁడగుచుఁ దనస్వరూపము నొకభాగమును, సేవకరూపమున నన్యభాగమును, గ్రహించి తదన్యభాగ గతస్వరూపముచే

* తస్మైస్వలోకం భగవాన్ సభక్తితః, సందర్శయామాస పరంనయత్పరం
వ్యపేత సంక్లేశ విమోహసాధ్వసం స్వదృష్టవద్భిర్విబుధైరభిష్టుతమ్
ప్రవర్తతే యత్ర రజస్తమస్తయోః సత్త్వంచ మిశ్రం నచకాలవిక్రమః
న యత్రమాయాకిముతాపరే హరే రనువ్రతాయత్ర సురాసురార్చితాః.

భా. 2-9-9 & 10.

నా యా రససేవనము సేయువారి కాదర్శరూపుఁడగుచు నచింత్య లీలను బ్రకటించుచుండును. శృంగార రసమందు శ్రీమతిరాధికయు, వాత్సల్య రసమందు నంద యశోదలును, సఖ్యరసమందు సుబలుఁడును, దాస్య రసమందు రక్తకుఁడును దత్తద్రసగతుండగు భగవంతునకు సేవకభావ విశేషములు. వీనిలో మఱియొక భేదముకూడఁ గలదు. శృంగార రసమందు శ్రీరాధిక యెట్లు భగవంతుని సాక్షాద్విభాగ విశేషమగుచున్నదో, ఇతర రసములయం దదేవిధమున బలదేవుఁడు సాక్షాద్విభాగ విశేషమగుచున్నాఁడు. నంద యశోదలును, సుబలుఁడును, రక్తకుఁడును, నతని యంగవ్యూహ స్వరూపములుగ నెఱుంగనగును. అవతారకాలమందుఁ దన యచింత్యశక్తి ప్రభావముచే భగవంతుఁడగు శ్రీకృష్ణచంద్రుఁడు తన లీలాపీఠములను, దన యనుచరులను గూడఁ దోడ్కొనివచ్చి వారలతోఁగూడి ప్రపంచమధ్యమున స్వైరవిహార మొనర్చును. ఆవిహారకార్యములయందుఁ బ్రపంచదృష్టికి గోచరించు భగవంతుని యనుచర బృందమును, రసోపకరణ సమూహమును, రసపీఠములును బ్రపంచసంబంధమగు నేవిధికి నధీనములు కావు. భగవంతుని యచింత్యశక్తికే స్వాధీనములగు కార్యవిశేషములు.

బద్ధ జీవు లైదువిధములని చెప్పఁబడెను. ఎట్లన,—

(1) పూర్ణ వికచిత చేతనములు.
(2) వికచిత చేతనములు.
(3) ముకులిత చేతనములు.
(4) సంకోచిత చేతనములు.
(5) ఆచ్ఛాదిత చేతనములు.

వీనిలోఁ బూర్ణవికచిత చేతనములు, వికచిత చేతనములు, ముకులిత చేతనములగు బద్ధజీవులు మానవదేహ సంపన్నులు. సంకోచిత చేతనములగు బద్ధజీవగణము పశుపక్షి సరీసృపదేహగతము. ఆచ్ఛాదిత చేతనములు చెట్టు, ఱాయి లోనగు రూపములువహించిన బద్ధజీవులు. తాను కృష్ణదాసుఁడను మాట మఱపువచ్చుటయే జీవుని యవిద్యాబంధనమునకుఁ గారణము.

ఆమఱియెంత గాఢముగనుండునో చేతనవిశిష్టుఁడగు జీవుని జడదుఃఖావస్థాప్రాప్తి యంతగాఢముగనుండును. చేతనధర్మము మఱఁగుపడిన యవస్థయే యత్యంత బహిర్ముఖావస్థ. కేవల సాధుసంస్పర్శచేఁగాని, లేక, వారిపాదధూళి సోఁకుటచేఁగాని, యాయవస్థ తొలఁగిపోవును. అహల్యాయమళార్జున సప్తతాళవిషయములకు సంబంధించిన పురాణగాధలు తిలకించినచో నీవిషయము స్పష్టపడఁగలదు. ఆయూఁదుదాహరణములయందును భగవత్సంస్పర్శయే సాధుసంస్పర్శ యగుచున్నవి. పూర్ణప్రేమ ప్రాప్తిఁగల జీవుఁడును, భగవంతుఁడును దప్ప నితరు లెవరుతాఁకినను దదవస్థామోచనము కలుగ నేరదు. చేతనధర్మము సంకోచిత మైనపుడు తద్విమోచనకు (నృగు మహారాజున కూసరవెల్లి రూపుతొలఁగుటకువలె) భగవత్సంస్పర్శయే ప్రధానమగు కారణము. ప్రేమారూఢులగు పురుషు, లసంగా, నారదాదులగు భక్తులును, సిద్ధజీవగణమును నను్రగహించినచోఁ గూడ సంకోచిత చేతనులగు జీవులుద్ధరింపఁ బడుదురు.

మానవదేహధారులు ముకుళితచేతనులనియు, వికచిత చేతనులనియు, బూర్ణవికచిత చేతనులనియుఁ జెప్పియుంటిని. ఇందుల కుదాహరణములు సులభముగ నీయవచ్చును. నరజీవనమందు దృష్టినిక్షిప్తిమేని నవి సహజముగ మనకు లభ్యమగును. నరజీవన మైదువిధములు. ఎట్లన,—

—పంచవిధ నరజీవనము.—

(1) నీతిశూన్య జీవనము.
(2) కేవలనైతిక జీవనము.
(3) సేశ్వరనైతిక జీవనము.
(4) సాధనభక్త జీవనము.
(5) భావభక్త జీవనము.

నీతిశూన్య జీవనమందును, కేవలనైతిక జీవనమందును నీశ్వరచింతనేముండదు. సేశ్వరనైతికజీవనము మఱల రెండువిధములు. కల్పితసేశ్వర నైతిక జీవనము మొదటిది. వాస్తవసేశ్వర నైతికజీవనము రెండవది. నీతి

శూన్య కేవలనైతిక కల్పితసేశ్వర నైతికజీవనములందు ముకుళిత చేతనులగు జీవులే నిర్దిష్టులగుచున్నారు. వారిచిత్తవృత్తిచాలనము యుక్తిపర్యంతమే. యుక్తినిమించిన యున్నతవృత్తి వారలెఱుంగరు. కాని నరజీవన మెంత వఱకు నున్నతిలాభమొందఁగలదో దానినిఁబట్టి చూచినపు డీయవస్థయందలి చేతనము కేవలముకుళితమైనదే కాని ప్రస్ఫుటితము కాలేదని సిద్ధాంతముగఁ జెప్పవచ్చును. వాస్తవసేశ్వర నైతికజీవనమందు సమస్తమునకుఁ గర్తయు, పాలకుఁడు, నియామకుఁడు నగు పరమపురుషుఁ డొకఁడవశ్యముగ నున్నాఁడను విశ్వాసము ప్రాదుర్భవించుటచే నాజీవనమందుఁ జేతనపుష్పము వికసించుటకు సంసిద్ధముగనుండును; కాని వెంటనే యది వికసింపదు. సాధనభక్తిమయ జీవనమందు శ్రద్ధ, నిష్ఠ, రుచి, ఆసక్తియను రేకులు మాత్రమా పుష్పమున విడియుండును. పూర్ణముగ వికసించెనేని భావభక్తజీవనమారంభమగును. కావున వాస్తవసేశ్వర నైతిక జీవనమందును, సాధనభక్తిమయ జీవనమందును, వికచిత చేతనులగు జీవులే నిర్దేశింపఁబడుచున్నారు. భావ భక్తి మయ జీవనమందుఁ బూర్ణవికచిత చేతనులు నిర్దిష్టులగుచున్నారు. భావభక్తి సంపూర్ణమైనచోఁ బ్రేమభక్తి యగుచున్నది. భావభక్తి యనినఁ బ్రేమభక్తియనియే యచట నర్థము. ప్రేమభక్తునికి జీవసాంతమున నెట్టి జడసంబంధమును గలుగదు. జీవుఁడపుడు బద్ధముక్తుఁడగుచు శుద్ధ వైకుంఠధామమునఁ బ్రవేశించును.

స్వధర్మానుభవము శుద్ధజ్ఞానమునందలి తృతీయప్రకరణము. స్వధర్మమని దేని నందురు? స్వీయధర్మమే స్వధర్మము.

స్వధర్మానుభవము. ప్రతిపదార్థమందును నొక్కొక్క ధర్మముండును. వస్తుధర్మము వస్తువుకంటె వేఱుగ నుండదు. జీవుఁడనువస్తువునకుఁ బ్రీతియే స్వధర్మము.* శక్తి, గుణప్రకృతి, వృత్తియను

* యథాభ్రామ్యత్యయోబ్రహ్మన్ స్వయమాకర్షసన్నిధౌ
తథామేభిద్యతేచేత శ్చక్రపాణేర్యదృచ్ఛయా. భా. 7-5-14.

**వస్తుధర్మముయొక్క త్రివిధావస్థలు.**

నవి ధర్మమునకు నామాంతరములు. ధర్మమే తదధిష్ఠానమగు వస్తువుయొక్క పరిచయము గలిగించును. అగ్నియనునదెట్టి వస్తువో యెవ్వరు నెఱుఁగరు. దగ్ధముసేయుట, వేఁడినిచ్చుట, వెలుఁగునిచ్చుట యగ్నిధర్మములు. ఆధర్మములచే నగ్నియనువస్తువు మనకుఁ బరిచితమగుచున్నది. ధర్మము, లేక, గుణమునకు వ్యతీతమగు వస్తువులేదని చెప్పినచో దీనియందుఁ గల దోషమేమనిన నేదేనొక సాధారణాధారమందున నే తప్ప రెండు మూఁడు గుణములు కలిసియుండుట కవకాశములేదు. అట్టికలయిక యెచ్చట గోచరించెనో, అచ్చట మనము వస్తుభావమును గ్రహింపనిచో విజ్ఞానముగాని, సహజజ్ఞానముగాని, సంతృప్తి నొందఁజాలవు. వస్తుధర్మమునకు సుప్తావస్థయనియు, జాగ్రదవస్థయనియు, వికృతావస్థయనియు, మూఁడవస్థలు గలవు.

అగ్గిపుల్లకుఁగాని, చెకుముకికిఁగాని మఱియొకవస్తువుతో రాపిడి గలిగినపు డగ్నిసంభవమగును. అగ్నియందు వెలుఁగు నిచ్చునట్టియు, వేఁడి నిచ్చునట్టియు, దహించునట్టియు, శక్తులు మూఁడుగలవు. యుగపద్ధర్మమున నగ్నియందు వస్తురూపము గూడ మన కనుభవమునకు వచ్చుచున్నది. సంభవకాలమునకుఁ బూర్వము దాని ధర్మములన్నియు సుప్తావస్థయందుండును. తదుపరి జాగ్రదవస్థనొందును. ఆయవస్థయం దది విషయభేదముచే స్వాస్థ్యలాభముగాని, వికృతస్థితినిగాని, పొందును. కట్టెయం దగ్ని ధర్మములన్నియు సాస్థ్యలాభము నొంది కార్యపుష్టి వహించును. కట్టె కాక మఱేదేనొక యనుపయుక్తవస్తువు నది తాఁకెనేని దానిం గాల్పఁగలిగియుండియు వెలుఁగు నిడలేకపోవచ్చును. వెలుగు నిచ్చియుఁ గాల్పలేకపోవచ్చును. ఇచ్చట వెలుగు నిచ్చుటయను ధర్మము వికృతమయ్యెను. ప్రతిపదార్థమునం దొక్కొక్క మూలధర్మముండును. అది తన భిన్నభిన్నవృత్తులమూలమునఁ గార్యనిర్వాహక మొనరింపుచుండును. ఆమూలధర్మ మేదేనొక

క్రియాచరణమును దలపెట్టినపుడా క్రియాచరణమం దది వికృతిధర్మము నొందెనేని దదితర ధర్మము (వృత్తు) లు గూడ వికృతావస్థ నొందును. దీనినే ధర్మవికృతియందురు. విషయప్రాప్తి లేనపుడు ధర్మము సుప్తావస్థ నుండును. యోగ్యమగు విషయము సంప్రాప్తించినపుడు ధర్మము జాగ్రదవస్థ నొందును. అయోగ్యవిషయము సంప్రాప్తించినపుడు ధర్మమునకు వికృతావస్థ కలుగును. ధర్మము యథార్థ సంపన్నత్వము నొందుటకు మూఁడు విషయములు సుయోగ్యములై యుండుటావశ్యకము. ధర్మమే వస్తువు నాశ్రయించునో, అద్దాని నాశ్రయమని చెప్పుదురు. ధర్మము స్వయం వృత్తి రూపముగలది. దేనియందావృత్తి నియుక్తమగుచున్నదో, అద్దానిని విషయమని చెప్పుదురు. ఆశ్రయయోగ్యత, వృత్తియోగ్యత, విషయయోగ్యత యను నీ మూఁడు విధములగు యోగ్యతలును సమ్మేళనము కానిచోఁ గార్యము సంపూర్ణ రూపమున సిద్ధింపదు. ఈమూఁడు యోగ్యతలలో నేదే నొకటి న్యూనమగుటయో, లేకుండుటయో, సంకుచితమగుటయో, సంభవించెనేనిఁ గార్యము గూడ నంతవట్టు దోషయుక్తముగనే యుండును. విషయాశ్రయ వృత్తులు పరస్పర సంబంధము గలిగి పరస్పర విశుద్ధతచేఁ బరస్పరోన్నతికిఁ గారణములగుచున్నవి. వృత్తి విశుద్ధమైనచో నాశ్రయమునకుఁ బవిత్రతాలాభమును, నున్నతిలాభమును, గలుగుచున్నవి. ఆశ్రయము విశుద్ధమయ్యెనేని వృత్తిపారిశుద్ధ్యము సహజముగఁ గలుగును. విషయము విశుద్ధమైనచో వృత్తియొక్క శుద్ధతాక్రమమున నాశ్రయమునకుఁ దుష్టియు, బుష్టియుఁ గలుగుచున్నవి. కావున విషయాశ్రయధర్మము (వృత్తు) లొకదాని కొకటి యాధారభూతములుగ నుండును.

వస్తువు ద్వివిధము.

చిద్వస్తువనియు, జడవస్తువనియు, వస్తువు రెండు విధములు. ప్రపంచ మంతయు జడవస్తుమయమే. ఈ జడజగత్తునందు జీవుఁడు తప్ప వేఱే చిద్వస్తువు లేదు. చిజ్జగత్తునందు భగవంతుఁడు, జీవుఁడు, లీలాపీఠములు

ఉపకరణములు గూడఁ జిన్మయములే. ఈప్రపంచమందు జీవుఁ డొక తెగ వస్తువును, జడము వేఱొక తెగవస్తువును. జడబద్ధుఁడు కాఁగానే జీవుని కొక నూతనదశ కలుగుచున్నది. జడ మధ్యమందుఁ గూడ జీవుఁడొకవస్తువే.

వస్తుస్వరూపుఁడగు జీవుని ధర్మమేమి? ఏధర్మము జడ ప్రపంచమంతయు గాలించినను * లభ్యముకాదో, ఏది కేవలము జీవునియందే లక్షితమగుచున్నదో, అదియే జీవధర్మము. బాగుగ విచారించి చూచినచో నానందమే జీవధర్మముగ నిర్ణయింపఁబడుచున్నది. † జీవులందఱును జడ జగత్తు నొక్క-

జీవుని ధర్మము.

సారిగా విడిచిపోయిరేని జగత్తంతయు నిరానంద మయమగును. జలము, అగ్ని, వాయువు, ఆకాశము పృథివి యనునవి మఱి యానందజనకములు కానేఱవు. జీవుఁడే జగత్తున కానందదాయకుఁడు. జీవుఁడు చిద్వస్తువని యింతకుముందే చెప్పఁబడినది. ఆనంద ధర్మ

జీవుఁడు చిదానందుఁడు.

విశిష్టుఁడనికూడ నిపుడు తేలినది. జడసంబంధముచే జీవుని చిద్దేహమెట్లు లింగదేహముచేతను, స్థూలదేహముచేతను మఱఁగుపడెనో, అట్లే జీవుని యానందరూప ధర్మము కూడనట్టి లింగస్థితియు, స్థూలస్థితియు నొంది దుఃఖరూపముగఁ బరిణామము నొందుచున్నది. ఆదుఃఖ మెచట నొకింత నివారితమైనట్లు కనఁబడునో, అచ్చట క్షణకాలముండునట్టి స్వభావముగల యొకవిధమగు సుఖమనుభవింపఁబడుచున్నదని చెప్పనగును. సుఖదుఃఖములు రెండును

---

* తస్యైవ హేతోః ప్రయతేత కోవిదో న లభ్యతే యద్భ్రమతాముపర్యధః
తల్లభ్యతే దుఃఖవదన్యతస్సుఖం కాలేన సర్వత్ర గభీరరంహసా.

భా. 1.5.18.

† అహమాత్మాత్మనాం ధాతః ప్రేష్ఠస్సన్ప్రేయసామపి
అతో మయి రతిం కుర్యాద్ దేహాదిర్యత్కృతే ప్రియః

భా. 3.9.42.

వాస్తవముగ నానంద వికార విశేషములే. జీవుఁడు చిదానందుఁడు. వాని స్వరూపమును, వాని ధర్మమును వైకుంఠధామమందు నిత్య విశుద్ధరూపమున నొప్పుచుండును. జడ జగత్తునందా స్వరూపమును, ఆధర్మమును వికృత రూపము వహించియుండును. చిద్వస్తువు యుక్తిమూలముగను, ఇంద్రియ మూలముగను, ననుభవమునకు రాజాలదు. చిద్వస్తువును చిద్వస్తువే తెలిసి కొనఁగలుగును. 'చిత్తు' అనునది జ్ఞప్తిలక్షణ సామగ్రి విశేషము (Self-Conscious Entity). దానిచేత జీవుల చిద్దేహములు, వైకుంఠధామము, భగవన్నిలయము, భగవద్విగ్రహము నిర్మింపఁబడినవి. ఆ చిద్దేహమిచ్ఛాశక్తియుక్తమైనచోఁ జిత్పదార్థమందలి ధర్మరూపమగు నానందము పరిచాలితమగును. చిత్ప్రభావముయొక్క సంధిన్యంశమునుండి చిద్దేహమును, సంవిదంశమునుండి యిచ్ఛయు, హ్లాదిన్యంశమునుండి యానందమును ప్రాదుర్భవించి యేకత్రితమగుటచే జీవనిర్మాణము కలుగుచున్నది. జీవునిదేహము చిత్పరమాణుస్వరూపము; జీవుని యిచ్ఛ సంవిత్కణవిశేషము; జీవునియానందము హ్లాదినియొక్క యత్యంత క్షుద్రాంశము. ఇదే జీవునిస్వరూపము; ఇదే

**జీవుని స్వధర్మము.**

జీవుని ధర్మము. హ్లాదినిచేఁ గలిగెడు నుల్లాస రూపము జ్ఞప్తి లక్షణయుక్తుఁడగు జీవునియందుఁ ప్రకాశించునపుడు జీవుని రతిధర్మముదయించును.

ఆనందము, ప్రీతి, రతి యను నీపదములచే నేజైవధర్మము నిర్దిష్టమగుచున్నదో, అదియే జీవుని స్వధర్మము. * ముక్తావస్థయందాధర్మ మకుంఠితమును, విమలమును, నప్రతిహతమునునై తనరారును. జడబద్ధావస్థయందది వికృతమగును. కావున బద్ధజీవుని స్వధర్మము సంబంధగతమేకాని స్వరూపగత మెన్నఁడును గాదు. నీతి శూన్యజీవనమందును, నిరీశ్వర నైతికజీవన

* పూర్తేన తపసాయజ్ఞైర్దానైర్యోగైస్సమాధినా
రాద్ధం నిశ్రేయసంపుంసాం మత్ప్రీతిస్తత్త్వవిస్మతమ్.
భా. 3.9.41.

మందును, గల్పిత సేశ్వర నైతిక జీవనమందును, నాధర్మము విషయరాగ రూపమున వికృతిఁజెందును. ఆమూఁడు విధములగు జీవనములయందును గలుగు ధర్మ వికృతియందొకింత తారతమ్యము గూడఁ గలదు. ఆజీవనముల యం దది విపరీతవిషయ గతమగుటచే స్వధర్మ మత్యంత విపరీతాకారము నొందుచున్నది. ఉత్తమ బుద్ధిగలవారు దానిని స్వధర్మమని పిలువక వైధ ధర్మమని పిలుతురు. నీతిశూన్య జీవనమం దాహారము, నిద్ర, స్త్రీ సంగము మున్నగు పశుధర్మకార్యములందే జీవుఁ డనురక్తుఁడై యుండును. ఆయను రక్తిని నైతికులు విధర్మమని చెప్పుదురు. నైతికులకుఁగూడ నీ సమస్త విషయములందును రాగముండునుగాని తద్విషయభోగమం దొకింత నియమమును బాటింతురు. చెప్పవలసినదేమనిన, నీతిశూన్యులగువారల చరిత్ర మపకృష్ట పశుచరిత్రము; నీతియుక్త నిరీశ్వరవాదుల చరిత్ర ముత్కృష్ట పశుచరిత్రము. ఆరెండుతెగలవారి నడవడియందును జీవుని స్వధర్మ మత్యంత వికృతముగ నుండును. వాస్తవికేశ్వర విశ్వాసముగలిగి యెవరు నైతికజీవనము సేయుదురో, వాగల విషయరాగ మీశ్వరచింత కధీనమగుటచే జీవుని స్వధర్మ మచట వికృతిత్యాగమున కున్ముఖమైయుండును. † వైధభక్త జీవనమందు స్వధర్మము చాలినంత ప్రకాశముగలిగియుండును.‡ భావభక్త జీవనమందది పూర్ణప్రకాశము నొందును. వర్ణాశ్రమ ధర్మమునందును, వైధభక్త జీవనమందును గల యధికారవిభాగముల ననుసరించి తదధికారగతమగు నిష్ఠ

---

† అస్తియజ్ఞపతిర్నామ కేషాంచి దర్హసత్తమాః
ఇహాముత్రచ దృశ్యంతే జ్యోత్స్నావత్యః క్వచిద్భువః.

భా. 4.21.26.

‡ తమేవయూయం భజతాత్మవృత్తిభి
ర్మనోవచఃకాయగుణైస్స్వకర్మభిః
అమాయినఃకామదుఘాంఘ్రిపంకజం,
యథాధికారావసితార్థసిద్ధయః.

భా. 4.21.32.

తోఁగూడిన పరేశభక్తియే స్వధర్మమనుచు బద్ధజీవులవిషయమై చెప్పఁబడినది. అర్జునుని యుద్ధమును, ఉద్ధవుని వైరాగ్యరూపమగు వర్ణిక కర్మత్యాగమును, నీవిధమగు స్వధర్మమున కుదాహరణములు. సంక్షేపముగఁ జెప్పవలయుననిన శుద్ధజీవులకుఁ బ్రీతియే స్వధర్మము. బద్ధజీవులకు భక్తియే ముఖ్య స్వధర్మము. సమస్తకర్మలును గౌణస్వధర్మములు. అవి భక్తికధీనములుగ నాచరింపఁబడినచో నధికారభేదమును బట్టి స్వధర్మములగును. భక్తికి విపరీతముగ నాచరింపఁబడినచో నవి వైధధర్మములై పరిత్యాజ్యములగుచున్నవి. జడబద్ధుఁడై యున్నంతకాలము జీవుని స్వధర్మము శుద్ధము కాఁజాలదు. * బద్ధజీవుఁడు ప్రీతిసంపన్నుఁడైనను బరిశుద్ధరూపమున స్వధర్మాలోచనము సేయుటకు సమర్థుఁడు కాఁడు. జడముక్తుఁడైనంతమాత్రముననే స్వధర్మ విచారము పరిశుద్ధమగుచున్నది. స్వధర్మానుశీలనముచే జీవుని చిత్స్వరూపమును, స్వధర్మరూపమగు ప్రీతియుఁ గ్రమముగ విశుద్ధతాలాభము నొందుచున్నవి.

## —పంచవిధ ఫలానుభవము.—

ఫలానుభవము జీవుని శుద్ధజ్ఞానమందు చతుర్థప్రకరణము. ఫలానుభవ మైదువిధములు. ఎట్లన,—

(1) వికర్మ ఫలానుభవము.
(2) అకర్మ ఫలానుభవము.
(3) కర్మ ఫలానుభవము.
(4) జ్ఞాన ఫలానుభవము.
(5) భక్తి ఫలానుభవము.

---

* ఇంద్రియైర్విషయాకృష్టై రాక్షిప్తంధ్యాయతాంమనః
చేతనాంహరతేబుద్ధేః స్తంబస్తోయమివహ్రదాత్
భ్రశ్యత్యనుస్మృతిశ్చిత్తం జ్ఞానభ్రంశఃస్మృతిక్షయే
తద్రోధం కవయఃప్రాహు రాత్మాపహ్నవమాత్మనః

**వికర్మ.**

నీతిశూన్యజీవనము సర్వదా వికర్మమయము. పాపకర్మనే వికర్మ యందురు. ఇంద్రియ సుఖసంపాదనమే యాజీవనముయొక్క యేకమాత్ర తాత్పర్యము. ఆ జీవనమందుఁ బరలోక విశ్వాసము పూజ్యము. పీడ, అకాల మృత్యువు, అకాల బలవీర్యాదిక్షయము, మనోయాతనము, కొన్నిశాస్త్రము లందుఁ జెప్పినట్లు నరకాది గమనము, అయశము, అందఱకు నవిశ్వసనీయుఁడగుట,—ఇవియే యా జీవనమునకు ఫలములు. వీనిమూలమున నరజీవనము తీఱనికష్టములకు విషయమగుచున్నది. ఏమాత్రము బుద్ధియున్నను నిట్టి భయంకరములగు ఫలముల నెవ్వరును వాంఛింపరు.

**అకర్మ.**

నిరీశ్వర నైతికజీవనము, కల్పితసేశ్వర నైతికజీవనము సర్వదా యకర్మ మయములు. కర్తవ్యకర్మ జేయకపోవుటయే అకర్మ యనఁబడును. మానవజీవనమందుఁ గలకర్తవ్యకర్మల న్నింటిలోఁ బరమేశ్వరుని యెడలఁ గృతజ్ఞతతో వానినుపాసంచుటయు, వాదికివందనాదు లర్పించుటయు, ముఖ్యకర్తవ్యములు. అట్టి యుపాసనాదులు లేనప్పుడు జీవన మితర విషయములయం దెంతనైతికముగ నున్నను నకర్మ మూలమున దూషితమగుచున్నది. నీతిమూలమున శరీరాదులు సురక్షితములుగ నున్నను మానవుని కెంతపర్యంత మీశ్వరవిశ్వాసముగలుగదో, అంతపర్యంత మతఁ డెవరికిని విశ్వాసపాత్రుఁడుకాఁడు. ఈశ్వరవిశ్వాస మేహృదయమందు లేకుండునో, ఆహృదయము సూర్యుఁడులేని జగత్తువలె భయాసక్తమై యుండును. కొన్ని కొన్ని సమయములం దాహృదయమునందు నిండి.

---

నాతఃపరతరో లోకే పుంసస్స్వార్థవ్యతిక్రమః
యదధ్యన్యస్య ప్రేయ స్త్వమాత్మనః స్వవ్యతిక్రమాత్
అర్థేంద్రియార్థాభిధ్యానం సర్వార్థాపహ్నవో నృణామ్
భ్రంశితో జ్ఞానవిజ్ఞానా ద్యేనావిశతిముఖ్యతామ్.

భా. 4.22.30 to 33.

యున్న యంధకారము నాధారముచేసికొని మహాపాతకము లనెడి పక్షులందు గూళ్లుకట్టుకొని నివసించును. నిరీశ్వరులగు వ్యక్తులు నీతినిఁ బాలింపుచున్నను నరకమునే పొందుదురని శాస్త్రములుగూడఁ జెప్పుచున్నవి. ఇందలి సత్య మనుభవముమీఁదనే తెలియఁగలదు. కల్పిత సేశ్వరనైతిక జీవనము ధూర్తతా మూలమున సర్వదాకృత్రిమమును, బాప మయమును నగుచున్నది.

**వర్ణాశ్రమాచారముగల పురుషులు.**

ఎవరు వాస్తవమగు నీశ్వరవిశ్వాసముగలిగి నీతిఁ దప్పకుండ జీవనము సేయుచున్నారో వారలే భారతదేశమందు వర్ణాశ్రమాచారముగల పురుషులని చెప్పఁబడుచున్నారు.* ఇతర దేశములందు నివసించు నిట్టి లక్షణములుగల పురుషులు వర్ణాశ్రమములను గ్రహింపకపోయినను అట్టివి గ్రహించినవారివలెనే జీవనము గడపుచుందురు. వ్యావహారిక దృష్టితోఁ జెప్పినపుడు విధియనునది యుచ్చశ్రేణికి సంబంధించిన మానవులనే దృష్టిపథమం దిడికొని సర్వదా లిపిబద్ధమగుచున్నది. వెనుక నితర మానవులుకూడ నావిధియొక్క తాత్పర్యము ననుసరించియే తమ తమకార్యముల నొనరింతురు. భారతవాసు లార్యశ్రేష్ఠులు. వర్ణాశ్రమ విధి వారలను గుఱుతునం దిడికొనియే నిర్మింపఁబడినది. ఆవిధియొక్క తాత్పర్యము ననుసరించి యితర జాతులుగూడఁ దమ తమ సంసారములను నిర్వహించుచున్నారు. ఎట్లయిననేమి వారలజీవనమం దీశ్వరోపాసనము గూడ నితరకర్తవ్య కర్మలతోఁ జేరియుండుటచే నది వికర్మమయముగాని, అకర్మమయముగాని కానేరదు; వారు చేయునవన్నియుఁ గర్మలే యగుచున్నవి. కర్మకే ప్రాధాన్యము చెప్పుచు దానినే సర్వోపరితత్త్వముగ నిర్ణయించుటచే వారలుచేయు కర్మను గర్మయనియే పిలువవలెనుగాని

* ఇతిమాం యస్స్వధర్మేణ భజన్నిత్య మనన్యభాక్
సర్వభూతేషు మద్భావో మద్భక్తిం విందతేఽచిరాత్.

భా. 11.18.44.

యితరనామము దానికిడుట తగదు. తాముచేయు సమస్తకర్మలకును ఫలము లొసంగుట కీశ్వరుఁ డొకఁడుగలఁడు. వారల కీశ్వరుఁ డొకకర్మాంగ విశేషమే. వారలుచేయు కర్మలచే నీశ్వరుఁడు సంతుష్టుఁడయ్యెనేని స్వర్గ వాసాదిఫలములు వారలకొసంగును. వారల యీశ్వరుఁడు కర్మస్వతంత్రుఁడుకాఁడు. కావున నీశ్వరానుగత్యము వారి యనేకకర్మలలో నొక కర్మగనే యేర్పడుచున్నది. దానికి స్వర్గప్రాప్తియేఫలము. ఇతరకర్మల పరిమాణానుసారముగ స్వర్గాదిభోగముల ననుభవించి జీవుఁడు మఱలఁ గర్మక్షేత్రమునకువచ్చి కర్మచేయును.* కర్మయు, దత్ఫలమును నీరీతిగఁ జక్రాకారముగఁ బ్రాప్తించుచుండును. వారి యభిప్రాయము ననుసరించి కర్మను విడువవలెనను వాసనగూడ నొకపాపకార్యమగుటచే నీకర్మచక్రమునుండి విడువడు మార్గమేలేదు. కొందఱ మతముప్రకారము కర్మక్షేత్రమందు జీవుఁ డొనరించు సకలకర్మలను విమర్శింపుట కొఱకా నొకదినము† నిర్ణయింపఁబడుచున్నది. మరణానంతరము జీవులందఱును దమ తమకర్మఫలములను బొందుటకొఱ కాదినమువఱకును వేచియుండవలసియుండును. సత్కర్మల నొనర్చినవారును, దమ తమగురువులను సర్వవిధముల ననుసరించువారును, చిరకాలము స్వర్గమునందు నివసింతురు. అట్లుకాక యెవరు తమయాచార్యుల యనుగ్రహమునకుఁ బాత్రులు కాకుందురో, లేక, యెవరు మంచికర్మలు సేయక నింద్యములగు కర్మలనొనర్చిరో, వారు చిరకాలము నరకమందు

---

* త్రైవిద్యామాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తేపుణ్యమాసాద్య సురేంద్రలోక,
మశ్నంతిదివ్యాన్ దివిదేవభోగాన్॥
తేతంభుక్త్వాస్వర్గలోకం విశాలం క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవంత్రయీ ధర్మమనుప్రపన్నా, గతాగతం కామ కామాలభంతే॥
గీ. 9-20 & 21.

† Day of Judgment—Millennium.

వసింతురు. క్రిశ్చ్యనులు, మసల్మానులునగు సేశ్వరనైతిక సంప్రదాయకు లిట్టి విశ్వాసమును గలిగియుందురు. ఇటువంటి విశ్వాసముగలవారి జీవనమెన్నఁటికి నుచ్చతరస్థితికి రాఁజాలదు. జీవునియొక్క యొకక్షుద్ర జీవితకాలమందతఁడేమేమి యొనర్చెనో దానికంతకును బునరున్నత్యవసతుల కవకాశమీకుండ నొక్కమారుగా ననంతఫల మీశ్వరుఁడొసంగునఁట! దుష్టకుటుంబమందు జన్మించుటచేఁగాని, దుష్టసహవాసము సేయుటచేఁగాని బాగోగులు తెలియని బాల్యమం దెవరుపాపబుద్ధిని గలిగి పాపకార్యముల నొనరింతురో వారికిఁ జిరస్థాయి యగు నరకగమనరూప ఫలమఁట! వారికి మఱి పుణ్య శిక్షణమున కవకాశమే లేదఁట! అటుగాక సద్వంశమందు జన్మించి బాల్యకాలమునందే సాధుసంగప్రాప్తి కలిగినవానికిఁ జిరస్థాయి యగు స్వర్గఫలమఁట! అంతటిపసితనమునం దతఁడేమియోగ్యతఁ గనఁబఱచినాఁడని యట్టిఫలమీయఁ బడుచున్నదో! పరమేశ్వరుని యాలోచన లీరీతిగనున్నచో దుర్బలుఁడగు జీవునిగతి యింకనేమిచెప్పవలెను? ఈమతస్థులకుఁగల యీశ్వర సంబంధమగు ననుభవము మిగులఁ గుంఠితము. వారలభిలషించు కర్మఫలము లత్యంతతుచ్ఛములును, యోగ్యతాశూన్యములును.

సంక్షేపముగఁ జెప్పవలయునని సేశ్వరనైతిక జీవనము కర్మమయము కాని యందకర్మ వికర్మలులేవు. ఈజీవనమునకు సంబంధించిన కర్మకు మూఁడు భాగములుకలవు. ఎట్లన,—

(1) నిత్యకర్మ—సంధ్యావందనాదికము.

(2) నైమిత్తికకర్మ—శ్రాద్ధాదికము.

(3) కామ్యకర్మ—పుత్రేష్టి యాగాదికము.

సేశ్వరనైతిక జీవనమందు (i) నీచప్రకృతి జనిత సేశ్వర నైతికజీవనమనియు, (ii) నుచ్చప్రకృతిజనిత సేశ్వరనైతిక జీవనమనియు రెండవాంతర విభాగములుగలవు. నీచప్రకృతి సేశ్వరనైతికులకు నిత్యనైమిత్తిక కర్మలయందుఁగంటెఁ గామ్యకర్మలయందు విశేషాసక్తియుండును. ఉచ్చప్రకృతి సేశ్వరనైతికులు కామ్యకర్మలు మాత్రమేయొనర్పరు. నిత్య నైమిత్తికకర్మలు

గూడఁ గొందఱు నిష్కామరూపముగను, గొందఱు బ్రహ్మార్పణపూర్వకముగను, గొందఱు భగవదర్పణపూర్వకముగను జేయుచుందురు.* వీరిలో నిష్కామకర్ములుమాత్రమే కేవల కర్మపరులు. బ్రహ్మార్పణ పరాయణులు సేయుకర్మ జ్ఞానసీమాపరిచయ ప్రాప్తినొందును. భగవదర్పణ పరాయణులకర్మ భక్తిసీమాపరిచయము నొందును. భక్తిసీమాపరిచితిగలకర్మ భక్తియే యగుటచే దానిని గౌణీభక్తియందురు.† వైధభక్తు లిట్టి కర్మ లాచరింపుచునే తమజీవయాత్ర గడపుదురు. ఇతరములగు సమస్తకర్మలఫలములు నమంగళజనకములే యగుచున్నవి. ఫలితార్థముగఁ దెలియఁదగిన దేమన, గర్మఫలములు నమ్మఁదగినవికావు. శరీర యాత్రకొఱకుఁ గర్మయవశ్యముగ నాచరణీయమే కాని బద్ధజీవుఁ డాకర్మఫలమును గ్రహించువిషయమం దత్యంతము మెలఁకువ గలిగియుండవలెను.

జ్ఞానఫలానుభవము విచారింపకపూర్వ మొకమాట చెప్పవలసియున్నది. శుద్ధజ్ఞానమునకు ఫలము ప్రేమయగుటచే నాజ్ఞానఫలవిచారమిచటఁ జేయఁబడదు. ఇంద్రియార్థజ్ఞానము, నైతికజ్ఞానము, ఈశ్వరజ్ఞానము, బ్రహ్మజ్ఞానమునను నీనాలుగువిధములగు జ్ఞానములచేఁగలుగు ఫలము మాత్ర మిచట విచారింపఁబడును. వీనిలో నింద్రియార్థజ్ఞాన నైతికజ్ఞానములకు సంబంధించిన విచార మింతకుఁబూర్వము చాలినంతఁ జేయఁబడుటచే నిచట నీశ్వరజ్ఞాన బ్రహ్మజ్ఞానముల ఫలముమాత్ర మొకింత వివేచింపఁబడును.

---

* బ్రహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వాకరోతియః
లిప్యతేనసపాపేన పద్మపత్రమివాంభసా.

గీ. 5-10.

† నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిష న్నిమిషన్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయన్. గీ. 5-8 & 9.

ఈశ్వరజ్ఞానముచేతనే కర్మయొక్క కర్తవ్యత నిరూపింపఁ బడుచున్నదని యింతకుముందే చెప్పఁబడినది. కర్మకు రెండువిధములగు ప్రకృతిగలదు.

కర్మయొక్క ద్వివిధ ప్రవృత్తి.

ఫలమునొసంగి, జీవుఁడు దానిని భోగించునట్లు చేసి, తన్మూలముననగు నాసక్తికారణముగ నతనిని తనకధీనుఁడగు నట్లొనర్చి, యతనిచే మఱలఁ గర్మసేయించు ప్రవృత్తియొకటి. ఈశ్వరతోషణ మొనర్చి జీవునికి శాంతిగలిగించు ప్రవృత్తి యింకొకటి. ప్రథమ ప్రవృత్తి యింతకుఁబూర్వమే విచారింపఁబడినది. ద్వితీయ ప్రవృత్తిక్రమమున నీశ్వర జ్ఞాన జనితమగుకర్మ జీవునికున్నతిలాభము క్రమముగఁగలిగింపఁ జూచును గాని యట్లొనర్పుటకుఁ దుదకు దానికి సమర్థత లేకపోవును. అష్టాంగయోగ శాస్త్రమందలి యీశ్వర ప్రణిధానముచేఁ జిత్తము వశభూతమగుచుండ నందుఁజెప్పఁబడిన యాయాకర్మలు, "మేము తుదకుఁ గైవల్యమొసంగి తీఱుదు" మనుచు ధైర్యజనక వాక్యములు చెప్పవచ్చును.* కాని యాకైవల్యముయొక్క యాకారముచూచినచో నదియంతయు మిథ్యయని స్పష్టముగ బోధపడును. పాతంజలయోగ శాస్త్రమం దీశ్వరుఁడు క్లేశము, కర్మము,విపాకము, ఆశ్రయము ననువానిచే నపరామృష్టుఁడగు పురుషవిశేషుఁడని మొట్టమొదటనే చెప్పఁబడినది. ఆయీశ్వరుఁడు కేవలుఁడు. జీవుఁడు కూడ యోగపరిచయముగలిగి కైవల్యలాభము నొందును. సరియే కాని యిట్లు కైవల్యలాభమునొందిన జీవుల కొకరితో నొకరి కెట్టిసంబంధము కలిగి యుండును? అంతేకాక నేను తెలిసికొనిన యీ యీశ్వరుఁడు నాకింక నేమి

---

* యమాదిభిర్యోగపథైః కామలోభహతో ముహుః
ముకుంద సేవయా యద్వత్ తథాత్మాద్ధా నశామ్యతి.
భా. 1.7.36.

విద్యాతపఃప్రాణ నిరోధమైత్రీ, తీర్థాభిషేకవ్రత దానజప్యైః
నాత్యంత శుద్ధింలభతేఽంతరాత్మా, యథాహృదిస్థే భగవత్యనంతే.
భా. 12.3.48.

యొసర్చును? వీనికుత్తరమా యోగశాస్త్రమందు లేదు. కనుక దీనిని బట్టి నేనేమి తెలిసికొనవలెను? ఈశ్వరుఁడు కల్పిత పురుష విశేషుఁడనియే కదా నేను తెలిసికొనవలసినది? సాధనకాలమందే వానివలని ప్రయోజనము కాని తరువాత వానిదర్శనము మనకు లభింపదు. ఇపుడు కైవల్యాలాభము నొందిన జీవులనేకులగుచుండ నదియెట్లు కేవలత్వమనఁబడును? పోనీ, ఈశ్వరుఁడొక యవస్థావిశేషమనియు, నాయవస్థయందు సమస్త జీవులును లయమగుదురనియుఁ జెప్పినచో నీశ్వర సాయుజ్యవాదము సిద్ధించుచున్నది. అయినఁ దప్పేమన్నచో నీ యీశ్వర సాయుజ్యమతమునకును, నద్వైతమతమునకును నామ మాత్రభేదము తప్ప రెండు నొక్కటియే యగుచున్నవి. ఒక్కటే మతము రెండు నామములతోఁ బ్రచారము కావలసిన యవసరమేమున్నది? యోగశాస్త్రమునందలి ఫల విభూతు లనిత్యములగుటచే నెట్లు గ్రాహ్యములగుచున్నవో, అట్లే తచ్ఛాస్త్ర చరమఫలమగు కైవల్యము గూడ

కైవల్యము.

భక్తి విరుద్ధవాదమనుచు నెఱిఁగి దానిని గ్రహింపకుండుటయే కర్తవ్యము. యోగ ప్రతిజ్ఞలు వినుటకు బాగుగ నుండునుగాని ఫలవిషయమై యవి యతి తుచ్ఛములు. ఈశ్వర జ్ఞానఫలములని చెప్పుచు ననేక శాస్త్రములు సాలోక్య సాక్షి సామీప్యములను ముక్తిత్రయమును వచించెను. కాని యవి మూఁడును వాస్తవికఫలములు గావు. ఏమన నీమూఁడిటి మూలమున భగవత్సేవయే తుదకుఁ జేయఁబడుచున్నది. ఈ ముక్తులన్నియును భగవత్సేవకు ద్వారములవంటివని కొన్ని శాస్త్రములయందు వ్రాయఁబడినది. ఈశ్వర జ్ఞానముచేఁ గృష్ణభక్తికెపుడు పుష్టిలాభము గలుగునో, అపు డా యీశ్వర జ్ఞానస్వరూపము శుద్ధజ్ఞానస్వరూపముగ శీఘ్రముగఁ బరిణామమునొందును. ఇట్లగుటచే నీశ్వరజ్ఞానము చరితార్థత నొందును.

ఈశ్వరజ్ఞానము

బ్రహ్మజ్ఞానము.

సుపథగామియైనచో బ్రహ్మజ్ఞానముగఁ బరిణమించునని యింతకుముందే చెప్పఁబడినది. బ్రహ్మజ్ఞానఫలమగు సాయుజ్యమను నిర్వాణ ముక్తి నితాంతహేయము. నిర్విశేషతత్త్వమనుచు నొక

బ్రహ్మ యేర్పాటు చేయఁబడియే యుండెను. నిర్విశేష బ్రహ్మయని చెప్పినపుడు సర్వప్రకారములగు నస్తిత్వమునకును విపరీతమగు తత్త్వ మెయ్యదియో అదియే యని తెలియవలెను. అస్తిత్వమునకు విపరీతమగు తత్త్వమునను సహజమగుపేరు నాస్తిత్వము. నిర్వాణశబ్దము గూడ నాస్తిత్వమునే చెప్పుచున్నది. బ్రహ్మసాయుజ్యమనుటచే నిర్వాణము, లేక, నాస్తిత్వము నిర్దిష్టమగుచున్నది.

నిర్వాణము.

జీవుఁడు బ్రహ్మసాయుజ్యలాభమును బొందెనని చెప్పుటచే నేమయ్యెను? జీవుఁడు సర్వనాశనమయ్యెను. ఇందువలన వచ్చిన లాభమేమి? ఇట్టి ఫలప్రాప్తికొఱకే ప్రయత్నమైనను జేయు టుచితమగునా? భగవంతునియెడల మహాపరాధమొనర్చిన కంసుఁడు, శిశుపాలుఁడు మున్నగువారు పొందిన ఫలము తాము బొందవలెననుచు శిష్టజను లెవరైన వాంఛింతురా? కావున జ్ఞానఫల మతి తుచ్ఛము. యుక్తియే జ్ఞానమని చెప్పువారు గూడ జ్ఞానఫల మతి నిరుపయోగమనియే యెఱుంగవలెను. జడజగత్తును విడిచి బయటికిఁ బోవుటకు యుక్తికి సమర్థత లేదని యింతకుముందే చెప్పియున్నాను. అట్లు పోవుటకొకవేళ ప్రయత్నించినచో నదిలక్షణావృత్తినే యవలంబించునుగావునఁ దన్మూలమునఁ బ్రకృత్యతీత తత్త్వవిచారము ఫలదాయకము కాఁజాలదు. యుక్తికార్యము సాగనప్పుడు నాస్తికత బయలుదేఱుట ప్రాయికముగఁ గనుచున్నాము. తన కధికారములేని విషయములందుఁ బ్రవేశించి యుక్తి చర్చాప్రభావము చూపుటచే సందేహవాదము, నాస్తికవాదము, జడవాదము, నిర్వాణవాదము మున్నగు సమస్తవాదములును బయలుదేఱినవి. కావున జ్ఞానఫలము జీవుని కన్నివిధములచేతను అమంగళప్రదమే యగుచున్నది.

జ్ఞానఫల మమంగళ జనకము.

భక్తిఫలానుభవమే కడపటి విషయము. భక్తి జీవుని స్వధర్మమని పూర్వమే చెప్పఁబడినది. స్వధర్మోన్నతియు, నాశ్రయోన్నతియు, విషయశుద్ధావస్థితియు, స్వధర్మమునను ఫలములు. స్వర్గము, ముక్తి, జడశరీరో

భక్తి.

న్నతి, మన ఉన్నతి, బద్ధాత్మ వికారోన్నతి, సమాజోన్నతి మున్నగువానికి సంబంధించునవెవ్వియు భక్తికి ముఖ్యఫలములుగావు. భక్తి యహైతుకియు, జీవుని స్వాభావిక ప్రవృత్తియు.* భక్తియున్నతిలాభము నొందెనేని ప్రేమ రూపము వహించును. ఇదే భక్తికార్యము. జడబద్ధుఁడగు జీవునికిఁ దదవస్థ నతిశీఘ్రముగఁ దొలఁగించి స్వస్వరూప మొందఁజేసి భగవత్సేవయందతనిని సుయోగ్యముగ నియమించును. ఇదియే దానికార్యము. సంక్షేపముగఁ జెప్ప వలయుననిన భక్తికి భక్తియే ఫలముగాని వేఱొండు ఫలములేదు. భుక్తి ముక్తులయెడల నాసక్తికలచోట భక్తి పూర్తిగ మఱుఁగుపడును. కర్మ జ్ఞానములు భక్తి నాశ్రయించి తా మిడఁగల ఫలముల నొసంగును. కాని భక్తి స్వతంత్ర యగుటచే సమస్తఫలములను దాను స్వయముగ నీఁగలిగియు తన్ను స్వధర్మోన్నతికంటె వేఱగు నెట్టిఫలము నది యనుగ్రహింపదు.

విరోధానుభవము శుద్ధజ్ఞానమండలి పంచమమును, గడపటిదియు నగు ప్రకరణము. విరోధానుభవము నాలుఁగువిధములు. ఎట్లన,—

—చతుర్విధ విరోధానుభవము.—

(1) పరేశ స్వరూప విరోధానుభవము.

(2) స్వస్వరూప విరోధానుభవము.

---

* దేవానాం గుణలింగానా మానుశ్రవికకర్మణాం।
సత్త్వఏవైకమనసోవృత్తిః స్వాభావికీ తు యా॥
అనిమిత్తాభాగవతీభక్తి స్సిద్ధేర్గరీయసి।

భా. 3.25.32.

మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే।
మనోగతి రవిచ్ఛిన్నా యథాగంగాంభసోంబుధౌ।
లక్షణంభక్తియోగస్య నిర్గుణస్యహ్యుదాహృతం।
అహైతుక్యవ్యవహితా యాభక్తిః పురుషోత్తమే॥

భా. 3.29.11 & 12.

(3) స్వధర్మ స్వరూప విరోధానుభవము.

(4) ఫలస్వరూప విరోధానుభవము.

పరమేశ్వరుని రూపగుణలీల లేకత్రితమైనప్పుడే వాని స్వరూపమేర్పడుచున్నది. అతఁడు నిరాకారుఁడని చెప్పినచో వాని సచ్చిదానంద రూపమునకు విపరీత బాధ కలుగుచున్నది. జడరూప మతనికి లేదని చెప్పినంతమాత్రమున నతఁడు నిరాకారుఁడు కాఁజాలఁడు. వానిగుణము లచింత్యములు. అతఁడు కేవల సర్వవ్యాపి యని చెప్పినపుడు క్షుద్ర గుణ విశిష్టునిగ నే మనము భావించుచున్నాము. మధ్యమాకారుఁడయ్యును యుగపద్ధర్మమున నతఁడు సర్వత్ర పూర్ణరూపమున నిండియుండును. ఇది యతని యలౌకికమును, అచింత్యమును నగు సామర్థ్యము.* అతఁడు నిర్విశేషుఁడని చెప్పినపు డొక్క నిర్విశేషగుణమే యతని యం దారోపించి యతనికి క్షుద్రత కలిగించుచున్నాము. అతఁడు సవిశేషుఁడుగను, నిర్విశేషుఁడుగను, నేక కాలమున నే యొప్పుచున్నాఁడని చెప్పినపు డతని యలౌకికాచింత్యగుణ పరిచయము లభించుచున్నది. ఈశ్వరుఁడు సమస్త జీవులను మాతృగర్భమందు

---

* అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః।
పరంభావమజానంతో మమావ్యయమనుత్తమమ్॥
నాహంప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః।
మూఢోయం నాభిజానాతి లోకోమామజమవ్యయమ్॥
గీ. 7-24 & 25.

యేషాంత్వంతగతంపాపం జనానాం పుణ్యకర్మణాం।
తేద్వంద్వమోహనిర్ముక్తా భజంతేమాం దృఢవ్రతాః॥
గీ. 7-28.

నచాంతర్నబహిర్యస్యన పూర్వంనాపిచాపరం।
పూర్వాపరం బహిశ్చాంత ర్జగతోయో జగచ్చయః॥
భా. 10-9-13.

సృష్టించి, తనచే నిర్మింపఁబడిన సుఖాలయమగు జగత్తునందలి సర్వప్రకారములగు సుఖములకు నున్నతిలాభము కలిగించుటకు వారలను నియమించె ననియు, నీశ్వరునకుఁ బ్రియమగు నాకార్యమును లెస్సగ నొనర్చువారికి సుఖప్రదాన మొసంగుచుండు ననియు, నిట్టియూహలుఁగలిగియే యీశ్వరుఁడు జీవజగత్తును సృష్టించెననియు, జెప్పితిమేని నీశ్వరుని యచింత్యలీల కివి విరోధవాక్యము లగుచున్నవి. సిద్ధసంకల్పుఁడును, సర్వశక్తిమంతుఁడును నగు పురుషుఁ డిచ్ఛగించినచో నీ జగత్తింతకంటె వేయిమడుంగు లున్నతి లాభము నొంది యెట్టికొఱఁతలును లేనిది కాఁగలదని నపు డీశ్వరుని యిచ్ఛామాత్రమే యీ జగత్తునకుఁ దద్రూప సుఖసంపన్నత నొడఁగూర్పఁ గలిగియుండునుగదా? ఈశ్వరుఁడు తాను జేయఁగలిగినదంతయుఁ జేసి మిగిలిన కార్యము జీవులకు విడిచిపెట్టెనని యెవ్వరైన భావించినచో నట్టివార లీశ్వరుని పని నేర్పులేని యగసాలెవానిగను, కమ్మరివానిగను, వడ్లవానిగను, బరిగణింపుచు వానికి క్షుద్రత గలిగించుచున్నారు.

పరేశ స్వరూప విరోధకార్యము.

ఇట్టి యశుద్ధములును, నకించిత్కరములును నగు సిద్ధాంతముల మూలమున ననేకములగు ననార్యజుష్టమతములు జగత్తునందుఁ బ్రచారము నొందుచున్నవి. స్వరూపవిచారము ననుసరించి భగవంతుఁ డేకతత్త్వమే యైనను దన్ను దర్శించు జీవుల యధికారము ననుసరించి యుదయభేదముల నొందుచుండును. ఆభేదములయందలి దృష్టిచే భగవంతుని యేకతత్త్వమును గ్రహింపకుండుటయే పరేశ స్వరూప విరోధకార్యము. *

భగవంతుఁడు ఛాయాసహితుఁడు కాకున్నను భక్తియోగముతో నను శ్రీమూర్తియందుఁ బ్రతిఫలించుచున్నాఁడు. ఇది భగవంతుని యచింత్యశక్తి

* నతేఽభవస్యేశ భవస్యకారణం వినావినోదం బత తర్కయామహే।
భవోనిరోధః స్థితిరప్యవిద్యయాకృతా యతస్త్వయ్యభవాశ్రయాత్మని॥
భా. 10-2-41.

కార్యము. భక్తజీవనమం దట్టి ప్రతిభాత శ్రీమూర్తి సేవన మొనరించుట మిక్కిలి యుచితమగు కార్యము. అట్టి శ్రీమూర్తి సేవలను ద్రోచి బ్రహ్మ నిరాకారుఁడనియు, నతనికి స్వరూపవిగ్రహము లేదనియుఁ జెప్పుచు నా నిరాకారతత్త్వమును బొందుట కొక మిథ్యాకృతిని నిర్మించి దాని నుపాసించువారు కేవల పౌత్తలికులు (విగ్రహారాధకులు). వారి యుపాసనాఫలము నట్టిదే యగుచున్నది. ఇట్టి యుపాసకులలోఁ గొందఱు పండితాభిమానులట్టి పౌత్తలికతను బరిత్యజించి ప్రణవము ధనువనియు, నాత్మ శరీరమనియు, బ్రహ్మ దానికి లక్ష్యమనియుఁ జెప్పుచు నధ్యాత్మ యోగసాధనమందుఁ బ్రవృత్తులగుచున్నారు. పౌత్తలికులు కనులు విప్పిచూచునపుడు వారలకుఁ గనఁబడునది మట్టితోఁగాని, కొయ్యతోఁగాని చేయఁబడిన ప్రతిమూర్తియనియు, వారలు కనులు మూసినపుడా ప్రతిమూర్తికిఁ బ్రతిమూర్తి నే తమహృదయములలోపలఁ గనుచు, దమ ప్రేమసంతయు దానియందే నిలుపుదురనియు, నందువలన వాస్తవముగ నెట్టి లాభమును గలుగదనియు, నా పండితులు యుక్తిగఁ జెప్పుదురు. వారు చెప్పున దొకవిధముగ వాస్తవమే. కాని వారు కూడ నటువంటి కార్యమునందే ప్రవృత్తులగుచున్నారు. పరమేశ్వరుని యాకారము నెఱుఁగనివారు పరమేశ్వరుని రూపమనుచు నొక యాకృతిని నిర్మించిరేని వారలవశ్యముగఁ బౌత్తలికులే. ఇందుల కుదాహరణము:—నేను సనాతనర్షి నెన్నఁడును జూడకున్నను వానిమూర్తి నొక దానినిఁ గల్పించినచో నది యెన్నఁడును సరిగా నుండదు. అట్టి మూర్తి యందుఁ బ్రేమను నిలిపినచో నది సనాతనునిఁ జేఱునా యనునది పెద్ద సందేహమే. కాని సనాతనుని నెఱిఁగినవాఁడు వాని ప్రతిచ్ఛాయ (Photograph) నొకదానిని సంపాదించి దానినిఁ దన కనులతోఁజూచిన పైని కనులుమూసికొనినచో వాస్తవ సనాతనుఁడే హృదయమందు వానికిఁ గోచరించును. ప్రతిచ్ఛాయ సత్యభావమునే కలిగించును గాని పౌత్తలికత యనిపించుకొనదు. మీఁదు మిక్కిలి యీ ప్రతిచ్ఛాయను యథార్థస్మారక చిహ్నముగ వైజ్ఞానికులు గూడ నంగీకరించిరి. "ప్రణవము ధనుస్సు"

మున్నగు ప్రక్రియలుగల యధ్యాత్మయోగము సాధకులయొక్క కేవల ప్రాథమిక వ్యాపారముమాత్రమే.* ఆమాత్రముచేత సాధకుని హృదయము చరితార్థత నొందదు. భగవత్స్వరూప దర్శనమగుసంతవఱకు నిట్టి కొన్ని ప్రాథమిక క్రియ లా యా యధికారుల కవశ్యకర్తవ్యములే. కాని భగవత్స్వరూప దర్శన ప్రాప్తిగలవార లనుక్షణమును దమ హృదయములందు భగవద్ధ్యానము సేయుచునే యుందురు. మఱియు నీప్రాకృత ప్రపంచమునందు భగవదనుశీలనము వ్యాప్తిఁ జెందుటకై తదనురూపమగు శ్రీవిగ్రహమును గూడఁ బ్రకాశింపఁజేయుదురు. ఆ శ్రీ విగ్రహము తన్ను దర్శించువారలను నుద్దీపకత్త్వమగుచున్నది. యాథార్థ్యసాధకమగుచు నది వారలకు పరమార్థలాభము కలిగించును. స్వరూపదర్శనమం దధికారము గలవారలకు మిథ్యాకల్పితమూర్తు లనర్థములు కలిగించునట్లే స్వరూపాభావ రూపాసక్తులగు బ్రహ్మోపాసకులకుఁగూడ నట్టి యనర్థములే వాటిల్లును. ఇట్టి క్షుద్రప్రక్రియ లన్నియు వస్తులాభప్రాప్తికిఁ బూర్వమునసే యాచరితము లగుచున్నవి. సామాన్యభాషయం దివియన్నియు వస్తువుకొఱకుఁ జీఁకటిలోఁ దడవులాడుటలు వంటివి. ఇవన్నియు భగవత్స్వరూపమునకు విరోధములగుటచే సర్వవిధములచేతను బరిత్యాజ్యము లగుచున్నవి.

---

* త్వం భక్తియోగ పరిభావిత హృత్సరోజ
ఆస్సే శ్రుతేక్షితపథో ననునాథ పుంసామ్ ।
యద్యద్ధియాత ఉరుగాయ విభావయంతి
తత్తద్వపుః ప్రణయసే సదనుగ్రహాయ॥

భా. 3.9.11.

విదితోఽసి భవాన్ సాక్షాత్పురుషః ప్రకృతేఃపరః।
కేవలానుభవానంద స్వరూపః సర్వబుద్ధిదృక్॥

భా. 10.3.13.

శ్రీవిగ్రహసేవకును, పౌత్తళికతను, గల భేదము.

తత్వాంశులగు మానవులు పరమేశ్వరుని స్వరూప జ్ఞానమును బొందలేక భక్తులొనరించు శ్రీ విగ్రహారాధనము పౌత్తళికత యని చెప్పుచు నిందా వాక్యములు పలుకుచుందురు. ముసల్మానుల యసంపూర్ణమతమును, క్రిశ్చ్యనుల సంకుచిత మతమును, వీని రెండిటి ననుగమించెడి బ్రహ్మమతమును భారతవాసుల యొక్క పవిత్రమగు మతసంప్రదాయమును దూషిత మొనరించుటచే నవీన సంప్రదాయము వారికి శ్రీవిగ్రహసేవయందశ్రద్ధ యుదయించెను. ముఖ్యముగ శోచనీయమగు విషయమేమనఁగా శ్రీవిగ్రహములను నిందించుటకుఁ బూర్వమెవరును విగ్రహసేవా తత్త్వమునుగూర్చి విచారమే చేయరు. శ్రీమన్మహాప్రభుని శిక్షయందు స్పష్టముగఁ జెప్పఁబడిన విషయమును మనమాలోచించితిమేని శ్రీవిగ్రహసేవ నంగీకరింపని సంప్రదాయము మిక్కిలి పనికిమాలిన సంప్రదాయమగుచున్నది. భక్తిమార్గమందు శ్రీవిగ్రహవ్యవస్థకంటె శ్రేష్ఠమగు ధర్మాను శీలనోపాయములేదు. కావున విమర్శ (నింద) కులు విచారణచేయునీతిగ దీని నొకించుక విచారణసేయు టావశ్యకము. శ్రీవిగ్రహసేవకును, బౌత్తళికతను మహాత్తరమగు భేదముగలదు. పరమేశ్వరుని సత్యస్వరూపము నవలంబించియే శ్రీవిగ్రహము సేవింపఁబడుచున్నది. జీవుని చిద్దేహమందుఁగల నేత్రముతోఁ బరమేశ్వరుని స్వరూపము చూడఁబడుచున్నది. వ్యాసుఁడు, నారదుఁడు మున్నగు విద్వజ్జనులును, సాధారణముగ నిరుపాధిక భక్తజనులందఱును బరానందసమాధి సమయమందు సచ్చిదానంద స్వరూపుఁడగు భగవంతుని నిత్యరూపమును దర్శింపుచుందురు. మనస్సుచే నారూపము ననుదినమును ధ్యానింపుచుందురు. ప్రాకృతప్రపంచమందా నిత్యరూపమునకుఁ బ్రతిచ్ఛాయాస్వరూపమున నున్న శ్రీవిగ్రహమును గన్నులపండువుగ దర్శింపుచుందురు. ఇట్టి శ్రీవిగ్రహము కల్పితమును, జీవనిర్మితమును నగు వస్తువెన్నఁ

డును గాదు. భక్తిహీనునకు భగవత్స్వరూపప్రాప్తి గలుగదుగాని భక్తుని చెంగట నానిత్య చిన్మయమూర్తి యర్చావతారుఁడై వెలుఁగొందుచుండును. శ్రీవిగ్రహము భగవత్స్వరూపముయొక్క సాక్షాన్నిదర్శనమే యగునుగాని స్వరూపేతరవస్తువు కాఁజాలదు. పరోక్షములగు తత్త్వములయొక్క స్థూల ప్రతిమూర్తులన్నియును శిల్పవిజ్ఞానమం దెట్లు లక్షితములగుచున్నవో, అట్లే శ్రీవిగ్రహములుకూడ జడనేత్రములతోఁ జూడఁబడనట్టి భగవత్స్వరూపము నకుఁ బ్రతిమూర్తు లగుచున్నవి. భక్తజనుల నిమిత్తమేర్పడిన భగవత్స్వరూప ప్రతిమూర్తుల వాస్తవత్వమును వానచేఁగలుగు విశుద్ధభక్తివృద్ధిరూపమగు ఫలముచేతనే భక్తులనుత్క్షణమును బరీక్షించుచుందురు. విద్యుత్పదార్థమునకు విద్యుత్యంత్రములతోఁగల సహజసంబంధము విద్యుత్ఫల కోత్పత్తిరూపమగు ఫలముచేతనే తెలియఁబడుచున్నది. కాని యీవిషయమం దనుభవము లేని వారు విద్యుత్యంత్రమును జూచుటచే నేమి గ్రహింపఁగలరు? అట్లే తమ హృదయములందు భక్తిలేనివారు శ్రీవిగ్రహము

శ్రీవిగ్రహసేవకుఁడు లను బుత్తళిక లనక మఱి యేమందురు? భక్తి పౌత్తళికుఁడు కాఁడు. సిద్ధాంత ప్రకారము శ్రీవిగ్రహసేవకులు పౌత్తళి కులు కారు. పౌత్తళికులన నెవరో యిచటఁ గొంచెము విచారముసేయుదముగాక. భగవత్స్వరూపముతో సంబంధము లేని వస్తువు నుపాసించువారు పౌత్తళికులు. వార లయిదువిధములు. ఎట్లన,—

—పంచవిధ పౌత్తళికులు.—

(1) వస్తుజ్ఞానములేక జడమునే యీశ్వరునిగ భావించి పూజించువారు.*

---

* యస్యాత్మబుద్ధిః కుణపే త్రిధాతుకే, స్వధీః కళత్రాదిషు భౌమఇజ్యధీః
యత్తీర్థబుద్ధిః సలిలే న కర్హిచిజ్జనేష్వభిజ్ఞేషు సఏవగోఖరః.

భా. 10.84.13

(2) జడమందుఁ దుచ్ఛజ్ఞానముకలిగి జడవిపరీత భావమునే యీశ్వరుఁడనుచుఁ బూజించువారు. *

(3) ఈశ్వరుఁడు స్వరూపరహితుఁడనుచు స్థిరపఱచి స్వరూప వ్యతీత చింతకు విషయముగు దానినిఁ బొందుట కష్ట మగుటచే నుపాసనా సౌలభ్యముకొఱకు నీశ్వరునికి జడ రూపము గల్పించువారు. †

(4) చిత్తవృత్తి శుద్ధముగుటకుఁగాని, ఉన్నతి లాభమొందుటకుఁ గాని యీశ్వరు నొకనినిఁ గల్పించి యాకల్పిత మూర్తినిఁ బూజించువారు. ‡

(5) జీవునే యీశ్వరునిగఁ బూజించువారు.

---

* తస్యారవింద నయనస్య పదారవింద
కింజల్క_మిశ్ర తులసీ మకరంద వాయుః
అంతర్గతస్స్వవివరేణ చకార తేషాం
సంక్షోభ మక్షర జుషామపిచిత్తతన్వోః.

భా. 3_15_43.

† ప్రాదుశ్చకర్థ యదిదం పురుహూత రూపం
తేనేశ నిర్వృతి మవాపురలం దృశోనః
తస్మా ఇదం భగవతే నమ ఇద్విధేయ
యోఽనాత్మనాం దురుదయో భగవాన్ ప్రతీతః

భా. 3_15_50.

‡ కామైస్తైస్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా.
అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం
దేవాన్ దేవయజోయాంతి మద్భక్తా యాంతిమామపి.

గీ. 7_20 & 23.

అసభ్యులగు వన్యజాతులును, అగ్నినిఁ బూజించువారును, జోవ్ (Jove), శ్యాటర్న్ (Saturn) ప్రభృతి గ్రహములను బూజించుసట్టి గ్రీసుదేశపు మానవులును, ప్రథమశ్రేణికి సంబంధించిన పౌత్తళికులు. ఈశ్వర స్వరూపజ్ఞాన ముదయింపక పూర్వము గూడ నీశ్వర విశ్వాసము సహజముగ నుండుటవలనఁ గాంతిమంతములగు వస్తువుల నీశ్వరభావముతోఁ బూజించుటయే యీశ్రేణికి సంబంధించిన పౌత్తళికత. కానివారల యధికారమునుబట్టి యీవిధమగు పౌత్తళికత నిందనీయముగాదు.

*కాంతిమంతములగు వస్తువుల నీశ్వర భావముతోఁ బూజించుట పౌత్తళికత.*

*నిర్విశేష వాది పౌత్తళికుఁడు.*

జడజ్ఞానవిచారము తీవ్రముగ నొనర్చి సమస్త జడగుణములకును విపరీతమగు నిర్విశేష భావమే యీశ్వరుఁడనుచు యుక్తిచే స్థిరపఱచినపుడు రెండవశ్రేణికి సంబంధించిన పౌత్తళికత కలుగుచున్నది. నిరాకారవాదులే యీశ్రేణికి సంబంధించిన పౌత్తళికులు. నిర్విశేషభావమెపుడైన నీశ్వరస్వరూపముగాని, యీశ్వర స్వరూపమునకు సంబంధించిన భావముకాని కాఁజాలదు. ఈశ్వరునికిఁగల యనంత విశేషములలో నిర్విశేషతనుగూడ నొకవిశేషముగఁ జెప్పినపు డది స్వరూప సంబంధమగు భావమగుచున్నది. ఈశ్వర స్వరూపము జడవిలక్షణమైనదే కాని జడవిపరీతము కాఁజాలదు.

*పంచోపాసనము పౌత్తళికతయే.*

నిర్వాణముక్తిఁ గోరుచు విష్ణు, శివ, ప్రకృతి, గణేశ, సూర్యులను సగుణమూర్తుల పూజనమందులకు సాధనోపాయముగఁ గల్పించువార లీశ్వరుని నిత్యస్వరూపము నెఱింగినవారు కారు. వారలు కల్పితమూర్తులను సేవించుటచే మూఁడవశ్రేణికి సంబంధించిన పౌత్తళికులుగ నెన్నఁబడుచున్నారు. నేఁటికాలపు "పంచోపాసన"

మీ శ్రేణిలోని పౌత్తళికతయే. ఏదేనొకగుణము నాశ్రయించినపుడు దానికి విపరీతమగు గుణశూన్యావస్థ యెట్లు లభింపఁగలదో బోధపడదు.

కల్పితమూర్తి ధ్యానము పౌత్తళికతయే.

యోగులొనరించు కల్పిత విష్ణుమూర్తిధ్యానమే నాలుగవ శ్రేణికి సంబంధించిన పౌత్తళికత. అట్టిధ్యానముచే మఱి యేదైన లాభముండిన నుండవచ్చునేమో కాని భగవంతుని నిత్యస్వరూప సాక్షాత్కారమని యెడి పరమలాభముమాత్రము గలుగ నేరదు.

జీవుఁ డీశ్వరుఁ డనుట పౌత్తళికతయే.

జీవుఁ డీశ్వరుఁడని జెప్పి వానినిఁ బూజించువార లయిదవ శ్రేణికి సంబంధించిన పౌత్తళికులు. శ్రీమన్మహాప్రభుని శిక్షప్రకార మింతకంటె మహాపరాధము వేఱొకటి లేదు. పూజార్హులగు జీవులనందఱను భగవద్భక్తులుగ భావించి పూజించినచో జీవునియం దీశ్వరభావ మారోపించుట యను నపరాధము సంభవింప నేరదు. శ్రీరామ నృసింహాద్యవతార స్వరూపములను భజించుట పౌత్తళిక వ్యాపారము కాదను విషయము నాచే రచింపఁబడిన “శ్రీకృష్ణసంహిత” ను జదివిన వారికిఁ దెలియఁగలదు.

పైనిఁజెప్పిన యైదువిధములగు పౌత్తళికులును భగవత్స్వరూపమును నిందించుచుఁ దమలోఁ దమ్మునుగూడ నొకరి నొకరు నిందించుకొను చున్నారు. ప్రథమశ్రేణీ పౌత్తళికులు జడాకాశముయొక్క సర్వవ్యాప్తిత్వగుణ మీశ్వరుని ప్రధానగుణమునిచెప్పి భగవత్స్వరూపమును నిందించుచుఁ గల్పితములును, బరిమితములును నగు సకలదేవతా స్వరూపములనుగూడ నిందించు చున్నారు. దీనికి ఫలితముగ సమానాధికారుల సాపత్న్యభావమును, దన్మూలమునఁ గలహములును ననివార్యము లగుచున్నవి. పౌత్తళికులు పౌత్తళికులనే నిందించుచున్నారు. భగవత్స్వరూపమును దామెఱిఁగి యుండుటచే నపౌత్తళికులగు భగవద్భక్తులకుమాత్ర మెట్టి పౌత్తళికులయందును ద్వేషము గలుగదు. స్వరూపజ్ఞానము కలుగునంతవఱకును గల్పనకాక మఱియేమి

నేయనగుననియు, గల్పన చేయఁగా జేయఁగా సాధుసంగ్రమమునఁ గల్పనా హేయమను జ్ఞానముకలిగి స్వరూపజ్ఞాన ముదయించుననియు, మాత్రమే వారు భావింతురు. అప్పుడు మఱి వివాద ముండదు.

జీవుని స్వరూప విచారమునకు సంబంధించిన విరోధజ్ఞానము లెన్నెన్నికలవో వాని నన్నిఁటిని విమర్శించి నిరాకరించుట యుక్తము. ఒకమతమువారు చిదానంద స్వరూపుఁడగు జీవుని జడమధ్యమందుఁజేర్చి, యనేక జడభావనలు వానికారోపింతురు. జడదేహగతుఁడగు జీవుఁడు తన యుపాధికారణముచే శుద్ధజీవునికంటె వేఱగువస్తువుగాఁ దన్నుఁదాను భావించుచుండును. మాతృగర్భమందు జీవుని యుత్పత్తియు, నాజీవనమందు ధర్మవిచారము చేయుటచేఁ బరమేశ్వరుఁడు సంతుష్టుఁడై వాని కొక పాపరహితమగు స్వరూపమొసంగుటయు, ననునది యొకవిధమగు జీవస్వరూపవిరోధ జ్ఞానము. క్రిశ్చ్యనులు, ముసల్మానులు, బ్రహ్మవాదులు మున్నగు నల్పమతములవారు దీనినే యుపదేశింతురు.

జీవస్వరూప విరోధ మత సమూహము.

అవిద్యయందుఁ జేఱుటచే బ్రహ్మమే జీవుఁడగుచున్నాఁడు. "నేను బ్రహ్మ" (అహం బ్రహ్మాస్మి) ననుచు ననుసంధానము చేయఁగా జేయఁగా నవిద్యతొలఁగి పోవుటచే జీవునికి జీవత్వము నశించి బ్రహ్మత్వము గలుగును. ఇది ప్యాంథీస్టు, థియాసఫిస్టు, మనదేశమందలి యభేదబ్రహ్మవాది, యనువారల మతము. ఇది స్పష్టముగ జీవస్వరూప విరోధజ్ఞానమే. ఘటనావశతచే జీవుఁడు జడమునుండి యుద్భవించి జడగతమగు తన పార్థివోన్నతి సాధనము చేయఁగా జేయఁగాఁ బంచత్వలాభము నొందినంతనే యతఁడు నాశనమొందునని కొందఱు చెప్పుదురు. దేహాసత్త్వము నాశనమైనను జీవుని క్రియాశక్తి నశింపకుండుటచే నది వేఱొకజీవుని యున్నతిసాధనమున కగుచున్నదని మఱికొందఱు చెప్పుదురు. ఇది చార్వాకుల యొక్కయు, కామ్టె, మిల్, సోషలిస్ట్

(Compte, Mill and Socialist) ప్రభృతి నాస్తికుల యొక్కయు మతము. "జీవుఁడనేక జన్మలనెత్తి కర్మలు చేయుచుఁ గ్లేశముల నందుచున్నాఁడు. ప్రేమమైత్రీ వైరాగ్యములచే శిక్షింపఁబడి స్వభావశుద్ధి నొంది సంతట బుద్ధత్వలాభమును, నంతమందు నిర్వాణలాభమును బొందుచున్నాఁడు" అనునది శాక్యసింహుని యనుయాయులగు బౌద్ధులయొక్కయు, నిఱువదినలుగురు దేవతలను బూజించు జైనులయొక్కయు మతము. ఘటనావశతచే జీవుఁడీ సంసృతియందు జన్మించి మహావిపత్తుల నొందుచుండుటచే సంసార సుఖములం దొక్కదానినైన స్వీకరింపక యేదోవిధముగ జీవితమును గడపి మరణించినచో శాంతిగలుగునని శోపెన్‌హౌయెర్ (Schopenhauer) మున్నగు పెసిమిస్టు (Pessimist) ల మతము. "ప్రకృతి పురుషులయొక్క సంయోగముచే జీవత్వము కలిగెను. జీవత్వ విచ్ఛేదమే పరమ పురుషార్థము. కర్మ నిమిత్తమేకాని, వివేకము నిమిత్తమేకాని, ప్రకృతిపురుషుల భోగ్యభోక్తృత్వభావ మనాదియై యున్నది. అది ఛేదింపఁబడినచోఁ ద్రివిధ దుఃఖములయొక్క యాత్యంతిక నివృత్తి రూపమగు పురుషార్థము లభించుచున్నది." ఇట్లు చెప్పునది సాంఖ్యమతము; దీనిచే జీవస్వరూపమున కత్యంత విరోధము గలుగుచున్నది. "జీవుఁడు చేయు కర్మల మూలమునఁ గలిగెడి 'అపూర్వ' యే జీవుని కర్మఫలదాత. జీవునికి మోక్షములేదు. ఈశ్వరునికైశ్వర్యము లేదు." ఇది జైమిని కృతమగు పూర్వ మీమాంస దర్శనముయొక్క మతము. నైష్కర్మ్యరూపమును, అపరిజ్ఞాతావస్థారూపమును నగు జీవుని కైవల్యము మొదట క్రియా యోగముచేఁ బుష్టిలాభము నొంది వెనుక వైరాగ్యయోగముచే ఫలరూపముగఁ గలుగుచున్నది. పాతంజలమతమునకు సంబంధించిన యీ జీవస్వరూప విరోధమత మింతకు ముందే నిరూపింపఁబడినది. గౌతముని న్యాయశాస్త్రమందును, గాణాదుని వైశేషికశాస్త్రమందును బరమాణువుల నిత్యత్వముతోపాటు జీవేశ్వరుల నిత్యత్వము కూడ నంగీకరింపఁబడినది. కాని జీవుని చిత్తత్త్వమంగీకరింపఁబడ

లేదు. వారి సిద్ధాంతము ననుసరించి జీవుఁడును, మనస్సును గూడ నణు స్వరూపములే. జీవుఁడే లింగశరీరమని కూడ వారల మతము. కొందఱు నైయాయికులు ముక్తి నంగీకరింతురుగాని బ్రహ్మసాయుజ్య ముక్తివలె వారి ముక్తికూడ జీవుని సర్వనాశన విశేషమే. శంకరాచార్యులుగూడఁ దన వేదాంతభాష్యమందు జీవుఁడనిత్యుఁడనియే చెప్పెను. మూల వేదాంతశాస్త్ర మొక్కటే యథార్థ మంగళ మయశాస్త్రము. ఆశాస్త్రమునకుఁ గల భక్తి పోషక భాష్యమునందు జీవుని శుద్ధ స్వరూపము విచారింపఁబడియున్నది. నిజము చెప్పవలసి వచ్చినపుడు పూర్వోక్తములగు మతములన్నియును జీవ స్వరూప విరోధములగు మతములే. కావున నన్నియుఁ బరిహార్యములు.

భక్తియే జీవుని స్వధర్మము.

స్వధర్మస్వరూప విరోధానుభవమును దెలిసికొనుట మిక్కిలి యావశ్యకము. భగవచ్ఛ్రద్ధ, భగవదానుగత్యము, భగవన్నిష్ఠ, భగవద్రుచి, భగవదాసక్తి, భగవద్రతి, భగవదనురాగము, భగవత్ప్రీతి, భగవద్భావము మున్నగు శబ్దము లేభగవద్భక్తి నుద్దేశించి చెప్పఁబడినవో, ఆభక్తియే జీవుని స్వధర్మము. వికర్మబుద్ధి, కర్మబుద్ధి, అయుక్త వైరాగ్యబుద్ధి, అశుద్ధజ్ఞానము నను నివన్నియు జీవ స్వరూప విరోధభావములు. మఱియు నీవిషయము లింతకుఁ బూర్వమే విచారింపఁబడినవిగాన వానియందు దృష్టి నిలిపి స్వధర్మ విరోధానుభవము తెలిసికొనుట శ్రేయస్కరము.

ఫల స్వరూప విరోధానుభవముయొక్క పరిచయము గూడ నితాంత కర్తవ్యము. భక్తి దేనికి ఫలమో ఆవిషయ మింతకు ముందే చెప్పఁబడినది. భుక్తి (స్వర్గాదిభోగము), ముక్తి (సాలోక్య, సార్ష్టి, సామీప్య, సారూప్య, సాయుజ్యములను పంచవిధములగు జడమోచనము), యను నీరెండును గొన్ని మతములందు భక్తికి ఫలములుగఁ జెప్పఁబడుచున్నవి. భక్తికి ఫలమగు నీభుక్తిని భక్తియనుచు భక్తిశాస్త్రమందెచ్చటను జెప్పఁబడలేదు. భక్తిలక్షణ

మింతకుముందే వివరింపఁబడినది. భక్తునకు భోగేచ్ఛ యొక్కమాత్రమైనను గలుగనేరదు. భుక్తి కర్మఫలముగాని భక్తిఫలముగాదు. భక్తి సాధనచేఁ దప్ప మఱి యేవిధమగు సాధనచేతను ఫలప్రాప్తి సిద్ధింపదు కావున నిజాభీష్ట ఫలప్రదానముకొఱకు కర్మ భక్తినే యాశ్రయించును. భక్తి యాఫలము నాసంగి దానినిఁ గర్మ కొప్పగించి తాను దొలఁగిపోవును. భుక్తి కర్మఫలమనునదియే వైజ్ఞానిక తీర్మానము. అవిద్యయే జీవునికి బంధనము. శుద్ధజ్ఞానముదయించినచో నవిద్య దూరస్థమగుచు జీవునికి స్వస్వరూపలాభము కలుగుచున్నది. కావున ముక్తి జ్ఞానఫలముగాని, భక్తిఫలము కాదు. సాలోక్య, సార్ష్టి, సామీప్య, సారూప్యములు భగవత్సేవ కుపయోగించు నవస్థావిశేషములు. కాని యేకాంత భగవద్భక్తులు భగవత్సేవ తప్ప మఱెద్దియును వాంఛింపరు. సేవాలాభము కొఱకవాంతరావస్థా రూపములగు ముక్తులన్నియును శుద్ధజ్ఞానముచేతనే కలుగుచున్నవి. కావున నవి యెుకప్పుడును భక్తిఫలములు గావు. జీవుని జడమోచనారూపమగు నవస్థావిశేషమే ముక్తి. ఈ యవస్థకుఁ బూర్వమందును, బరమందును గూడ భక్తి యుండును.

ముక్తావస్థకుఁ బరమందుండెడి భక్తికి ఫలమేమి?

భక్తికి ఫలము భక్తియే—భుక్తిగాని, ముక్తిగాని కాదు.

భక్తియను ఫలమే యపుడు నిజమగు ఫలము. ముక్తి భక్తిఫలమని వైజ్ఞానికులు విశ్వసింపరు. భక్తియే భక్తికి ఫలము. భుక్తి ముక్తులయందు వాంఛగలవారికి శుద్ధభక్తియుదయింపదు. కావున భుక్తి ముక్తి స్పృహయే భక్తికి స్వరూప విరోధి.

బ్రహ్మజ్ఞానమీశ్వర జ్ఞానముయొక్క యుపశాఖయే.

ఇప్పుడు విచారింపఁబడిన యైదువిధములగు జ్ఞానములలో నింద్రియార్థజ్ఞానము, నైతికజ్ఞానము, ఈశ్వరజ్ఞానము గౌణము, లనఁగా, శరీరమునకును, మనస్సునకును, బద్ధజీవునకును, సమాజమునకును సంబంధించిన వగుటచే నవి జీవునివిషయమై యసంపూర్ణములును, అకించిత్కరములును, అగుచున్నవి. బ్రహ్మజ్ఞాన

మీశ్వరజ్ఞానమున కొక యుపశాఖమాత్రమే. అది సాధనవిషయమం దచ్చట చ్చట నొకింత యుపకారమగునున్నను మొత్తముమీఁద నది యనుపకారియే. ఇవన్నియు జ్ఞానములేయైనను హేయములే. శుద్ధజ్ఞానమొక్కటే యుపాదేయజ్ఞానము. అది భక్తికనన్యసహచరరూపమున నుండును. భావభక్తులకు భగవద్గుణాఖ్యానమునందు గలుగు నాసక్తికి శుద్ధజ్ఞానమొక్కటే విషయము. భగవల్లీలాజ్ఞానము కలుగనిచో భగవద్గుణజ్ఞానమును, దచ్ఛ్రవణకీర్తనాదులును సంభవింపనేరవు. భగవంతుఁడు మధ్యమాకారుఁడైయ్యును నపరిమేయుఁడే యనునట్టి గుణాఖ్యానోదాహరణస్వరూపమగు యశోదాకర్తృక భగవద్బంధనము మొదట సాధ్యపడలేదు. తదుపరి భగవంతుఁడు తానపరిమేయుఁడైనను భక్తివిషయమునఁ జిన్నవాఁడై యప్రడనాయాసముగ బంధింపఁబడెను. భగవల్లీలలకు సంబంధించిన యీకథలన్నియును గేవల శుద్ధజ్ఞానమువలనఁ బుట్టిన తత్త్వసమూహము లగుచున్నది. కావున భావభక్తి శుద్ధజ్ఞానముల యైక్యవివేచనము కొఱకు జ్ఞానములని పిలువఁబడుచున్న యశుద్ధజ్ఞానములఁ గూర్చి భక్తిశాస్త్రమునందు "జ్ఞాననింద" వినఁబడుచున్నది. శుద్ధజ్ఞానము [illegible] కాఁద యనరాదు. ముందుఁ జెప్పఁబడిన నాలుగువిధములగు [illegible] కాఁడ. అది భక్తునకు వర్జనీయమగుచున్నది.

**జ్ఞానము యొక్క మూఁడువిధములగు విభాగములు.**

ఇచ్చట మఱియొక న[illegible]గలదు. జ్ఞానమునందు జిజ్ఞాస, సం[illegible]స్వాదనము మూఁడు విభాగములు [illegible]వభక్తులవిషయమై జిజ్ఞాసయు, సం[illegible]పూర్వమందే సాధనభక్తజీవనమున [illegible]ద్భాగవతార్థాస్వాదనమూలమున సమాప్తములయినవి. భావభక్తజీవనమం దాస్వాదనాంశ మొక్కటియే నిర్వర్తింపఁ బడుచున్నది. ఈ యాస్వాదనాంశము ముక్తి లభించిన వెనుకను, వైకుంఠధామమందును జాజ్వల్యమానముగ

నుండును. జడబద్ధావస్థయందది యొకింత కుంఠితముగ నుండి ముక్తావస్థయందు వికుంఠత్వలాభము నొందును. ఏస్థానమందు భగవదాస్వాదనరూపమగు జ్ఞానాంశము విగతకుంఠితముగ నుండునో, ఆస్థానమును బండితులు వైకుంఠమందురు. శుద్ధజ్ఞానాస్వాదనము (పరేశానుభవము), విరక్తి (భక్తికనుపయోగములగు వస్తువులయెడల నుదాసీనత), భక్తి (భగవంతుని యెడల ననురాగము) యను నీమూఁడును భక్తహృదయమం దేకకాలమున నే నివసించుచుండును. ఇవన్నియు నొక్కటే వస్తువగుచున్నవి. భక్తి యెచట వస్తురూపమున గ్రహింపఁబడుచున్నదో, అచట శుద్ధజ్ఞానము (భగవదనుభవము) ను, విరక్తియు, గింకరరూపమున దాని సేవ యొనర్చును. * భావభక్తి విచారమందు శుద్ధజ్ఞానమును, యుక్తవైరాగ్యమును స్వతంత్ర విషయములు కావు. అవి భావముతోడనే ఫలస్వరూపమున నుదయించి భక్తిని సేవించును. అవి రెండును లేనిచోట భావము కూడ లేదనియే తెలిసికొనవలెను. అట్లయ్యును నచట భావలక్షణములు గోచరించెనే నది భావాభాసమగు కపటరతి మాత్రమే యగుచున్నది. అది చతుర్థధారయందు విచారింపఁబడును.

---

* ఆసేవయాయం ప్రకృతేర్ ... వైరాగ్యవిజృంభితేన।
యోగేన మయ్యర్పితయా చ ... ప్రత్యగాత్మాన మిహావరుంధే॥
భా. 3.25.27.



# పంచమవృష్టి—చతుర్థధార.

## రతివిచారము.

శ్లో. సతాం ప్రసంగాన్మమ వీర్య సంవిదో
భవంతి హృత్కర్ణ రసాయనాః కథాః
తజ్జోషణా దాశ్వపవర్గ వర్త్మని
శ్రద్ధారతిర్భక్తి రనుక్రమిష్యతి.

ప్రాస సందర్భమునఁ జాల సావకాశముగ నేను విచారణ సల్పి యుంటిని. ఇఁక భావభక్తివిషయమై చెప్పవలసిన దేమున్నదో యిపుడు చెప్పుచున్నాను. సాధనభక్తిచేఁ గలిగినదే కానీ, కృష్ణునియొక్కయు, కృష్ణభక్తులయొక్కయు ననుగ్రహముచేఁ గలిగినదే కానీ, భావభక్తి కృష్ణ భక్తసంగముచేతఁ దప [illegible] నొందఁజాలదు. కృష్ణభక్తునియెడల నపరాధ మొనర్చిన [illegible] గు రతిధనము క్షీణించి క్షీణించి తుదకు శూన్యమైపో [illegible] తిలోనైనఁ జేఁటిపోవును. ఇది మిగుల శోచనీయముగు [illegible] ప్రీతిలక్షణముగల భక్తులలోఁ జేఁటుటయు, భక్తాపరాధము [illegible] ను సర్వవిధములచేతను ప్రయత్నింపుటయు భక్తస [illegible] ణముగల పురుషులకును నితాంత కర్తవ్యము. అట్లొనర [illegible] సం దనర్థనివృత్తియు, భావదశయందుఁ దత్పుష్టియు [illegible] ంపఁబడుచున్నవి.

అమూల్యధనమని చెప్ప [illegible] డిన యీరతి కొన్నికొన్ని స్థలములయందు భగవద్భక్తులు కానివారియందుఁగూడ లక్షితమగుచున్న దేయను సందేహ మెవరికైనను గలుగవచ్చును. శుద్ధ రతియొక్క పరిచితికొఱకై నే నీవిషయ

మిచట విచారింపుదును. ఇతర సంప్రదాయములయందలి ద్వేషముచేఁగాని, యితరుల భజనప్రతీకములయందలి ద్వేషముచేఁగాని, నే నిచటఁ జెప్పునదో మియు నుండదు కాని భక్తుల జిజ్ఞాస ననుసరించి వారలను భక్తి దృఢపడుటకై యేరెండుమాటలు నే నిచటఁ జెప్పఁబూనితినో యవి యన్యసంప్రదాయములయొక్క భజన ప్రక్రియలకు విరుద్ధములైనచో వారలు నన్ను క్షమింతురు గాక. జీవునియొక్క భాగ్యవశతచే శుద్ధభక్తియందు వానికి రతి గలుగుచున్నది. గ్రంథ రచనమూలమున నితరులకు రతి శిక్షణ మొసంగుట యసంభవము. శుద్ధభక్తియందు శ్రద్ధగలిగినవారి నిమిత్తమే యీ గ్రంథమా రచింపఁబడినది. కనుక నేదే నొక కారణముచే నన్య సంప్రదాయములకుఁ జెందినవారిది చదువుట సంభవించినచో నే నందులకు నింద్యుఁడనుగాను. ఒకవేళ యదృష్టము బాగుగ నుండి యీ గ్రంథమునందలి యభిప్రాయములు తమ యభిప్రాయములతో నేకీభవించినచో సన్నివిధములచేతను మేలే యగును. అట్లేకీభవింపనిచో నీగ్రంథమింకొకరి కర్పింపవలెననియు, నాపై నేనూయఁ జూపకుండవలయుననియు వారలను సవినయముగ వేడుకొనుచున్నాను.

అభేద బ్రహ్మవాదుల మ[illegible] బ్రహ్మ నిర్గుణుఁడు. సగుణోపాయములతోఁ జేయు ను[illegible] బ్రహ్మోపాసనము కాదు. జీవుఁడు సగుణుఁడగుటచే వా[illegible] ప వేఱొండు గతిలేదు. అందువలన జీవుఁడు మొదట [illegible]కఁ గల్పింపఁబడిన యేవేవో మూర్తుల నుపాసించి క్రమ[illegible] నిర్గుణలక్షణుఁడగు బ్రహ్మయం దపుడు జ్ఞాన వై[illegible]మ చేయుచున్నాఁడు. వైరాగ్యము, వివేకము, శమము, ద[illegible] తితిక్ష, శ్రద్ధ, సమాధానము, ముముక్షుత్వము నను నీతొమ్మిది [illegible]సములచేఁ బురుషుఁడు బ్రహ్మవిచారము చేయఁగా జేయఁగాఁ గర్తవ్య జ్ఞానలాభము కలుగుచున్నదని యభేద బ్రహ్మవాద మతమునకుఁ బ్రధానాచార్యుఁడగు శ్రీ శంకరస్వామి

తన యపరోక్షానుభూతి గ్రంథమునందు రచించెను. వర్ణాశ్రమధర్మము, తపస్సు, హరితోషణము నను నీమూఁడును జక్కఁగ నిర్వర్తింపఁబడినచోఁ బూర్వోక్త సాధనసమూహము లభ్యమగుటయు, నుపయోగకరమగుటయు, సంభవించును. సగుణదేవతోపాసనమే హరితోషణమని చెప్పఁబడుచున్నది. అద్వైతవాదులకుఁ బ్రకృతి, సూర్యుఁడు, గణేశుఁడు, శివుఁడు, విష్ణువు నను నీ యైదుగురే సగుణదేవతలు. ఈ దేవత లేవురును సంబంధించిన యుపాసనాకాండ భిన్నభిన్న విధములుగ నుండుటచేఁ బంచోపాసనాపద్ధతికి సమ్మతమగు తంత్రమంతయు విరచింపఁబడినది. ఆ యందఱిదేవతల యుపాసనము సేయఁగా జేయఁగా జిత్తైకాగ్రతాఫలము లభించునని యందలి సిద్ధాంతమున కభిప్రాయము. ఆ ఫలసాధన క్రమమున నిర్విషయత్వము గలిగి నిర్విశేషాభినివేశ లక్షణమగు జ్ఞానముదయించును. ఈ జ్ఞానము గాఢతరమైనచో "నేను బ్రహ్మ" ననునట్టి జ్ఞానము గలుగును.

లెస్సఁగ వివేచింపఁబడిన యీ సిద్ధాంతము ప్రకార మద్వైతవా
దులు బ్రహ్మ నొక్కని … ందురు. బ్రహ్మేతరమంతయు నవస్తువే.
సాధనకాల ప్రారం … పాసింపఁబడిరో వారుగూడ నవస్తు
వులే. నిర్విశేషావస్థ … ము లేదు. కావున నా దేవతలు
కల్పిత దేవతలే. ఈ … కృష్ణాదిమూర్తులుగూడఁ గాల్ప
నికులే. ఆది ప్రకృతియు … ర్యుఁడును, గణేశుఁడును, శివుఁ
డును, విష్ణువును వారి … ల్పనికులే. అష్టాంగయోగులును,
బంచోపాసకులును, … ను, దుదకు బ్రహ్మాదులందఱుఁ
గూడ ముక్తిపక్షమువ … ు దేవతలు మిథ్యలనియు, గల్పితు
లనియు బాగుగ నెఱింగియే … సించుచున్నారు. ఉపాసనాకాలమందు
వారియందే రతిలక్షణము గోచరింపుచున్నదో దానినే రతియని చెప్పవలెనని వారి యభిప్రాయము. ఉత్సవకాలములందుఁ గంపము, స్వేదము, వైవర్ణ్యము, నశ్రుధారాపాతము, రోమహర్షణము మున్నను లక్షణములను

ప్రకటించుచు వారు నృత్యము సేయుదురు. అవి రతిలక్షణములగుట నిజమే కాని నే నేశ్రద్ధఁ గూర్చియు, నే నిరుపాధిక రతి గూర్చియు వ్రాసియుంటినో వానిలక్షణములు మాత్ర మవికావు.

రతి యెన్నివిధములు ? బాగుగ విచారించినపు డైదువిధములగు రతి జగత్తునందు లక్షితమగుచున్నది. ఎట్లన,—

—రతి పంచవిధములు.—

(1) శుద్ధారతి.
(2) ఛాయారతి.
(3) ప్రతి బింబిత రతి.
(4) జడరతి.
(5) కపటరతి.

శుద్ధారతి.

శుద్ధారతికి భక్తిశాస్త్రమున నాత్మరతి, భగవద్రతి, చిద్రతి, భావమా నను నామాంతరములు గలవు. జీవుఁడు పరిశుద్ధావస్థయం [illegible] తత్త్వముతో నియోజసం[illegible] రతి యనిపేరు. ఆ యవస్థయందు భగవదితర విష[illegible]ండదు. ఏక నిష్ఠయే రతి లక్షణము. ఆర్ద్రిత, మసృ[illegible]రుచి, ఆసక్తి యనునవి రతి తత్త్వముయొక్క యవస్థా[illegible]

ఛాయారతి.

శుద్ధారతియొక్క కించిదా[illegible]ారతి యని పేరు. శుద్ధార[illegible]రమగుటచే నిదియును క్షుద్రమే. [illegible]ప్పుడుదయించెనో అప్పుడే యిది క్షుద్రమును, గాతూహలమయమును, దుఃఖహారిణియు, నగుచున్నది. భక్తుల సాంగత్యముచేతఁగాని, వైధభక్తి సాధన కాలమందుఁగాని యీరతి కలుగుచున్నది. ఈ ఛాయారతి చంచలమైనది. దీనికి స్థాయి లేదు. భక్త సాంగత్యముచే నిది తత్త్వవేత్తలుగాని వారికిఁ

గూడఁ గలుగుచున్నది. శుద్ధారతికిఁ గాంతిరూపమగు నీ ఛాయారతి మహా భాగ్యవశమున జీవుల హృదయములయం దుదయించుచున్నది. దీని యుదయమే జీవుల భావి శ్రేయస్సునకు మూలము. ఈ ఛాయారతి యథార్థమగు భావముగాదు. కావున దీనిని భావాభాసమని యందురు. విశుద్ధభక్తుల యనుగ్రహము కలిగెనే నీభావాభాసము భావముగఁ బరిణమించుచున్నది. కాని భక్తాపరాధము సంభవించినచో నీ ఛాయారతి యంతరించిపోవును. భక్తసాన్నిధ్యముచే నభేద బ్రహ్మవాదులయొక్కయును, వారి కధీనులగు కల్పిత దేవదేవ్యుపాసకులయొక్కయును, హృదయములందు రతి ప్రతిబింబించుచున్నది.

ప్రతిబింబితరతి.

ఒకానొక భక్తుని సాత్త్వికవికారముల యొక్క మాధుర్యమును దిలకించి యా ముక్తిపక్షులందఱును గీర్తనాది కాలములయందును, ఉత్సవకాలములయందును, ననుకరించు సాత్త్విక వికారములను బ్రతిబింబిత రతి యందురు. కావున సగుణోపాసకుల రతిలక్షణ మిట్టిదే యగుచున్నది. దీనియర్థమేమనిన సగుణోపాసకులు తమ గురువుచే నుపదేశింపఁబడిన పద్ధతిప్రకారము ము [illegible] మహత్తరమగు కష్టమని యెంచి కల్పిత దేవతామూ [illegible] సహజ లక్షణములను బ్రకటింప వుచుఁ దమ హృద [illegible] ంచుటయే. వారల చరమోద్దేశమగు భుక్తికిఁగాని, ము [illegible] చిన యే సుఖలేశము గలదో, అదియే వారల రతి [illegible] మగుచున్నది. ఛాయారతియు బ్రతిబింబితరతియుఁ [illegible] త్రములే; వానిలో నెద్దియు శుద్ధారతికాదు. శుద్ధారతి [illegible]. అది నిత్య భగవత్స్వరూపమును విషయరూపమున నవలంబిం [illegible] నిఁ దనకాశ్రయరూపునిగ జేసికొనును. కల్పిత దేవదేవ్యుపాసకుల విచారమందుఁ దొలుత జీవునికి నిత్యత్వము లేదు; కావున రతికి నాశ్రయము లేదు. వారల చరమప్రయోజన మభేద జ్ఞానమగుటచే భగవంతునికి స్వరూపగత విశేషత్వము లేదు. కావున వారిమతమందు

శుద్ధారతికి విషయము గూడఁ గనఁబడదు. ఈ కారణముచే వారల రతి శుద్ధారతికిఁ బ్రతిబింబముగాని, జడరతికి రూపాంతరముగాని, యగుచున్నది; కొన్నిస్థలములయం దది కపటరతియుఁగూడ నగుచున్నది. రతి కాశ్రయుఁడగు జీవుఁ డనిత్యుఁడనియు, రతికి విషయమగు పరమేశ్వరుఁడు నిర్విశేషుఁడును, స్వరూప శూన్యుఁడుననియు, జెప్పుచు నెవరుపాసనము నేయుదురో, అట్టివారల రతి యనిత్యమును, ఔపాధికమును, గపటమును, జడగతమును, బ్రతిబింబ స్వరూపమును, నగుచున్నది. కాని భాగ్యవశమున, నసఁగా, గురుదేవుని తాత్పర్యము బోధపడుటచేఁగాని, తనకే యభిరుచి కలిగికాని, "నా యుపాస్యతత్త్వము నిత్యమైనది; నేను దానికి నిత్యదాసుఁడ" ననుచు నా పంచోపాసకుల మనమం దిట్టి నిశ్చయముదయించినచో నా వెంటనే శుద్ధారతియొక్క యంశ మొకటి యావిర్భవించును. విష్ణు, శివ, గణేశోపాసకుల రతి యిట్లు చైతన్యోద్దేశినియైనచోఁ గ్రమముగ నది శ్రీకృష్ణునియందే పర్యవసానమొందును. అప్పుడు సూర్యోపాసకులకు భర్గచింత తొలఁగి యా భర్గస్థుఁడగు శ్రీ నారాయణమూర్తియందలి రతి యావిర్భవించును. ప్రకృతి పూజకులకు శక్తి చింత తొలఁగి క్రమముగ ప భగవంతునియందు రతి గలుగును. అన్యదేవతోపాస ర్వకముగఁ దన్నే భజించుచున్నారనియు, దుదకు ు, శ్రీ కృష్ణభగవానుఁడు భగవద్గీతయందుఁ జెప్పె శ్రయములగు వానియం

* అనన్యాశ్చింతయంతో పాసతే ।
తేషాం నిత్యాభియుక్త వహామ్యహం॥
యేఽప్యన్యదేవతాభక్తా న్వితాః ।
తేఽపిమామేవకౌంతేయ! య విధిపూర్వకం॥
యాంతిదేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః ।
భూతాని యాంతి భూతేజ్యా యాంతిమద్యాజినోఽపిమాం॥
గీ. 9-22, 23 & 25.

డొకింత శుద్ధతా లోపమున్నచో రతి సంపూర్ణము కాఁజాలదు. క్రమ విచారము పలుపఁగా పలుపఁగా రతికిఁ బుష్టిలాభము గలిగి యనేక జన్మక్రమమున విషయాశ్రయముల కషాయత్వము నశించుచున్నది. అప్పుడు సకల జీవులకును విశుద్ధమగు కృష్ణభక్తి యుదయించుచున్నది. మధ్య మధ్య గలుగు సాధుసంగమే రతి పుష్టికిఁ గారణమగుచున్నది.

జడరతి.

లోకమునందు జడరతి కుదాహరణములు మాదక సేవకులయొక్కయు, వేశ్యాలంపటులయొక్కయు, నత్యంత గృహాసక్తి గలవారియొక్కయు, నుదర పరాయణులయొక్కయు, జీవితములందుఁ గుప్పతెప్పలుగ లభించుచున్నవి. 'లైలా' మరణించినచో 'మజను' జీవింపఁజాలఁడు. ఊర్వశి తన్ను విడిచి పోవుటచేఁ బురూరవునకుఁ బ్రాణవియోగమువఱకు వచ్చెను. 'జూలియట్' కొఱకు 'రోమియో' జీవితమును గోలుపోయెను. ఇట్టియుదాహరణములు పుస్తకములందుఁ జాలఁగలవు. ఇవన్నియు రతిలక్షణములేనా? ఈ రతికిఁ బేరేమి? చిన్మయుఁడగు జీవుఁడు జడబద్ధుడై జడాభిమానము సేయుచుఁ దన స్వధర్మమగు భగవ [illegible] సహితముగ వికృతిలాభము నొందుచుండ భగవద్రూపవ [illegible] జడవిషయజ్ఞానమందు స్వీయ లక్షణమిట్లు వ్యాపిం [illegible] దవాదపక్షులగు సగుణోపాసకులు సేయు దేవ దేవీపూ [illegible] కల్పనమాత్రమే. జడీయ కల్పనాగతవిషయమందు జడ [illegible] రణ నెట్లు సర్పునో, కల్పిత దేవదేవీసంబంధమున గూడ [illegible] గలివరు (Gulliver) ని యుపన్యాసము చదివినవార [illegible] వానికి దుఃఖము కలిగినపుడు తాము దుఃఖింపుచును, [illegible] కలిగినపుడు తాము గూడ సుఖానుభవమొందుచును దమ కల్పిత [illegible] మనోచరిత్రమున వానితో సహానుభూతిఁ జూపుచు నెట్లు రతి లక్షణములను బ్రకటించుచుందురో, అట్లే కల్పితదేవదేవీ లీలావర్ణనములనుస్మరించి తత్సేవకులు రతిలక్షణములను బ్రకటించుచుందురు. ఇందులో నాశ్చర్యమేమున్నది? రామాయణమును వినుచుండిన యొక వృద్ధ

వనిత రాముని వనవాసగమనమును విని మిక్కిలి వ్యాకులపడుచుండెను. అప్పుడు చేటిసవారిలోఁ గొందఱామెను జూచి యేమి యిట్లు విలపించు చుంటివని యామె నడుగఁగా, "అయ్యా! నామేఁక యొకటి యడవిలోఁ దప్పిపోయి మఱి యింటికి రాలేదు. ఇప్పుఁడు రాముని వనవాసకథను వినుట వలన నాసంగతి యిపుడు నాకు స్మరణకు వచ్చుటచే నిక్లేడ్చుచుంటి" వని జవాబు చెప్పెను. ఈవిషయమును బాగుగ నాలోచింపుఁడు. ఈశ్వరోపాస నమును పేరితో సేద్చువారిలో నెవ్వరికిని శుద్ధారతి యుండదు. వారిలోన నే కులకు జడరతిమాత్రమే యుండును. ఈ జడరతియు, గొన్నిచోట్లఁ బ్రతి బింబరతియు, గల్పిత దేవోపాసకులయొక్కయు, బ్రహ్మవాదులయొక్కయు, రతిలక్షణములను నిరూపించుచున్నవి.

ముందుఁ జెప్పఁబడిన నాలుగువిధములగు రతియందుఁగూడఁ గాపట్య లక్షణము గలదు. దుష్టురాలగు స్త్రీ తనభర్త సందేహములు నివారించుటకుఁ గపట జడరతినిఁ బ్రకటించును. నైవేద్యమైన వెంటనే మేఁకమాం

కపటరతి.

సము మున్నగు నవస్నియును దినవచ్చు ... ర్తుల సేవకులు కల్పిత దేవదేవీ సాన్నిధ్యమున రతి లక్ష ... ఁ గపటరతి కుదా హరణము లగుచున్నారు. తమ ... ందుటకును, సాధు మండలమందుఁ బేరు వహించు ... జనుల నాకర్షించుటకును, గాలనేమివలె స్వకార్య సాధ ... త్సవములందు సన్మా నము నొందుటకును, అ సేవకులు ... ముగ నభినయింపుచు నృత్యము, స్వేదము, పులకాశ్రువు ... టు, ఒక్కొక్కప్పుడు భావపర్యంతము నగు రతి లక్షణముల ... కటించుదురు. కాని వారల హృదయమందు సాత్త్విక వికార ముండ ... యుండదు. *

---

* తదశ్మసారం హృదయం బతేదం, యద్గృహ్యమాణైర్హరినామధేయైః ।
నవిక్రియేతాథయదావికారో నేత్రే జలంగాత్రరుహేషుహర్షః ॥
భా. 2.3.24.

లోకమునం దిన్నివిధములగు రతులుండుట నెఱింగి శుద్ధమగు భాగవతీరతిని యథాయోగ్యముగ నాదరింపనివారు శోచనీయులును, క్షుద్రాశయములు గలవారును. ఎట్టిసాధనము సేయకుండఁ గొందఱ కాకస్మికముగ భాగవతీరతి యుదయించును. పూర్వజన్మములయందుఁ జేసిన రతి సాధనమునకు విఘ్నము కలుగుటచే నపుడు రతి యుదయింపక యీ జన్మమునఁ దద్విఘ్ననివారణ మేకారణముచేతనైన నేమి సంభవించుటచే నాచ్ఛాదితమగు నారతికాచ్ఛాదనము తొలఁగి రతి హఠాత్తుగ నుదయించెనని యిచటఁ దెలియనగును. దానితోపాటు భక్తియు, బరేశానుభవమును, నితర వైరాగ్యమును గూడ నుదయించి శుద్ధారతి కనుభావరూపమున నుండును.



## షష్ఠవృష్టి—ప్రథమధార.

## ప్రేమభక్తి విచారము.

### —ప్రేమభక్తి విచార భేదము..—

శ్లో. నప్రేమగంధో౽స్తి దరోపిమేహరా
క్రందామి సౌభాగ్యభరం ప్రకాశితుం
వంశీ విలాస్యానన లోకనం వినా
బిభర్మియత్ప్రాణి పతంగకాన్ వృథా.

ప్రేమభక్తి.

ఇఁకఁ బ్రేమభక్తి విచారము సేయఁబడును. సాంద్రత నొందిన భావమునకును, గాఢతరమగు రతికిని, బ్రేమయని పేరు. * [illegible] మైనచో సంతఃకరణము మెత్త[illegible] అధికమేమన, భగవంతునియం దనన్య మమత క[illegible]గ్యత కలిగినచో దాని నపుడు ప్రేమ యనసగు[illegible] కలదుగాని యామమత యనన్య భావ లాభమును వ[illegible]తి తనకు భగవంతుఁడే విషయమను నిశ్చయముతో ను[illegible]ని భగవద్వ్యతీతమగు

---

* సమ్యఙ్మసృణిత స్వాం[illegible]ంకితః ।
భావం సఏవ సాంద్రాత్మ[illegible]మా నిగద్యతే॥
భక్తిరసామృతసింధువు.

† అనన్యమమతావిష్ణో ర్మమతా ప్రేమసంగతా ।
భక్తిరిత్యుచ్యతేభీష్మ ప్రహ్లాదోద్ధవ నారదైః॥
పంచరాత్రమ్.

వేటొక విషయము లేదనునట్టి నిశ్చయావస్థ దానికిఁ గలుగవలెను. కాని యెప్పుడట్టి నిశ్చయావస్థ యుదయించుచున్నదో, అప్పుడు రతి విశుద్ధమగుచు విలాసవతియై ప్రకాశించును. రసోపయోగియగు రతియే ప్రేమయనఁబడును. ఇంతకుముం దేరతిని గూర్చి చెప్పఁబడినదో, ఆ రతియే ప్రేమాంకురము. అది శుద్ధారతియగుట నిజమేకాని కృష్ణునియందలి యనన్య మమత్వము దాని యందు లేకుండుటచే నది రసోపయోగి కాఁ

స్థాయీభావము. జాలదు. రతికిఁ బ్రేమావస్థ ప్రాప్తించినపు డది స్థాయీభావరూపము వహించుచున్నది. స్థాయీ భావము లేనియెడల నేది రసము కాఁగలదు? ప్రేమయనఁగాఁ బ్రేమారంభ మనిమాత్రమే తెలియనగును. ప్రేమ రెండువిధములు. మొదటిది భావోత్థ ప్రేమ; రెండవది ప్రసాదోత్థప్రేమ. భావ మెప్పు డంతరంగములగు సకలాంగ ములయొక్క నిరంతరాను సేవనముచేఁ బరమోత్కర్ష పదము నొందుచు న్నదో, అపుడు దానికి భావోత్థప్రేమ యని పేరు. భావముయొక్క యంత రంగములన్నియు నింతకుముందే వివరింపఁబడినవి.

శ్రీహరిస్వరూపస[illegible]ంగతమగుటచే నుదయించెడి ప్రేమకుఁ బ్రసాదోత్థ ప్రేమ య[illegible]

భావోత్థప్రేమ [illegible]న,—

—ద్వి[illegible]మము.—

(1) వైధ [illegible]

(2) రాగ[illegible]ము.

అతి ప్రసాదోత్థ[illegible]ములు. కేవల భగవత్సంగ బలము చేత నే తత్ప్రసాదోదయము[illegible] ప్రేమ సంపన్నులగు పురుషుల యను

* ఏవంవ్రతస్స్వప్రియనామకీర్త్యా, జాతానురాగో ద్రుతచిత్త ఉచ్చైః ।
హసత్యథో రోదితి రౌతి గాయత్యున్మాదవన్నృత్యతి లోకబాహ్యః॥
భా. 11-2-40.

ద్వివిధమగు ప్రసాదోత్థప్రేమము.

గ్రహముచే నాయాస్థితులం భావపర్యంత ముద యించి తదుపరి కృష్ణసంగముచేగాని, భావాంగ ముల యుపసేవనముచేగాని ప్రేమ యుత్పన్న మగుచున్నది.

ప్రసాదోత్థప్రేమ రెండువిధములు. ఎట్లన,—

(1) మాహాత్మ్య జ్ఞానయుక్తప్రేమ. (2) కేవల ప్రేమ.

మాహాత్మ్య జ్ఞాన యుక్తప్రేమము.

విధిమార్గము ననుసరించుటచే నుదయించెడి ప్రేమ మహిమ జ్ఞాన యుక్తమగుచున్నది. దీనినే కొందఱు స్నేహ భక్తియందురు. ఈ ప్రేమచే జీవునికి సార్ష్టి, సారూప్య, సామీప్య, సాలోక్య లాభప్రాప్తి కలుగుచున్నది. జీవుఁడు జడ ముక్తుఁడగుచు నా యాభావములతో భగవత్సేవ సేయుచుండును.

కేవల ప్రేమ.

రాగమార్గము ననుసరించుటచే నుదయించెడి ప్రేమ ప్రాయికముగఁ గేవలత్వము ...చును. ప్రాయిక మనుటచే రాగా... ...యందు వైభాంశాసక్తి యు... ...త్వము నొందదు. రాగా నుగా సాధనభక్తియందుఁ ... ...భాంశయున్నను దాని యం దాసక్తిలేనిచో సిద్ధిక... ...ము యుదయించును.

ప్రేమోదయమైనచో... ... జీవునికి సర్వార్థసిద్ధి కలు... ...ములును దూరములగును.

ప్రేమయే సర్వార్థ శిరోమణి.

ప్రేమ ... ...గు నున్నతిలాభము జీవునికి లేదు. ... ...న్నధిని మోక్షమొక తుచ్ఛ్రమును, క్షణికమును నగు తత్త్వవిశేషము. ప్రేమప్రాప్తికి సంబంధించిన యనేకములగు నవాంతరఫలములలో మోక్ష మొకఫలము.

మోక్షము క్షుద్రా వాంతరఫలముమాత్రమే.

జడసంబంధము సాగుచుండియు నొక్కమాఱుగాఁ ప్రేమోదయమైనచో మఱి యాజడసంబంధమను భవమునను రాదు. ప్రేమభక్తుని జీవన మత్యంత జడ సంగ రహితమును, కృష్ణమయమును నగుచున్నది. సూర్యోదయమైనప్పుడు మెఱుఁగుడు పుర్వుకాంతి యెట్లడఁగి పోవుచున్నదో, ప్రేమోదయమైనప్పుడు విధి కార్యము గూడ నట్లే యడఁగి పోవుచున్నది. ప్రేమ భక్తునను భూలోకము కూడ వైకుంఠము వలెఁ ప్రకాశించుచుండును.



## షష్ఠవృష్టి—ద్వితీయధార.

### ప్రేమోదయ క్రమ విచారము.

శ్లో॥ మృద్వీకా రసితా సితా సమసితా స్ఫీతం నిపీతం పయః
స్వర్యాతేన సుధాప్యధాయి కతిథా రంభాధరః ఖండితః
సత్యంబ్రూహిమదీయజీవ! భవతాభూయోభవేభ్రామ్యతా
కృష్ణేత్యక్షరయోరయం మధురిమోద్గారః క్వచిల్లక్షితః॥

ఇట్టి పరమపురుషార్థ స్వరూపమగు ప్రేమయొక్క సాధనకాలము మొదలుకొని సాధ్యావస్థ పర్యంతము దానికిఁ గలిగెడునుదయక్రమము తెలిసికొనుట కర్తవ్యము.

ప్రేమయొక్క నవవిధోదయక్రమము.

ప్రేమోదయక్రమమందు తొమ్మిదవస్థలు గోచరించుచున్న...

(1) శ్రద్ధ. (4... ...ఆసక్తి.
(2) సాధుసంగము. ... ...భావము.
(3) భజనక్రియ. ... ...) ప్రేమ. *

నీతిశాస్త్రజీవనము కేవ... ...వనమం దింద్రియసుఖముల కొఱకగుచు బుద్ధిచేఁ గలిగె... ..., శిల్పాదుల యున్న

---

* ఆదౌశ్రద్ధాతతస్సాధు ... ...యా ।
తతోఽనర్థనివృత్తిస్స్యాత్తత... ...స్తతః ॥
అథాసక్తి స్తతోభావ స్తతఃప్రేమాభ్యుదంచతి ।
సాధకానామయంప్రేమ్ణః ప్రాదుర్భావే భవేత్క్రమః॥
భక్తిరసామృతసింధు.

తియుసనునవి, కేవల మాసురికములు, ననిత్యములు, నకించిత్కరములు నగుచున్నవి. నైతిక జీవనము నీతిబద్ధమైనను దానియందుఁ బరలోకముయొక్కయు, నీశ్వరునియొక్కయు భావము శూన్యమగుటచే నది క్షుద్రమును, జీవునికయోగ్యమును, నగు జీవనమగుచున్నది. సేశ్వర నైతిక జీవనమందుఁ బరలోకచింతయు, నీశ్వరచింతయు నొప్పుచున్నను ఆ జీవనాశయ మశుద్ధమును, క్షుద్రమును, నతృప్తికరమును. జీవుఁడింతమాత్రమున సంతుష్టి జెంది దీనియందు నిత్య బద్ధుఁడై యుండఁజాలఁడు. అభేదవాదుల జీవన మత్యంత హేయమును, కుమార్గగతమును. భక్తజీవన మొక్కటే యవలంబనీయమగుచున్నది. * పరమేశ్వరుఁడొక్కఁడే సర్వమయుఁడును, సర్వకర్తయు, సర్వనియంతయును. వానియందుఁ బరమానురాగము కలిగియుండుటయే మేల్లన్నిఁ

---

* ప్రయత్నాద్యతమానస్తు యోగీసంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధ స్తతోయాతి పరాంగతిం ॥
తపస్విభ్యోఽధికోయోగీ, జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధి[illegible]న్నద్యోగీ భవార్జున ! ॥
యోగినామ[illegible]ంతరాత్మనా ।
శ్రద్ధావా[illegible]యుక్తతమోమతః॥

గీ. 6-45 to 47.

సమోఽహం[illegible]ద్వేష్యోస్తి నప్రియః ।
యేభజంతిత[illegible]తేషుచాప్యహం ॥
అపిచేత్సుద[illegible]మామనన్యభాక్ ।
సాధురేవ స[illegible]గ్వ్యవసితోహిసః ॥
క్షిప్రంభవతిధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ ! ప్రతిజానీహి నమేభక్తః ప్రణశ్యతి ॥
మాంహి పార్థ! వ్యపాశ్రిత్యయేఽపిస్యుః పాపయోనయః ।
స్త్రియోవైశ్యాస్తథాశూద్రాస్తేపియాంతిపరాంగతిం ॥

టిలో ముఖ్యమైన మేలు. ఇతరములగు మేళ్లనియుఁగూడ నా యనురాగమునకే యధీనములై యుండును. జీవచేష్టారూపములగు కర్మలును, జీవబుద్ధిరూపమగు జ్ఞానమును మిక్కిలి క్షుద్రములును, బరిమేయములును. వీనిమూలమునఁ బరమేశ్వర తుష్టిసాధనము జరుగనేరదు. స్వార్థరహితమగు భగవద్భక్తియే జీవునికిఁ గర్తవ్యము. జీవుఁడు నిత్య భగవద్దాసుఁడు. జడసంగమే జీవుని కధోగతి కలిగించెను. అయోగ్యతయే యీజడ సంగప్రాప్తికిఁ గారణము. భగవద్వైముఖ్యమే యీదుర్దశకు హేతువు. జీవుఁడు తన బంధమునకుఁ దానే హేతువు. భగవంతుఁడు తత్ఫలదాయకుఁడు మాత్రమే యగుచున్నాఁడు. జగత్తు మిథ్యకాదు. సత్యమైనదే; కాని నిత్యమైనది కాదు. అయోగ్యజీవుల దండనమునకేర్పడిన కారాగృహమే లోకము. భగవంతుఁడు దయామయుఁడు. జీవుఁడు క్లేశముల నొందుచుండుటచే వాని నాక్లేశముల నుండి తొలఁగింపుటకై తాను స్వయముగ వానివెంట నంటియుండును.

---

కింపునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।
అనిత్యమసుఖం లోకమిమం [illegible]జస్వమాం ॥
గీ. 9.29 to 33.

స్వధర్మనిష్ఠ శ్శతజన[illegible]
న్విరించతామేతి తత[illegible]
అవ్యాకృతం భాగ[illegible]
పదం యథాహం వి[illegible]
భా. 4.24.29.

నసాధయతి మాం యో[illegible]ద్ధవ! ।
నస్వాధ్యాయస్తపస్త్యాగో[illegible]ర్మమోర్జితా ॥
భా. 11.14.20.

తచ్ఛ్రద్దధానా మునయో జ్ఞానవైరాగ్యయుక్తయా ।
పశ్యంత్యాత్మని చాత్మానం భక్త్యా శ్రుతగృహీతయా ॥
భా. 1.2.13.

జీవుఁడు నిజచేష్టలమూలముననే యోగ్యత సంపాదించుటకొఱకును, దన యనంతలీలామృత మతని కొసంగుటకొఱకును, భగవంతుఁడు సదా ప్రయత్నించుచుండును. ఇచ్ఛామాత్రముచేతనే తానందఱ జీవుల నుద్ధరింపఁగలవాఁడేకాని తన యచింత్య లీలాక్రమమున జీవుని భక్తిమార్గమునందుఁ బ్రవర్తింపఁజేసి యందాతఁడొనరించు సర్వ ప్రయత్నములయందును భగవంతుఁ డంతరంగోపదేశకుఁడుగను, బ్రోత్సాహకుఁడుగను, ఉండును. అయోగ్యుఁడగు తనపుత్త్రునికిఁ దండ్రి సమస్త సంపదల నీఁగలిగినను బుత్త్రుని ముందు యోగ్యునిగ నొనరించి వెనుక సంపత్తు నొసఁగినచో నతని కధికతరానందముగ నుండునుగదా? ఇదే భగవత్స్నేహముయొక్క ప్రతిఫలము. భగవద్దాస్యమే జీవునికి శ్రేయస్సును, ప్రేయస్సును.

(i) శ్రద్ధ.

జీవునికి భగవద్దాస్యమే శ్రేయస్సును, ప్రేయస్సును—ఇట్టి విశ్వాసమే శ్రద్ధ.

ఇట్టి విశ్వాసమునకే శ్రద్ధయనిపేరు. నేనింత విపులముగ నిచట వ్రాసితినిగాని సంక్షేపముగఁ జెప్పినప్పుడు భగవద్విశ్వాసమే శ్రద్ధయని చెప్పవలెను. భగవత్తత్త్వ ... దృఢవిశ్వాసము, దన క్షుద్రతవాస్తవ మను విషయమునంధ ... పమును జీవునికేక్షణమం దుదయిం ... ందే పైనిఁ జెప్పినవాక్యములన్ని ... ఁడగు మానవుని నోఁటినుండి ... వడును. విశ్వాసమను తత్త్వ ... మేనిఁ బూర్వోక్తములగు భిన్న ... లన్నియును భగవత్తత్త్వము సం ... విశ్వాసమునం దంతర్భూతములని విశదమగును. పరానంద స్వ ... ఁడగు శ్రీ శ్రీ చైతన్యచంద్రుఁడీవిశ్వాసము భక్తిలతకు బీజమువంటిదని చెప్పెను. మనము భక్తుల జీవితచరిత్రములను బరికించితిమేని శాస్త్రవిచారము చేయుటచేఁ గొందఱకు నిరపేక్షత్వము కారణముగ శ్రద్ధయుదయించెననియు, ననేకులకు సాధుసంగక్రమమునను, సాధూపదేశక్రమమునను శ్రద్ధ యుదయించెననియు, స్వధర్మాచరణముచేతను, గర్మ

ఫలములయం దసూయగలుగుటచేతను, మఱికొందఱకు భక్తితత్త్వమందు శ్రద్ధ యుదయించెననియు, మఱికొందఱకు జ్ఞానఫలములయందలి విరక్తి చేతను, జుగుప్సచేతను శ్రద్ధ యుదయించెననియు, మఱికొందఱ కాకస్మికముగ శ్రద్ధ యుదయించెననియు, మనకు స్పష్టపడఁగలదు. కావున శ్రద్ధ యుదయించుట కొకానొక విధియున్నదని చెప్పుటకు వలనుపడదు. భక్తిలతకు బీజమగు నీశ్రద్ధ విధి కతీతమగు తత్త్వము. కావున భాగ్యవంతుఁడగు జీవునికి మాత్రమే శ్రద్ధ యుదయించుననిః చెప్పవలసియుండును. కర్మాధికార పరిసమాప్తియు, శ్రద్ధోదయమును నేకకాలమందే సంభవించును. *

శ్రద్ధోదయము గలవాఁడే భాగ్యవంతుఁడు.

శ్రద్ధ యుదయించినంతనే జీవునకు వ్యాకులపాటు కలుగును. జీవుఁడు సహజముగ ననర్థములకు వశీభూతుఁడే. "ఇపుడు నేనేమిచేసినచో నాకీయనర్థములు తొలఁగు" ననుచు [illegible] విచారము చేసి యనర్థనివృత్తి గల సాధుపురుషుల పాద[illegible]ను. అపుడు సాధుసంగముకొఱకుఁ దత్తఱిల్లుచు [illegible] కొంతకాలమునకుఁ గృష్ణ కృపచే సాధుసంగము ల[illegible]యమునకు మొదటి చిహ్నము.†

సాధుసంగము.

* తావత్కర్మాణి కుర్వీ[illegible] ।
మత్కథాశ్రవణాదౌ[illegible]తే॥
భా. 11-20-9.

† సతాంప్రసంగాన్మమవీర్యసం[illegible]
భవంతిహృత్కర్ణ రసాయనాఃకథాః
తజ్జోషణాదాశ్వపవర్గవర్త్మని
శ్రద్ధారతిర్భక్తిరనుక్రమిష్యతి.
భా. 3-25-25.

తనకు లభించిన యీ సాధుపురుషులు హరికథాశ్రవణము, కీర్తనము, హరినామము, రూపగుణలీలాస్మరణము మున్నగు

భజనక్రియ. భజనక్రియలయందు సదా ప్రవృత్తులై యుందురు. పూర్వోక్తమగు పంచవిధ వైధభక్త్యనుశీలనము చేయఁగాఁ జేయఁగా ననర్థమూలములగు నింద్రియార్థములును, వాసనయు నిపుడు భక్తి ననుగమించును. అనర్థములు దేహగతములుగ నున్నను వాని వాసనమాత్రము పూర్తిగ వదలిపోవును. భజన క్రియ ప్రేమలాభమునందలి ద్వితీయక్రమము. *

విషయాసక్తియు, పాపాచరణము, హింస, లోభము మున్నగు నవి భగవదనుశీలన క్రమమున నంతరించుచుండ

అనర్థ నివృత్తి. జీవుఁడు నిర్లోభుఁడగును. దీనినే యనర్థ నివృత్తి రూపమగు తృతీయక్రమమని యందురు.

నిర్లోభత్వము కలుగఁగానే యన్య నిష్ఠ దూరమగును. అపుడు శ్రద్ధ భగవన్నిష్ఠారూపమునఁ బరిణామము నొందును.

నిష్ఠ. ...ందువఱకును శ్రద్ధ కేక నిష్ఠ కలు ...ములు నివారింపఁబడుచుండ శ్రద్ధ క్రమముగ నిష్ఠారూ... ...నిష్ఠ ప్రేమలాభమందుఁ జతుర్థ క్రమము.

నిష్ఠ కలుగుటచే ... మధికతర యత్నముతో సాగు ...సాధుసంగమింకను తీవ్రతర యత్న

రుచి. ...ర్యమగుచుండుటయు, నీ సకల ప్రక్రి... ననర్థనాశనమగుచుండ దానితోపాటు

---

* శుశ్రూషోః శ్రద్దధానస్య వాసుదేవకథారుచిః ।
స్యాన్మహత్సేవయా విప్రాః పుణ్యతీర్థనిషేవణాత్ ॥

భా. 1.2.17.

నిష్ఠయు నుల్లాసలాభము నొందును. ఉల్లాసభావమును బొందిన నిష్ఠకు రుచి యని పేరు. రుచియే పంచమక్రమము. కృష్ణునియందు రుచి వొడమెనేని మఱి దేనియందును రుచి కలుగదు.

ఆసక్తి. రుచి రానురాను స్థిరత వహింపుచుండ మఱింత మఱింతగ ననర్థనాశనమగుచు దానితోపాటు ఆసక్తి యుదయించును. ఆసక్తిపర్యంతమే సాధనము. సాధనము సంపూర్ణమైనచో నాసక్తి పూర్ణత్వలాభము నొందును; అప్పుడు జీవుఁడు కృతకృత్యుఁడగును. ప్రేమోదయమందాసక్తి షష్ఠమక్రమము. *

భావము. ఆసక్తి పూర్ణమైనచో దానికి భావమనియు, రతియనియు, ప్రేమాంకురమనియుఁ బేళ్లు. ఆసక్తికి శుద్ధసత్త్వ స్వరూపము లేదు. కాని భావము శుద్ధసత్త్వ స్వరూపలాభము నొందును. అపుడు చిత్తమునకు మెత్తందన ముద్భవించును. ఇదే ప్రేమకు సప్తమక్రమము. †

---

* తత్రాన్వహంకృష్ణకథాః ...
మనుగ్రహేణా శృణ ...
తాశ్శ్రద్ధయా మేఽన ...
ప్రియశ్రవస్యంగ మ ...

భా. 1.5.26.

† ఇత్థంశరత్ప్రావృషికా ...
ర్హరేర్విశృణ్వతో మేఽనుసవం య ...
సంకీర్త్యమానం మునిభిర్మహాత్మ
ర్భక్తిఃప్రవృత్తాత్మరజస్తమోఽపహా॥

భా. 1.5.28.

స్థాయీ భావము, ప్రేమ.

భావ మనన్య మమతా లాభము నొందెనేని ప్రేమ యగుచున్నది. ఇదియే రసోపయోగి యగు స్థాయీభావము.

సాధనభక్తులు తమ యవస్థను సర్వదా పరీక్షించుకొనుచుందురు. "నిన్నను నేనేస్థితిలో నుంటిని? నేఁడేమాత్ర మున్నతిలాభము నొందితి?" యనుచు నిట్లు కొన్నిదినములు తమ్ముఁ దాము పరీక్షించుకొనుచుఁ దమకట్టి యున్నతిలాభమును గలుగనట్లు కనుపడినచో నేదే నొక యపరాధము జరిగెనంచు నూహింతురు. ఆ యపరాధమేదో తెలిసికొని దానినిఁ దాము బరిహరింతురు. సాధుసంగ సేవామూలమున నట్టి యపరాధమువలనఁ గలిగిన గాయమును మానునట్లు చేయింతురు. భక్త్యనుశీలనఁ మనుత్తుణమును జేయుచుఁ దమ యా వేదనమును శ్రీకృష్ణుని కెఱింగింపుచు మఱల నట్టి యపరాధము కలుగకుండునట్లు మిగుల మెలఁకువతో నుందురు. క్రమోన్నతి యందు దృష్టిలేనివారికిఁ దామెఱుంగకుండనే లెక్కలేని వ్యాఘాతములు సంభవించుచుండుటచే నున్నతిలాభము మిక్కిలి విలంబమగును. కావున నో సాధకులారా! ఇంద... ...ను విశేష సావధానులరు కండు.

---

తదారజ... ...లోభాదయశ్చయే
చేతఏతై... ...సీదతి॥

భా. 1.2.19.

రసోవై సః... ...లబ్ధ్వాఽనందీభవతి.

తైత్తిరీయోపనిషత్.



## షష్ఠవృష్టి—తృతీయధార.

### ప్రేమాధికారమునుబట్టి నామభజన విచారము.

శ్లో. వజ్రంపాప మహీభృతాం
భవగదోద్రేకస్య సిద్ధౌషధం
మిథ్యాజ్ఞాన నిశా విశాల
తమసస్తిగ్మాంశు బింబోదయః
క్రూరక్లేశ మహీరుహాముర
భరజ్వాలా జటాలశ్శిఖీ
ద్వారం నిర్వృతి సద్మనో
విజయతే కృష్ణేతి వర్ణద్వయం.

ప్రేమయే జీవుని ప్రయో [illegible] జీవనము పుష్టియైన [illegible] చో [illegible]. జీవుఁడు కృష్ణ [illegible]

ప్రేమాధికారులు న్మూ [illegible] బోఁగాఁ బోఁగాఁ రెండు తెగలు—ప్రే క్రమ [illegible] సురఁ జేయును. కావునఁ మారురుక్షువులు, ప్రే ప్రేమా [illegible] క్ష్వవస్థయు, ప్రేమా మారూఢులు. రూఢా [illegible] రెండవస్థలు గలవు. ప్రేమారూఢ [illegible] నంతకంటె నుచ్చావస్థ మఱిలేదు. అచ్చట సఖండ కృష్ణరస మొక్క [illegible] యద్వయ తత్త్వమై ప్రకాశించుచుండును. ఆరురుక్ష్వవస్థయందలి భక్తజనము వివిక్తానందులనియు, గోష్ఠ్యానందులనియు రెండువిధములు. వివిక్తానందు లాచారప్రియులు; గోష్ఠ్యానందులు సర్వదా ప్రచారప్రియులు. వారిలోఁ గొందఱునయ ప్రియ

భావము గలిగి యానందించుచుందురు. భగవంతుని స్మరించుటయే ప్రేమభక్తునియాచారము. భగవన్నామకీర్తనమే ప్రేమభక్తుని ప్రచారకార్యము.

ఆరురుక్ష్వవస్థయందలి ప్రేమభక్తులేకాంత కృష్ణభక్తులు. ఏకాంత శరణాగతియే వారి సాధారణ లక్షణము. *

శరణాగతిలక్షణము—భక్తి కనుకూలించునది స్వీకరించుట, ప్రతికూలించునది త్యజించుట.

ఏకాంత శరణాగతుల విశేష మాహాత్మ్యము శ్రీమద్భాగవతమందును, భగవద్గీత యందును నెక్కుడుగఁ గీర్తింపఁబడెను. ఏకాంత శరణాగతిలేనివారికిఁ బ్రేమప్రాప్తి దూరమగుటట్లుండ భావముకూడ నుదయింపదు. ప్రేమభక్తి కేది యనుకూలించునో, అదియే యేకాంత శరణాగతి యందు స్వీకరింపఁబడవలెను. ఏది ప్రతికూలించునో అది వర్జనీయము. "కృష్ణుఁడొక్కఁడే రక్షించువాఁడు. వేఱొక గత్యణోపాయము లేదు. మఱి యొక రక్షకుఁడులేఁడు" అనునదియే యేకాంతభక్తులవిశ్వాసము. "కృష్ణుఁడొక్కఁడే నన్నుఁ బాలించువాఁ" డను విషయమందు వారికెవ్విధమగు
సందేహమును లేదు. ' [illegible] దీనుఁడను, హీనుఁడనని చెప్పుచు
భక్తుఁడు సుదృఢమును [illegible] విశ్వాసము గలిగియుండును.
"నేనేమియుఁ జేయఁ [illegible] ను వ్యతిరేకముగ నెవఁడును
నేమియుఁ జేయఁజాలఁ [illegible] తభక్తుల విశ్వాసము. †

---

* సర్వధర్మాన్ [illegible] రణంవ్రజ
అహంత్వా [illegible] యిష్యామిమాశుచః.
గీ. 18.66.

మామేక మేవ [illegible] త్మనం సర్వదేహినాం
యాహిసర్వాత్మభా [illegible] మయాస్యాహ్యకుతోభయః.
భా. 11.12.15.

† అనుకూలస్యసంకల్పః ప్రతికూలస్యవర్జనం ।
రక్షిష్యతీతివిశ్వాసో గోప్తృత్వేవరణతథా ।

శ్రీనామము ననన్య భావముతో నాశ్రయింపుట.

ఏకాంతశరణాగతభక్తులు భక్త్యంగము లన్నిటిలో శ్రీనామము ననన్యభావముతో నాశ్రయింతురు. శ్రీనామ స్మరణమందును, శ్రీ నామకీర్తనమందును వారికి మిక్కిలి రుచి కలిగియుండును. * భజనాంగము లలో భగవన్నామముకంటె విశుద్ధ చిన్మయమైన వేఱొకయంగము లేదు. శ్రీ హరిభక్తివిలాసమం దలి నైకాంతిక కార్యములన్నిటిలో నామస్మరణముయొక్కయు, నామ కీర్తనముయొక్కయు, నధిక మాహాత్మ్యము వర్ణింపఁబడెను.

నామనాముల కభేదము.

కృష్ణనామ మునకును, కృష్ణునికిని గొంచెమైనను భేదము లేదని శాస్త్రములు చెప్పుచున్నవి. నామము చింతామణి తత్త్వము. కృష్ణుని చైతన్య రస విగ్రహరూపమున నామ మీలోకమున నుద యించెను. †

శ్రీనామ స్వరూప రూప[illegible]

కృష్ణ స్వరూపానుభవముయొక్కయు, నామ స్వరూపానుభవము యొక్క[illegible]ం దిచ్చుగలవారు చిత్స్వ[illegible] ప్రయత్నింపవలెను.

---

ఆత్మనిక్షేపకార్ప[illegible]ః॥

పద్మపురాణము.

తవాస్మీతివదన్వ[illegible]దన్ ।
తత్స్థానమాశ్రితస్త[illegible]తః॥

తత్రైవ.

* గర్భజన్మజరారోగ దుఃఖ[illegible]ః ।
నబాధ్యతే నరోనిత్యం వా[illegible]మనుస్మరన్॥

† నామచింతామణిఃకృష్ణశ్చైతన్యరసవిగ్రహః ।
పూర్ణశ్శుద్ధోనిత్యముక్తోఽభిన్నత్వాన్నామనామినోః॥

తత్రైవ.

జ్ఞానమే భజనోన్నతికి హేతువు.

చిత్తత్త్వముయొక్క స్వరూపానుభవము కలుగనంతవఱకును సాధకునికి భజనచాతుర్యము కలుగదు. ఆకారణముచే సాధనఫలరూపమగు సాధ్యవస్తుప్రాప్తి కవకాశముండదు. చిత్తత్త్వముయొక్క స్వరూపజ్ఞాన ప్రాప్తియొక్కటే భజనోన్నతికిఁ గారణము.* ఆవిషయమై యిచటఁ గొంత విచారము చేయఁబడును.

జీవుఁడు చిత్కణమనియు, కృష్ణధామము చిజ్జగత్తనియు, కృష్ణుఁడు చిత్సూర్యుడనియు, కృష్ణభక్తి చిత్ప్రవృత్తియనియు, కృష్ణనామము చిద్రసవిగ్రహ విశేషమనియు నింతకు ముందనేక స్థలములలోఁ జెప్పియుంటిని; శాస్త్ర ప్రమాణములనుగూడ నిచ్చియుంటిని. ఇప్పుడు ప్రేమారురుక్షువులగు మహాత్ములతోఁగూడి చిత్తత్త్వవిచారము కొంచెము సలిపి నాయాత్మప్రసాదముకొఱకు నేనుప్రయత్నించుచున్నాను. నాకుఁ బూర్వజన్మ సుకృతముగలదేని నా హృదయమునఁ జిత్సుఖముదయించును. చిన్మాత్రోపలబ్ధిరూపమగు బ్రహ్మజ్ఞానమునందుఁ జిద్వస్తుసంబంధమగు క్రియావిలాసము లేనందున నాకు దానియందభిరుచి లేదు.[illegible]

దశమూలము.

కలియుగ పావ[illegible] [illegible]ష్ణచైతన్యుఁడు వేదమే ప్రమా[illegible] [illegible]నియందుఁ దొమ్మిది ప్రమేయ[illegible] [illegible] శ్రీమద్భాగవతమం దీవిష[illegible] [illegible] వివరింపఁబడినది. వేదప్రమా

---

* జ్ఞానతః సు[illegible] [illegible]ాది పుణ్యతః ।
సేయంసాధ[illegible] [illegible]భక్తిస్సుదుర్లభా॥ తత్రైవ.

† యానిర్వృతి స్తను[illegible] [illegible]వపాదపద్మ
ధ్యానాద్భవజ్జనక[illegible] [illegible]ణేన వాస్యాత్ ।
సాబ్రహ్మణిస్వమహిమన్యపినాథమాభూత్
కిన్న్వంతకాసిలులితాత్ పతతాం విమానాత్॥

భా. 4.9.10.

ణముచేతనే జీవుఁడు చిత్కణత్వమున స్థిరపఱుపఁబడినది. * కృష్ణ స్వరూప సూర్యుని కిరణకణమని చెప్పుటచే జీవుని చిత్కణత్వము నిర్ధారితమైనది.

కృష్ణుఁడర్కస్వరూపుఁడు, జీవుఁడు కిరణస్వరూపుఁడు.

వస్తుతత్త్వమును బట్టి కృష్ణునియందును, జీవుని యందును జిత్స్వరూపావస్థ గోచరించుచున్నది. కాని భేదమెచ్చట నున్నదనిన, గృష్ణుఁడు సూర్యస్వరూపుఁడు; జీవుఁడు వాని కిరణ కణము. కృష్ణుఁడు మహేశ్వరుఁడు; జీవుఁడు వానికి నిత్యదాసుఁడు. కృష్ణధామమగు పరవ్యోమ, మనఁగా, గోలోకము సాక్షాచ్చిన్మయ ధామ మనుటలో సందేహములేదు. 'వైకుంఠము,' 'చిజ్జగత్తు' అనుపేళ్లతోనా చిన్మయధామ మభిహితమగుచున్నది. † వాజసనేయోపనిషత్తునందుఁ గృష్ణస్వరూపముయొక్క శుద్ధచిన్మయత్వము నిరూపింపఁబడినది. ‡ ఆపరమే

---

* యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగావ్యుచ్చరన్తి
ఏవమేవాస్మాదాత్మనః సర్వాణిభూతానివ్యుచ్చరంతి ।
తస్యవాఏతస్య పురుషస్యద్వే ఏవస్థానేభవతః
ఇదంచ పరలోకస్థానం[illegible]ఘుంస్వం॥
బృహదారణ్యకే.

† దివ్యేబ్రహ్మపురే[illegible]సంప్రతిష్ఠితః.
ముండకే.

‡ సపర్యగాచ్ఛుక్రమ[illegible]
మస్నావిరగ్ంశుద్ధ[illegible]
కవిర్మనీషీపరిభూః స్వ[illegible]
తథ్యతోఽర్థాన్ వ్యదధా[illegible]భ్యః సమాభ్యః॥
ఈశోపనిషత్.

నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానా
మేకోబహూనాంయోవిదధాతికామాన్.
కఠోపనిషత్.

శ్వర పరబ్రహ్మరూపములు శ్రీకృష్ణుని నిత్యశక్తికి సంబంధించిన విషయము లని శ్వేతాశ్వతరోపనిషత్తునందు వర్ణింపఁబడినది.* భక్తి చిద్రసమని ముండకోపనిషత్తునందుఁ జెప్పఁబడినది. కృష్ణుఁడు సర్వభూతములకును బ్రాణస్వరూపుఁడని యెఱింగి పండితుఁ డతివాద శుష్కజ్ఞానమును, దర్కమును బరిత్యజించి యాత్మక్రీడ ననుభవించుచున్నాఁడు. † శుద్ధ జ్ఞానముచే నా విషయము

కృష్ణ స్వరూపము శుద్ధచిన్మయము, భక్తి చిద్రసము.

తెలిసికొని ధీరపురుషుఁడు ప్రజా (శుద్ధభక్త్య) ను శీలనము సేయును. ఇట్టి యనుశీలనము సేయువాఁడే బ్రాహ్మణుఁడు. ఈ విషయ మెఱుంగకుండ నీలోకమును విడుచువాఁడు కృపణుఁడు; శోచనీయుఁడు. దీని నెఱింగిన వాఁడే బ్రాహ్మణుఁ, డనఁగాఁ గృష్ణభక్తుఁడగు వైష్ణవుఁడు. ‡

భక్తిస్వరూప మిట్లు ప్రదర్శింపఁబడుచున్నది:—"ఓ మైత్రేయీ! ఆత్మయే చూచుటకును, వినుటకును, మననము సేయుటకును, ధ్యానించుటకును యోగ్యమైనది. ఆత్మదృష్టమును, శ్రుతమును, ధ్యాతమును, విజ్ఞాతము నైనచో సర్వమును విదిత[illegible]త్మ (కృష్ణుఁడు) సకలమునకు సంత

---

శ్వాముప్రప[illegible]నిషత్.

* పరాస్యశక్తిర్వి[illegible]భావికీజ్ఞానబల క్రియాచ.

† ప్రాణోహ్యేష[illegible]ర్వభూతైర్విభాతి

విజానన్ వి[illegible]

ఆత్మక్రీడ ఆత్మ[illegible]నేషు బ్రహ్మవిదాంవరిష్ఠః.

ముండకోపనిషత్.

‡ తమేవధీరో విజ్ఞాయ[illegible]o కుర్వీతబ్రాహ్మణః ।

ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మాల్లోకాత్

ప్రైతి సకృపణోఽథయ ఏతదక్షరం గార్గి

విదిత్వాస్మాల్లోకాత్ ప్రైతిసబ్రాహ్మణః.

బృహదారణ్యకే.

కృష్ణునితో జీవునకుఁ గల నిత్య సుఖ సంబంధమే ప్రేమ.

ర్యామి యగుటచేఁ బుత్త్రునికంటెను, విత్తము కంటెను బ్రియుఁడగుచున్నాఁడు. కామముల యందు సహజ ప్రియత్వము లేదు. అవి తనకొఱ కైనచో సకల విషయములును బ్రియములగును.* కావునఁ గృష్ణునితో జీవునకుఁ గల నిత్య సుఖ సంబంధమునకుఁ బ్రేమయని పేరు. ప్రేమ పూర్ణ చిత్స్వరూపమగుతత్త్వము.

దృశ్యమానమగు నీ జడజగత్తుతోఁ జిత్తత్త్వమునకుఁ గల ప్రకృత సంబంధమేమి? యథార్థసంబంధ జ్ఞానము కలిగినచో భక్తిరూపమగు ప్రజ్ఞ యుదయించును. చిత్తత్త్వమును విమర్శింపఁబూనినప్పుడు మన కనేక సమ యములం దు భ్రాంతియే కలుగుచుండును. యుక్తి

యుక్తి పనికిమాలి నది.

పేషణముచేసినచోఁ జిత్తత్త్వము జడతత్త్వము నకు విపరీతమగు తత్త్వమనియే తేలును. యుక్తి పేషణముచేఁ జిద్రసరూపమగు పరమతత్త్వము దూరమై యస్ఫుటమును, చిదాభాసస్వరూపమును, నసంపూర్ణమును నగు నధ్యాత్మ బ్రహ్మకల్పన మొకటి య[illegible]సనము దానితో సంతృ ప్తిఁ జెందుదుము. ఆ చిన్మాత్ర[illegible]సంబంధించిన బ్రహ్మ నిరాకారుఁడును, నిర్వికారుఁ[illegible]ను, గుణశూన్యుఁడును, బ్రేమశూన్యుఁడునునగుచు నా[illegible]నిర్వచనీయవస్తుస్వరూపుఁ

---

* ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్[illegible]వ్యో నిధి ధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మని ఖల్వరే దృ[illegible]పతే విజ్ఞాతే ఇదం సర్వం విదితం । తదేతత్ప్రేయః పుత్త్ర[illegible]ప్రేయో విత్తాత్ ప్రేయోఽ న్యస్మాత్ సర్వస్మాదంతర[illegible] యదయమాత్మా । నవా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి । ఆత్మనస్తు కామాయ సర్వంప్రియం భవతి.

బృహదారణ్యకే.

డగుచున్నాఁడు. అప్పుడు మన మాచిన్మాత్రుని గుణక్రియారూపనామములు తెలిసికొనుట కసమర్థుల మగుటచే నైష్కర్మ్యలాభము నొందుచున్నాము. కావున నీ శుష్కజ్ఞానము జీవునికి మహోత్పాతము ఘటించుచున్నది. ఈ విషయము వ్యాసనారద సంవాదమునఁ జూడనగును. *

**చిద్విలాసము.** శుద్ధచిదాభాసరూపమున నొప్పుచుండెడు చిన్మాత్ర బ్రహ్మయందు మనము సంలగ్నులమైనచోఁ బరబ్రహ్మయొక్క చిద్విలాసమును దెలిసికొనుటకు మఱి యవకాశ ముండదు. ఇది నిశ్చయము. కావున నో సోదరుఁడా! అగ్రేసరుఁడవు కమ్ము. చిన్మాత్ర ప్రతిభను ఛేదించుకొని చిద్ధామమందుఁబ్రవేశింపుము. అచ్చటఁ బరబ్రహ్మను, వాని చిద్విలాసమును, గూడఁ జూడఁగలవు. అపు డఖండ బ్రహ్మరసమను వస్తువును నీ వాస్వాదింతువు. అపుడు నీవు మఱి యపమార్గమునఁ బడి యెండుకట్టె యొక్క స్థితికి రావందువు. ఆత్మవేత్తలగు పురుషులు ప్రకృతియొక్క పరతత్త్వరూపమగు హిరణ్మయ (శుద్ధచిన్మయ) ప్రకోష్ఠమునందు రజోగుణనిర్లిప్తుఁడును, నిష్కలుఁడును నగు విశుద్ధ పరబ్రహ్మ విరాజిల్లుచుండుట తెలిసికొందురని ముండకోపనిషత్తు చెప్పుచున్నది. ... ప్రాకృతజ్యోతి కతీతమును, బూర్ణమును నగు

---

* నైష్కర్మ్యమ[illegible] [illegible]తభావవర్జితం,
నశోభతే జ్ఞానమ[illegible] [illegible]రంజనం ।
కుతః పునశ్శశ[illegible] [illegible]మీశ్వరే
నచార్పితం కర్మ [illegible] [illegible]దప్యకారణం. భా. 1-5-12.

† హిరణ్మయే పరే[illegible] విరజం బ్రహ్మనిష్కలం ।
తచ్ఛుభ్రం జ్యోతిషాంజ్యోతి స్తద్యదాత్మవిదోవిదుః॥
నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం
నేమావిద్యుతోభాంతి కుతోఽయమగ్నిః।
తమేవభాంత మనుభాతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి. ముండకోపనిషత్.

నప్రాకృత జ్యోతిమూలమున వాని నామ రూప గుణ లీలలు ప్రకాశించుచుండును. జడజగత్తునందలి సూర్యుఁడును, చంద్రుఁడును, నక్షత్రములును, మెఱుపులును, వగ్నియు నా చిద్ధామమున జ్యోతి నిచ్చుటకు యోగ్యత గల పదార్థములు కావు. చిద్ధామమున నే జడాతీతమగు చిజ్జ్యోతి కలదో, అదే యాధామమునకు వెలుఁగు నిచ్చునది. ఆ వెలుఁగుయొక్క కుంఠిత ప్రతిఫలన స్వరూపులును, జడజ్యోతి నొసంగువారును, నగు సూర్యచంద్రులనే మనము వెలుఁగు నిచ్చు వస్తువులుగ భావించుచున్నాము. వాస్తవముగ వెలుగు నిచ్చున వవి కావు. ఛాందోగ్యోపనిషత్తున బ్రహ్మపురవర్ణనమం దీవిషయము విపులముగఁ జర్చింపఁబడినది. చిజ్జ్యోతిర్మయమగు చిత్ప్రపంచమే యీ జడ ప్రపంచమున కాదర్శరూపమగుచున్నది. అచ్చట హేయమగున దణుమాత్రమును లేదు. ఉపాదేయమే యచ్చటి సుఖ జనక వ్యాపారము. ఈ జడ జగత్తునందలి చతుర్దశ భువనములు నా యాదర్శముయొక్క హేయ ప్రతిఫలనము లగుచున్నవి. అచ్చటి జ్యోతియొక్క స్థూల ప్రతిఫలనములు సూర్యాదులును, సూక్ష్మ

**జడ జగత్తు చిద్ధామముయొక్క హేయ ప్రతిఫలనమాత్రము.**

ప్రతిఫలన రూపము మనోబుద్ధ్యహంకార [illegible]గు జడ జ్ఞానముయొక్క వెలుఁగును. స్థూలేంద్రియములమూలమున మన[illegible]లసూర్యాదుల కాంతిని గనుచున్నాము. సూక్ష్మమనోబుద్ధ్యహంకా[illegible]చే సాధితమగు నష్టాంగ యోగ ప్రణాళి మూలమున జడజ్ఞానమును [illegible]మానించుచున్నాము. ఇవన్నియు జడబద్ధజీవునియొక్క నైసర్గిక కా[illegible]మములు. నారదోపదేశముచే వ్యాసునకుఁ గలిగిన యాత్మగత స[illegible]మాధియం దతఁడు పరమ పురుషుని నామమును, రూపమును, గుణమును, లీలలను, సంపూర్ణరూపమునఁ జూడఁగలిగెను.* పరాశక్తికి ఛాయారూపమగు నా మాయను బర

* భక్తియోగేన మనసి సమ్యక్ప్రణిహితేఽమలే ।
అపశ్యత్పురుషం పూర్ణం మాయాంచ తదపాశ్రయామ్॥

తత్త్వముయొక్క యపాశ్రయశక్తిగ నెఱింగెను. ఆ మాయచే మోహింపఁబడిన జీవరూపచిత్తత్త్వముయొక్కయనర్థముల నతఁడు తెలిసికొనెను. భక్తియోగరూపమగు సహజ సమాధిమూలమున నా జీవులను స్వస్వరూపప్రాప్తి కలుగుననుచుఁ దెలిసికొని భగవంతుని చిన్మయలీలలను బ్రకటించునట్టి శ్రీమద్భాగవతగ్రంథమును వెలువరించెను. జీవుని స్వస్వరూపభ్రమ, కృష్ణస్వరూపభ్రమయను నీరెండును బ్రధానములగు ననర్థములు. ఈ యనర్థములవలననే కృష్ణ బహిర్ముఖతయు, నందువలన మాయాచక్రమునఁబడి కర్మమార్గము ననుసరించుటయు, నందువలన సుఖదుఃఖ మయ సంసారమును సంభవించుచున్నవి. కర్మమార్గమందలి యష్టాంగవిచారము చేతను, జ్ఞానమార్గమందలి సాంఖ్య విచారముచేతను, గలిగిన యతన్నిరసన రూప జడీయ జ్ఞానజనితమగు యుక్తియొక్క బహిర్ముఖ వ్యాపారముడిగి శుద్ధ భక్తియోగాశ్రయ మెపుడు లభించుచున్నదో, అపుడు జీవునికిఁ గలిగిన సహజ సమాధిమూలమున సకల తత్త్వములును శుద్ధ జ్ఞానసంబంధమగు వెలుఁగు వెల్లువయందు [illegible]ష్టాగతములుగఁ జూడఁబడుచున్నవి. జడసుఖములపుడు తుచ్ఛములుగ భా[illegible]ఁబడును. కృష్ణప్రేమయు నపుడుదయించును. శుద్ధభక్తియందెపుడు శ్రద్ధ[illegible]ో, అపుడు జీవుని యాత్మగత వ్యాపారము ప్రారంభమగును. అ[illegible]డు చిత్సూర్యస్వరూపుఁడగు కృష్ణునియొక్క

కృష్ణ బహిర్ముఖత కనర్థములే కారణము.

---

యయాసమ్మోహితోజీవ ఆత్మానంత్రిగుణాత్మకం ।
పరోఽపిమనుతేఽనర్థం తత్కృతంచాభిపద్యతే॥
అనర్థోపశమంసాక్షా ద్భక్తియోగమధోక్షజే ।
లోకస్యాజానతోవిద్వాం శ్చక్రేసాత్వతసంహితామ్॥

భా. 1.7.4 to 6.

కృప గలుగును. కృష్ణ కృపాబలముకంటె ననర్థనాశమునకును, ఆత్మోన్నతి లాభమునకును వేఱొక యుపాయమే లేదు. *

వ్యాసనారద సంవాదము.

శుద్ధ భక్తిమార్గమునందు మానవునకుఁగల నిష్కాపట్యమగు విశ్వాసమే సహజ సమాధికి మూలకారణము. వ్యాస మహర్షికి మంచికాలము వచ్చుటచేతనే కర్మకాండయొక్కయు, శుష్క జ్ఞానకాండయొక్కయు ప్రయోజనము విషయమై సంశయమతని కుదయించెను. అప్పుడతఁడు తనకు గురువగు శ్రీ నారదమహర్షినిఁజూచి, "ఓ స్వామీ! తమరే జ్ఞానముగూర్చి సెలవిచ్చితిరో, అదియంతయు నేను సంపాదించియే యుంటిని కాని యందువలన నాకెట్టి సంతుష్టియుఁ గలుగలేదు. కావున నోబ్రహ్మనందనా! నా యీ దురవస్థకు మూలకారణ మెద్దియో తాము సెలవిత్తురుగాక. నేను బహుకష్టస్థితిలోనుండి తమవలన నిది తెలిసికొనఁ గోరుచున్నాను. †" అని చెప్పెను.

---

* నాయమాత్మాప్రవచనేనలభ్యో,
నమేధయానబహునాశ్రుతేన ।
యమేవైషవృణుతే తేనలభ్యస్తస్యైష
ఆత్మా వివృణుతే తనూగ్స్వాం॥
నాయమాత్మా బలహీనేన లభ్యో
నచప్రమాదాత్తపసోవాప్యలింగాత్ ।
ఏతైరుపాయైర్యతతేయస్తు విద్వాం
స్తస్యైషఆత్మావిశతేబ్రహ్మధామ॥

ముండకోపనిషత్.

† అస్త్యేవమే సర్వమిదం త్వయోక్తం,
తథాపి నాత్మా పరితుష్యతేమే ।
తన్మూలమవ్యక్త మగాధబోధం
పృచ్ఛామహేత్వాత్మ భవాత్మభూతమ్॥

భా. 1.5.5.

అప్పుడు శ్రీ నారదమహర్షి యిట్లు సెలవిచ్చెను. "ఓ వ్యాసుఁడా! ఆయా పురాణములయందును, వేదాంత సూత్రములందును, శ్రీమహాభారతమందును ధర్మార్థ కామమోక్షములను పురుషార్థములను నీవెంత విపులముగ వర్ణించితివో అంత విపులముగ భగవంతునియొక్క నిర్మల చిన్మయ లీలోదయములు వర్ణించితివి కావు. తత్కారణముచే నీకుఁ గల్గిన క్షుద్రావస్థను బట్టి నీకు తుష్టిలాభము కలుగలేదు. మీఁదు మిక్కిలి బద్ధజీవునికి వర్ణాశ్రమధర్మమే స్వధర్మమనుచు నీవు దాని నతిశయముగ శ్లాఘించుటచేఁ డీఅని ముప్పు వచ్చినది. ఇట్టి యౌపాధికమగు స్వధర్మము నాచరించుట మాని యెవ్వఁడైనను హరిభజనము సేయుచు నపక్వస్థితియందుఁ బతితుఁడైనచో నందువలన వానికేమి యమంగళము కలుగుచున్నది? పోనీ, ఆ యౌపాధిక స్వధర్మమునే యాచరింపుచు హరిభజనము బొత్తుగ మానుకొన్నవాని కెట్టి దుర్లభమగు స్వార్థలాభము కలుగనున్నది?"*

ఈ యుపదేశముచే హరిభజనముకంటె వేఱగు నుపాయమే లేదని తెలియుచున్నది. ఏకాంత నామాశ్రయరూపమగు హరిభజనమే జీవునికి సమస్తలాభములను సమకూర్చును.†

---

* త్యక్త్వాస్వధర్మం చరణాంబుజం హరే,
ర్భజన్నపక్వోఽథపతేత్తతోయది ।
యత్రక్వవాభద్రమభూదముష్యకిం,
కోవార్థఆప్తోఽభ[illegible]ం స్వధర్మతః॥

భా. 1.5.17.

† ఏతన్నిర్విద్యమానానా మిచ్ఛతామకుతోభయం ।
యోగినాం నృపనిర్ణీతం హరేర్నామానుకీర్తనం॥

భా. 2.1.11.

ఏతావానేవలోకేఽస్మిన్ పుంసాంధర్మః పరఃస్మృతః ।
భక్తియోగోభగవతి తన్నామగ్రహణాదిభిః॥

భా. 6.3.22.

ఈ భక్తియోగముయొక్క సాహాయ్యముచేతనే వ్యాస దేవునకు సహజ సమాధిలాభము కలిగెను. జీవునికిఁ గృష్ణభక్తియే యత్యంత సహజధర్మమగుటచే నీసమాధి సహజ సమాధియని చెప్పఁబడుచున్నది. ఆత్మయొక్క నిత్యధర్మమే జీవుని సహజధర్మము. సహజధర్మముయొక్క ప్రక్రియయే యిది.

కృష్ణభక్తియే ఆత్మయొక్క నిత్య సహజ ధర్మము.

అపుడు జీవుఁడు కర్మమార్గముచేఁ దనకెట్టి నిత్యలాభమును గలుగదనియు, బదునెనిమిది యవరకర్మలయందు యోగ్యత కలుగుటచేఁగానీ, అష్టాంగయోగము మున్నగు సూక్ష్మయోగములందు యోగ్యత కలుగుటచేఁగానీ, తనకు స్వధర్మమగు కృష్ణదాస్యము లభింపనేరదనియు, లింగశరీర వ్యాపార రూపమగు జడజ్ఞానముచేతను, ఆధ్యాత్మికమగు చిన్మాత్రోద్దేశక క్షుద్ర జ్ఞానముచేతను, దనకు నిత్యలాభము కలిగెడివిధము కనఁబడదనియు, స్పష్టముగఁ దెలిసికొనును. * అపుడు వానికెట్టి యుపాయము తోఁపక సాధుపురుషుఁడగు గురుదేవుని కటాక్షముకొఱ కిట్లు మొఱపెట్టును:—"ఓ కృష్ణా! ఓ పతితపావనా! నేను నీకు నిత్యదాసుఁడనై కూడ సంసార సముద్రమునఁ బడి కష్టముల ననుభవించుచుంటిని. ప్రభూ! అనుగ్రహించి నీ చరణధూళి నా కాశ్రయముగ నిమ్ము."†

---

* పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేదమాయాన్నాస్త్యకృతఃకృతేన ।
తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్
సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥

ముండకోపనిషత్.

† అయినందతనూజ! కింకరం, పతితం మాంవిషమే భవాంబుధౌ।
కృపయాతవపాదపంకజ స్థితధూళీసదృశం విచింతయ॥

శ్రీ శిక్షాష్టకమ్.

**కృష్ణశరణము.**

ఈ మొఱవిని కృపామయుఁడగు భగవంతుఁడు తన పాదపద్మముల సన్నిధిని జీవునిఁ జేర్చుకొని వాని నాదరించును.

**సాధుసంగమున శ్రవణకీర్తనములు.**

సరళ (అకపట) ములగు పులకాశ్రువులతోఁ గృష్ణనామశ్రవణమును, గీర్తనమును, స్మరణమును జేయఁగాఁ జేయఁగా భావజీవన ముదయించును. కృష్ణుఁడపుడు హృదయమందుఁ బ్రవేశించి హృదయగతములగు ననర్థముల నన్నింటిని బాఱఁద్రోలి, దానినిఁ బరిశుద్ధము చేసి యందుఁ దన ప్రేమను గృపాపూర్వకముగ నునుచును. ఇట్టి యవస్థయం దెవరికి శరణాగతి శూన్యమగుచున్నదో, అట్టివారు దంభపూర్వక వ్యాపారము నవలంబించి కూటసమాధి నభ్యసించి హృదయమును శుష్క మొనర్చి ప్రేమలాభమునందు వంచితులగుచున్నారు. కావున జీవుఁ డప్రమత్తుఁడగుచు దైన్యమును, ఆత్మ నివేదనమును నిష్కపటభావమున నవలంబించి తనహృదయమందిరము కృష్ణప్రవేశయోగ్యముగ నొనర్చుకొనవలెను. అప్పుడు జడవృత్తులన్నియు నొక్కమాఱుగా నడఁగి యాత్మ నేత్రము తెఱువఁబడుటచే భగవత్తత్త్వదర్శనలాభము కలుగును. అసత్సంగపరిత్యాగమును, సత్సంగాదరమును గలిగినచో భగవద్దర్శనకార్యమందు నిర్బంధినీ మతి జన్మించి నిష్ఠాదిక్రమమున భావోదయమగును. కుటిలాంతఃకరణము గలవారికిఁ గుమార్గగతియే యవశ్యము ప్రాప్తించును.

**అప్రాకృత తత్త్వోపలబ్ధి చిత్తనైర్మల్యముచేఁ గలుగును.**

ప్రేమారురుక్షువగు మానవుఁడు సాధుసంగమందుఁ జేఱి సరళభావమునఁ గేవల కృష్ణనామ జపమును సర్వదా చేయుచుండును. భక్తియొక్క యితరాంగము లెవ్వియును వానికపుడు రుచింపవు. నామమందుఁ గొద్దిదినములఁ జిత్తమేకాగ్ర మొనర్చినచో యమ నియమ ప్రాణాయామ ధ్యాన ధారణా ప్రత్యా

హారముల ఫలము లభించి తీఱును. ఆయంగిములం దొక్కటియు నభ్యసింపకపోయినను నామముయొక్క కృపచేఁ జిత్తవృత్తి నిరోధరూపమగు ఫలము గలిగి తీఱును. చిత్తము నిర్మలమైనచో నప్రాకృత జగత్తునందలి వైచిత్ర్యమంతయు నందుదయించును. నామభజనముచే నెంతటి సుఖము గలుగుచున్నదో అందులో నణుమాత్రమైన నితరములగు నేయుపాయముల చేతను గలుగనేరదు. కృష్ణ కృపాధనమును మించి జీవుఁడు కోరవలసిన వేఱు ధనములేదు.

నామము చిన్మయమును బరమారాధ్యమునగు వస్తువు.

నామము చిన్మయవస్తువు. నామముతో సమానమగు జ్ఞానమును, నామముతో సమానమగు వ్రతమును, నామముతో సమానమగు ధ్యానమును, నామముతో సమానమగు ఫలమును, నామముతో సమానమగు త్యాగమును, నామముతో సమానమగు శమమును, నామముతో సమానమగు పుణ్యమును, నామముతో సమానమగు గతియు, మఱి యెచ్చటను లేదు. నామమే పరమముక్తి, నామమే పరమగతి, నామమే పరమశాంతి, నామమే పరమస్థితి, నామమే పరమభక్తి, నామమే పరమ మతి, నామమే పరమప్రీతి, నామమే పరమ స్మృతి, యనెడి నిశ్చయము సదా కలిగియుండవలెను. నామమే జీవునికిఁ గారణము, నామమే జీవునికిఁ బ్రభువు, నామమే పరమారాధ్యవస్తువు, నామమే పరమగురువు.

నామ భజనమునకు

నామముయొక్క చిన్మయత్వమును, సర్వ తత్త్వాధికత్వమును వేదములు వేయినోళ్లతో వర్ణించినవి. * ఓభగవంతుఁడా! నీనామము సర్వోత్తమమైనదని నేను

* ఓం ఆఽస్యజానంతో నామ చిద్వివిక్తన మహస్తే విష్ణో సుమతిం భజామహే ఓం తత్సత్ । ఓం పదం దేవస్య నమసా వ్యన్తః శ్రవస్యవశ్రవ ఆపన్న మృత్యుం । నామాని చిద్దధిరే యజ్ఞియాని

దేశకాల నియమము లేదు.

విచారపూర్వకముగఁ దెలిసికొని నేను దానిని భజించుచున్నాను. నామభజనమందుఁ గొంచెమైనను నియమము లేదు. నామము సకల సత్కర్మలకు నతీతమైనది. అది చిత్స్వరూపవస్తువు. తేజస్స్వరూప ప్రకాశము. ఆనామమునుండియే సమస్తవేదములు నావిర్భవించినవి. అది పరమానంద స్వరూపమును, బరబ్రహ్మ స్వరూపమును. నామమునే మనము చక్కఁగ భజింపఁగలము. ఆత్మస్వరూపమును దెలిసికొనుటకంటె నామమును దెలిసికొనుట సులభము. నామము శోభన విద్యారూపము. కావున సాధనమును, సాధ్యమునుగూడ నదియే. ప్రభూ! నీవు పరమ పూజనీయుఁడవు; పద స్వరూపుఁడవు. నీ చరణకమలములకు నేను మఱల మఱల నమస్కరించుచున్నాను. ఆత్మశ్రేయస్సాధకులు నీ నామమహత్త్వము నొకరితో నొకరు విచారింపుచుందురు. కొందఱు దానిని వేనోళ్లతోఁ జాటుచుందురు. నీనామము చైతన్యస్వరూపమని తెలిసికొని దానిని శరణజొత్తురు. నీయొక్క యశఃకీర్తన స్వరూపమగు నామగానమును వినుటకై నీ భక్తగణము సర్వదా నామగానము సేయుచుందురు. అట్లు చేయుటచే వారు పవిత్రులగుచున్నారు. నామమే సత్తును, సత్యస్వరూపమును, వేదమాతయును, సారభూతయును, సచ్చిదానంద ఘనమును. ఓ విష్ణూ! నిన్ను స్తుతించుటకు నేను నామకృపచేతనే సమర్థుఁడ నగుచున్నాను. కేవలము నీ నామమునే భజింతును. శ్రీమన్మహా

నామము నుండియే వేదాదులు నిఃసృతములు.

---

భద్రాయ స్తే రణయంతః సంద్రుష్టౌ। ఓం తముస్తోతారః పూర్వ్య యథావిద ఋతస్యగర్భం జనుషాపి పర్తన్ ఆఽస్యజానంతో నామ చిద్వివిక్తన । మహస్తే విష్ణో సుమతిం భజామహే॥

శ్రుతిః.

ప్రభువు శిక్షాష్టకమందు నామమాహాత్మ్యమునే వచించెను. * నామము యొక్క భజనక్రమ మెనిమిదిశ్లోకములలో భూమికారూపమున లిఖించెను.

శిక్షాష్టకమందు నామభజనప్రణాళి వక్కాణింపఁబడినది.

పది నామాపరాధములలో దేనికిని లోఁబడకుండ నామభజనము సేయుటెట్లో దాని లక్షణము "తృణాదపి సునీచేన" శ్లోకమూలమునఁజెప్పెను. అహైతుకీ భక్తితో నామభజనము సేయుటెట్లో అది, "నధనం నజనం" మ్మను శ్లోకమునందుఁ జెప్పెను. విజ్ఞప్తి సేయుటెట్లో అది "అయినంద తనూజ" యను శ్లోకమందుఁ జెప్పెను. వ్రజ భజనమందు సంభోగ విప్రలంభరసమున శ్రీమతి ననుగమించుచు నామభజనము సేయుటెట్లో అది కడపటి రెండుశ్లోకములలోఁ జెప్పెను. నామ మాహాత్మ్యమును గుఱించి శాస్త్రములందుఁ జెప్పిన దంతయు నీ పుస్తకమున వ్రాయఁబూనినచో నిది శ్రీహరిభక్తివిలాసమంత పెద్ద గ్రంథమగును. నామ మాహాత్మ్యమును గూర్చి మఱి యధికముగఁ జెప్పకుండ నిపుడు నామభజన ప్రణాళిని గూర్చి కొంచెము వివరింతును.

---

* చేతోదర్పణమార్జనం భవమహాదావాగ్నినిర్వాపణం
శ్రేయఃకైరవచంద్రికా వితరణం విద్యావధూజీవనం।
ఆనందాంబుధివర్ధనం ప్రతిపదం పూర్ణామృతాస్వాదనం
సర్వాత్మస్నపనంపరం విజయతే శ్రీకృష్ణసంకీర్తనమ్॥
శ్రీ శిక్షాష్టకమ్.

నామ్నామకారి బహుధానిజసర్వశక్తి
స్తత్రార్పితానియమితః స్మరణే న కాలః।
ఏతాదృశీతవకృపాభగవన్మమాపి
దుర్దైవమీదృశమిహాజని నానురాగః॥

శ్రీశిక్షాష్టకమ్.

నామస్వరూపజ్ఞానమును నిజస్వరూపజ్ఞానమును నామభజనమునకుఁ బూర్వమే కలిగి యుండుటావశ్యకము.

ప్రేమారురుక్షువులగు పురుషులు నామభజనము సేయుటకుఁ బూర్వమందే యొక కొన్ని విషయములను సదా జ్ఞప్తి యందుంచుకొందురు. కృష్ణస్వరూపమును, కృష్ణనామస్వరూపమును కృష్ణసేవా స్వరూపమును, కృష్ణదాస స్వరూపమును నిత్యముక్తములు చిన్మయములనియు, కృష్ణుఁడును, వాని ధామమును, వాని సమస్త లీలాపరికరములును చిన్మయములు మాయాతీతములనియు, కృష్ణసేవకు సంబంధించిన వానిలోఁ బ్రాకృతమగునది యొక్కటియు లేదనియు, కృష్ణుని పీఠము, గృహము, ఉద్యానము, వనము, యమున, మఱియు సమస్త ద్రవ్యములును చిన్మయములు కావున నప్రాకృతములనియు, వారు మొదటనే తెలిసికొని యుందురు. మఱియు వారి విశ్వాసము జడసంబంధమగు నంధ విశ్వాసము కాక యిది పరమసత్యమును, నిత్యమును నగు సమ్మిగయనియు, నీజగత్తునందా ద్రవ్యస్వరూపము లెవ్వియును వాస్తవ స్థితియందు సందృశ్యములు కావనియు, నాయావస్తువులయం దభిమానముగల శుద్ధభక్తుల హృదయములయందు మాత్రము వాని స్వరూపములు నిత్యము ప్రకాశించుచుండు ననియు, నీలోకమునందు సాధనకు ఫలము స్వరూప సిద్ధిమాత్రమే యనియు, స్వరూపసిద్ధిగలవానికిఁ గృష్ణకృపచే నతిశీఘ్రముగ వస్తుసిద్ధి కలుగుననియు, నా పరమసిద్ధవస్తువుయొక్క యాభాసమాత్రమే యిచట సాధనఫలముగ నుదయించుననియు, నీయుదయముయొక్క మొదటివిధము ముక్తియనియు,* గడపటివిధము ప్రేమయనియుఁ, గూడఁ దెలిసికొందురు.

* ముక్తిర్హిత్వాన్యథారూపం స్వరూపేణవ్యవస్థితిః.
భా. 2.10.6.

## షష్ఠవృష్టి—చతుర్థధార.

### నామభజనప్రణాళి.

శ్లో. అవ్యాఖ్యేయాం వితరతి పరాం ప్రీతిమంతర్నిమగ్నా
కంఠేలగ్నాంహరతి నితరాం యాంతరధ్వాంతజాలమ్
తాంద్రాక్షౌఘైరపి బహుమతాం మాధురీముద్గిరంతీం
కృష్ణేత్యాఖ్యాం కథయ రసనే! యద్యసిత్వం రసజ్ఞా.

**నామము కృష్ణావతార స్వరూపము.**

అప్రాకృత తత్త్వముయొక్క స్వరూపజ్ఞానమే స్వరూపసిద్ధి యనఁబడుచున్నది. దీనినే ప్రకృతసంబంధజ్ఞానమందురు. సంబంధజ్ఞానముండియే ప్రేమానుశీలనరూపమగు నభిధేయమును, ప్రేమప్రాప్తి రూపమగు ప్రయోజనమును గలుగుచున్నవి. కృష్ణుని చిద్ధామమును జన్మయ నామమును, జిన్మయగుణమును, జిన్మయలీలలును ప్రేమాంతర్గతములగు ప్రయోజన విశేషములు. ప్రశ్నోపనిషత్తునందు భగవన్నామభజనము నిర్ణయింపఁబడినది. * కృష్ణుఁడీ జగత్తునకు నామరూపమున నవతరించెననునది సర్వ సమ్మతమగు విషయము. అక్షరాత్మకమైనను నామబలముచేతనే యీ యక్షరాత్మకమగు నామ మప్రాకృత కృష్ణావతార

---

* ఋగ్భిరేతం యజుర్భిరంతరిక్షం ససామభిర్యత్తత్కవయో వేదయంతే తమోంకారేణైవాయతనేనాన్వేతి విద్వాన్ యత్తచ్ఛాంతమజరమమృతమభయంపరంచేతి॥ తేషు సత్యం ప్రతిష్ఠితం బ్రహ్మణో నామ సత్యమ్.

ప్రశ్నోపనిషత్.

విశేషమగుచున్నది. † నామనామ్య భేద విచారమును బట్టి శ్రీ కృష్ణుఁడు గోలోక బృందావనమునుండి నామరూపమున విజయంచేసెను. కావునఁ గృష్ణనామమే కృష్ణునియొక్క ప్రథమ పరిచయము. కృష్ణుని బొంకవలయు నను సంకల్పముచేతనే జీవుఁడు కృష్ణనామమును గ్రహించుచున్నాఁడు. శ్రీ స్వరూప దామోదర గోస్వామియొక్క ప్రియశిష్యుఁడగు శ్రీ గోపాల గురు గోస్వామి హరినామార్థనిర్ణయము సేయుచోట నగ్నిపురాణమునందలి,

"శ్లో॥ హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
రటంతి హేలయా వాపి తే కృతార్థా నసంశయః".

అను శ్లోకమును, బ్రహ్మాండపురాణమునందలి,

"శ్లో॥ హరే రామ హరే రామ రామ రామ హరే హరే
యే రటంతి ఇదం నామ సర్వపాపం తరంతి తే"

అను శ్లోకమును రచించెను. ఏతచ్ఛ్లోక సంగ్రహకారుఁడగు శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు,

"శ్లో॥ శ్రీ చైతన్యముఖోద్గీర్ణ 'హరే కృ' ష్ణేతివర్ణకాః
మజ్జయంతో జగత్ప్రేమ్ణి విజయంతాం తదాజ్ఞయా"

అను శ్లోకానుసారముగ,

---

† ఓంకార ఏవేదం సర్వం, ఓమిత్యేతదక్షర మిదగ్ం సర్వం ।
సర్వవ్యాపినమోంకారం మత్వాధీరోనశోచతి ।
ఓంకారో విదితోయేన సమునిర్నేతరోజనః॥
అవతారాంతరవత్ పరమేశ్వర స్యైవవర్ణరూపేణావతారోయ మితి।
తస్మాన్నామనామినోఽరభేదఏవ ।

భగవత్సందర్భే.

ఓమిత్యేతద్బ్రహ్మణో నేదిష్ఠంనామ యస్మా దుచ్చార్యమాణ ఏవ సంసార భయాత్తారయతి తస్మాదుచ్యతే తార ఇతి.

భక్తిసందర్భే.

"హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
హరే రామ హరే రామ రామ రామ హరే హరే"

అనునట్టి పదునాఱు నామములును, ముప్పది రెండక్షరములును గల నామమాలను జీవులు గ్రహింపవలెనని శ్రీ చైతన్య చరితామృతమందును, శ్రీచైతన్య భాగవతమునందును విధించెను. శ్రీ గోపాల గురు

పదునాఱు నామముల యర్థము.

గోస్వామి యా పదునాఱు నామములకు నిట్లర్థము చెప్పెను:—హరిశబ్ద ముచ్చరించుటచే దుష్టచిత్తులయొక్క సమస్తపాపములును దూరీభూతములగుచున్నవి. అగ్నిని దాఁకవలయునను నుద్దేశము లేకున్నను దానినిఁ దాఁకినచో నది యెట్లు దహించునో, అట్లే హరినామము నుచ్చరించు నుద్దేశము లేకపోయినను దాని నుచ్చరించునపు డది సర్వపాపములను హరించును (దహించును). ఈ హరినామము చిద్ఘనానంద విగ్రహరూపమగు భగవత్తత్త్వమునే ప్రదర్శిత మొనర్చుచు నవిద్యను, దత్కార్యమును గూడ హరించును (నాశనము సేయును). ఇట్టికార్యము లొనర్చుటచేత నే 'హరి' యను నామ మేర్పడెను. స్థావర జంగమములయొక్క తాపత్రయములను హరించును గనుక నది 'హరి' నామమయ్యెను. అప్రాకృతములగు సద్గుణములను వినుటచేతను, గీర్తించుటచేతను సమస్త లోకములయొక్క మనస్సును హరించునదియే హరినామము. తన కోటి మన్మధ లావణ్యముచేతను, దన సహజ మాధుర్యముచేతను సమస్తలోకములయొక్కయు, దుదకు అవతార మూర్తులయొక్కయు మనస్సులను హరించునదే హరినామము. హరిని సంబోధించునపుడు 'హరే' శబ్దము ప్రయోగింపఁబడుచున్నది. లేక, బ్రహ్మసంహిత మతానుసారము స్వరూప ప్రేమ వాత్సల్యముచే నెవతె శ్రీ హరియొక్క మనస్సును హరించుచున్నదో, అట్టి 'హరా' శబ్దవాచ్యయగు వృషభాను నందిని శ్రీమతి రాధికను సంబోధించుటయందు 'హరే' యనునది ప్రయుక్తమగుచున్నది. 'కృష్ణ' శబ్దార్థమాగమ మతానుసార మిట్లు

చెప్పఁబడుచున్నది:—'కృష్' ధాతువునకు 'ణ' ప్రత్యయముఁ జేర్చుటచేనైన 'కృష్ణ'శబ్దమునకు నాకర్షకుఁడును, నానందస్వరూపుఁడును ననియే యర్థము. కృష్ణుఁడే పరంబ్రహ్మ. కృష్ణశబ్దమునకు సంబుద్ధి 'కృష్ణ'.

ఆగమమిట్లు చెప్పుచున్నది:—"ఓ దేవీ! 'రా' యను శబ్దముచ్చరించుటచే సమస్తపాపములును దూరములగుచున్నవి. మఱల నవి లోపలఁ బ్రవేశింపకుండ 'మ' శబ్దము కవాటరూపమునఁ బ్రయుక్తమై 'రామ' నామమగుచున్నది."

పురాణమిట్లు చెప్పుచున్నది:—"వైదగ్ధ్యసార సర్వస్వమూర్తియు, లీలాధిదేవతయు నగు నెవఁడు శ్రీరాధికతో నిత్యము రమించుచుండునో అతఁడు రామశబ్దవాచ్యుఁడగు కృష్ణుఁడు."

భజన క్రియావిచారమందుఁ బ్రత్యేక ప్రయోగములతోఁ గూడిన నామార్థము వివరింపఁబడును.

సంఖ్యానామము.

ప్రేమారురుక్షువులగు భక్తులీ "హరే కృష్ణ" మన్నగు నామములను లెక్కింపుచుఁ గీర్తనమును, స్మరణమును జేయుదురు. కీర్తనకాలమందును, స్మరణకాలమందును నామార్థముచే నప్రాకృత స్వరూపముయొక్క నిరంతరానుశీలనము సేయుచుందురు. నిరంతరానుశీలనము చేయఁగాఁ జేయఁగా సకలానర్థములు నతిశీఘ్రముగ దూరములై చిత్తము నిర్మలమగును. నామాభాసతోఁగూడి సర్వదా నామము జపించుచుండుటచే శుద్ధచిత్తమున నప్రాకృతనామము సహజముగ నుదయించును. *

---

* స్యాత్ కృష్ణనామ చరితాది సితాప్యవిద్యా
పిత్తోపతప్తరసనస్యనరోచికాను
కింత్వాదరా దనుదినం ఖలు సైవజుష్టా
స్వాద్వీక్రమాద్భవతి తద్గదమూలహంత్రీ.

శ్రీఉపదేశామృతమ్.

నామము సేయువారు సాధకులనియు, సిద్ధులనియు, రెండువిధములు.

ద్వివిధ నామగ్రాహకులు.

సాధకులు ప్రాథమికులనియు, ప్రాత్యహికుల నియు మఱల రెండువిధములు. వీరుగాక తక్కిన వారందఱును దేహసంబంధము గలిగిన నిత్య సిద్ధులు. ప్రాథమిక సాధకుఁడు * సంఖ్యావృద్ధితో నామము చేయఁగాఁ జేయఁగా నామకీర్తనమందు నైరంతర్యము

---

* తత్రభక్తోద్వివిధః సాధకః సిద్ధశ్చ సాధకోద్విధా ప్రాథమికః ప్రాత్యహికశ్చ దేహేన సిద్ధో నిత్యసిద్ధః । తత్రప్రాథమికో నిజ చిత్తశుద్ధ్యర్థం జపతి:—

(1) హే హరే! మచ్చిత్తం హృత్వా భవబంధనాన్మోచయ.

(2) హే కృష్ణ! మచ్చిత్త మాకృష.

(3) హే హరే! స్వమాధుర్యేణ మచ్చిత్తం హర.

(4) హే కృష్ణ! స్వభక్తద్వారా భజనజ్ఞాన దానేన మచ్చిత్తం శోధయ.

(5) హే కృష్ణ! నామరూపగుణ లీలాదిషు మన్నిష్ఠాంకురు

(6) హే కృష్ణ! రుచిర్భవతు మే.

(7) హే హరే! నిజసేవాయోగ్యం మాంకురు.

(8) హే హరే! స్వసేవామాదేశయ.

(9) హే హరే! స్వప్రేష్ఠేన సహ స్వాభీష్ట లీలాంశ్రావయ.

(10) హే రామ! ప్రేష్ఠయా సహస్వాభీష్టలీలాం మాం శ్రావయ.

(11) హే హరే! స్వప్రేష్ఠేన సహ స్వాభీష్టలీలాం మాం దర్శయ.

(12) హే రామ! ప్రేష్ఠయా సహ స్వాభీష్టలీలాం మాందర్శయ.

(13) హే రామ! నామరూపగుణలీలాస్మరణాదిషు మాంయోజయ.

(14) హే రామ! తత్రమాం నిజసేవాయోగ్యం కురు.

(15) హే హరే! మాం స్వాంగీకృత రమస్వ.

(16) హే హరే! మయా సహ రమస్వ.

సాధకులు, సిద్ధులును.

లభించుచున్నది. నైరంతర్యలాభము నొంది యతఁడు ప్రాత్యహికుఁడగుచున్నాఁడు. ప్రాథమికసాధకుల యవిద్యాపిత్తోపతప్త రసనకు నామము రుచింపదు. తులసీమాలయందు లెక్కించుచు నామము చేయఁగాఁ జేయఁగా నైరంతర్య సిద్ధికాని, లేక, ప్రాత్యహికావస్థయందు నామమందపుడొకవిధమగు నాదరముగాని, కలుగును. ఇట్టి యవస్థ ప్రాప్తించినపుడు సాధకుఁడు నామభజనము మాని యూరకుండఁజాలఁడు. ఆదరణపూర్వకముగ నామమును సర్వదా చేయుచుండుటచే నామమందు మిక్కుటమగు నభిరుచి యుదయించును. ఈ యవస్థయందుఁ బాపమును, పాపబీజమగు పాపవాసనయు, వీని కన్నిఁటికిని మూలకారణమగు నవిద్యాభినివేశమును, సాధకుని విడిచి దవ్వులకుఁ బోవును. ప్రాథమికావస్థయందు నామభజన మపరాధశూన్యముగఁ జేయవలయునను పట్టుదల పూర్తిగఁ గలిగియుండుట మిగుల నావశ్యకము. దుస్సంగమును గేవలము విడుచుటచేతను, సాధుసంగమందు సద్ధర్మశిక్ష నొందుటచేతను, సాధకున కట్టి పట్టుదల కలుగుచున్నది. * ప్రాథమికావస్థ దాటినచో నైరంతర్యక్రమమున నామమందలి రుచియు, జీవుల

సత్సంగమందుఁ జేటి కృష్ణనామ కీర్తనము.

---

పునః పునః సుదృఢాభ్యాస జన్యసంస్కారేణ నైసర్గికః ప్రాత్యహికః సాధకః సిద్ధనుగో మనసి స్యాదితి.

గోపాలగురుః.

* తథాపి సంగః పరివర్జనీయో గుణేషు మాయారచితేషు తావత్ ।
మద్భక్తియోగేన దృఢేన యావద్రజో నిరస్యేత మనఃకషాయః॥
భా. 11.28.37.

యత్రానురక్తాః సహసైవ ధీరా వ్యపోహ్య దేహాదిషు సంగమూఢమ్।
వ్రజంతి తత్పారమహంస్యమంత్యం యస్మిన్నహింసోపశమః స్వధర్మః॥
భా. 1.18.22.

యందలి దయయు, సహజముగ వృద్ధిఁబొందును. ఇందులకుఁ గర్మ జ్ఞాన యోగముల సాహాయ్యమేమియు నవసరము లేదు. ఒకవేళ నీ మూఁడిఁటి కార్యములు సాధకునియందుఁ బ్రబలముగఁ దోఁచి వానిని విడువకుండి నపుడు తన శరీర యాత్రా నిర్వాహమునకు వాని నతఁ డుపయోగించును. మిక్కిలి పట్టుదలతో సాధుసంగమందు నామకీర్తనము చేయఁగాఁజేయఁగా స్వల్పకాలమునకే చిత్తశుద్ధియును, నవిద్యా నాశ ప్రక్రియయును, సంభవ మగును. అవిద్య నాశనమగుచున్నకొలఁది యుక్త వైరాగ్యమును, సంబంధ జ్ఞానమును బ్రాదుర్భవించి చిత్తము నతి నిర్మలమొనర్చును. ఈ విషయము సమస్త పండితులచేతను మాటిమాటికిఁ బరీక్షింపఁబడుచునే యున్నది.

నామము చెంగట సక్రందనప్రార్థన మొన ర్చుట.

నామము చేయుకాలమందు నామముయొక్క స్వరూపార్థానుశీల నముం దత్యాదరముకలిగి కృష్ణునియెదుట సంక్రం దనసహితముగ ప్రార్థనము చేయఁగాఁజేయఁగాఁ గృష్ణుని కృపచే భజన మూర్ధ్వగతి నొందును. సాధుఁ డిట్లు సేయనిచోఁ గర్మివలెను, జ్ఞానివలెను దానుగూడ ననేక జన్మలెత్తుచు సాధనము చేయవలసివచ్చును.

భారవాహి, సారగ్రాహి.

భజనము సేయువారిలోఁ రెండు తెగలు గలవు. ఒకతెగ భారవాహులు; వేఱొకతెగ సారగ్రాహులు. భుక్తిముక్తులయందు వాంఛగలిగి జడ సంసారమునం దాసక్తి గలవారగుచు ధర్మార్థ కామమోక్షములను సాధించు కార్యభారము గలవారు భారవాహులు. సారవస్తువగు ప్రేమను వారలెఱుంగఁజాలరు. కావున భారవాహులెన్ని కార్యము లొనర్చినను, ఎన్ని ప్రయత్నములు చేసినను భజనోన్నతి లాభమును బొందఁజాలరు. సారగ్రాహులకుఁ బ్రేమ తత్త్వమందు లక్ష్యముండుటచే నతి శీఘ్రముగ నభీష్టపదప్రాప్తి నొందుదురు. వీరే ప్రేమారురుక్షువులు; వీరలే యతిస్వల్పకాలములోఁ బ్రేమారూఢులు గాని, సహజ

పరమహంసలుగాని, అగుదురు. భాగవాహి యొకవేళ సాధు సంగమందుఁ జేటి సారవస్తు గ్రహణమందు శిక్షితుడైనచో నతఁడు గూడ నతిశీఘ్రముగఁ ప్రేమారురుక్షువగును. *

శ్రద్ధయు, సాధు సంగమును.

అనేక జన్మగతమగు భక్త్యున్ముఖతయొక్క సుకృతబలముచేత భక్తి మార్గమందు శ్రద్ధ యుదయించును. ఆశ్రద్ధ భక్తసంగమునం దభిరుచి పుట్టించును. శుద్ధభక్తసంగమందుఁ జేటి భజనాదిక మొనర్చుచున్నచోఁ ప్రేమోన్ముఖియగు సాధనభక్తి యుదయించును. శుద్ధభక్తులకృపకుఁ బాత్రుఁడై వారలచే సాధనప్రణాళి యనుగ్రహింపఁ బడినవాఁ డత్యల్పకాలములోఁ ప్రేమారురుక్షువగును. మిశ్రభక్తులయొక్కయు, భక్తాభాసులయొక్కయు సంగమందు భజన శిక్ష పొందినవాఁడు ప్రేమతత్త్వమున కత్యంతము దూరుఁడగును; వాఁడేకాంతభక్తుఁడు కాఁజాలఁడు. అట్టి యవస్థయం దనర్థములు ప్రబలియుండుటచే శుద్ధభక్తులయం దాదరముదయింపదు. కుటిలత జన్మించి హృదయమును గపటమయ మొనర్చును. అట్టి యవస్థయందున్న సాధకుఁడు కనిష్ఠాధికారివలె బహుజన్మము లెత్తవలసివచ్చును.

కనిష్ఠశ్రద్ధయనున దొకటి గలదు. అది మిగులఁ గోమలమైనదియు, సర్వదా లౌల్యముచేఁ బరిచాలనమొందునట్టి స్వభావముగలదియును. కోమల శ్రద్ధగలవారు తమ శ్రద్ధకనురూపుఁడగు గురువును, దదనురూప సాధుసంగమును సంపాదింతురు. వారల హృదయ చాంచల్యము నిర్మూలమగుట కా

* తేవై విదంత్యతి తరంతిచ దేవమాయాం
స్త్రీశూద్ర హూణశబరా అపిపాపజీవాః ।
యద్యద్భుతక్రమ పరాయణ శీలశిక్షా
స్తిర్యగ్జనా అపికిము శ్రుతధారణాయే॥

భా. 2.7.46.

గమమార్గమందుఁ జెప్పఁబడిన యర్చనావిధాన ముపయుక్తగురువుచేఁ దెలిసికొని యావిధముగ బహుకాల మర్చనము చేయఁగాఁ జేయఁగా వారలకు నామమందు శ్రద్ధ జన్మించును. నామమందు శ్రద్ధ కలిగినంతనే శుద్ధ సాధుసంగమున నామభజనము సేయు ప్రవృత్తి యుదయించును.

మొదటినుండియుఁ గృష్ణనామమం దనన్య శ్రద్ధగల సౌభాగ్యవంతు లవలంబించు భజనావిధాన మింతకంటె వేఱగునది.

**నామతత్త్వ విద్గురు పదాశ్రయము.**

కృష్ణుని యనుగ్రహముచే వారలు నామతత్త్వవేత్తయగు గురువునే యాశ్రయింతురు. నామతత్త్వవేత్తయగు గురుని యధికార నిర్ణయము శ్రీమన్మహాప్రభువు సెలవిచ్చియుండెను. నామతత్త్వవిషయమై దీక్షాగురుని యావశ్యకత లేకపోయినను నామతత్త్వగురుని యావశ్యకత స్వతస్సిద్ధమే కదా? నామాక్షరములు మనకు సర్వత్ర లభించుచునేయున్నవి. కాని వాని యందలి నిగూఢతత్త్వము విశుద్ధభక్తగురుని కృపచేతనే ప్రకటితమగుచున్నది. గురుకృపచేతనే నామాభాస దూరమగుటయు, నామాపరాధములు తొలంగుటయు సంభవించుచున్నది.

**నామాభాసము.**

నామభజనముసేయు పురుషులకు నామస్వరూప మవగతమైయుండుటచే వారలు మొదటినుండియు మధ్యమాధికారులే. వారు తఱచుగ నామాభాసస్థితికతీతులుగనే యుందురు. ప్రకృత ప్రస్తావమందు వీరే ప్రేమారురుక్షువులు. కృష్ణునియందుఁ బ్రేమయు, శుద్ధభక్తిగలవారియెడల మైత్రియు, గోమలశ్రద్ధగలవారియందుఁ గృపయు, జ్ఞాన లవ దుర్విదగ్ధులును, భగవచ్ఛ్రీమూర్తి విద్వేషులును నగువారియెడల నుపేక్షయు గనఁబఱచుటయే వారల ధర్మవ్యవహారము. ఎవఁడు భక్తుఁడో, ఎవఁడభక్తుఁడో యను విషయము విచారించుటకు సమర్థతలేనందునఁ గనిష్ఠాధికారి యనేకస్థలముల

యందు మిగుల శోచనీయస్థితియందుండును.* మధ్యమాధికారియగు ప్రేమా రురుక్షుభక్తుఁడు త్రివిధ భక్తులయెడలను ద్రివిధ వ్యవహారము యథోచితముగ నెఱపుచు నతిశీఘ్రముగఁ బ్రేమారూఢుఁడై యుత్తమ భక్తుఁడగుచున్నాడు. † మధ్యమాధికారియగు భక్తుఁడే సంగయోగ్యుఁడగు పురుషుఁడు.

ప్రేమారురుక్షువగు మధ్యమాధికారిభక్తుఁడు సంఖ్యాక్రమమున నామము చేసి చేసి తుదను రాత్రింబవళ్లు మూఁడులక్షల నామము చేయఁగలిగియుండును. నామము సేయుటచేఁ గలిగెడి యానందమువలన నామము విడిచిపెట్టవలయునను బుద్ధియే యతనికిఁ బుట్టదు. శయనాది సమయములందు సంఖ్యాక్రమమున నామము చేయుట కవకాశము లేనందునఁ జివరకు లెక్కలేకుండనే నామ మొసర్చును. శ్రీ గోపాలగురు గోస్వామి చెప్పిన నామార్థము భావన సేయుచుండినచో నరస్వభావమందుఁ గల సకలానర్థములును గ్రమముగ నుపశమించి నామముయొక్క పరమానంద స్వరూపము సాక్షాత్కారమగును. నామస్వరూపము స్పష్టముగ నుదయించినపుడు కృష్ణుని చిన్మయస్వరూపము నామస్వరూపమును నైక్యమగుచు నుదయించును.

---

* అర్చాయామేవ హరయే పూజాం యశ్శ్రద్ధయేహతే ।
న తద్భక్తేషు చాన్యేషు స భక్తః ప్రాకృతస్స్మృతః॥

భా. 11-2-47.

† ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ ।
ప్రేమమైత్రీ కృపోపేక్షా యః కరోతి స మధ్యమః॥

భా. 11-2-46.

కృష్ణేతి యస్య గిరి తం మనసాద్రియేత
దీక్షాస్తి చేత్ ప్రణతిభిశ్చ భజంతమీశం ।
శుశ్రూషయా భజనవిజ్ఞమనన్యమన్య
నిందాదిశూన్యహృదమీప్సితసంగలబ్ధ్యా.॥

శ్రీ ఉపదేశామృతమ్.

నామముయొక్క శుద్ధరూపముదయించి రూపసాక్షాత్కారమున కనురూపమగు సాత్త్వికభజనము సాగుచుండఁ బ్రకృతి సంబంధములగు సత్త్వ రజస్తమస్సులు మూఁడును జిత్తమం దడఁగి శుద్ధసత్త్వ మనఁగా, గృష్ణుని యప్రాకృతములగు గుణములన్నియు, నుదయించును. నామ, రూప, గుణములను మూఁడింటియొక్క యైక్యానుసంధానమగు విశుద్ధభజనము సాగుచుండ సహజ సమాధితోఁ గూడుకొన్న యమలచిత్తమునఁ గృష్ణానుగ్రహముచేఁ గృష్ణ లీలాస్ఫూర్తి యుదయించును. ఈవిధమున సంఖ్యాక్రమమునఁగాని, యసంఖ్యాక్రమమునఁగాని కృష్ణనామభజనమును, మనోనేత్రములతోఁ గృష్ణ రూపదర్శనమును, జిత్తమునందుఁ గృష్ణ గుణగణసంభావనయు, సమాధి లాభము నొందిన యాత్మయందుఁ గృష్ణలీలాస్ఫూర్తియు, సంభవించును.

సాధకులకుఁ గలిగెడి యవస్థ లైదువిధములు. ఎట్లన,—

సాధకులకుఁ గలిగెడి పంచవిధావస్థలు.

(1) శ్రవణదశ.
(2) వరణదశ.
(3) స్మరణదశ.
(4) "ఆపన" దశ.
(5) "ప్రాపన" దశ.

(i) శ్రవణ దశ.

సుయోగ్యుఁడగు గురుని సన్నిధిని సాధన సాధ్య విషయములు శ్రవణము సేయుటచే నే సుఖమయదశ గలుగుచున్నదో, అది శ్రవణదశ యనఁబడును. నామాపరాధములు గలుగకుండ నామము సేయువిధమును, నామగ్రహణ ప్రణాళియు, యోగ్యతావిషయములును, శ్రవణ దశయందు సంప్రాప్తములగును. * అందువలన నామమునకు నైరంతర్యము సిద్ధించుచున్నది.

* యథాయథాత్మా పరిమృజ్యతేఽసౌ, మత్పుణ్యగాథా శ్రవణాభిధానైః।
తథాతథా పశ్యతి వస్తుసూక్ష్మం, చక్షుర్యథైవాంజనసంప్రయుక్తమ్॥
భా. 11.14.26.

యోగ్యుఁడగు శ్రీ గురుదేవునివలనఁ బ్రేమగ్రథితమగు నామ మాలికను గ్రహించుటయు, శిష్యుఁడు పరమసంతోషముతో శ్రీగురుచరణముల నాశ్రయించి శుద్ధ భజనాంగీకార రూపమగు వరమును వానివలనఁ బొందుటయు, శ్రీ గురునివలన శక్తిసంచారప్రాప్తి నొందుటయు ననునవి వరణ దశను దెలుపుచున్నవి.

(ii) వరణ దశ.

(iii) స్మరణదశ.

స్మరణము, ధ్యానము, ధారణ, ధ్రువానుస్మృతి, సమాధి యను నీ యైదును స్మరణ ప్రక్రియలు. నామ స్మరణము, రూపస్మరణము, గుణధారణయు, లీలలయొక్క ధ్రువానుస్మృతియు, లీలాప్రవేశముచే నగు కృష్ణరసమగ్నతా రూపమగు సమాధి లాభమును,—ఇవన్నియుఁ గ్రమముగఁ గలిగినేని 'ఆపన' దశ సంప్రాప్తించును.

(iv) 'ఆపన' దశ.

స్మరణమును, 'ఆపన' మును, అష్టకాలీయము లగు కృష్ణుని నిత్యలీలలకు సాధనము లగుచున్నవి. మఱియు వానియందు గాఢమగు నభినివేశము * గలిగినపుడు స్వరూపసిద్ధి కలుగుచున్నది. స్వరూపసిద్ధి గల భక్తులే సహజ పరమహంసలు.

---

* మర్త్యో యదా త్యక్తసమస్తకర్మా, నివేదితాత్మా విచికీర్షితో మే।
తదామృతత్వం ప్రతిపద్యమానో మయాత్మభూయాయ చ కల్పతే వై॥
భా. 11-29-34.

ఏకాంతినో యస్య నకించనార్థం, వాంఛంతి యే వై భగవత్ప్రపన్నాః
అత్యద్భుతం తచ్చరితం సుమంగళం, గాయంత ఆనందసముద్రమగ్నాః॥
భా. 8-3-20.

ఇదం హి పుంసస్తపసశ్శ్రుతస్య వా, స్విష్టస్య సూక్తస్య చ బుద్ధిదత్తయోః।
అవిచ్యుతోఽర్థః కవిభిర్నిరూపితో, యదుత్తమశ్లోకగుణానువర్ణనమ్॥
భా. 1-5-22.

స్వరూప సిద్ధి గలిగిన భక్తగణమే పరమహంసలు.

తుదకు కృష్ణానుగ్రహముచే దేహ పతన సమయమందు వస్తురూపమగు సిద్ధదేహముతోఁ దాను వ్రజలీలా పరికరమగుటయే వస్తుసిద్ధి యనఁబడును. నామభజనమున కిదియే చరమఫలము.

(v) 'ప్రాపన'దశ

ప్రేమారురుక్షువులందఱును గృహస్థాశ్రమమును విడిచి సన్యాసాశ్రమము స్వీకరింపు టావశ్యకమా? దీనికు త్తరమేమనిన, గృహస్థాశ్రమమేకానీ, వానప్రస్థమేకానీ, సన్యాసమేకానీ, యేయాశ్రమము ప్రేమా రురుక్షువు తన ప్రేమసాధనమునకుఁ దత్కాలమం దనుకూలముగ నుండునని భావించునో, ఆయాశ్రమమందే యతఁడుండి నామభజనమొనర్చును. ఏ యాశ్రమము ప్రతికూలముగ నతనికిఁ గనఁబడునో, ఆయాశ్రమము నతఁడు వెంటనే పరిత్యజించును. * ఈవిషయమందు శ్రీ వాసపండితుఁడు, శ్రీ పుండరీక విద్యానిధి, శ్రీరామానందుఁడు మున్నగు భగవత్పారిషదులచరిత్రములాలోచనీయములు. వారందఱును సహజ పరమహంసలు. పూర్వకాలమందు ఋభుప్రభృతుల నేకులు గృహస్థాశ్రమమునందుండియే పరమహంసలగుట వినియున్నాము. అటుకాక, శ్రీ రామానుజస్వామి, శ్రీ స్వరూప దామోదరగోస్వామి, శ్రీ మాధవేంద్రపురి గోస్వామి, శ్రీ హరిదాస ఠాకురు, శ్రీ సనాతన గోస్వామి, శ్రీ రఘునాథదాస గోస్వామి మున్నగు మహనీయులు గృహస్థాశ్రమము భజనకుఁ బ్రతికూలమైనదనుచు దానిని విడిచి సన్యాసాశ్రమము స్వీకరించుట కూడ వినియున్నారము.

---

* భయంప్రమత్తస్యవనేష్వపిస్యాద్యతస్స ఆస్తే సహషట్సపత్నః।
జితేంద్రియస్యాత్మరతేర్బుధస్య గృహాశ్రమః కిన్నుకరోత్యవద్యం॥
భా. 5-1-17.

# షష్ఠవృష్టి—పంచమధార.

## ప్రేమారురుక్షువులగు పురుషులగతి.

శ్లో. సంత్యేవాస్మిన్జగతి బహవఃగ పక్షిణోరమ్యరూపా
తేషాం మధ్యే మమతు మహతీ వాసనా చాతకేషు
యైరధ్యాక్షైరథ నిజసఖం నీరదంస్మారయద్భి
శ్చిత్తారూఢం భవతి కిమపి బ్రహ్మకృష్ణాభిధానమ్.

గుర్వనుగ్రహముచేతను, కృష్ణానుగ్రహముచేతను సాధకుఁడు తాను సంపాదించిన భక్తిలతాబీజము, నఁగా, భక్తితత్త్వమందలి శ్రద్ధాలాభమును విశేషప్రయత్నపూర్వకముగ ఫలవంతమగునట్లు చేసికొనును. ఈవిషయమొక రూపకోదాహరణపూర్వకముగ శ్రీమన్మహాప్రభువు ప్రయాగయందు శ్రీరూప గోస్వామికి బోధపఱచెను. సాధకుఁడు కృషికుఁడగుచుఁ దనకు దొరకిన యాబీజమును దన హృదయమునందు నాటును. ఇచ్చట సాధకహృదయము క్షేత్రముగ వర్ణింపఁబడుచున్నది. క్షేత్రమునందు బీజమును నాటుటకు ముందే కర్షకుఁడు క్షేత్రమును దున్ని బీజారోపణమునకు యోగ్యమైనదిగఁ జేసికొనవలెను. భాగ్యవంతుఁడగు జీవుఁడు సద్గురునియొద్ద భుక్తి, ముక్తి, సిద్ధివాంఛాపరిత్యాగ రూపమగు నుపదేశమును బొంది తత్పరిపాలనా రూపముగ క్షేత్రమును లెస్సగ శుభ్రపఱచును. ఇదే సాధుసంగఫలము. తనను దృణముకంటె హీనునిఁగఁ జెప్పుకొనును. తరువుకంటె నధికమగు సహనము గలిగి తనహృదయమును క్షోభరహితముగ నొనర్చుకొనును. *

---

* తృణాదపిసునీచేన తరోరపిసహిష్ణునా ।
అమానినామానదేన కీర్తనీయ స్సదాహరిః॥ శ్రీశిక్షాష్టకమ్.

తాను వేఱుప్రతిష్ఠలు వాంఛింపక సమానియగుచు సర్వజీవులను యథాయోగ్యముగ సన్మానించును. ఇట్టి స్వభావము కలిగినప్పుడే హరి నామ గ్రహణమున కధికారము గలుగును. ఇట్టిసాధనమే క్షేత్రమును శుభ్రపఱచు కార్యము. అశ్వమును వశపఱచుకొనువిధమున మనస్సు నాయావిషయములనుండి మఱలించి యాత్మవశ మొనర్చుకొనుటయే కర్తవ్యము. ఇదియే యుక్తవైరాగ్యము. ఇది భజనమునకుఁ జాల నుపకారకమగును. ఇట్టి యుపకారము శుష్కవైరాగ్యమువలనఁ గలుగదు.

నామ గ్రహణమున కధికారము.

* ఈభక్తిలత శ్రవణము, కీర్తనము, స్మరణము నను జలములచేఁ దడుపఁబడుటవలనఁ గ్రమముగ వృద్ధిఁబొందును. భక్తిలత చిన్మయధర్మము గలదగుటచే దానివృద్ధి యీ ప్రాకృతజగత్తునందే నిలిచిపోవునట్టిదికాదు. చతుర్దశ లోకమయమగు నీబ్రహ్మాండమునంతయుఁ

భక్తిలతావృద్ధికుపాయము.

---

వాచోవేగంమనసఃక్రోధవేగం, జిహ్వావేగముదరోపస్థవేగం।
ఏతాన్ వేగాన్ యోవిషహేతధీరః సర్వామపీమాంపృథివీంసశిష్యాత్॥
ఉపదేశామృతమ్.

ధార్యమాణంమనోయర్హి భ్రామ్యదాశ్వనవస్థితం।
అతంద్రితోఽనురోధేన మార్గేణాత్మ[వ]శంనయేత్॥
భా. 11.20.19.

* బ్రహ్మాండభ్రమితే కోనో భాగ్యవాన్ జీవ
గురుకృష్ణప్రసాదే పాయ్ భక్తిలతాబీజ
మాలీ హఞా కొరెషెయ్ బీజఆరోపణ
శ్రవణకీర్తన జలే కొరయే సేచన
ఉపజియా బాడేలతా బ్రహ్మాండభేదిజాయ
విరజాబ్రహ్మలోకభేదీ పరవ్యోమపాయ

ప్రాంకి ప్రాంకి దాని నతిక్రమించి విరజానది దాటి బ్రహ్మలోకమును ఛేదించుకొని పరవ్యోమమునం బ్రవేశించును. అప్రాకృతమగు చిన్మయ వస్తు

తబేజాయ తదుపరి గోలోక బృందావన
కృష్ణచరణకల్పవృక్షే కొరే ఆరోహణ
తాహా విస్తారిత హాఞాఫలే ప్రేమఫల
ఇహామాలీషేచే నిత్యశ్రవణకీర్తనాదిజల
యదివైష్ణవ అపరాధ ఉఠేహాతీమాతా
ఉపాడేవా ఛిండేతార్ శుకిజాయపాతా
తాతేమాలీయత్నకొరి కొరే ఆవరణ
అపరాధహాతీజైచ్ఛే నహాయ్ఉద్గమ
కింతుజదిలతార్ సంగే ఉఠే ఉపశాఖా
భుక్తిముక్తివాంఛాయత అసంఖ్యతార్ లేఖా
నిషిద్ధాచార్ కుటినాటీ జీవహింసన
లాభపూజా ప్రతిష్ఠాదియత ఉపశాఖాగణ
షేకజలపాఞా ఉపశాఖా బాకేజాయ
స్తబ్ధహాఞా మూలశాఖా బాడితేనాపాయ
ప్రథమే ఇ ఉపశాఖార్ కొరయే ఛేదన
తబేమూలశాఖా బాడీజాయ్‌బృందావన
ప్రేమఫలపాకి పరేమాలీ ఆస్వాదయ
లతా అవలంబి మాలీ కల్పవృక్షపాయ
తాహాసె ఇకల్పవృక్షేర్ కొరయేసేవన
సుఖేప్రేమ ఫలరస కొరే ఆస్వాదన
ఎఇతో పరమఫల పరమపురుషార్థ
జార్ ఆగే తృణ తుల్యచారి పురుషార్థ॥

చైతన్య చరితామృతమ్.

వున కిదియే జడాతిక్రమధర్మము. భక్తుని సామాన్య చేష్టలచేతను, బట్టుదల చేతను స్వరూప జ్ఞానముదయించుటచే భక్తుని యాత్మ యా భక్తిలతను జడాతీతమును, జిన్మయమును నగు తన రాజ్యమునకుఁ గొనిపోవును. క్రమముగఁ బరవ్యోమమున కుపరిభాగమందున్న గోలోక బృందావనమున కది కొనిపోఁబడును. అచ్చట నాభక్తిలత కృష్ణచరణ కల్పవృక్షమును జుట్టుకొని బాగుగ వృద్ధిఁబొంది ప్రేమఫలమును ధరించును. కాని యిచ్చటఁ గూడఁ గర్షకుఁడీ లతకు శ్రవణకీర్తనాది జలములతో నిత్యసేచనము సేయుచునే యుండవలెను. విరజానది కవ్వలియొడ్డు నది తాఁకినచో నాలతకు మఱి యువనతిభయ ముండదు. ప్రకృతి, మహత్తత్త్వ, మహంకార, రూప, రస, గంధ, స్పర్శ, శబ్ద, పంచజ్ఞానేంద్రియ, పంచకర్మేంద్రి, యాంతఃకరణ, క్షితి, జల, తేజో, మరు, ద్వ్యోమ, సత్త్వరజస్తమోమయమగు నీ జడ బ్రహ్మాండమునం దీ లత యెంతవఱకు బద్ధమైయుండునో, అంతవఱకు దాని యున్నతికి వ్యాఘాతములు కలుగుచునే యుండును. జడాతీతమగు స్థలమున కది ప్రాఁకఁ గలిగినచోఁ దన స్వభావ మహిమచేతనే యది యభేద్యమును, అచ్ఛేద్యమును నగుచు నూర్ధ్వగామి యగును. ఈభక్తి లత జడమధ్యమందున్నంతకాలమును గర్షకుఁడు రెండువిషయములఁ గూర్చి మిగుల జాగరూకుఁడై యుండవలెను. వైష్ణవాపరాధమను నట్టి

ఉత్పాత సమూహము.

యేనుఁగు వచ్చి యీ లతను ద్రెంపివేయకుండఁ జూచుకొను టొక విషయము. ఇందుకొఱకు నిస్సంగభజనమును, సాధుజనాశ్రయమును నను నావరణలు రెండు దానికి నిర్మించుట కర్తవ్యము. శుద్ధభక్తసంగము దొరకినచో నిట్టి యుత్పాతమెన్నఁడును బుట్టనేరదు.

వైష్ణవాపరాధము.

మఱియొక విషయమేమనినఁ, నీ లత జడజగత్తున వృద్ధిఁబొందుచుండఁ గుసంగ దోషమున దీనికిఁ గొన్ని యుపశాఖలు పుట్టుట కారంభమగును. భుక్తివాంఛ, ముక్తివాంఛ,

నిషిద్ధాచారము కాపట్యము మున్నగునవి.

నిషిద్ధాచారము, కపటత, శఠత, ధూర్తత, జీవహింస, స్వార్థపరత్వము, సన్మానము, ప్రతిష్ఠావాసన, మున్నగు లెక్కలేని యుపశాఖలు జన్మించును. శ్రవణకీర్తనాది జలసేచనముచే నీ యుపశాఖలన్నియు వృద్ధిఁబొంది మూల శాఖయొక్క యున్నతిని నిరోధపఱచును. భుక్తిముక్తి వాంఛలుగలవారి సాంగత్యము సేయుటవలన నీ యుపశాఖలన్నియు జన్మించును. సహవాసదోషమే భక్తుల పతనమునకు సర్వత్ర కారణముగఁ జెప్పఁబడుచున్నది. కావునఁ గర్షకుఁడు

సద్గురు సంగమే యుత్పాత వినాశకారణము.

సద్గురూపదేశ క్రమమున నా యుపశాఖలు పుట్టినవి పుట్టినట్లుగనే ఛేదింపుచు వానియెడల బహు జాగరూకతతో నుండవలెను. అట్లు చేయుచుండినచో నా భక్తిలతయును మూలశాఖ క్రమముగ వృద్ధిఁ బొంది చివఱకుఁ జిద్ధామబృందావనమునఁ బ్రవేశించును. అచ్చట దానియందుఁ బ్రేమ యను పండు పండినంతనే కర్షకుఁడచ్చటనుండియే దాని నారగించును. లత నాధారము చేసికొని చిత్కణస్వరూపుఁడగు కర్షకుఁడు కృష్ణచరణ కల్పవృక్షమును జేరుకొనును. మఱియు నతఁ డచ్చటనే యుండి కల్పవృక్షమును సేవించుచుఁ బరమ పురుషార్థరూపమగు ప్రేమఫలము ననుభవించుచుండును.

ప్రేమారురుక్షువులగు పురుషు లీ ప్రణాళీక్రమమున శ్రీహరినామశ్రవణమును, గీర్తనమును, స్మరణమును జేయఁగాఁజేయఁగా చిత్తము నిర్మలమై వారలకు భావావస్థ కలుగును. భావోదయముతోపాటు రస యోగ్యతకూడ

మధుర రసము.

జన్మించును. శ్రీకృష్ణలీలలకు సంబంధించిన సకల రసములును మాధుర్యము గలవియే. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్యము లనునవి కూడఁ దమ తమ రసస్థానములయందుఁ బ్రత్యేకములుగఁ బరమోపాదేయములే. అధికార

భేదమును బట్టి భక్తులాయారసములం దభినివేశము గలిగియుందురు. శ్రీమన్మహాప్రభుని శిక్షయందు మధురరసమే భక్తుల కుపాస్యరసముగఁ జెప్పఁబడినది. ఈ రసమునందు శ్రీరాధిక కనుగతులు కానివారు తద్ రసాస్వాదనము సేయఁజాలరు.

రాధాకృష్ణతత్త్వము.

సచ్చిదానందతత్త్వమే పరబ్రహ్మ. శ్రీకృష్ణుఁడు సచ్చిద్రూపి; శ్రీ రాధిక యానందరూపిణి. రాధాకృష్ణు లేక తత్త్వమేయైనను రసమును విస్తరింపఁజేయుటను రెండు రూపములతోఁ బ్రకాశించుచున్నారు. గోపికలందఱిలోఁ శ్రీ రాధయు, చంద్రావళియు మిన్నలు. వారిరువురిలోఁ రాధికయే యన్నివిధములచేతను శ్రేష్ఠురాలు.

జీవుని నిత్యదేహమందులింగభేదములేదు.

వ్రజవాసులభావమం దభినివేశముగలవారు వ్రజవాసుల కనుగతులై సాధనకార్య మొనర్తురని రాగానుగా భక్తి సాధనతత్త్వమందుఁ బూర్వమే చెప్పఁబడినది. కావున శ్రీరాధాకృష్ణుల నిత్యలీలయందుఁ బ్రవేశించుట కుపయోగించు ప్రణాళినిఁ బ్రేమారురుక్షువు లగువారు తమ గురుదేవుని యనుగ్రహము నొంది యవశ్యముగఁ దెలిసికొననగును. సాధకుఁ డీ రసమందుఁ దన గోపీదేహమునే భావించుచు శ్రీ రాధికాయూథమునఁ బ్రవేశలాభము నొందును. సాధన దేహమందుఁ బురుషత్వము ద్యోతకమగుచున్నను భావదేహమందుఁ దాను గోపికయే యగును. ఇది యసంభవమని మాత్ర మెన్నఁడు ననుకొనరాదు. జీవుఁడు కేవలము కృష్ణుని తటస్థశక్తియే. స్థూలదేహమందుఁ బురుషత్వమును, స్త్రీత్వమును గల్పితమగుచుండును. లింగదేహమందుఁగూడ స్త్రీ పురుష ప్రాగ్భావముదయించియేయుండును. జీవునియొక్క నిత్య సిద్ధదేహము చిన్మయము. దానియందు స్త్రీ పురుష భేదములేదు. * చిన్మయ శరీరము స్వతంత్రమును,

---

* వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్యచ ।
భాగోజీవస్సవిజ్ఞేయః సచానంత్యాయకల్పతే॥

శుద్ధ కామమయము. ఎపుడేభావమును బొందవలెయునను కోర్కె గలిగిన నాభావమునే శుద్ధజీవుఁడు పొందుచుఁ దానే స్త్రీయును, పురుషుఁడు నగుచున్నాఁడు. శాంతరసమందు నపుంసకత్వమును, దాస్య సఖ్యరసములందుఁ బురుషత్వమును, మాతృ వాత్సల్యరసమునందు స్త్రీత్వమును, పితృవాత్సల్య రసమునందుఁ బుంస్త్వమును వానికి సిద్ధించుచున్నవి. మధురోజ్జ్వలరసమునందు సకల జీవులును శుద్ధ స్త్రీరూపులే యగుచు నొక్క పరమపురుషుఁడగు శ్రీకృష్ణునే వారు సేవింతురు.

ఏజీవుని కే రసాస్వాదనమం దర్హతయుండునో అది వానికిఁ గల గాఢరుచినిఁ బరీక్షించుటవలనఁ దెలియనగును. భజనయందు శ్రద్ధ గలుగు కాలమందు సాధకుఁ డీ రుచిమూలముననే తనరసమందుఁ దనభినివేశము జూపును. సాధకుని రుచి పరీక్షించియే గురుదేవుఁడు వానికి భజన దీక్ష నొసంగును.

శృంగార రసమయమగు ప్రేమయొక్క స్వరూపము బృహదారణ్యకోపనిషత్తునందు వర్ణింపఁబడినది. *

---

నైవ స్త్రీ న పుమానేష న చైవాయం నపుంసకః।
యద్యచ్ఛరీరమాదత్తే తేన తేన స రక్ష్యతే॥

శ్వేతాశ్వతరశ్రుతిః.

క్వచిత్ పుమాన్ క్వచిచ్చ స్త్రీ క్వచిన్నోభయమంధధీః ।
దేవో మనుష్యస్తిర్యగ్వా యథాకర్మగుణంభవః॥

భా. 4.29.29.

* తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం,
కించన వేద నాంతరమేవాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా
సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరమ్ ।

బృహదారణ్యకశ్రుతిః.

శ్రీకృష్ణుఁడు శృంగారరస సర్వస్వము. శ్రీరాధిక కృపచేతఁ దప్ప నేఅొకవిధముగ నీరసము మూలమునఁ గృష్ణునిఁ బొందుట కవకాశము లేదు. కావున శ్రీ గురుదేవుని యనుగ్రహము సంపాదించియు, శ్రీ గౌరచంద్రుఁ డాయా సమయములం దేయే భావములను బ్రకటించెనో వానిని స్మరించియు, శ్రీ రాధా కృష్ణలీలలను స్మరించినచో నుజ్జ్వలమగు భావ ముదయించును. ప్రాత్యహిక సాధకుఁ డీ జడజగత్తునందు జడదేహముతో నివసించుచున్నను శ్రీగురుదేవుని ప్రసాదముచేఁ దన నిత్య సిద్ధదేహముతో భావమార్గమున నిట్లు భావన సేయఁగలిగియుండును. ఆసిద్ధదేహముతో సప్త కాలీయమగు మానససేవను జేయఁగాఁ జేయఁగా స్వరూపసిద్ధి కలిగి యా లీలలయం దభిమాన ముదయించును.

సిద్ధదేహభావనము.

తనసిద్ధదేహముతో సాధకుఁడీ క్రింద వివరించిన విధముగ భావన సేయనగును :—"గాంధర్వికయగు శ్రీరాధికయొక్క స్వంత యూథమున శ్రీమతి లలితాగణమందు నేనిపుడున్నాను. నేను శ్రీ రూపమంజరి కనుగతను, మఱియు యావటగ్రామ నివాసినిని. నేను చిదానందమయను. జడాతీతనగు చింతనీయాకృతిని. నేను గామరూపానుగామినిని. రసమయిని. ఉజ్జ్వల స్వర్ణవర్ణను. నవయౌవనను. శ్రీ రాధాకృష్ణుల పార్శ్వవర్తినిని."

సిద్ధదేహమునకు సాధనములుగ నామము, రూపము, వయస్సు, వేషము, సంబంధము, యూథము, ఆజ్ఞ, సేవ, పరాకాష్ఠ, పాల్యదాసి, నివాసము నను పదునొకండు పర్వములు చెప్పఁబడెను. వీని నన్నిఁటిని దన స్వరూపమందు భావనసేయుటచే వీనియందభిమానముదయించును. అప్పుడు నిత్యసేవయొక్క స్ఫుటభావము గోచరించును. జడావస్థితి యభ్యాసవశతచే మరణపర్యంతముండియే తీఱును. స్థూలదేహముయొక్క రక్షణము, భరణము, పోషణము, కేవలము తన సాధనమున కనుకూలించు క్రియలుగ భావింపఁ

బడును. ఈసందర్భమున నిచట యేర్చి వ్రాయఁబడిన శ్లోకముల * యర్థము మిక్కిలి తేలికగా నుండునుగావునఁ దెలిసికొనసగును.

---

* శ్లో॥ అస్యైవసిద్ధదేహస్య సాధనాని యథాక్రమం ।
ఏకాదశ ప్రసిద్ధాని వక్ష్యంతేఽతి మనోహరం॥
నామరూప వయోవేష సంబంధో యూథఏవచ ।
ఆజ్ఞాసేవాపరాకాష్ఠా పాల్యదాసీ నివాసకః॥

1. నామయథా—
శ్లో॥ శ్రీరూపమంజరీత్యాది నామాఖ్యానామరూపతః ।
చింతనీయం యథాయోగ్యం సనామవ్రజసుభ్రువాం॥

2. రూపంయథా—
శ్లో॥ రూపంయూథేశ్వరీసేవా యోగ్యంభావ్యం ప్రయత్నతః ।
త్రైలోక్యమోహసంకామో ద్దీపకం గోపికాపతేః॥

3. వయోయథా—
శ్లో॥ వయోనానావిధం తత్ర యత్తుత్రిదశవత్సరం ।
మాధుర్యాద్భుతకైశోరం విఖ్యాతంవ్రజసుభ్రువాం॥

4. వేషోయథా—
శ్లో॥ వేషోనీలపటాద్యైశ్చ విచిత్రాలంకృతైస్తథా ।
స్వస్వదేహానురూపేణ స్వభావరససుందరం॥

5. సంబంధోయథా—
శ్లో॥ సేవ్యసేవకసంబంధః స్వమనోవృత్తిభేదతః ।
ప్రాణాత్యయేఽపినోహేయః కదాస పరివర్తనం॥

6. యూథోయథా—
శ్లో॥ యథాయూథేశ్వరీయూథ స్సదాతిష్ఠంతితద్వశే ।
తథైవసర్వదాతిష్ఠే ద్భూత్వాతద్వశవర్తినీ॥

రాగానుగమార్గమం దెప్పు డభిరుచి కలిగెనో, అప్పుడు సద్గురువు కడకు బోయి ప్రార్థించినచో నతఁడు సాధకుని రుచి పరీక్షించి భజన నిర్ణయము సేయుచు దానితోపాటు వాని సిద్ధదేహముయొక్క పరిచయముకూడ

---

7. ఆజ్ఞాయథా—

శ్లో॥ యూథేశ్వర్యాశ్శిరస్యాజ్ఞా మాదాయహరిరాధయోః ।
యథోదితశ్చ శుశ్రూషాం కుర్యాదానందసంయుతా॥

8. సేవాయథా—

శ్లో॥ చామరవ్యజనాదీనాం సయోగ్యప్రతిపాలనం ।
ఇతిసేవాపరిజ్ఞేయా యథామతివిభాగశః॥

9. పరాకాష్ఠాయథా—

శ్లో॥ శ్రీరాధాకృష్ణయోర్యద్వద్రూపమంజరికాదయః ।
ప్రాప్తానిత్యం సఖీత్వంచ తథాస్యా మితిభావయేత్॥

10. పాల్యదాసీయథా—

శ్లో॥ పాల్యదాసీచసాప్రోక్తా పరిపాల్యప్రియంవదా ।
స్వమనోవృత్తిరూపేణ యానిత్యం పరిచారికా॥

11. నివాసోయథా—

శ్లో॥ నివాసోవ్రజమధ్యేతు రాధాకృష్ణస్థలీయుతః
వంశీవటస్తు శ్రీనందీశ్వరశ్చాప్యతికౌతుకః॥
మంజర్యాబహుశోరూప గుణశీలవయోన్వితాః।
నామరూపాది తత్సర్వం గురుదత్తంచభావయేత్॥
తత్రతత్రస్థితోనిత్యం భజేత్ శ్రీరాధికాపతిం।
నామస్మృతివికాసేన స్థిత్వాకృష్ణప్రియాగృహే॥
తదాజ్ఞాపాలకోభూత్వా కాలేష్వష్టసుసేవతే ।
సఖీనాం సంగినీరూపా మాత్మానం భావనామయం॥

ధ్యానచంద్ర భజనపద్ధతౌ.

నతనికిఁ గలిగించును. అట్టి పరిచయముగల ప్రాత్యహిక సాధకుఁడగు నా ప్రేమా రురుక్షువు గురుసలవాసము నేయుచు సర్వవిషయములను దెలిసికొని ప్రయత్నపూర్వకముగఁ దన స్వస్థానమును స్థిరపఱచుకొని భజనము సేయుట కారంభించును. గురుదత్తములగు తన నామ రూపాదులను స్మరింపఁగా స్మరింపఁగా శీఘ్రముగనే వానియం దభిమానమేర్పడును. ఈ యభిమానమే యాత్మజ్ఞానమనియు, స్వరూపసిద్ధియనియుఁ జెప్పుదురు.

స్వరూపసిద్ధి.

నామ రూప గుణలీలలను భజించుటయు, గీర్తించుటయునను నింతకుముందుఁ జెప్పిన భజనక్రమ మిపుడు పూర్తిగ వికసితమగును. తన నామరూపాదులను జింతింపుచుఁ దన సంబంధ మేర్పఱచుకొని శ్రీ రాధాకృష్ణుల నిత్యసిద్ధములగు నామ రూప గుణ లీలలయందుఁ బ్రవేశించుటే యీ భజనతాత్పర్యము. భక్తిలత విరజానదిని దాటి బ్రహ్మలోకమును భేదించుకొని పరవ్యోమోపరిభాగమగు గోలోక బృందావనమందలి కృష్ణ చరణ కల్పవృక్షముపై కెక్కినంతనే, యాలత నాధారము చేసికొని సాధక కర్షకుఁడప్రాకృతధామమునఁ బ్రవేశించును. ఈ స్వరూపసిద్ధిని గొందఱు భక్తిశాస్త్రకారులు సాధన సంపూర్తి కాకముందు సాధకుఁడు వ్రజమందు గోపగృహమున జన్మించుటగా వ్యాఖ్యానము చేసిరి. కాని యదియుఁ గూడ నసత్యము కాదు. భక్తుఁడగు వైష్ణవుఁడు వస్తుసిద్ధి నొందుటకుఁ బూర్వము ద్విజత్వలాభము పొందుటన ని[illegible]యే యని తెలిసికొనసగును. భక్తుఁడు గోపీదేహమును బొందుటయే యతనికి శుద్ధ ద్విజత్వప్రాప్తి సంపూర్ణముగఁ గలుగుట యనఁబడును. అదియే వాని 'కాపస' దశ. ఆ యవస్థయందు గుణమయదేహము వదలిపోవు నేని సాధకుని కపుడు స్వరూప సిద్ధి యతిక్రమించి వస్తుసిద్ధి కలుగుచున్నది. కృష్ణుని నామ రూప గుణ లీలా స్మరణముయొక్క వికాసముతోఁ గూడిన నిత్య బృందావన లాభ మపుడు

'ఆపస' దశ.

వస్తు సిద్ధి.

కలుగును. భౌమ బృందావనమునకును, గోలోక బృందావనమునకును గల యతి సూక్ష్మభేదము శ్రీ సనాతన గోస్వామి కృతమగు "బృహద్భాగవతామృత" మందు నిరూపింపఁబడినది. *

చిద్ధామమున రజోగుణ తమోగుణములు లేవు. మిశ్ర సత్త్వగుణమైనను లేదు. కాలముయొక్క పరాక్రమముగాని, మాయాశక్తియొక్క యవస్థితిగాని యచట లేదు. కాని యచటఁ గృష్ణుఁడును, కృష్ణపారిషదులును సదా నివసించుచుందురు. † ఇది యెట్లగునను విషయము విచారణీయము. కృష్ణధామము బ్రహ్మధామమున కుపరిభాగమందున్నను మఱల నది నిత్యములగు నష్టకాలాది లీలలకు స్థానమయ్యెను. దేశకాల సంబంధములగు భేదములు గూడ నచటఁ గలవు. ఇది యేమాశ్చర్యము! మానవ లోకమునందుఁ గల సమస్తపదార్థములును హేయవర్జితములగుచు వైకుంఠమునందు నిత్యములుగ నుండునని వేదములయందును, బురాణములయందును ప్రమాణముగఁ జెప్పఁబడెనుగదా? యథార్థవిషయ మేమనిన, నీజగత్తు చిజ్జగత్తుయొక్క ప్రతిఫలనరూపమగు తత్త్వము. ఈలోకమందు సమస్తమును మాయాసంబంధముచేఁ గలుషితమైనది. చిజ్జగత్తునందు మాయయు, దాని త్రిగుణములును లేనందున నచటి సమ

చిద్ధామము.

జడజగత్తు చిద్ధా

---

* యథాక్రీడతితద్భూమౌ గోలోకేఽపిత థైవసః ।
అధ ఊర్ధ్వతయా భేదోఽనయోః కల్ప్యేత కేవలం॥

భాగవతామృతమ్.

† ప్రవర్తతే యత్ర రజస్తమస్తయో
స్సత్త్వంచ మిశ్రంనచ కాలవిక్రమః ।
నయత్రమాయాకిముతాపరేహరే
రనువ్రతా యత్రసురాసురార్చితాః॥

భా. 2.9.10.

మముయొక్క హేయ ప్రతిఫలనము.

స్తమ నవవద్యమైయుండును. అచటి సమస్తమును శుద్ధసత్త్వమయము. కాలమునట్టిదే; దేశమునట్టిదే. కృష్ణలీలలు మాయాతీతములు, త్రిగుణాతీతములు; కావున నిర్గుణములు. ఆలీలలకు రసపుష్టి కలుగుటకై నిర్దోషమగు కాలము, నిర్దోషమగు దేశము, నిర్దోషమగు నాకాశము, జలము మున్నగునవి కృష్ణలీలల కుపకరణము లగుచున్నవి. కావున జడీయకాలాతీతమగు నా చిన్మయ కాలమునఁ గృష్ణలీల లష్టకాలీయములగుచున్నవి. నిశాంతకాలము, ప్రాతఃకాలము, పూర్వాహ్ణకాలము, మధ్యాహ్నకాలము, అపరాహ్ణకాలము సాయంకాలము, ప్రదోషకాలము, రాత్రికాలము నను నీయెనిమిదివిధము లగు కాలములచే నచటి రాత్రియుఁ బవలును విభక్తములై కృష్ణలీలలకు నిత్యమును, నఖండమును నగు రసపుష్టి నొదవించుచున్నవి.

నిత్యధామము, నిత్యలీలలు, నిత్యగణములు.

ధామమగు గోకులబృందావనమం దేలీలలు కృష్ణుని యిచ్ఛచే నిత్యరూపములుగఁ బ్రకాశితము లగుచున్నవో, వాని కనురూపములగు లీలలు గోలోక బృందావనమందు నిత్యవర్తమానము లగుచున్నవి. పద్మపురాణమం దీక్రిందివిషయము గలదు. నారదమహర్షి తన గురుదేవుఁడగు శ్రీ సదాశివునికడకుఁ జని, “ప్రభూ! నేనడిగినవన్నియు నీవు చెప్పఁగా శ్రవణానందమువింటిని. కాని యిపుడు నాకు సర్వోత్తమ భావమార్గము గూర్చి వినవలయునను కోర్కె వొడముచున్నది. కావున దానిని తెలుపు”మ్మనియెను. అప్పుడు మహాదేవుఁడిట్లనెను. “ఓనారదా! కృష్ణుని దాసులును, సఖులును, దలిదండ్రులును, ప్రేయసీ గణమును నిజసదృశగుణ సంపన్నులగుటచే నిత్యులగుచున్నారు. పురాణములందు వర్ణింపఁబడిన యప్రకట లీలలన్నియును గాలచక్రమునందలి ధామబృందావనమునందు నిత్యవర్తమానములగుచుండును. వనగోష్ఠములకు వచ్చిపోవుచుండుటయు, వయస్యులతోఁ గూడి గోచారణము సేయుటయు,—ఇవన్నియు నిచ్ఛ

టన, సచ్ఛటన, నానావిధముగ నుండును. భౌమజగత్తునందలి యసురసంహారము మున్నగునవి రస పుష్టికొఱకు గోలోకమునందలి యప్రకట లీలలయం దభిమానరూపముగ మాత్రముండును. ఆయభిమాన భావమే యసుర సంహనన కార్య రూపముగఁ బ్రకట లీలయందు గోచరముగుచున్నది. కృష్ణుని ప్రేయసీ గణము

అసుర నాశాదులు భావమాత్ర వర్తమానములు.

ప్రచ్ఛన్నభావములు గలిగి పరకీయాభిమానముతో నతనికి సదా సుఖదానమొనర్చుచుందురు. వారల కనుగతులగుచుఁ గృష్ణసేవ సేయువారుకూడ వారలవంటి రూపగుణ శాలినులుగనే తమ్ముఁ దాము భావించుచుందురు. పైనిఁ జెప్పిన సరళార్థము గల శ్లోకములు పఠించినచో సర్వము తెలియఁ గలదు."

అనిన విని నారదుఁ డప్రకట లీలానుభవము లేనివా రట్టిభావములతో హరిసేవన మెట్లు సేయఁగలరని సదాశివునడిగెను. అప్పుడు సదాశివుఁ,"డో నారదా! ఆ యప్రకటలీల యెట్టిదో నాకు వాస్తవముగఁ దెలియదు. అది తెలియకపోవుటకు నాకుఁ గల పురుషభావమే ప్రతిబంధకము. నీవు బృందాదేవివద్దకుఁ బోయినచో నామె దానింగూర్చి చెప్పును. బృందాదేవి గోవిందునిపరిచారిక. సఖీసహితయై యామె సదా కేశితీర్థమందు నివసించుచుండు" నని వచించెను.

నారదుఁడపుడు కేశితీర్థమునకుఁ బోయి బృందాదేవిని జూచి, "ఓ దేవీ! కృష్ణుని నిత్యలీలలను వినుటకు నాకు గోర్కెగలదు. వానిని వినుటకు నాకు యోగ్యత గలదని నీకుఁ దోఁచినచో నవి యనుగ్రహపూర్వకముగ నాకు సెలవి" మ్మనియెను.

ఏరూపముతో, నేభావముతోఁ బ్రాత్యహిక సాధకులు హరిభజనము సేయుదురో, ఆరూపభావములు మహాదేవుఁడే యుపదేశరూపముగ నిచట వచించెను.

---

# షష్ఠవృష్టి—షష్ఠధార.

## అష్టకాల లీలాపరిచయము.

శ్లో॥ నైతత్సమాచరేత్ జాతు
మనసాపి హ్యనీశ్వరః
వినశ్యత్యాచరన్ మౌఢ్యాత్
యథాఽరుద్రోఽబ్ధిజం విషమ్.

అష్టకాల లీలలు.

అష్టకాలలీలల విషయమై శాస్త్రవాక్యనిరూపణచేఁ బాఠకులకు శ్రద్ధ కలుగునట్లాధునిక రచనలవలన నట్టి శ్రద్ధ యుదయింపనేరదు. పురాణవాక్యము లతిపరళార్థములు. వానిందెలిసికొనుటకుఁ జదువరుల కెట్టి కష్టమును లేదు. మఱియు నవి నిత్యపాఠమునకుఁ గూడ మిగుల ననుకూలముగ నుండును. ఈవిషయము నేనాలోచించి పద్మపురాణాంతర్గతమగు పాతాళఖండమునందలి వర్ణన మున్నదున్నట్లుగ నే నిచట నెత్తి వ్రాయుచున్నాను. అనేక కారణములచే దీని యనువాద మిచటఁ బొందుపఱుపలేదు.

—బృందోవాచ.—

(1) నిశాంతలీలా—

రహస్యమపివక్ష్యామి కృష్ణభక్తోసినారద!
నప్రకాశ్యం త్వయా హ్యేత ద్గుహ్యాద్గుహ్యతరంమహత్.
మధ్యేబృందావనేరమ్యే పంచాశత్కుంజమండితే,
కల్పవృక్షనికుంజేతు దివ్యరత్నమయేగృహే.

నిద్రితౌ తిష్ఠత స్తల్పే నిబిడాలింగితౌ మిథః,
మదాజ్ఞాకారిభిః పశ్చాత్ పక్షిభిర్బోధితావపి.
గాఢాలింగన జానంద మాప్తౌ తద్భఙ్గకాతరౌ,
నోమనః కుర్వత స్తల్పా త్సముత్థాతుం మనాగపి.
తతశ్చ శారికాసంఘై శ్శుకాద్యైరపి తౌ ముహుః,
బోధితౌ వివిధైర్వాక్యై స్స్వతల్పాదుదతిష్ఠతాం.
ఉపవిష్టౌ తతో దృష్ట్వా సఖ్య స్తల్పే ముదాన్వితా,
ప్రవిశ్య సేవాం కుర్వంతి తత్కాలే హ్యుచితాం తయోః.
పునశ్చ శారికావాక్యై స్స్వతల్పాదుదతిష్ఠతాం,
గచ్ఛతస్స్వస్వభవనం భీత్యుత్కంఠాకులౌ తతః.

(2) ప్రాతర్లీలా—

ప్రాతశ్చ బోధితో మాత్రా తల్పాదుత్థాయ సత్వరః,
కృత్వా కృష్ణో దంతకాష్ఠం బలదేవసమన్వితః.
మాత్రాఽనుమోదితో యాతి గోశాలాం సఖిభిర్వృతః,
రాధాఽపి బోధితా విప్ర! వయస్యాభిస్స్వతల్పతః.
ఉత్థాయ దంతకాష్ఠాది కృత్వాఽభ్యంగం సమాచరత్,
స్నానవేదిం తతో గత్వా స్నాపితా సా నిజాలిభిః.
భూషాగృహం వ్రజేత్తత్ర వయస్యా భూషయంత్యపి,
భూషణైర్వివిధైర్దివ్యై ర్గంధమాల్యానులేపనైః.
తతస్సఖీజనై స్తస్యా శ్శ్వశ్రూం సంప్రార్థ్య యత్నతః,
పక్తుమాహూయతే స్వన్నం ససఖీ సా యశోదయా.

నారద ఉవాచ.

కథ మాహూయతే దేవి! పాకార్థం తు యశోదయా,
సతీషు పాకకర్త్రీషు రోహిణీప్రముఖాస్వపి?

బృందోవాచ.

పూర్వం దుర్వాససా దత్తో వర స్తస్యై మహామునే!,
ఇతి కాత్యాయనీవక్త్రా చ్ఛ్రుతమాసీన్మయా పురా.

'త్వయాయత్పచ్యతేదేవి, తదన్నం మదనుగ్రహాత్,
మిష్టంస్వాద్వమృతస్పర్థి భోక్తురాయుష్కరం తథా'.
ఇత్యాహ్వాయతితాంనిత్యం యశోదాపుత్రవత్సలా.
ఆయుష్మాన్మేభవేత్పుత్ర స్స్వాదులోభాత్తథాసతీ,
శ్వశ్రావానుమోదితాసాపి హృష్టానందాలయంవ్రజేత్.
సాసఖీప్రకరాతత్ర గత్వాపాకం కరోతిచ,
కృష్ణోపిదుగ్ధ్వాగాః కాశ్చిద్దోహయిత్వాజనైఃపరాః,
ఆగచ్ఛతిపితుర్వాక్యాత్ స్వగృహంసఖిభిర్వృతః.
అభ్యంగైర్మర్దనంకృత్వా దాసైస్సంస్నాపితోముదా,
ధౌతవస్త్రధరస్స్రగ్వీ చందనాక్తకళేబరః.
ద్విఫాలబద్ధచికురైర్గ్రీవాఫాలోపరిస్ఫురత్,
చంద్రాకారస్ఫురద్భాల తిలకాఽలోకరంజితః.
కంకణాంగదకేయూర రత్నముద్రాలసత్కరః,
ముక్తాహారస్ఫురద్వక్షా మకరాకృతికుండలః.
ముహురాకారితోమాత్రా ప్రవిశేద్భోజనాలయం,
అవలంబ్యకరం సఖ్యుర్బలదేవమనువ్రతః.
భుక్త్వాఽథ వివిధాన్నాని భ్రాత్రాచ సఖిభిర్వృతః,
హాసయంశ్చవివిధైర్హాస్యైః సఖీంస్తైర్హసతిస్వయం.
ఇత్థంభుక్త్వాతదాఽచమ్య దివ్యఖట్వోపరిక్షణం,
విశ్రమ్యసేవకైర్దత్తం తాంబూలం విభజన్నదన్.

(3) పూర్వాహ్ణలీలా—

గోపవేషధరఃకృష్ణః ధేనుబృంద పురస్సరః,
వ్రజవాసిజనైఃప్రీత్యా సర్వైరనుగతఃపథి.
పితరం మాతరంనత్వా నేత్రాంతేనాపితంగణం,
యథాయోగ్యం తథాచాఽన్యాన్ వినివర్త్యవనంవ్రజేత్.

వనంప్రవిశ్యపఖిభిః క్రీడయిత్వాక్షణంతతః,
విహారై ర్వివిధై స్తత్ర వనేవిక్రీడతోముదా.
వంచయిత్వాతుతాన్‌సర్వాన్ ద్విత్రైఃప్రియసఖైర్వృతః,
సంకేతకంప్రవజేద్ధర్షా త్ప్రియాసందర్శనోత్సుకః.
సాపికృష్ణం వనంయాంతం దృష్ట్వాస్వంగృహమాగతా,
సూర్యాదిపూజావ్యాజేన కుసుమాహృతయేతథా.
వంచయిత్వాగురూన్‌యాతి ప్రియసంగేచ్ఛయావనం.

(4) మధ్యాహ్నలీలా—

ఇత్థంతౌ బహుయత్నేన మిళిత్వాస్వగణై స్తతః,
విహారై ర్వివిధై స్తత్ర వనేవిక్రీడతౌముదా,
దోళంచైవసమారూఢౌ సఖిభిర్గోళితౌక్వచిత్.
క్వచిద్వేణుంకరస్రస్తం ప్రియయాపహృతంహరిః,
అన్వేషయన్నుపాలబ్ధో విప్రలబ్ధఃప్రియాగణైః.
హసితైర్బహుధాతాభి ర్హాసిత స్తత్ర తిష్ఠతి,
వసంతవాయునాజుష్టం వనఖండం క్వచిన్ముదా.
ప్రవిశ్యచందనాంభోభిః కుంకుమాది జలై రపి,
నిషించతోయంత్రముక్తై స్తత్పంకైర్లింపతోమిథః.
సఖ్యోప్యేవంనిషించంతి తాశ్చతౌసించతఃపునః.
వసంతవాయుజుష్టేషు వనఖండేషుసంవృతః,
తత్తత్కాలోచితైర్నానా విహారైస్స్వగణైర్ద్విజ!
శ్రాంతౌక్వచిద్వృక్షమూల మాసాద్యమునిసత్తమ!.
ఉపవిశ్యాసనేదివ్యే మధుపానం ప్రచక్రతుః,
తతోమధుమదోన్మత్తౌ నిద్రయామీలితేక్షణౌ.
మిథఃపాణీసమాలంబ్య కామబాణవశంగతౌ,
రిరంసూవిశతఃకుంజం స్ఖలద్వాఙ్మనసౌపథి.
క్రీడతశ్చతత స్తత్ర కరిణీయూథపౌయథా.

సఖ్యోఽపిమధుభిర్మత్తా నిద్రయాపీడితేక్షణాః.
అభితోమంజుకుంజేషు సర్వాఏవాపిశిశ్యిరే,
పృథగేకేనవపుషా కృష్ణోఽపియుగపద్విభుః.
సర్వాసాం సన్నిధింగచ్ఛేత్ప్రియయాప్రేరితోముహుః,
రమయిత్వాచతాస్సర్వాః కరిణీర్గజరాడివ.
ప్రియయాచ తథాతాభిః క్రీడార్థంచ సరోవ్రజేత్,
జలసేకైర్మిథస్తత్ర క్రీడతస్సగణౌతతః.
వాసస్స్రిక్చందనైర్దివ్యై ర్భూషణైరపిభూషితౌ,
తత్రైవ సరసస్తీరే దివ్యరత్నమయేగృహే.
ప్రాగేవ ఫలమూలాని కల్పితాని మయామునే!,
హరిస్తత్రప్రథమంభుక్త్వా కాంతయాపరివేష్టితః,
ద్విత్రాభిస్సేవితోగచ్ఛే చ్ఛయ్యాంపుష్పవినిర్మితాం.
తాంబూలైర్వ్యజనైస్తత్ర పాదసంవాహనాదిభిః,
సేవ్యమానోహసంస్తాభి ర్మోదతేప్రేయసీం స్మరన్.
రాధికాపి హరౌసుప్తే సగణాముదితాంతరా,
అపితత్రగతప్రాణా తదుచ్ఛిష్టం భునక్తిచ.
కించిదేవ తతోభుక్త్వా వ్రజేచ్ఛయ్యాం నికేతనే,
ద్రష్టుంకాంతముఖాంభోజం చకోరీవ నిశాకరం.
తాంబూలం చర్వితంతస్య తత్రత్యాభినివేదితం,
తాంబూలాన్యపిచాశ్నాతి విభజంతీప్రియాలిషు.
కృష్ణోపి తాసాంశుశ్రూషు స్స్వచ్ఛందం భాషితంమిథః,
ప్రాప్తనిద్ర ఇవాభాతి వినిద్రోపి పటావృతః.
తాశ్చక్ష్వేలాం క్షణం కృత్వా కుతశ్చిదనుమానతః,
వ్యుదస్యరసనాం దద్భిః పశ్యంత్యోఽన్యోన్యమాననం.
లీనాఇవలజ్జయాస్యుః క్షణమూచుర్నకించన.
క్షణాదేవ తతోవస్త్రం దూరీకృత్య తదంగతః,

సాధునిద్రాంగతోఽసీతి హాసయంతీహసంతిచ.
ఏవంతౌవివిధైర్హాస్యై రమమాణౌగణైస్సహ,
అనుభూయక్షణంనిద్రా సుఖంచమునిసత్తమ!
ఉపవిశ్యాసనేదివ్యే సగణౌ విస్తృతేముదా,
పణీకృత్యమిథోహార చుంబాశ్లేషపరిచ్ఛదాన్.
అక్షైర్విక్రీడతః ప్రేమ్ణా నర్మాలాపపురస్సరం,
పరాజితోఽపి ప్రియయా జితోఽహమితివైబ్రువన్.
హారాదిగ్రహణేతస్యా స్సవృత్తస్తాదృశేతథా,
తయైవంతాడితఃకృష్ణః కరేణాస్యసరోరుహే.
విషణ్ణమానసో భూత్వా గంతుంచ కురుతేమతిం,
జితోఽస్మిచేత్త్వయాదేవి! గృహ్యతాంమత్పణీకృతం.
చుంబనాదిమయాదత్త మిత్యుక్త్వాసాతథాఽచరేత్,
కౌటిల్యంతద్భ్రువోర్ద్రష్టుం శ్రోతుంతద్భర్త్సనం వచః.
తతశ్శారీశుకానాంచ శ్రుత్వావాగాహవంమిథః,
నిర్గచ్ఛత స్తతస్స్థానా ద్గంతుకామాగృహంప్రతి.
కృష్ణఃకాంతామనుజ్ఞాప్య గవామభిముఖంవ్రజేత్,
సాతుసూర్యగృహంగచ్ఛే త్సఖీమండలసంవృతా.
కియద్దూరంతతోగత్వా పరావృత్యహరిఃపునః,
విప్రవేషం సమాస్థాయ యాతిసూర్యగృహంప్రతి.
సూర్యంప్రపూజయేత్తత్ర ప్రార్థిత స్తత్సఖీజనైః,
తదైవకల్పితైర్వేదైః పరిహాసవిగర్హితైః.
తతస్తాజ్ఞాపితంకాంతం పరిజ్ఞాయవిచక్షణాః,
ఆనందసాగరే లీనా నవిదుస్స్వం నచాపరం.
విహారైర్వివిధైరేవం సార్ధయామద్వయం మునే!
నీత్వాగృహాన్వ్రజేయుస్తాః సచకృష్ణోగవాంవ్రజేత్.
సంగమ్యస్వసఖీన్కృష్ణో గృహీత్వాగాస్సమంతతః.

(5) అపరాహ్ణలీలా—

ఆగచ్ఛతివ్రజం హర్షా ద్వాదయన్ మురళీం మునే!,
తతో నందాదయస్సర్వే శ్రుత్వావేణు రవం హరేః.
గోధూళి పటలవ్యాప్తం దృష్ట్వాచాపి నభఃస్థలం,
విసృజ్య సర్వకర్మాణి స్త్రియో బాలాదయోఽపిచ.
కృష్ణస్యాభిముఖం యాంతి తద్దర్శన సముత్సుకాః,
రాజమార్గే వ్రజేద్ద్వారి యత్ర సర్వేవ్రజౌకసః.
కృష్ణోఽపితాన్ సమాగమ్య యథావదను పూర్వశః,
దర్శన స్పర్శనైర్వాచా స్మితపూర్వావ లోకనైః.
గోపవృద్ధాన్ నమస్కారైః కాయికైర్వాచికైరపి,
అష్టాంగ పాతైః పితరౌ రోహిణీ మపినారద!.
నేత్రాంతసూచితే నైవ వినయేన ప్రియాంతథా,
ఏవంతైస్త ద్యథాయోగ్యం వ్రజౌకోభిః ప్రపూజితః.
గవాలయే తథాగాశ్చ సంప్రవేశ్య సమంతతః,
పితృభ్యా మర్థితో యాతి భ్రాత్రాసహ నిజాలయం.
స్నాత్వా పీత్వా తత్రకించి ద్భుక్త్వా మాత్రాను మోదితః,
గవాలయం పునర్యాతి దోగ్ధు కామోగవాం పయః.
తాశ్చ దుగ్ధ్వాదోహయిత్వా పాయయిత్వాచ కాశ్చన,
పిత్రాసార్థం గృహం యాతి తత్రభావశతానుగః.

(6) సాయంలీలా—

తత్ర పిత్రా పితృవ్యైశ్చ తత్పుత్రైశ్చ బలేనచ,
భునక్తి వివిధాన్నాని చర్వ్య చోష్యాది కానిచ.
తన్మాతః ప్రార్థనాత్పూర్వం రాధికాపి తత్రైవహి,
ప్రస్థాపయే త్సఖీద్వారా పక్వాన్నాని తదాలయం.
శ్లాఘయంశ్చ హరిస్తాని భుక్త్వా పిత్రాదిభిస్సహ,
పక్వాన్నాని గృహీత్వాయాః సఖ్యస్తత్ర పురాగతాః.

బహూనిచ పునస్తాని ప్రదత్తాని యశోదయా,
సఖ్యస్తత్ర తయాదత్తం కృష్ణోచ్ఛిష్టం నయంతిచ.
సర్వంతాభి స్సమానీయ రాధికాయై నివేద్యతే,
సాపిభుక్త్వా సఖీవర్గయుతా తదనుపూర్వశః,
సఖీభిర్మండితా తిష్ఠే దభిసర్తుం సముద్యతా.

(7) ప్రదోషలీలా—

ప్రస్థాప్యతే మయాకాచి దితవేవ తతస్సఖీ,
తథాభిసారితా సాఽథ యమునాయా స్సమీపతః.
కల్పవృక్ష నికుంజేఽస్మిన్ దివ్యరత్నమయే గృహే,
సితకృష్ణ నిశాయోగ్యవేషా యాతి సఖీయుతా.
కృష్ణోఽపి వివిధం తత్ర దృష్ట్వా కౌతూహలం తతః,
కాత్యాయన్యా మనోజ్ఞాని శ్రుత్వాచ గీతకాన్యపి.
ధనధాన్యాది భిస్తాశ్చ ప్రీణయిత్వా విధానతః,
జనైరారాధితో మాత్రాయాతి సఖ్యానికేతనం.
మాతరి ప్రస్థితాయాంచ కృష్ణోహిత్వా తతోగృహం,
సంకేతకం వసంయత్ర సమాగచ్ఛే దలక్షితః.

(8) నిశాలీలా—

మిళిత్వా తావు భావత్ర క్రీడతో వనరాజిషు,
విహారై ర్వివిధై రాసలాస్యగీత పురస్సరైః.
సార్థయామ మద్వయం నీత్వా రాత్రావేవ విహరతః,
సుషుప్సూ విశతః కుంజం పశుపక్ష్యాద్యలక్షితా.
ఏకాంత కుసుమైః క్లృప్తే కేళితల్పే మనోహరే,
సుప్తావతిష్ఠత స్తత్ర సేవ్యమానా నిజాలిభిః.
సంస్కారాంశ్చ విధాయైవ మయాప్యేత త్తవోదితం,
త్వయాప్యేత ద్గోపనీయం రహస్యం పరమాద్భుతం.

దైనందినమును, నప్రాకృతమును నగు నిరాధాకృష్ణుల నిత్యలీలను బఠించుట కందఱకు నధికారములేదు. ఇది పరమాద్భుత రహస్యము. దీని రహస్యముగ గాపాడుట కందఱకును గర్తవ్యము. దీనియం దధికారము లేని వారి కీలీలను వినిపించరాదు.

జడబద్ధ జీవుఁడు కృష్ణలీలా శ్రవణమున కనధికారి.

జడబద్ధజీవునకుఁ జిత్తత్త్వ సంబంధమగు రాగమార్గమం దెంతవఱ కభిరుచి కలుగకుండునో, అంతవఱకును వాని కీలీలా వర్ణనము రహస్యముగ నుండుటయే మేలు. నామరూప గుణలీలలయొక్క యప్రాకృతములగు శుద్ధచిన్మయ స్వరూపములు హృదయోదితములగు నంత వఱకు నీలీలాశ్రవణమున కెవ్వరికి నధికారములేదు. అధికారము లేని వార లీలీలలను బఠించిరేని మాయికభావ సంపన్నులగుచు జడీయములగు స్త్రీ పురుషసంగాదులను ధ్యానించుచు నధోగతిఁ జెందుదురు. పాఠక మహాశయులు సావధాన చిత్తులగుచు నారదునివలె నప్రాకృత శృంగార సంస్కార లాభమునొంది తదుపరి యీలీలయందుఁ బ్రవేశించుట కర్తవ్యము. అట్లుకానిచో మాయికమగు కుతర్కము జనించి వారల హృదయము నంధకారమున ముంచివేయును. అధికారులకు మాత్ర మీలీలా వర్ణనము నిత్య పఠనీయమును, నిత్యచింతనీయమును, అగుచున్నది. వారల కిది సర్వపాపహరమును, అప్రాకృతభావ ప్రదమును. ఇది నరలీలవలె లౌకికముగ గోచరించుచున్నను సర్వశక్తిమంతుఁడును, సర్వమంగళమయుఁడును నగు పురుషుని విషయమున నత్యంత చమత్కారరూపమున నలౌకికమే యగుచున్నది. అధికారులచే నిత్యస్మరణ యోగ్యమగు నేతల్లీలాసంక్షిప్తసారము గోస్వామిగణముచే విరచింపఁబడినది. శ్రీగోవిందలీలామృతము మున్నగు ననేక రసగ్రంథము లీలీల నవలంబించియే రచింపఁబడినవి. అధికారులగు వారు వానినిఁ బఠించిరేని భజనానందలాభము నొందుదురు. సప్తమవృష్టియందు విచారింపఁబడిన శృంగారాది రసముల నుత్తమరూపమునఁ దెలిసికొని ప్రాత్యహిక రాగమార్గీయులగు సాధకులు లీలాసౌష్ఠవ

ధ్యాన తత్పరులగుచు నిజసేవాభావన మొనరింతురు. ఇదియే వారల నిత్యభజనము. రాస పంచాధ్యాయియందలి యీక్రింది శ్లోకమును శ్రీమన్మహాప్రభువు మనము లెస్సగ విచారించుట కొఱకొసంగెను. ఈశ్లోకమందలి 'శ్రద్ధా' శబ్దమున కప్రాకృత విషయమునందలి శ్రద్ధయని యర్థము.—

—శ్రద్ధాన్వితుఁడగు జీవుఁడే యధికారి.—

"విక్రీడితం వ్రజవధూభి రిదంచ విష్ణో
శ్శ్రద్ధాన్వితోను శృణుయా దథవర్ణయేద్యః
భక్తిం పరాం భగవతి ప్రతిలభ్యకామం
హృద్రోగమాశ్వపహినోత్యచిరేణ ధీరః"

శ్రీకృష్ణలీల నిత్యమనియు, నైమిత్తికమనియు, రెండు విధములు.

**శ్రీకృష్ణుని నిత్య లీలయు, నైమిత్తిక లీలయు.**

గోలోకమునందు నిత్యచరిత్రయు, నష్టకాలలీలయు సర్వదా వర్తమానములై యుండును. భౌమ రూపలీలయందా యష్టకాలలీలతో నైమిత్తిక లీల కలసియుండును! వ్రజమునుండి వెడలి వచ్చుటయు, మఱల వ్రజమును జేరికొనుటయు, నసుర సంహార మొనర్చుటయు, ననునవి నైమిత్తికలీలలు. ప్రపంచబద్ధులగు సాధకుల కివి యపరిహార్య విషయములు. నైమిత్తికలీల గోలోకమునందు వ్యతిరేక లక్షణముగలిగి భావరూపమున నుండును. భౌమ జగత్తునందు మాత్ర మది వస్తురూపమునఁ బ్రకాశించును. నైమిత్తికలీల సాధకులను నిత్యలీలా ప్రతిబంధకముగ గోచరించునుగాని వార లీ లీలాంతర్గతములగు నాయాకార్యములందుఁ దమ తమ యనర్థనాశనమునే యుత్సాహముతో గమనించు చుందురు. నైమిత్తికలీల యీక్రింద వివరింపఁ బడుచున్నది.

(1) పూతనావధ.

పూతన యనిన భుక్తి ముక్తి శిక్షకుఁడగు కపటగురువు. భుక్తి ముక్తిప్రియులగు కపటసాధువులే పూతనాతత్త్వము. శుద్ధభక్తునియందలి

యనుగ్రహముచే బాలకృష్ణుఁడు తన సంబంధమగు సహోదితభావమును రక్షించుటకై పూతనను వధించెను.

(2) శకట భంజనము.

ఇది పూర్వజన్మములకును, నీజన్మమునకును సంబంధించిన యసత్సంస్కార జాడ్యమును, నభిమాన జనితమగు భారవాహిత్వమును. బాల కృష్ణభావము శకటభంజన పూర్వకముగ నీయనర్థమును దూరీకృతమొనర్చెను.

(3) తృణావర్త వధ.

వృథా పండితాభిమానమును, దానిచేఁ గలుగు కుతర్కమును, శుష్కయుక్తులును, శుష్కన్యాయాదులును, బండితాభిమానుల సాంగత్యమును, దృణావర్తుఁడనఁబడును. హైతుకపాషండ మతసమూహములు వీనికి సంబంధించినవే. భావసాధకుల దైన్యమును జూచి కృపాప్రపూర్ణుఁడై బాల కృష్ణుడు తృణావర్తునిఁ జంపి వారి భజనమును నిష్కంటకమొనర్చెను.

(4) యమళార్జునభంగము.

తాను రూపవంతుఁడననియు, గొప్పయింటివాఁడననియు నభిమానము గలిగి తత్కారణమున భూతహింసయు, స్త్రీసంగము, మద్యపానము మున్నగునవి యలవడుటచే జిహ్వాలాంపట్యము, దయావిహీనమగు భూతహింస, నిర్లజ్జత మున్నగు దోషములు సంభవించును. ఇదియే యమళార్జున తత్త్వము. కృష్ణుఁడనుగ్రహపూర్వకముగ యమళార్జున భంగమొనరించి యీదోషములను దొలఁగించెను.

(5) వత్సాసురవధము.

బాలబుద్ధిచే సంభవించెడి దుష్కార్యములును, బరబుద్ధివశతయు, ననునవి వత్సాసురనామకమగు ననర్థములు. కృష్ణుఁడనుగ్రహించి వానినిఁ దొలఁగించెను.

(6) బకాసురవధ.

కుటిలత, ధూర్తత, శఠత యనువానిచేఁ గలిగెడి మిథ్యాచరణమే బకాసురుఁడు. దానిని నాశనమొనర్పకున్న శుద్ధమగు కృష్ణభక్తి గలుగదు.

(7) అఘాసురవధము.

భూతహింసయు, ద్వేషముచేఁ గలిగెడి పరద్రోహరూపమగు పాపబుద్ధియు దూరీకృతము చేయఁబడుటయే యఘాసురుని వధించుట. ఇదియొక నామాపరాధము.

(8) బ్రహ్మమోహనము.

కర్మజ్ఞానాదులను జర్చించుటచేఁ గలిగెడి సందేహవాదమును, ఐశ్వర్యబుద్ధిచే మాధుర్యరసము నవమానించుటయును.

(9) ధేనుక వధ.

స్థూలబుద్ధియు, సద్జ్ఞానాభావమును, మూఢత్వముచేఁ గలిగెడి తత్త్వాంధతయును. ఇవి స్వరూపజ్ఞానమునకు విరోధములు.

(10) కాళీయ దమనము.

అభిమానము, ఖలత్వము, పరాపకారిత్వము, క్రూరత్వము, జీవులయందలి దయాశూన్యత, యనువానిని దూరీకరణమొనర్చుట.

(11) దావాగ్ని నాశము.

పరస్పరవాదము, సంప్రదాయవిద్వేషము, అన్యదేవతలయెడ విద్వేషము, యుద్ధమును. ఇత్యాది సంఘర్షణమే దావానలము.

(12) ప్రలంబ వధ.

స్త్రీలాంపట్యము, లాభము, పూజయుఁ బ్రతిష్ఠాశయు,—వీని దూరీకరణము.

(13) దావానల పానము.

నాస్తికబుద్ధిచే ధర్మమునకును, ధార్మికులకును గలుగు నుపద్రవమును దొలఁగఁద్రోయుట.

(14) యాజ్ఞిక విప్రపత్నీత్వము.

వర్ణాశ్రమాభిమానముచేఁ గలిగెడి కృష్ణునియెడల నుదాసీనబుద్ధియుఁ గర్మజడత్వమును.

(15) ఇంద్రపూజావారణము.

బహ్వీశ్వర బుద్ధిత్యాగమును, అహంగ్రహోపాసనాదూరీకరణమును.

(16) వరుణలోకమునుండి నందునిఁ దెచ్చుట.

వారుణి మున్నగు మద్యములను సేవించుటచే భజనానందము వృద్ధిఁ బొందుట యను దుర్బుద్ధిని దూరీకరణ మొనర్చుట.

(17) సర్పమువలన నందుని రక్షించుట.

మాయావాదముచే మ్రింగఁబడిన భక్తితత్త్వము నుద్ధరించుట. మాయావాది సంగత్యాగము.

(18) శంఖచూడవధము మణిమోచనము.

ప్రతిష్ఠాశావర్జనము, స్త్రీసంగస్పృహావర్జనమును.

(18) అరిష్టాసురవధ.

పంచకములగు మతములయం దభిమానముచే భక్తి నపహసించుట యనుదాని నాశనము.

(20) కేశీవధము.

"నేను గొప్పభక్తుఁడను, గొప్ప యాచార్యుఁడను" అను నట్టి యభిమానము, ఐశ్వర్యబుద్ధి, పార్థివాహంకారము ననువానిని వర్జించుట.

(21) వ్యోమాసుర వధ.

దొంగ భక్తులయొక్కయుఁ, కపట భక్తులయొక్కయు సంగమును విడుచుట.

వ్రజభజనమునకుఁ బ్రతికూలము లగు తత్త్వములు.

శ్రీకృష్ణసంహితయొక్క యష్టమాధ్యాయమునందలి పదుమూఁడవ శ్లోకము మొదలుకొని యధ్యాయ శేషపర్యంతము వివరింపఁబడిన వ్రజ భజన ప్రతిబంధక రూపములగు పదునెనిమిది యనర్థములకు యను శ్లాఘనభంగమును, యాజ్ఞికవిప్రుల వృథాభిమాన దౌరాత్మ్యమును అను రెండులీలలను జేర్చినచో

నిఱువది * ప్రతిబంధకములగును. ఇవన్నియు వ్రజభజనమునఁ బ్రతికూలము లగు తత్త్వములు. నామభజనము సేయు సాధకు లనుదినమును హరి నెలుఁగెత్తి సంబోధించుచు నీ ప్రతిబంధకములను నివారించుకొను శక్తి తమ కను గ్రహింపుమని ప్రార్థింపవలెను. ఇట్లు చేయఁగలిగినచో భక్తచిత్తము పరిశుద్ధమగును. కృష్ణుఁ డే యసురులను వధించెనో యా యసురు లందఱును దమ మనోరాజ్యమునఁ బుట్టించు నుత్పాతములను హరి తొలఁగింప వలయునను నభిప్రాయముతో హరి సమక్షమున సదైన్యముగ నాక్రందించుచు వేడుకొనినచో భగవంతుఁ డాసకలానర్థములను దొలఁగఁద్రోయును. ఇంక నేయసురులను బలదేవుఁడు సశింపఁ జేసెనో తత్సంబంధములగు ననర్థములను సాధకులు తమ స్వశక్తిచేతనే నాశన మొనరింపనగును. వ్రజభజనయొక్క రహస్యమిదియే. భారవాహిత్వరూపమగు కుసంస్కారమే ధేనుకాసు రుఁడు. స్త్రీలాంపట్య లాభపూజా ప్రతిష్ఠాశారూపమగునదియే ప్రలంబనామకమగు ననర్థము. సాధకుఁడు దీనినిఁబట్టుదలతోఁ గూడిన స్వప్రయత్నముతోఁ గృష్ణానుగ్రహముచే నివారించుకొననగును.

బలదేవుని కృపచే దూరీభూతములగును.

స్వస్వరూపమునకును, నామస్వరూపమునకును, ఉపాస్య స్వరూపమునకును సంబంధించిన యజ్ఞానము, నవిద్యయు ధేనుకాసురుఁడు. సాధకుఁడు వీనిని బహుళ ప్రయత్నముతో దూరీకృత మొనర్పనగును. స్త్రీసంగ పురుషసంగ లాంపట్యము, నర్థలోభము, విషయచేష్టయు, స్వసన్మానాద్యభిమానవృద్ధి, స్వీయపూజాప్రాప్త్యాశ, ప్రతిష్ఠాలాభమునను నివన్నియును బ్రలంబతత్త్వము. ఇవి నామభజనమునకు మహాప్రతికూల విషయములని తెలిసికొని స్వప్రయత్నముతో సాధకుఁడు వీనిని దూరస్థములుగ నొనర్పవలెను. సాధకునను

---

* (11) దావాగ్ని నాశమును, (13) దావానల పానమును గలసి యేకలీలావిషయముగనే భావింపనగును.

దైన్యము ప్రబలమైనచో నతనిపై నవశ్యముగఁ గృష్ణకృపకలుగును. అందువలన బలదేవభావమావిర్భవించి యాయనర్థములన్నియు క్షణములో నాశనమగును. అనర్థ నాశనమగుటచేఁ గ్రమముగ నన్వయానుశీలనమునకు విశేషోన్నతి గలుగుచున్నది. ఈప్రక్రియలన్నియు సహజముగ గూఢములు. సద్గురునివలన నుపదేశపూర్వకముగ వీనినిఁ దెలిసికొను టావశ్యకము. కావున,

శ్లో. యస్యప్రసాదా ద్భగవత్ప్రసాదో
యస్యాప్రసాదా న్నగతిః కుతోఽపి
ధ్యాయన్ స్తువం స్తస్యయశ స్త్రిసంధ్యాం
వందే గురో శ్శ్రీ చరణారవిందమ్.





| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108 B186 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 429 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, VIII, XXVI, 404, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |